# శ్రీదేవీభాగవతము



౧-౨-౩ స్కంధములు

కవిసమ్రాట్

నోరి నరసింహశాస్త్రి



సాహితీసమితి రేపల్లె

రు. ౫/-



జగద్గురు శ్రీ కల్యాణానందభారతీ మహాస్వామి పూజ్యపాదులు

# శ్రీ సూక్తి

శ్రీ మహాస్వామి కల్యాణ దేశిక పూజ్యపాదుల సంకల్పశక్తి సహస్రపద. దేశనాస్రోతమున నా శక్తి సామయిక సంప్రదాయ శిష్యానుగతమై విరాజిల్లును. దీక్షాస్పృష్టికనాటినుండి సహస్రశీర్ష మయిన శక్త్యుల్లాసము మంత్రచైతన్య మను భావ్యను చేయును. జనుఃకర్మవిశేషము లొకటొకటి కలసి చైతన్యస్ఫురణము నీతి రీతి గతి మతుల స్ఫురిత స్ఫురితము చేయును. నోరి నరసింహశాస్త్రి, మహాస్వామి చరణ సన్నిధిని స్వస్పందసుందర మగు హృదయసంవాదముతో మంత్రచైతన్య ధారాసార మనుగత మధిగతము చేసికొని జంగీభణితిభూషితుడై విజ్ఞాని యయ్యెను. నోరి విజ్ఞానితలో గురుకటాక్షస్వీకృతి విశిష్టత నిదానము.

ఈరచన "దేవీకృతచోదనము, ఆత్మాచార్యానాదేశము." అప్రతిగృహీత, అశ్రాద్ధభోజి, అలుప్తవినయుడు నరసింహశాస్త్రి దేవీపూజానిత్య పవిత్రపాణి, శ్రీదేవీభాగవతము రచయిత. దేవీభాగవతము మహాపురాణము. పురాణ మర్త్యప్రవణము సుహృత్సమ్మతము నని సహృదయుల హార్దభాష. ఈరచనలో నరసింహశాస్త్రి ప్రత్యభిజ్ఞేయములు చేసికొనిన శబ్దార్థములు పురాణార్థపరతంత్రము లగుట కింత ప్రసాదము కలవై నవి. పురాణార్థము గంభీర మయినను తగిన ప్రసన్నత కలిమి జాపక పాఠకులకు గాంభీర్యవేదిత నీయగలదు. రామాయణము గేయపాఠ్యమధురము. ఇదియు గేయసంపద పాఠ్యసంపద కలదై వాసించును.

శ్రీ వ్యాసభట్టారకుడు సర్వామ్నాయసార మగు గాయత్రిని శ్రీదేవీ భాగవతమున నిరూపించెను. అనుపనీతుల కపరిచితము, నుపనీతులకు సుపరిచిత మయిన గాయత్రి ప్రకటరూప. గుప్తభావ గాయత్రి దేవీదీక్షితులకే తెలియును. నరసింహశాస్త్రి దేవీదీక్షితుడు. గాయత్రీసంపద కల దేవీభాగవత మాంధ్రమున నాభాషించుట నరసింహశాస్త్రికే తగును. ఆదేవీభావనులు, ఇతరేతరపారమ్య మంగీకరించు నభినివిష్టులు, దేవీసమయాచార విచారచతురులు, దేశనానధికృతులు, కవియశఃప్రార్థులు దేవీభాగవత మన్యరీతిలో పలుకుట దేవీసంకల్పము కాదు. ఈ నిశ్చితము దేవీభాగవతరచయిత వ్యాసుని హృదయంగతము. కావుననే నరసింహశాస్త్రిరచన "దేవీకృతచోదనము".

సంస్కృతభాషా నిబద్ధము లయిన గ్రంథములు నిత్య పారాయణ యోగ్యములు. అట్టి యోగ్యత కా కర్తల విశిష్టత హేతువు. ఆంధ్రభాషలో పారాయణ యోగ్య గ్రంథ ముదయింపలేదు. నరసింహశాస్త్రి యట్టి గ్రంథ ముదయింపజేసినాడు. ఇంటింట నోట నోట శ్రీదేవీభాగవత మిక వెలసి తీరును.

శ్రీ దేవీభాగవతమును శ్రీదేవీభాగవతముగా జూచి శ్రీదేవీభాగవతులు శ్రీదేవీభావ రతు లగుదురుగాత!

"శ్రీ కల్యాణ గురోః సాక్షాత్ దీక్షాం దైవీ మవాప యః,
తస్యేయం కృతిస స్సార్థా లోకే జీయా త్కృతి స్సదా."

జమ్మలమడక మాధవరామశర్మ

వికృతి నిజాషాఢ శుద్ధ
పంచమి, గురువారము

---

# కృతజ్ఞత

ఈ గ్రంథ ప్రచురణమునకు నన్నుఁ బ్రోత్సహించిన శ్రీ జమ్మలమడక మాధవరామశర్మకును, దీనిని నిర్దుష్టముగ సిద్ధము చేయుటకు నాకు సర్వవిధముల సహాయపడిన శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రికిని నేను కృతజ్ఞుఁడను.

నోరి నరసింహశాస్త్రి
రేపల్లె

వికృతి నిజాషాఢ
శుద్ధ పంచమి

---

# విషయ సూచిక

## ప్రథమ స్కంధము



## ద్వితీయ స్కంధము

## తృతీయ స్కంధము

ఉ. జానకి లక్ష్మి, లక్ష్మణుఁడు చంద్రుఁడు, మారుతి రత్నమూర్తియుక్,
భానుసుతుండు కల్పకము, వారణ మంగదుఁ డైన దుగ్ధపా
థోనిధి రామకీర్తికథ, ధూర్త్వహుఁడై స్మృతిమందరంబుతోఁ
బూని మథించు నాదికవిఁ బూజితుఁ జేసెద వాక్సుమంబులన్. ౬

తే. కవులవాక్సుధ తెలుఁగునఁ జవులు గొలుప
మొదల దొరకొన్న ఋషి నన్నపదము ప్రొక్కి,
హరికథాకీర్తనాలాప నామృతాప్తిఁ
దన్మయుండయి వెలుఁగు పోతన్నఁ గొలుతు. ౭

తే. గంగను సముద్ధరించిన ఘటము లెంత
పిన్న వయ్యును, మహామహోఁ బెద్ద వనుచు,
నేను నా చిన్నదోయిట నించి కొలువఁ
గడఁగువాఁడ శ్రీదేవిభాగవతగంగ. ౮

శా. శ్రీదేవీ యను నక్షరత్రయము మజ్జిహ్వాగ్రవీథిన్ సదా
పాదన్యాస మొనర్చి ధిం ధిమి యటం చాడ్యావిహారముల్ సల్పఁగన్,
నా దేహంబు త్రివిక్రమక్రమ విరాడ్రూపాత్మ విన్యాసమై
దీపింపదె, నిండదే మనసు పూర్ణానంద దుగ్ధాబ్ధియై! ౯

## అవతారిక

వ. అని శ్రీదేవీధ్యానావధానంబునఁ గృష్ణద్వైపాయనమునిఁ బ్రార్థించి పరాయణుండనై, శ్రీమద్రామాయణ మహాభారత భాగవతంబులు నోడువక నుడులకు జనిజనిమం బెడలు కట్లు పాఠ్యములు సను సిన మనీష నుండు నే నా సంహితాత్రయం బేకంబై గూర్చిన శ్రీదేవీ భాగవతంబు నాంధ్రీకరింపం బూనిన నిమిత్తాదికంబు లభివర్ణించెద.

శా. శ్రీదేవీపదవృత్తి నొక్క తఱి నే శ్రీచక్రరాజార్చనా
ప్రాముఖ్యాత సుశాంతితో గురుపదద్వంద్వంబు చింతించి, శ్రీ
పాదాంభోజపవిత్ర తీర్థము గ్రహింపం బోవు నా కయ్యెడన్
శ్రీదేవీభగవత్కథార్థము స్ఫురించెం బెల్లుగం జెప్పఁగా. ౧౧

శా. సర్వం బిద్ది యహమ్ము సుమ్ము యనుచున్ శ్రావ్యంబుగా సృష్టికిం
బూర్వం బా వటపత్రశాయి శిశు సంబోధించు శ్రీమాతృకా
శర్వాణీ శుభవాణిగాఁ గొనఁగ వాసిన్ నాకు శ్రోత్రద్వయిన్
బర్వంబైనవి యష్టవారకృత ఘంటానాద సిద్ధశ్రుతుల్. ౧౨

మ. అది దేవీకృతచోదనం బదియు మాతృత్వాచార్యు నాదేశ మం
చుదితం బయ్యెను నిశ్చయంబు మది విద్యోద్యోగమై, యంత స
మ్మదభావంబునఁ బంచితిం బ్రియుని సన్మజ్యేష్ఠపుత్రుల్ హనూ
మ దభిఖ్యుల్ గురుభక్తు, భాగవతసంభావ్యంపుటాపం దేరఁగా. ౧౩

క. శ్రీదేవీ భాగవతము
నాదిమమంత్రము పఠించి యతిభక్తి సహా
నాదిత పరం శ్రీకాంతం
బాదిం బూంచితిని కరపుటాంజలిఁ బూజన్. ౧౪

క. గురువే విధి హరి హరు లగు,
గురువె పరబ్రహ్మ మంచు, గుణియించి మదిన్,
స్మరియించి గణేశుని, గురు
చరణాంకితముగ రచింప సాగితి దీనిన్. ౧౫

శా. శ్రీవిద్యామయమూర్తియై తగు హయగ్రీవావతారంపు గ
న్యావిర్భావకథాంక ఘుట్ట మగు పర్యంతంబు నా గ్రంథమున్
నే విన్పించి జనస్తుతామ్ములకున్, శ్రీవారి నర్థించితిన్,
దేవా! దీనిఁ బరిగ్రహింపుఁ మను భక్తిన్ మద్గృహంతమందున్. ౧౬

మ. సురగిరితాళపార్శ్వముల శోభిలు సయ్యమ్ము తాంశుచంద్రికా
సరణిఁ గపోలభాగములఁ జల్లని సవ్వాలయున్, గురుఁడు, నీ
తెలుఁగున, శివా గాని, శుభ మిద్ది, మాయమ్మ స్వాజయంతి నేఁడు, నీ
విరచిత కావ్యభాగమును వింటి జయం బగు నంచుఁ బల్కుచున్.

క. కారిక కనుకాలంబుగ
నారాయణు సంస్మరించి నను గరుణింపన్,

వారికి సాష్టాంగ నమ
స్కారం బొనరించి సెలవుఁ గైకొంటిని నేన్. ౧౮

వ. నా యాంధ్రీకరించు శ్రీదేవీభాగవతకృతికి కథానాయకు లగు శ్రీవిద్యా
శంకర పదసమావేశ ప్రకాశిత జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ
స్వాముల వారి పవిత్రాన్వవాయం బెట్టి దనిన— ౧౯

## కృతినాథ వంశ వర్ణనము

శా. ఆ నారాయణుఁ డాదిదేవుఁడు పద్మం బాదిగా నినేన్ బ్రహ్మసృష్టి,
యేనే యీ సకలమ్ము, లే దితర మొం డేదే సమాద్యమ్ము నన్
జా నొప్పారిన దేవివాక్యములు; దానం జేసి యా దేవుఁడే
శ్రీనాథుండు జగద్గురుం డనెడి వాసిం గాంచె శ్రీచక్రస్థు. ౨౦

శా. శ్రీచక్రాధ్యాసినాభికంజమునఁ దోఁచెన్ బ్రహ్మ; యాతం డపూర్వ్యుఁడై
వాచోధీన సమస్తవేదుఁ డగుచున్ వర్ణాశ్రమాచార సం
త్త్వాచార్యుం డయి యీ ప్రపంచ మఖిలం బాదిన్ సృజించెన్, గురు
ప్రాచీనత్వము భారతీప్రభుతి సంపాదించె వాణీప్రభున్. ౨౧

ఉ. ఆతఁ డిచ్చచే జనన మందె వసిష్ఠుఁడు సూర్యవంశసం
జాతులఁ జక్రవర్తులను శాసనవర్తులఁ జేయుచుం, బ్రదీ
ప్తాతత కీర్తియై వెలసెఁ, గేవల మాత్మయ భ్యసుజ్ఞ సి
ద్ధ్యాత్మ నొసర్ప బ్రహ్మఋషిగాఁ గుశికాత్మజుఁ డెంచి పల్కెన్. ౨౨

క. శక్తి యతని సుతుఁడు మహా
శక్తి ప్రద్యోతితుఁడు త్రిశంకుప్రభు నా
సక్తికిని జండాలాకృతి
యుక్తుం గావించె ధర్మయోగపరక్తిన్. ౨౩

క. స్మృతికర్త పరాశరముని
యతని సుతుండై వెలింగె నయ్యార్జితస
న్నుతవిష్ణుతేజుఁ డతనికి
స్తుతమతి ద్వైపాయనుండు సుతుఁడై పుట్టెన్. ౨౪

పద్మపాదుఁడు జగన్నాథపదగురుండు,
నైరి ద్వారక గురుఁడు హస్తామలకుఁడు. 26

వ. అయ్యాచార్యవర్యులందు, సురేశ్వరులు, నైష్కర్మ్యసిద్ధి, తైత్తిరీయోపనిషద్భాష్యవార్తికము, బృహదారణ్యక భాష్యవార్తికము, దక్షిణామూర్తి స్తోత్రవార్తికము; పద్మపాదులు, శారీరకమీమాంసా భాష్య వ్యాఖ్యాస్వరూప పంచపాదిక, ఇత్యాది మహానిబంధంబులు రచించి, వైదికధర్మంబు లోకంబున సుప్రతిష్ఠితం బొనరించిరి. 27

క. అందెల్ల యజుర్వేదా
మందానందాస్పదంబు మహిమమాహాత్మ్యం బు
స్పందం బధిపీఠం బై
చెందెను ఖ్యాతిని సురేశచిహ్నిత మగుటన్. 28

శా. విద్యారణ్యయశోభిధానసకుఁ డా పీఠం బధిష్ఠించి శ్రీ
విద్యాపూర్వకనామమౌ నగరదేవిం దుంగభద్రానదీ
ప్రోద్యత్తీరభువిం బ్రతిష్ఠ సలిపెన్; బుక్కేశు నాతండె శ్రీ
విద్యాశంకరుఁ డాభిషేచకపీఠస్థుం జేసె సుప్రఖ్యాతిగా. 29

శా. వేదార్థంబులు నాస్తికాపశదదుర్వ్యాప్తంబులన్ స్వప్రభా
శ్రీదివ్యాకృతిఁ గోలుపోక స్థిరమూర్తిం గల్పవిస్ఫూర్తి స
మ్మోదంబుం బచరింప భాష్యములు సంపూర్ణంబుగాఁ గూర్చె నే
యాదీప్తిన్ శ్రుతివిస్తరంబు సలుపంగా సాధనీయంబులన్? 30

మ. అకలంకస్థితిఁ గూర్మపృష్ఠయుతమై యష్టాపదాంగంబులన్
సకలాశాపరివేష్టితంబగు మహోచ్ఛ్రాయంబునై మేరుమూ
ర్తికమై దానిఁ బ్రతిష్ఠ సేసె నతఁడే శ్రీచక్రరాజంబుఁ, బా
యక లోకైకగురూత్తముల్ పరమహంసాచార్యు లర్చింపఁగన్. 31

తే. రాజగురుఁడు విద్యాపురరాజ్యతంత్ర
మాపయిన్ శ్రీవిరూపాక్ష మహివసించి
నడపుటం జేసి, శృంగేరి విడువవలసె;
శ్రీవిరూపాక్షమె తదధిశ్రీ వెలింగె. 32

క. విధివశతఁ దల్లికోట
ప్రధనంబున రామరాజు పడి యడఁగుటచే
నధికార మడఁగి యడవుల
నధివాసము చేసి రెయ్యెడ యతితతి గురువుల్. ౩౮

వ. ఆ జగద్గురుపరంపరయందుఁ గ్రమాగతులై శాంకరశకంబున రెండు
వేల మూఁడువందల మూఁడవదగు సంవత్సరంబున — ౩౯

క. ఉద్దండభారతీయతి
యుద్దండుఁడు పీఠ మెక్కి యోగి జయశ్రీటం
బుద్దీపిత మొనరింపఁగ,
నద్దీపంబు శివగంగ నాత్మ లయించెన్. ౪౦

వ. అట్లు మచిలీపట్టణ సమీపంబున నుద్దండభారతీయతివరులు సిద్ధి నొందిన
దాదిగ శ్రీశృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధిపతులు కృష్ణా గోదావరీ
విశాఖాది మండలంబులు తమ ముఖ్యస్థానంబులుగఁ జేసికొని,
లోకసంగ్రహార్థంబు భారతీస్వామియం దున్న బ్రహ్మత్వంబును ధర్మ
శాసకులై వెలుంగుచుండిరి. అందు, శ్రీ బోధానందభారతీయతివరులు
పూర్వాశ్రమంబున విధివిధానంబున మహాగ్నిచయన సర్వాంత క్రతు
వులు మహాస్థైర్యంబున నాచరించి, శ్రీ నృసింహమహాగ్నిచి
న్నామమునఁ బ్రసిద్ధిం జెందెన్. ౪౧

క. హారితస గోత్రుఁ డాతఁడు
వరలెను దైవజ్ఞ సార్వభౌమాదిక సత్
పరిషత్కృత బిరుదాళీ
పరిపూజ్యుఁడు సర్వతంత్రపరినిష్ఠితుఁడై. ౪౨

వ. ఆ మహాగ్నిచితుండు సంన్యస్త సర్వకర్ముండై శ్రీ సచ్చిదానంద
భారతీ యతీంద్ర కరకమల సంజాతుండై యవతరించి, ౪౩

క. వాసిగ బోధానందుఁడు
శాసించెం బరమహంససామ్రాజ్యపదం

తే. మున్ను తంజాపురీరాజభూమియందు,
బ్రాహ్మణాగ్రహారంబు వెలంగమాను
వెలయు; నందు నిత్యాగ్నులు వేదవిదులు
రాజిలిరి పదుమూఁడు గోత్రములవారు. ౫౧

క. ఆ రాజ్యపతియధర్మం
బోరువ కొకనాఁడు వార లొక్కుమ్మడిగా
నా రాజ్యము వీడి బయలు
దేరిరి కాశికిని బోవఁ దివిరినమతితోఁ. ౫౨

క. తమతమ యగ్నులు మాత్రమె
తమ సర్వస్వంబు గాఁగఁ దరలి నడచు వా
రమలం బగు గోదావరి
సముపాంతస్థలము విడిసి సాగిరి దారిన్. ౫౩

క. వారల కథ విని పెద్దా
పురి కేలెడు రాజు, వేఁడి, పోనీయక, పే
రూ రగ్రహార మిచ్చి స
గౌరవముగ నిల్పె వారిఁ గడుఁ బ్రీతి నటన్. ౫౪

వ. తదాదిగాఁ దద్వంశంబులవా రాంధ్రధసప్రసూతులు పుణ్యవిశేషంబులఁ
బరివృద్ధులై పేరూరిద్రావిడులను నామంబునఁ బ్రసిద్ధులై, యజ్వలై,
యాజకులై, వేదవేదాంగవిదులై, వెలయుచుందురు. ఇట్లాంధ్ర
భూమికి వలస వచ్చిన కుటుంబములు పెక్కులు గలవు. ౫౫

తే. వారిలోఁ బెదవజ్ఝలు భార్గవుఁడును
నైతహవ్య సావేతస ప్రఖ్యులైన
గోత్రఋషుల వాధూలస గోత్రుఁ డొప్పు
నన్నిటం బెద్ద యగ్రహారాగ్రణి యనఁ. ౫౬

వ. ఆ పెదవజ్ఝలకు వేదాధ్యయనపరు లగు నేవురు పుత్త్రు లుదయిం
చిరి. అందు జ్యేష్ఠపుత్త్ర వంశములోనివాఁ డగు గంటి లక్ష్మణా

శాస్త్రి, మహాపండితుఁ డగుట విజయనగర భూపాలుం డాతనికిఁ దన
యాస్థాన పండితపదవి నొసంగి, గోస్తనీ సాగర సంగమప్రదేశంబునఁ
గల సంగమవలస యను గ్రామము నెలవు గావించి, సమగ్రంబు
లగు వసతుల నర్పించె. వారి వంశక్రమంబున వీరేశ్వరశాస్త్రి
యుదయించి, భీమునిపట్టణంబున గృహంబులు నిర్మించె. ఆతని
పుత్త్రుండు లక్ష్మణశాస్త్రి మహాపండితుఁ డయ్యెను. ఆతనికి
బ్రహ్మముఖంబులం బోని నలువురు సుతు లుదయించిరి. అందు
రెండవవాఁడగు వీరేశ్వరశాస్త్రి మేధావియై యొప్పుచుఁ, బరమసాధ్వి
యగు జోగమ్మను బరిణయం బాడె. ఆ పవిత్రదంపతులకు కామేశ్వర
దేవతాప్రసాదంబున నిరువురు పుత్త్రులు పుట్టిరి. అందు — ౫౭

క. సురవైద్యుఁ డవతరించిన
సరణిం బెదకాముఁ డఖిల సంస్తుతుఁ డయ్యెన్;
సురగురుఁ డన పద్మాభలు
కలిచిన చినకాముఁ డొప్పెఁ గడుఁ బ్రాజ్ఞుండై. ౫౮

వ. మఱియు నా పేరూరిద్రావిడవంశంబులందు నేకతాళ్లగ్రహారంబు
నివాసంబుగాఁ గలిగి, ౫౯

క. తాతావంశము వేదస
నాతన; మం దొప్పె సూర్యనారాయణ వి
ఖ్యాతానఘాసి; సోదెమ
నాతండు గ్రహించి మించె నాత్రేయసుతుండై. ౬౦

క. తాతా సుబ్బారాయం
డాతనికి ద్వితీయపుత్త్రుఁ డై వెలసె; బుధుం
డాతండు విజయనగర
స్థిత మహారాజగురుఁడు విద్వద్వరుఁడున్. ౬౧

క. తాతా సుబ్బారాయని
కై తోఁబుట్టువుగఁ బార్వతమ్మ యెసఁగె నా

నాతోఁ గ్రహించె గుణవి
ఖ్యాతుఁడు సతిగాఁగఁ జిన్నకామేశుఁ డొగిన్. ౬౨

తే. పార్వతీదేవి నిండుగర్భంబు దాల్చి
యరుణగర్భయౌ ప్రాచీదిగంగనవలె
సూర్యనారాయణాభిధానార్యునింట
నేకతాళాగ్రహారమం దెలమి నుండ, ౬౩

క. వేదపదక్రమ పాఠని
నాదంబులు వినుచు సూర్యనారాయణుఁ డా
వేదముఖుం డుదయించును
నాదౌపుత్రుఁడుగ నంచు నందించు మదిన్. ౬౪

తే. చిత్రభాను వైశాఖ పవిత్ర శుద్ధ
పక్షమున సప్తమిన్ జయవాసరమున
మిథున లగ్నంబునం బుష్యమీప్రయుక్త
తారఁ బార్వతి కనెఁ బుత్త్రు సూరిమిత్రు. ౬౫

క. కేశుఁడు మేశుం డీశుం
డేశబ్దంబున వెలయుదు రేకపదంబై,
యా శబ్దము కామేశం
బా శిశువున కమరె సార్థకాహ్వయ మగుచున్. ౬౬

క. కౌమారము యౌవనమును
గామేశుఁడు మాతులునకుఁ గడుఁ బ్రియుఁ డగుచున్
దా మని తాతాసుధికడ,
నేమంబునఁ జదువు లెల్ల నేర్చుచుఁ గడపెన్. ౬౭

శా. తాతా రాయుఁడు శాస్త్రి వ్యాకరణశాస్త్రప్రాజ్యసామ్రాజ్యసం
సేతుశ్రీహిమశైలమధ్యమహిమాభాసింగ నొందె న్నాచార్యతా
ఖ్యాతిం బ్రాప్తసమస్తవిద్యల ననన్యాత్తప్రభాధుర్యుఁడై
యాతం బొందె మహామహోపపద ధుర్యంబౌ నుపాధ్యాయతన్.

పార్వతీదేవి దేహంబు వదలి చనియె,
వచ్చి యాకస్మికమ్ముగా వ్యాధి యొండు. 23

ఉ. దీక్షితుఁడై వివాహవిధిఁ దీర్పఁగ నొప్పిన రూపుఁ డీ దశన్
దీక్ష కుపక్రమించె వినతిం బచరింపుచు నార్ధ్వదైహికం
బక్షయలోక మీ జనని, కాతనిఁ జూచిన గేస్తు రెల్లరున్
వీక్షణపంక్తి నశ్రువులు నిండఁగఁ గాంచి రేకధారగా. 24

క. కామేశుని నెమ్మది నది
సీమంబున భవవిరక్తి నిష్ఠం బెంపన్,
గామినిఁ జూడఁడు లోలతఁ,
గామినులును శుకునినట్లు కాంచెద రతనిన్. 25

తే. దక్షిణాచారమార్గ మాంధ్రమున నొక్క-
రాణిచయనుల సంప్రదాయాన నెనఁగు
నని వినుట నమ్మహామహునెనరు వడసి
పొందె మంత్రోపదేశ మమందవృత్తి. 26

మ. ఒకనాఁ డాతని కద్భుతంబుగ శ్రవణయోగంబునన్ మిగులన్
నకలంకంబును రోదసీకుహరపర్యాప్తంబు జ్ఞానైకగా
పక మానందమయం బఖండమును విశ్వస్ఫూర్తిబీజం బగు
నొక నాదం; బది తన్నుఁ బిల్చె ప్రణవధ్వానంబుగా నంతనన్.

మ. ఎద నేదో మధురార్ద్రతాపశిఖ బాధింపంగ రాఁజాలుచున్
మది యెప్పాటను శాంతి నొందమి నకస్మాజ్జాతసత్సాహసి
య్యది యే దీనికి నౌషధం బనుచు బోధానందస్వామీంద్రులన్
వెదుకంగాఁ జని యెట్టకేని దరిసించెన్వారి నప్పూరిన్. 28

వ. అచ్చట బాలకామేశ్వరశర్మ పండిత పరిషదనుజ్ఞతోఁ బ్రసంగ ప్రసంగ
శుద్ధచతుర్దశీ గురువాసరమ్మున యథాశాస్త్రీయమ్ముగాఁ దుర్కినా-
శ్రమ స్వీకారం బొనర్చి, జగద్గురు శ్రీ బోధానందభారతీ యతీంద్రుల
యనుగ్రహంబున మహోపదేశంబు నొంది కల్యాణానందభారతీ యను

సన్న్యాసాశ్రమంబున ద్వితీయ జన్మంబు నొంది, పిమ్మట రుధిరోద్గారి
సంవత్సర మార్గశీర్ష పూర్ణిమా భానువాసరమ్మున జగద్గురుపదవి నభిషిక్తులైరి.

## వ్యాఖ్యాన సింహాసన వర్ణనము

సీ. బ్రహ్మవర్చస్స్ఫూర్తి వరలుమూర్తిం గన
నగ్నిదేవుం డితం డనఁగఁ దోఁచుఁ,
గాంతిపుంజం బైన కాయంబు గాంచిన
బాలసూర్యప్రౌఢిఁ బరిభవించుఁ,
జిఱునవ్వు వెన్నెలల్ గురియు మోమును జూడఁ
బూర్ణచంద్రుం డను బుద్ధి పొడము,
బహుముఖప్రస్ఫురత్ప్రవచనంబులఁ గాంచ
భారతీశుం డను భావ మొదవుఁ,
బ్రబలధర్మేతరములఁ గోపంబు చూడ
నితఁడు భార్గవరాముఁ డన్పించుఁ బ్రజకు,
నౌర కల్యాణమూర్తి పూజ్యపాదగురులు
పరమహంస సామ్రాజ్యాధిపదము దాల్ప. ౧౦

వ. శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య పదవాక్యప్రమాణ పారా
వారపారీణ యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార
ధారణా ధ్యాన సమాధ్యష్టాంగ యోగానుష్ఠాననిష్ఠ తపశ్చక్రవ
ర్త్యనాద్యవిచ్ఛిన్న గురుపరంపరాప్రాప్త సాంప్రదాయిక షడ్దర్శనా
చార్య వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర సకలవేదార్థ ప్రకాశక సాంఖ్య
త్రయీ ప్రతిపాదక సకల నిగమాగమ సార హృదయ వైదికమార్గ
ప్రవర్తక సర్వతంత్ర స్వతంత్ర విద్యానగరాది మహారాజధానీ కర్ణా
టక సింహాసన ప్రతిష్ఠాపనాచార్య తుంగభద్రాతీరవాస ఋష్యశృంగ
గిరి పురవరాధీశ్వర శ్రీ విరూపాక్షాధీశ్వర శ్రీమ దాచార్యాన్వయ
పరివృఢ శ్రీమ ద్రాజాధిరాజ మహారాజ గురు భూమండలాచార్యా
ద్యన్వర్థ సకలబిరుదావలీ విరాజమాన శ్రీవిద్యాశంకర పదమావేశ
ప్రకాశిత శృంగగిరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధీశ్వర భారతీ సంప్రదాయ

సార్వభౌమ జగద్గురు శ్రీ బోధానందభారతీ మహంతాచార్య మహా
స్వామి కరకమలసంజాత జగద్గురు శ్రీ కల్యాణానందభారతీ మహంతా
చార్య మహాస్వామి చరణములు, వ్యాఖ్యాన సింహాసనాధిష్ఠితులై
యొసఁగుతజే, ౮

శా. బాలార్క ప్రతిమాన తేజుఁడు శ్రుతిప్రఖ్యాత దివ్యాకృతి
లా లోలాత్మముఖుండు నిత్యరసనా లాస్యస్థసద్భారతీ
కేలీ మంగళ విగ్రహుం డతఁడు పంకేజాత గర్భుండు తా
నై లోకంబు సముద్ధరింప దిగి కొల్వైనట్లు భాసిల్లెడిన్. ౯

చ. సనకసనందనాది మునిచంద్రులు వీరు, వసిష్ఠుఁ డీతఁడీ
మునిమణి నారదుం డనుచుఁ బూజ్యతఁ గొల్చుచుఁ దక్షిణం దపో
ధనులు తురీయధర్ములు సతంబు గురూత్తముఁ గొల్చుచుందు రా
ఘనుకరకంజజాత శుభగాత్రులు మానసమాత్ర సంభవుల్. ౧౦

మ. ఎదలం బేర్చినభక్తి కౌతుకధృతిన్ హెచ్చింప శ్రౌతాగ్నిస్తోమముల్
వదలంబోవక యూహ్యలో వెలుఁగు దివ్యజ్యోతి నశ్రాంతమున్
బదిలంబుగ గ్రహించి కాంచుచును విశ్వవ్యాప్తిఁ దన్వ్యాప్తిఁ ద
త్పద మేవేళ సమాశ్రయింత్రు త్రిపురాత్మవ్యయోగేశ్వరుల్. ౧౧

సీ. లక్ష్మీం దొకండును రాముం డొకండును
విమలుం డొకండు శ్రీవిద్య నొకఁడు
వేద మొక్కండును విరజుం డొకండును
సత్యుం డొకండును నిత్యుఁ డొకఁడు
నొకఁడు విముక్తుండు నొకఁడు విజ్ఞానియు
విజయుం డొకండును వినయుఁ డొకఁడు
పూర్ణుండు బ్రహ్మంబు బోధుండు నమలుండు
నచలుండు జయుఁడు నారాయణుండు
సద్యోజాత ప్రముఖుఁడు శివుండు శంకరుండు
పరుఁడును సుశీలుఁడును యోగివరులు సతముఁ
గొలుచుచుండు రానందనాథులు తదీయ
శిష్యులై పాదుకాంతదీక్షితులు భక్తి. ౧౨

తే. మఱియు మహిమాఢ్యు లున్నారు మహితయశులు
యోగివర్యులు కల్యాణ యోజితాత్మ
పాదుకాంత దీక్షాచార్యపదులు పంక్తి
పావనులు లోకపావన భవ్యమానులు. ౮౬

సీ. క్రమ జటా ఘనల సాంగముగ శ్రావ్యంబుగా
నర్చించు సూర్యనారాయణుండు,
వేదాంతగోష్ఠి వినోదంబు సంచరించు
సుధి యెల్ల లింగన సోమయాజి,
చర్చించు దైవజ్ఞ సార్వభౌముఁడు దివ్య
గమనముల్ వేంకట రమణశాస్త్రి,
పాణిని వరరుచి పాతంజల ప్రౌఢి
కలయఁ జేర్చును నీలకంఠసూరి,
సరస సాహిత్య సంపద సంతరించు
శ్రీయశశ్శాలి మాధవరామశర్మ,
శ్రీ జగద్గురు కల్యాణ రాజ పూజ్య
యతుల యాస్థాన పుణ్య సభాంతరముల. ౮౭

సీ. పదముల సాహితీసమితి సభాపతి
సత్కవీంద్రుఁడు శివశంకరుండు,
కవికుటీరావాస కావ్యమర్మజ్ఞుండు
ప్రౌఢకావ్యుఁడు వీరరాఘవుండు,
కవితావతంసుండు గట్టి నృసింహుండు
కామసంజీవన కావ్య కర్త,
జ్ఞానవాసిష్ఠ నిర్మాణదక్షుఁడు సూక్ష్మ
బుద్ధి శ్రీరామ సద్బుధవరుండు,
కవి విధేయుఁడు గురుకటాక్షప్రసార
సార హృదయాబ్జుఁ డీ నోరి నారసింహుఁ,
డా మహాస్థాన మెవ్వేళ నాశ్రయించి
కవిత వెలయింతు రిష్ట సత్కవులఁ గూడి. ౮౮

సీ. జ్యేష్ఠుండు శిష్యుల శ్రేష్ఠుండు యోగుల
లక్ష్యుండు లక్ష్మీనారాయణుండు,
అపరిగ్రహీత సర్వాగమవిదుఁడు వి
రజుఁడు చిద్వ్రతి శ్రీరామమూర్తి,
ఘనవేదపాఠి వేంకటసోమపీథియుఁ,
గ్రమపాఠి విమలసూరావధాని,
శుక్లయజుర్వేద సూరి యాచార్యుండు
పురుషోత్తమవధాని పూర్ణయోగి,
పరమ సత్యధర్ముండు సాంబశివశాస్త్రి,
యమల పూర్ణాత్ముఁ డాదినారాయణుండు,
సుబ్బరాయుండు సౌశీల్య శుద్ధబుద్ధి,
కొలిచియుండుదురు కల్యాణగురుల సతము.

వ. ఇట్లు ధర్మసంపన్నంబగు మహామహిమనొప్పారు నప్పూజ్యపాదు...

సీ. వ్రాయుచు నొకవేళఁ బ్రస్థానములు మూఁడు
భాష్యతద్వ్యాఖ్యాప్రబంధయుక్తి,
వివరించు నొకవేళ వేదవాక్యార్థముల్
కల్పోక్త మాధవోక్త క్రమమున,
[illegible]ంచు నొకవేళ శ్రౌతప్రయోగర
హస్యంబు [illegible]త్తరాధ్వర్యుసహితి,
[illegible] నొకవేళ నిగమాగమాచార
శాస్త్రక్రమము ధర్మనిష్ఠుఁ డగుచు,
స్మరణపరంబుగా [illegible]మూర్తిప్రతిష్ఠ
నొక్కహేల నొనర్చు నొక్కొక్కవేళ,
భువనగురుఁడు శ్రీ కల్యాణ పూజ్య పాద
పరమహంసుఁడు భారతీవంశవిభుఁడు.

. ద్వైతధ్వాంత ప్రచండభాస్కర పదప్రఖ్యాతి దీపింప, న
ద్వైతద్వేషులు దుర్వివాదరణయాత్రల్ సల్ప వారింపఁడే,

తే. మేము వైయాకరణసార్వభౌమబిరుద
సహితుఁగాఁ జాత రాముఁడుశాస్త్రిఁ దొలుత,
మరల దైవజ్ఞసార్వభౌమపదమహితుఁ
జలిపితిమి వేంకటరమణశాస్త్రి నిట్లు. ౯౮

తే. ఇట్టిఁ డగుఁ బౌత్రుఁడు కవిసమ్రాట్టు నాఁగ
మా యొనర్చెడినామముల్ మాన్యము లగు,
నవి యొసంగుఁ ద్రిలోకి నన్వర్థసంజ్ఞ,
నిదియు నీసభ యంగీకరించుఁగాక. ౯౯

ఉ. పేరుగలాఁడు సత్కవులు పేర్చెడి సర్వసభాంతరంబులం
దీరు సభాపతిత్వపద సుస్థితుఁ డీ శివశంకరుం డిదే
తీరెన యాభిషేచనకదీక్షఁ గనుంగొనెఁ గాన నాతఁ డీ
నోరి నృసింహశాస్త్రి శుభనూతననామము చాటి చెప్పెడిన్. ౧౦౦

వ. అని యానతిచ్చిన, సభాపతి శివశంకరుండు శ్రీ జగద్గురువుల యాదే
శంబు సభలోనం దఱకును బరమసమ్మతంబుగా లేచి, నోరి నరసింహ
శాస్త్రి కవిసమ్రాట్టని మువ్మాఱు సభామధ్యంబున నుద్ఘోషింప,

మ. కరుణాపాంగవిలోకనామృతముతోఁ గల్యంబుగా నంత శ్రీ
గురువర్యుల్ సకలాంగసేచనము నాకుం జేయుచున్ నాపయిన్
బరమాశాటి నొకండు కప్పి, "కవిసమ్రాట్సిద్ధనామ్నా చిరం
పరివర్ధస్వ" యటంచు శీర్షముపయిన్ స్వర్ణాక్షతల్ వైచినన్. ౧౦౧

తే. మొరసె భూసురాశీర్వాదముఖరరవము
తో నెనసి కవిమిత్ర సంతోషరవము,
సభ సముత్పన్నమై జయజయరవంబు
ప్రతిరవ మిమ్మెనె దశదిశావరణములను. ౧౦౨

ఉ. ఆ పరిషత్సమక్షమున నంత జగద్గురుపూజ్యపాద సు
శ్రీపదపంకజార్పణము సేయుచు భక్తిని గంత మెత్తి యీ
శ్రీపరదేవి భాగవత సిద్ధపురాణము వించితిన్ శిరం
బూఁప సదస్యు లెల్లరు మదార్జితజన్మము సార్థకంబుగా. ౧౦౩

వ. మఱియును శ్రీసదనంబున శ్రీగురుదేవప్రతిష్ఠిత శ్రీమహాకామేశ్వ
ర్యంబా రాజరాజేశ్వరీ ప్రతాపభారతీ పరాభట్టారికా పరదేవ్యాయతన
ముఖమంటపంబున నఖిల చాతుర్వర్ణ్య శిష్యబృందంబులుం జూడఁ
శ్రీ సదాశివానందభారతీ యతీంద్రుల శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీ
పీఠాధీశ్వరపదవి నధిష్ఠింపఁజేయ నుద్యుక్తులై వారలకుఁ బరమహంస
సామ్రాజ్యాభిషేచనంబు నిర్వర్తింపఁబోవు సమయంబున, వ్యయ
సంవత్సరాశ్వయుజ పూర్ణిమా గురువాసరమ్మున మిథునలగ్నమ్మున
నన్ను శ్రీగురుదేవులు మరల రావించి, యందుఁ గొలువున్న శ్రీ
రాజరాజేశ్వరీ పరదేవతా సమక్షంబున నుభయ జగద్గురువుల సన్ని
ధానంబున శ్రీ సత్యానందయతీంద్రులును బరివేష్టిత సకల కవి విద్వ
ద్యోగివరేణ్యులును నాలింప నస్మత్కృత శ్రీదేవీభాగవతకథార్థంబు
కొంత వినిపింపం బంచిన, నట్లొనర్చి కృతార్థుఁడనై వందనం బాచ
రించిన నాకుఁ దత్సభాముఖంబున నాశీరక్షతప్రక్షేపణ పురస్సరంబుగఁ
గవిసమ్రాట్పట్ట శ్రీముఖపత్రంబు ప్రసాదించి యనుగ్రహించిరి.
తదాదియు నేనును, ౧౦౫

ఉ. ఆ పరదేవికోమలకటాక్షము పాఱిన దీవిధంబుగా
నాపయి, దానియిచ్చకు గుణం బది యేటికి లెస్స, గాని నే
నీపయి నెట్టు లీసరణినే సిరిచూడ్కిఁ బాత్రభూమినై
యోపుదునో చరింప, నని, యుందు నితాంతతదాత్మబుద్ధినై. ౧౦౬

చ. కొరను దీన్నికై ధనము, కోరను సద్యశమైనఁగాని, నేఁ
గోరను గౌరవాంకములు, కోరను సత్పదజన్మభాగ్యముల్,
కోరను జన్మమోక్షణము, కోరుదు నొక్కటె సుస్థిరంబులై
శ్రీరమణీయపాద సరసీరుహముల్ విలసిల్లుటల్ మదిన్. ౧౦౭

## కృతికర్తృ వంశ వర్ణనము

వ. హారితాంబరీష యౌవనాశ్వ త్రయార్షేయం బగు హారితగోత్రంబున
నాపస్తంబసూత్రులు యజుశ్శాఖాధ్యాయులును వైదికనిష్ఠాభాసు

రులు నగు భూసురులం దాంధ్రదేశంబునఁ బొలుపొందు వెలనాటి
సమాజమందు, ౧౦౮

తే. శ్రీగిరీంద్రంబు మొదలు వార్ధియునుదాఁక
వృషభశైలాది సింహాద్రివిస్తృతమహీ
యజ్వలై కవులై పండితాగ్ర్యు లగుచు
నోరు గలవారు సిరి మీఱు నోరివారు. ౧౦౯

వ. అందు, ౧౧౦

తే. వేదనాదంబుతోడ నభిన్నవృత్తి
శ్రావ్యసంగీతనాదంబు సంతరించు
సతఁడు బ్రాహ్మణోత్తమునాఁడు వెలసి
మాన్యుఁడై పేరు గనె హనూమద్బుధుండు. ౧౧౧

క. అతనికి వేంకమ సాధ్వికి
సుతుఁడై గోపాలకృష్ణసూరి వెలసె స
న్నుతుఁడై యమోఘవాక్సి
వితతప్రథ మంత్రమర్మవిదుఁ డని బుధులన్. ౧౧౨

వ. ఆ గోపాలకృష్ణునకు శంభమసాధ్వియం దిద్దఱు పుత్రికలును, నలువురు
పుత్రులును గల్గిరి. ఆపుత్త్రులలో జ్యేష్ఠుం డగు నాగేశ్వరరాయుండు
వంశకరులగు పుత్రులం గాంచె. ద్వితీయుం డగు రాజేశ్వరరాయుండు
కవియై బహుకావ్యంబులు సంతరించి యశోమాత్రపుత్రుండై గతించె.
మూఁడవకుమారుం డగు హనూమద్బుధుండు మత్పిత్రుపాదుండు వేద
విద్యాసనాథం బగు కౌండిన్యగోత్రంబున నేతివంశంబున నుండి,
క్రమాంతస్వాధ్యాయపరుండును సగ్న్యాధానదీక్షితుండును పరమ
వైదికధర్మనిష్ఠాభాసురుండును నగు నాగలింగదీక్షితుల ద్వితీయ
పుత్రిని మహాలక్ష్మిని వివాహ మాడి, నలువురు పుత్రుల నొక్క
పుత్రికను గాంచె. గోపాలకృష్ణుని కనిష్ఠపుత్త్రుండగు గురులింగశాస్త్రి
చెన్ననగరంబునఁ బండితపదవీ సుప్రతిష్ఠితుండై, ౧౧౩

సీ. భారతం బాదిగా బహుపురాణంబులు
రచియించెఁ దెలుఁగున వచనశైలి,
ధర్మశాస్త్రాళికిఁ దత్సూక్ష్మవిస్తర
వ్యాఖ్యానములు కూర్చె నాంధ్రభాష,
జైమినీయాదిక జ్యోతిషగ్రంథార్థ
కలన నిరూపించెఁ దెలుఁగువాణి,
గీతారహస్యార్థ జాతప్రకాశాది
వేదాంతకోశముల్ వెలయఁ జేసె,

తే. వేయు నేటికి విజ్ఞాన భిక్షు నేఁడు
యాంధ్రజాతికిఁ బెట్టిన దాతఁడె కాదె,
శ్రౌత వేదాంత హోరాది శాస్త్రవిదుఁడు
నోరి గురులింగజంగముఁడు విస్తారయశుఁడు. ౧౧౪

క. అస్మ త్పితృపాదుం డగు హనుమద్బుధుండు, ౧౧౫

తే. సంస్కృతాంధ్ర సాహిత్య వశంవదుండు,
శ్రీమహా పాదుకాంత దీక్షా మహాత్ముఁడు,
జనకుఁడు నుతీయ సవితృదీక్షా గురుండు,
విదిత పండితకవి సత్కవిత్వగురుఁడు. ౧౧౬

క. శ్రీమాతాదయ [illegible]
[illegible],
[illegible]
[illegible]. ౧౧౭

వ. వారికి రాజగోపాలశాస్త్రియు, సీతారామశాస్త్రియు, వేంకట లక్ష్మీ నరసింహశాస్త్రియు, చంద్రశేఖరశాస్త్రియు నను నలువురు పుత్త్రులును, రాజ్యలక్ష్మి యను పుత్త్రికయుం గలిగిరి. అందుఁ దృతీయ పుత్త్రుండ నగు నేను కౌండిన్యసగోత్రుం డగు నేతి శ్రీరామశర్మ పుత్త్రి మల్లిపృసనామ్ని ధర్మపత్నిగాఁ బరిగ్రహించి సకుటుంబంబుగా శ్రీ జగద్గురుకరుణా కటాక్షపాత్రుండనై వర్ధిలుచుండు. ౧౧౮

క. కల్యాణాస్పదచరణా!
కల్యాణైకస్వరూప! కల్యాణగుణా!
కల్యాణప్రద! భారతి!
కల్యాణానందనామ! ఘనయతిసోమా! ౧౧౯

క. సాక్షాద్వ్యాసుఁడ వంచును,
సాక్షాత్పరదేవి వంచు, సత్కవి వంచున్,
వీక్షించి, సమర్పించితి,
నక్షయ్యకటాక్ష మిందు నమరింపఁగదే! ౧౨౦

క. ప్రజ్ఞాన ఘన కథాద్యుతి
నజ్ఞానధ్వాంత పరమహంసార్పిత మీ
విజ్ఞానయోగి కృష్ణో
పజ్ఞము తనప్రజ్ఞ నిట్లు ప్రతిదీపించున్. ౧౨౧

తే. అవధరింపు, భవత్పూజ్య హస్త పంక
జాభిషేచన సామ్రాజ్య శోభితుండు,
దివ్యమగు విద్య విజ్ఞానదీక్షితుండు,
పట్టికాశ్రీకుఁడు కవిసమ్రాట్టు, పలుకు. ౧౨౨

శౌనక ప్రశ్న

తే. పుణ్యమై యొప్పు నైమిశారణ్యభూమి
శౌనకాదులు కలిభీతి సంశ్రయించి;
రందుఁ బౌరాణికోత్తముఁ డయిన సూతుఁ
గాంచి శౌనకమౌని భాషించె నిట్లు. ౧౨౩

శా. సూతా! ధన్యుఁడ వయ్య! శుష్కులఁ గదున్ శుద్ధుండ వీవే; పరి
జ్ఞాతం బయ్యెఁ బురాణసంహిత సమస్తంబున్ సమర్థంబు నీ
చేతన్ వ్యాసమునీంద్రుకారిమి; భవచ్చిత్తంబు తాపత్రయా
పేతంబౌతఁ; జిరాయు రున్నతి యశస్స్ఫీతుండవై వెల్గుమా. ౧౨౪

తే. మునుల విశ్రామదేశ మీ పుణ్యవనము
విశ్వసననామకం బయి వెలయు నిందు
గూడిన మునీంద్రసమితికి వేడుకయ్యె
బ్రహ్మసమ్మిత దివ్యపురాణము విన. ౧౨౫

తే. షాడబోపేత రుచిరాన్న సన్నికర్ష
జిహ్వ కాహ్లాద మేరీతి సిద్ధ మట్లు
బుదిమంతుల వాక్సుధాపూరములను
శ్రోత్ర మానందకందళ చుంబిత మగు. ౧౨౬

తే. చెవులు లేనట్టి చిలువలే యవశము లయి
యాడును మనోహరధ్వని కనుగుణముగ;
చెవులు కల్గియు నా రమ్యో! చెవిటివారె,
విధిహతులు సత్కథావళి వినని నరులు! ౧౨౭

మ. కలికిన్ భీతిలి యీ పవిత్రతమమహా కాంతారమధ్యమ్మునన్
కలి వర్జ్యం బని చేరి, పాసి కలంకం; గాలంబు వెళ్లింప, ని
చ్చలు శాస్త్రార్థములం బురాణకథలన్ జన్మంబులన్ సత్రదీ
క్షల నా సత్యయుగప్రతీక్ష నిటు వాసం బుంటి మో పుణ్యులా!

క. వేదాంతము సాత్త్విక మగు,
నాదట మీమాంస రాజసాత్మకము నగున్,
వాదవితండము న్యాయం,
బాదిం ద్యాజ్యంబు తామసాత్మక మగుటన్. ౧౨౯

క. ఏచాయ శాస్త్రరీతులో,
యాచాయం బురాణచయము నగుం ద్రిగుణంబై;
వాచంయమీంద్రు లిందున్
యాచింతురు శుద్ధసాత్త్వికాఖ్యానంబున్. ౧౩౦

ఉ. ఏది స్మరింపం గామదుఘ, మేది వినన్ సకలార్థ సిద్ధిదం,
బేది పఠింప ధర్మకర, మేది విచింతన సేయ ముక్తిసం

పాదక మహా ముముక్షులకుఁ భవ్యము దివ్యము వేదసమ్మితం
బేది పరాత్పరం, బది వచింపుము భాగవతాఖ్యసంహితన్. ౧౩౦

తే. యజ్ఞశతము లొనర్చి నే మలసినాము;
శాంతి నొందము కేవల స్వర్గవాంఛ;
నమృత మేల పునర్జన్మ మగునయేని!
జ్ఞానమే వినా మోక్షసంధాన మున్నె! ౧౩౧

కం. కావున నే మర్థింతుము
పావనము రసైకఘుటిక పరమరహస్యం
బావలఁ జేర్చెడుతరి శ్రీ
దేవీభాగవతకథను దెలుపఁగ సూతా! ౧౩౨

కథా ప్రా రం భ ము

కం. ధన్యోస్మి యనుచు సూతుఁడు
మున్యాదేశంబు వించు, మూర్ధాంజలిబం
ధన్యాసమ్మునఁ దగి, స
మాన్యమ్ము లగు పలుకు లిట్లు మాలిమిఁ బలికెన్. ౧౩౩

కం. ఆహా నా సౌభాగ్యము!
మోహాళి విదల్చి ముక్తి మునుకొను దేవీ
మాహాత్మ్యసత్కథావళి
వ్యాహరింపంగ మీర లాజ్ఞాపింపన్. ౧౩౪

తే. వ్యాసఋషి తదుపజ్ఞమా భాగవతము
నం దధిష్ఠాత్రియై పొల్చు నాదిలక్ష్మి,
దీపశిఖవోలె మూఁడు వర్తికలమెలిసి
యేకమై వెల్గు నార్ద్రమై యెడఁద ప్రమిద. ౧౩౫

తే. అఖిలశాస్త్రంబులందు గుహ్యాతిగుహ్య,
ముత్తమాగమములలో ననుత్తమంబు

వేదవిదితంబు శ్రుత్యర్థవిహితపదము
నౌ పురాణంబు ప్రవచింతు ననఘులార! ౧౩౭

క. లలితముఁ దత్పదకంజముఁ
గొలుతురు, యోగులకు ముక్తిఁ గూరిచి, బ్రహ్మా
దులకును సేవ్యంబై, యా
నులకును ధ్యేయైకపదము, నుతసత్పథమున్. ౧౩౮

ఉ. వేదములందు విద్య యని విశ్రుత మెయ్యది, యాద్యశక్తి యా
నేది, పరాభిదం బెఱుక యేది, విదిర్పఁగ బంధముల్ క్షమం
బేది, దురాత్మదుర్విషయ మేయది, యోగికి ధ్యానగమ్య మా
నేది, యదే మదిన్ నిలిచి నృత్యము సేయుత మాయితంబుగా.

మ. చిదచిద్వ్యాపక యై జగదఖిలమున్ సృష్టించి పాలించుచుం,
దుది సంహారము చేయు ముత్తెఱఁగులై తొల్లాడు శక్తిత్రయిన్
ఆద నైనన్ రమియించు నొక్కరితయై యాత్మానందయై దాని నే
మ్మది ధ్యానించెద విశ్వసూతి నపరన్ మన్మాత నాత్మాత్మికన్.

తే. ఈ సమస్తంబు బ్రహ్మ సృజించె నంచుఁ
బ్రథిత మగును పౌరాణికవచనసరణి;
బ్రహ్మ జనియించె హరినాభిపద్మమందు;
నన, స్వతంత్రుఁ డని వచింప నగునె దాని? ౧౪౦

తే. ప్రళయకాలంబునఁ బయోధిజలములందు
శేషుని సహస్రఫణశయ్యఁ జేర్చి మేను
మఱచి కనుమోడ్చి నిద్రించు మాధవుండు,
నస్వతంత్రుఁడ; భగవంతుఁ డగుట యెట్లు? ౧౪౧

తే. అచ్యుతాధార మైన యేకార్ణవమును
బ్రభు వనఁగ రాదు పాత్రమై రసము లేమి,
భూత సర్వస్వమున శక్తిభూత యెవతె,
శరణు చొచ్చెద నే దాని సర్వజనని. ౧౪౨

క. అజుఁ డంబుజస్థితుం డయి
నిజజనకుం గాంచి యోగనిద్రావశుఁగా,
భజియించె నెట్టి దేవిని,
భజ రే మన, యట్టి దేవి, భక్తశరణ్యన్. ౧౪౪

క. దానిని మాయన్ సగుణన్
దానినె నిర్గుణను ముక్తిదాత్రిని మదిలో
ధ్యానించి చెప్పఁ దొడఁగితి,
మానులు వినుఁడీ పురాణమాణిక్యంబున్. ౧౪౫

## పురాణప్రశంస

వ. అయ్యాదియు శ్రీమద్భాగవతాభిధానంబునఁ బరమపుణ్యంబై, పదునెనిమిదివేలు శ్లోకములు గలుగ, ద్వాదశస్కంధ సమ్మితంబై, మున్నూట పదునెనిమిది యధ్యాయంబులతో నొప్పు. అందుఁ బ్రథమస్కంధంబున నిరువదియు, ద్వితీయంబునఁ బండ్రెండును, తృతీయంబున ముప్పదియుఁ, జతుర్థంబున నిరువదియైదును, నైదవ స్కంధంబున ముప్పదియైదును, షష్ఠంబున ముప్పదియొక్కటియు, సప్తమంబున నలువదియు, నెనిమిదవ స్కంధంబున నిరువదినాల్గును, నవమంబున నేఁబదియు, దశమంబునఁ బదుమూఁడును, నేకాదశంబున నిరువదినాల్గును, ద్వాదశస్కంధంబునఁ బదునాలుగధ్యాయంబులును విలసిల్లు. మఱియు, శ్రీదేవీమహాపురాణంబు ప్రతిస్కంధ రసబంధురంబై, ముముక్షుజన ప్రియంబై, యష్టాదశసాహస్రి సంహిత నాఁ బరగు. ౧౪౬

తే. సర్గ మనఁగను మఱి ప్రతిసర్గ మనఁగ
వంశ వంశానుచరిత మన్వంతరములఁ
బంచలక్షణ యుక్తమై పరగు చుండు
నార్షకృతులు పురాణవిఖ్యాతి నెసఁగు. ౧౪౭

తే. సత్త్వముగ నిర్గుణము బ్రహ్మ నిత్య మయ్యు
యోగిగణములఁ గృపతో సముద్ధరింప
వికృతియై వ్యాపకాకృతి వెలయును శివ
యుష్యాది చరాచరాధార యగు తురీయ. ౧౪౮

సీ. దాని శక్తులు మూఁడు తిన్ననువు లూను,
సౌదు మహాలక్ష్మి స్వచ్ఛసత్త్వ,
రాజసాత్మ మహాసరస్వతి యగు, మహా
కాళిక తామసాకార యగును;
ఈ మూఁడు శక్తులు సృష్ట్యర్థమై దేహ
సంగతి నొందుట సర్గ మండ్రు;
సృష్టి స్థితి వినాశ దృష్టిమై విని హరి
శంకరజని ప్రతిసర్గ మండ్రు;
వంశ మగుఁ జంద్ర సూర్యాది వంశ్య గణన,
మఖిల మనుకాల గణన మన్వంతర మగు,
వారి వంశానుచరితమూ వంశగణన;
పంచలక్షణ మీరీతి భాగవతము. ౧౪౯

తే. ఇట్లు పల్కిన సూతు నీక్షించి పల్కె
శౌనకుఁడు మౌనిసమితికి సమ్మతముగ,
స్మృతిపథమ్మునఁ దమ పూర్వవృత్త మూడ,
మఱియు నెఱుఁగఁ బురాణసమస్తమహిమ. ౧౫౦

ఉ. నేము కలిప్రవేశమున నేమరభీతి నజున్ భజింపఁగా
నా మునిపూజ్యుఁ డొక్క మహిమాన్వితచక్రము నిచ్చి, చక్రపు
న్నేమి విశీర్ణ మౌ నెచట నిల్వుఁ, డటన్ కలిబాధ లేదనెన్,
నైమిశ మయ్యె నేమి యిట నాశము నొందుట బ్రహ్మవాక్కునన్.

ఉ. ఏము తదాది నీయెడ మునీంద్రులు సిద్ధులు నాశ్రయించి యు
న్నా మిట నేకచిత్తుల మనామయ మీ రుచిరాశ్రమంబు, సూ

తా! మహనీయచిత్త! కడు ధన్యుల మైతిమి నీదు వాక్కుచే;
నామము లేవి తెల్పుము, వినన్ మన సయ్యెఁ బురాణజన్మముల్.

తే. వితత సుగుణైకపాత్రమై యతి పవిత్ర
మఖిల జగదంబికానాట్య మటు విచిత్ర,
మఘకదంబంబు హరియించు నర్థకంద,
మది వచింపుము వ్యాసోక్త మంబిక కథ. ౧౫౧

వ. అన విని సూతుఁడి ట్లనియె. ౧౫౨

తే. భద్వయము, మద్వయంబును, బ్రత్రయంబు,
వల చతుష్క, మనాపకూర్మలయు నాల్గు,
స్కాది యొక్కటి, లింగాదు లగును రెండు,
తెలియుఁ డష్టాదశపురాణము లివి యనుచు. ౧౫౩

వ. అందు, మాత్స్యంబు పదునాలుగు వేలును, మార్కండేయంబు
తొమ్మిది వేలును, భవిష్యంబు పదునాలుగువేల యైదువందలును,
శ్రీమద్భాగవతంబు పదునెనిమిది వేలును, బ్రాహ్మంబు పదివేలును,
బ్రహ్మాండంబు పన్నెండు వేలును, బ్రహ్మవైవర్తంబు పదునెనిమిది
వేలును, వామనంబు పదివేలును, వాయవ్యం బిరువదినాలుగు వేల
యాఱునూఱులును, వైష్ణవం బిరువదిమూఁడు వేలును, వారాహం
బిరువదినాలుగు వేలును, అగ్నిపురాణంబు పదునాఱు వేలును,
నారదం బిరువదియైదు వేలును, పాద్మం బేఁబదియైదు వేలును,
లైంగంబు పదునొకండు వేలును, గారుడంబు పందొమ్మిది వేలును,
కూర్మంబు పదునేడు వేలును, స్కాందం బెనుబదియొక్క వేలును,
శ్లోకంబులు గలిగియుండు. మఱియు, సనత్కుమారంబు, నారసిం
హంబు, నారదీయంబు, శైవంబు, దౌర్వాసంబు, కాపిలము, మాన
వము, ఔశనసము, వారుణము, కాలికము, సాంబము, నందికే
యము, సౌరము, పారాశరము, ఆదిత్యము, మాహేశ్వరము,
భాగవతము, వాసిష్ఠము, నను నుపపురాణంబులు పదునెనిమిదియు
నార్షసమ్మతంబులై యొప్పారు. ౧౫౪

తే. ఎలమి నష్టాదశపురాణములను నుడివి,
యాపుతపుశుండు సాత్యవతేయుఁ, డర్థిఁ
దదుపబృంహితమ్ముగ భారతమ్ముఁ బలికె,
నుద్ధరింపఁగ వేదబాహ్యులను గరుణ. ౧౫౭

క. ప్రతిమన్వంతరమందిఁ
బ్రతి ద్వాపరమందు వ్యాసభగవానుండై
హిత మాచరింప జగతికి
నతి కృప హరి యవతరించు నవతారంబున్. ౧౫౮

వ. మహర్షిసత్తములారా! వినుండు. వైవస్వతాభిధం బగు నీ సప్తమ మన్వంతరంబున నిరువదియెనిమిదవదగు ద్వాపరంబున, శ్రీహరి, సత్యవతియందుఁ బరాశరుని వలన వ్యాసుండై యవతరించె. పరమధర్మవిదగ్రణి యగు సాత్యవతేయ గురు ననుగ్రహంబున నే నఖిల పురాణసంహిత నభ్యసించితి. భవిష్యం బగు నిరువదితొమ్మిదవ ద్వాపరమ్మున ద్రోణపుత్త్రుఁ డగు నశ్వత్థామ వ్యాసుండై యవతరించు. కడచిన యిరువదియేనుగురు వ్యాసులును నాయాయుగంబుల లోకహితార్థంబయి పురాణసంహితలఁ బ్రవచించిరి. అందుఁ బ్రథమద్వాపరంబున స్వయంబుగా స్వయంభువు వ్యాసుండై, వేదంబుల విభాగించె. ద్వితీయద్వాపరంబునఁ బ్రజాపతి వ్యాసుం డయ్యె. తృతీయంబున నుశనసుండును, చతుర్థంబున బృహస్పతియుఁ, బంచమంబున సవితయు, షష్ఠంబున మృత్యువు, సప్తమంబున మఘవుండును, అష్టమంబున వసిష్ఠుండును, నవమంబున సారస్వతాభిధానుండును, దశమంబునఁ ద్రిధామనాముండును, ఏకాదశంబునఁ ద్రివృషుండును, ద్వాదశంబున భరద్వాజుండును, త్రయోదశంబున నంతరిక్షుండును, చతుర్దశంబున ధర్ముండును, పంచదశంబునఁ ద్రయ్యారుణియు, షోడశంబున ధనంజయుండును, సప్తదశంబున మేధాతిథియు, అష్టాదశంబున వ్రతియు, ఏకోనవింశంబున నత్రియు, వింశంబున గౌతముండును, ఏకవింశంబున నుత్తముండును, ద్వావింశమ్మున వాజశ్రవుం

డగు వేనుండును, త్రయోవింశమ్మున ఋణుస్యాయుణుం డగు సోముండును, చతుర్వింశంబునఁ దృణబిందువు, పంచవింశమ్మున భార్గవుఁడు, షడ్వింశంబున శక్తి, సప్తవింశంబున జాతుకర్ణుఁడు, అష్టావింశంబునఁ గృష్ణద్వైపాయనుండును, వ్యాసధర్మంబును నెరపిరి.

క. ఆ కృష్ణద్వైపాయన
ధీకల్పక దివ్యఫలము దీర్ఘాయుష్యం
బాకర్ణించితి వీనుల
నా కరుణాపూర్ణ గురుకటాక్షావాప్తిన్. ౧౬౦

క. వైరాగ్యయుక్తుఁడై సం
సారార్ణవ దుర్విగాహ జలము తరింపన్
గోరి శ[illegible] దర్శించినఁ,
బారాశర్యుండు దీని వాక్రుచ్చె దయన్. ౧౬౧

శా. శ్రీమద్భాగవతం బఘాంధ్యములు తూలింపం బరంజ్యోతియై,
సీమాంతంబుల కార్తిమేఘములు పోఁ జిమ్మన్ మహావాయువై,
యామూలాగ్రము కుద్దలించు భవవృక్షౌఘంబు కుద్దాలమై,
కామాద్యం బగు శత్రుకానన మడంగం గాల్చు దావాగ్నియై.

శా. శ్రీమద్భాగవతంబు పుణ్యదము సుశ్లోకమ్ము మోక్షాస్పదం
బామోదావహ మిష్టకామదము శాస్త్రానేకసారాళి కా
రామక్షోణి రసైకపాత్రము శ్రుతిప్రఖ్యాతవాక్యార్థము
క్తామంజూష శుభప్రదం బది సమాకర్ణించినం బల్కెనన్. ౧౬౩

క. శ్రీమద్భాగవతామర
భూమీరుహ రుచిరఫల బుభుక్షువులారా!
ఈ మహితక్షితి మీరలు
నేమనంబున విన్న ముక్తిసిద్ధిఁ గను టరుదే? ౧౬౪

శా. పాపీయుం డం[illegible] వేదధర్మవిహిత స్వాచారహీనుండు గా
నీ, పుణ్యోత్తరసత్పురాణము యదృచ్ఛేచ్ఛంబుగా విన్నచోఁ,

బిడ్డ సర్వాంగముల్ ప్రేమతోఁ దడవుచు,
మై మెయి రాయుచు మరల రాయు;
ముఖము ముద్దిడుఁ బ్రేమతో ముఖముఁ జేర్చి
చూచుఁ, జూచినపుడుగనే చూచి మురియు;
నద్భుతం బయి వాత్సల్య మతిశయింపఁ
జటకదంపతి కాత్మలో క్షణముక్షణము. ౧౭౨

తే. చాటకైరఁబుపై నెదఁ జటకములకుఁ
బొంగు నద్భుతప్రేమపు బుగ్గఁ గాంచి
వ్యాసుని మనస్సు, మిగులఁ జింతాతురమ్ము
గాఁగ నిట్లని తర్కింపఁగాఁ దొడంగె. ౧౭౩

ఉ. ఈ కలవింకయుగ్మ మతిహీనవిహంగమజాతి, కామభో
గైక సమర్థమాత్ర ముపయామము వీనికె, వారకంబునం
దీ కవపోషణం బయిన నిచ్చ్యది చేసెడియాస లేదు; కా
నీ, కడుఁ జోద్య మయ్యె నివి యిట్టులు పొంగుట పుత్రజన్మకున్.

సీ. స్వర్గలోకావాప్తి సాధించునా పుట్టి?
మృతి గన్న జనుపునా ప్రేతవిధులు?
సలుపునా గయలోన శ్రాద్ధపిండజలంబు?
విధిగ నీలోత్సర్గవిధి నెరపునో?
ధర్మిష్ఠుఁడై వీనిఁ దనియించునో, పుణ్య
భాగ్యంబు.విత్తసంపత్తిఁ గూర్చె?
పుత్త్రపరిష్వంగ భోగ మొక్కటి దక్క
యోజింప లే దే ప్రయోజనమ్ము;

నిట్టి తిర్యక్కులకె ప్రేమ మింతయైన
నెంత యనవచ్చు నరుల పుత్రైషణమ్ము?
లే దపుత్త్రునకుఁ బరంబు లే దటంచు
స్మృతులు ప్రత్యక్షముగను ఘోషించు శ్రుతులు, ౧౭౪

ట్లీ సంప్రశ్నమె విష్ణునిఁ
జేసెన్ మాతండ్రి మున్ను, చెప్పెద వినుమా. ౧౮౧

శా. శ్రీనాథుండు జగద్గురుండు విలసత్ శ్రీవక్షవక్షుండు ని
ధ్యానస్థుం డయి యుండ, వేధ యొకనాఁ డత్యద్భుతావిష్టుఁడై
కానన్ లేక తదీయహేతు, వెఱుఁగం గాంక్షించె దామోదరున్
శ్రీనారాయణు నాదిదేవు హరి శౌరిన్ విష్ణు సర్వాత్మకున్. ౧౮౨

తే. భూతభవ్యభవత్ప్రభూ ! పీతవసన !
దేవదేవ ! జగన్నాథ ! తెలియఁ జెప్పు
దేనికై తప మొనరింతు ? ధ్యేయ మేది ?
విస్మయం బయ్యె ధ్యానింప విశ్వపతివి. ౧౮౩

క. నీ వాదికారణంబవు;
నీవే కర్తవు, సమస్త నిర్వాహకుఁడవున్;
నీవే సంహర్తవు తుది;
నీవే సకలార్థకరణ నిపుణుఁడవు హరీ! ౧౮౪

క. నీ నాభిన్ జన్మించిన
నే నీయాజ్ఞన్ సృజింతు నిఖిలజగత్తున్;
దానికిఁ గాలము రా, నీ
శానుఁడు, నీయాన, సమయఁజేయును దేవా ! ౧౮౫

క. రవి తిరుగు, టగ్ని కాల్చుట,
పవనుని చలనంబు, మఘువు వర్షించుట ము
న్నవు నివి నీయాజ్ఞనె; ప్రభుఁ
డెవఁ డుండుఁ బరుఁడు నీవు నిటు ధ్యానింపన్? ౧౮౬

తే. ఇట్లనంగ బ్రహ్మ, హరి వచియించెఁ బ్రీతిః
వత్స! విను మేకమనమునఁ బల్కుదాని,
స్థితికి నే, నీవు సృష్టికి, హతికి శివుఁడు,
కారణము లంద్రు సర దేవగణము లెల్ల. ౧౮౭

క. కానీ నీకుఁ నా కీ
శానునకుం గారణంబు శక్తి యటంచున్
జ్ఞానులు శ్రుతిపారగు లగు
మానుల సిద్ధాంతవచనమార్గము, వత్సా! ౧౮౮

క. నాయందు శక్తి సాత్త్వికి,
యా యీశుని శక్తి తామసాత్మికయు నగున్,
నీయందు రాజసం బగు,
నాయంబకు ముప్పురమును స్వాధీనుల మే. ౧౮౯

క. నేను స్వతంత్రుఁడ నెన్నఁడు
గా, నెఱుఁగవె శేషశయ్యఁ గనుమూయుదుఁగా,
నే నాశక్తి కధీనుఁడ
నై నిత్యము తపము సేతు, సదియే కొలుతున్. ౧౯౦

మ. ఒకనాఁ డామెయనుజ్ఞ శ్రీ మెఱయఁ, గ్రీడోల్లాసినై యుందు; నిం
కొకచోఁ దానవకోటితోఁ భయదమౌ యుద్ధంబు సర్వాంగముల్
వికలంబై చనఁ జేయుదుం; దెలియవో సృష్టింపవో మున్ను జ్ఞ
ప్తికి రాదో, మధుకైటభాసురులతోఁ విఖ్యాత దోర్యుద్ధమున్. ౧౯౧

తే. జగతి యేకార్ణవం బైన సమయమందుఁ
గర్ణమలభూతులై మదగర్వితు లగు
వారితో నైదువేలేండ్లు పోరి జయముఁ
గంటి దేవీప్రసాదంబుకలిమిఁ దాదను. ౧౯౨

క. గడగడ వడఁకుచు బడలిన
వడువున నుడివడుచు వ్రాలి పద్మమునుండన్
పడియుంటి వపుడు చూడవొ
యుడిగెదు మతి కన్నులార నరసినదానిన్. ౧౯౩

తే. కూర్మమై క్రూరనరసింహమై కోలము నయి
యేల తిర్యక్కు నైదు నే స్వేచ్ఛ యున్న?

నా పరాశక్తి, కింకరుం డౌదు నేను;
హీనయోనిజన్మం బెవఁ డిచ్చగించు? [illegible]

తే. పూర్వ మొకమాఱు నాశార్ఙ్గమౌర్వి విఱుగ
శిరము తెగిపోవఁగా హయశిరముఁ దెచ్చి
శిల్పిచే నీవె యోజింపఁ జేసినావు;
హయశిరుఁడ నైతి, నెఱుక యున్నదియొ లేదొ! [illegible]

క. శక్తికి స్వాధీనుఁడ నై
శక్తినె ధ్యానింతు నేను సతతము భక్తిన్;
శక్తికిఁ బరతర మగునది
శక్తుఁడఁ గా నే వచింప, సత్యము వత్సా! [illegible]

తే. ఆ మహావిష్ణు వాక్యము లబ్జజుండు
తాను విన్నవి నాకును దయ వచించె;
నఖిల కల్యాణ కామితావాప్తి యగును,
నీవు హృద్వీథి నిలుపు శ్రీదేవి పదమె. [illegible]

తే. వ్యాసుఁ డాలించి నారదువచనసరణి,
నాత్మ యుప్పొంగ దేవీపదాబ్జయుక్తిఁ,
దప మొనర్చెను మేరువుతటమునందు
నంచుఁ బల్కిన సూతున కనిరి మునులు. [illegible]

### హయగ్రీవావతారము

తే. విస్మయం బయ్యె, నుతియించు వేద మెవని,
నాదిదేవుండు మాధవుం, డతని శిరము
దైవయోగంబుచే నెట్లు తెఱుఁగఁబడియె?
హయవదనుఁ డెట్టు లయ్యె జనార్దనుండు? [illegible]

వ. అనిన సూతుం డి ట్లనియె. ౧౦౦

భద్రంబౌ నొక వమ్రి సృష్టమయి భూపాన్యస్థధన్వగ్రము
చ్ఛిద్రింపన్, ధనువున్ విముక్తమగు, నీ శ్రీనాథుఁ డున్నిద్రుఁడౌ.

తే. శివుని యూసతి నొదలఁ జేర్చి, యపుడు
వమ్రి నొకదాని సృష్టించెఁ బద్మభవుఁడు;
దేవకార్యముఁ దీర్ప సందిష్ట మయ్యె,
వమ్రిఁ గొమ్ములక వేధతోఁ బలికె నిట్లు. ౧౯౭

ఆ. అలుకగల ప్రీతి యుడఁచుట, కథమధ్య
విఱుచుటయును, వేఱుపఱచుటయును
నిసువుఁ దల్లినుండి, నిద్దురఁ జెఱచుట
బ్రహ్మహత్య లంచుఁ బల్కు స్మృతులు. ౧౯౮

ఆ. ఏమి కోరి సేతు నీ మహాపాపంబు!
పాతకంబు సేయ ఫలము వలదె?
దేవదేవుఁ బ్రద దెలిపినదో నటఁ
జేయు లాభ మేమొ చెప్పుమయ్య! ౧౯౯

వ. దానికి బ్రహ్మ యిట్లనియె. ౨౦౦

క. సుఖభాగము గల్పించెద
మఖహవ్యములను వమ్రి! పార్శ్వమఖ స్థలిపం బౌ
మఖహవ్యము నీ కిచ్చితి;
సుఖముండుము; వేగ దీర్పు సురకార్యంబున్. ౨౦౧

తే. అట్లనుజ్ఞాత మై వమ్రి యంటి మెసవె
వేగనే నల నాసిన వింటి కొనను
విరియఁగా మౌర్వి ధనువును త్వరపుకొప్పు
ముక్త మయ్యె మహాధ్వని ముక్త మయ్యె. ౨౦౨

శా. క్షోణీభాగము దద్దరిల్లె నదరెన్, క్షోణీభృత్తు ప్రకంపించె, వి
ష్ణోద్విగ్నము లయ్యె వారిధులు, లబ్ధిస్రుల్ కలంగెన్. సూ

శైలముల్ కంపము నొందె, దిక్తటుల వీచెన్ ఘోరవాతూలముల్,
ప్రాణస్థానమునన్ నిరంతర మహోల్కావర్షధారల్ పడెన్. ౨౧౪

తే. ఇటు మహోత్పాతములు పుట్ట నెల్ల దిశలు
భూరిదుఃఖానుశంసన ఘోర మయ్యె,
నంధతమము వ్యాపించె నహస్కరుండు
కాన రాకుంట సుర లెల్ల భ్రమానుపడిరి. ౨౧౫

తే. కొంతవడి నంధకార మొక్కింత విరియ
నరమకుటకుండలోద్భాసి శిరము లేని
దేవదేవుని విష్ణుని దివ్యతనువు
వికృతరూపంబు గాంచిరి విధియు శివుఁడు. ౨౧౬

క. అయ్యో! నాథా! యిది యే
మయ్యా! ప్రభు! దేవదేవ! హరి! యెవ్వరిమా
యయ్యా! యిఁక దిక్కెవ రని
కుయ్యిడిరె సమస్త దేవకోటియు నార్తిన్. ౨౧౭

తే. నీవ భేద్యుఁడ వచ్ఛేద్య నిపుణగతివి
మాయకీశుఁడ వౌట నే మాయ నొనిఁ
ప్రభు! జగద్గురు! నినుఁ గ్రిందుపఱుప లేదు;
నీవు లేకున్న మే మెట్లు నిలువఁ గలము? ౨౧౮

తే. రాక్షసులు కాదు చేయరు యక్షు లెవరుఁ,
జేతులారంగ నిది మేమె చేసికొంటి;
నేమి చేయుము? మే మిప్పు డెందుఁ బోదు?
మెవరు శరణంబు? మా కింక నేది దిక్కు? ౨౧౯

తే. శివపురోగము లైన దేవనివహ మేడ్వ
చుండ వారించి దేవగురుండు పల్కె:
నిట్లు పరిదేవనము చేయ నేమి లాభ?
మేది యైన నుపాయ మూహింప వలయు. ౨౨౦

క. దైవంబుఁ బురుషకారము
దేవతలారా! సమంబ, తెలియుఁడు మదిలోఁ;
నేవాఁ డుపాయశాలియొ,
యావానికె యెపుడు దైవ మనుకూలించున్. ౨-౨౧

తే. ఇంద్రుఁ డది యాదరింపక యిట్లు పల్కెఁ:
దైవమె పరంబు పర మని తలఁతు నేను;
పురుషకారం బ దేల! ఛీ! సురలయెదుట
ఛిన్న మైనది విష్ణుశిరము కనమె? ౨-౨౨

తే. సంశయోచ్ఛిత్తికై యంత స్రష్ట పల్కెఁ:
గలుగును శుభాశుభంబులు కాలవశత;
దేహి సుఖదుఃఖములు గుడ్చి తీరవలయు;
దైవము నతిక్రమింపఁగా దక్షు లెవరు? ౨-౨౩

క. నాశిరము మున్ను త్రెవ్వఁడె
యీ శంభుఁడు? శాపవశత నితనికిఁ గూడన్
నాశం బొందదె లింగము?
శ్రీశునిశిర మిపుడు పడియె సింధువులోనన్. ౨-౨౪

ఆ. వజ్రి యెన్నిమార్లు స్వర్గవిచ్యుతుఁ డయ్యె?
నొక్కతఱి సహస్రయోని యయ్యె;
భవము నొంది దుఃఖభాక్కుఁ గాని దెవండు?
కాన శోక మొందఁ గాదు బుధులు. ౨-౨౫

తే. బ్రహ్మవిద్యాత్మ యెది, పరాప్రకృతి యెవ్వ,
రేయమ సనాతనీమహామాయ యందు,
రా జగద్ధాత్రి జనయిత్రి నఖిలధాత్రి
శరణు వేఁడుఁడు, మీకోర్కె సఫల మగును. ౨-౨౬

ఆ. ఇట్లు పలికి సుంత యెదలోన ధ్యానింప,
నిలువఁ బడెయె నెదుట నిగమరాశి,

దినకరాయమాన దివ్యతనువు దాల్చి,
దేవకార్యవిధముఁ దీర్పఁ గోరి. —౧౨౭

ఆ. సర్వకార్యసిద్ధి సాధనీభూతము
పరమగూఢ మైన బ్రహ్మవిద్య
వినుతి సేయుఁ డంచు వేధ యాదేశింప
శ్రుతులు దేవి నిట్లు స్తుతి యొనర్చె. —౧౨౮

## వేదకృత దేవీస్తోత్రము

క. మాతల్లి! నమస్కారము
చేతుము విశ్వైకజనని! శివకామేశీ!
భూతముల కెల్ల భూమీ
భూతవు, ప్రాణులకుఁ బ్రాణభూతవు దేవీ! —౧౨౯

క. శ్రీ ధీ కాంతి క్షాంతులు,
మేధా శాంతులును, శ్రద్ధ స్మృతియున్ ధృతియున్,
నీ ధామంబున వెలిఁగెడి
దీధితులే కాదటమ్మ త్రిదశజనిత్రీ! —౧౩౦

క. గాయత్రీ వ్యాహృతులును
నా యుద్గీథార్థమాత్ర యల ధాత్రివి నీ
వోయంబ! కీర్తి లజ్జలు
నాయత విజయా జయా దయా స్పృహ లీవే. —౧౩౧

ఉ. అమ్మ! జగత్త్రయమ్ముఁ గనినమ్మ! జనమ్ములు నమ్మినమ్మ! లో
కమ్ముహితమ్ము నెమ్మదిఁ గ్రమ్మినయమ్మ! దయారసైకమూ
లమ్మగు నమ్మ! సంసృతిఁ దొలంచి శివమ్మొనగూర్చు విద్యయై
నమ్మ! వరేణ్య వాగ్భవ హృదాలయనమ్మ! నుతింప నిమ్ము మా!

క. స్థావర జంగమములకున్
నీవే జనయిత్రి వగుట నీ పసిపాపల్

క. శ్రీదేవి పల్కె నిట్లని :
యో దానవ! నీతపస్సు కూర్జస్వితమై
నీదగు భక్తికి శ్రద్ధకు
మోదించితిఁ గోరు మిత్తు ముద మేవరమో? —౨౫౩

క. ప్రమదానహా మద్భాపల
క్రమందహార్షంబు నొంది, యాత్మైక్యము కో
సమరత్వ మజయ్యత్వం
బమరారి యపేక్ష సేయ నాతని కంటెన్. —౨౫౪

క. పుట్టినవారలు తథ్యము
గిట్టుట, జన్మంబు ధ్రువము గిట్టినయెడ; నీ
విట్టి జగన్మర్యాదన్
నెట్టన భావించి కోరు నిజవర మేదే. —౨౫౫

సీ. ఆ హయగ్రీవుఁ డర్థించె నంత నన్నుఁ;
దను హయగ్రీవుఁ డొక్కఁడు దక్క నొరులు
చంపలేకుంట; నరమ న్దోసంగినాను;
వాఁడు వరగర్వమున మీఱినాఁడు నేఁడు. —౨౫౬

తే. తామసాత్మ నన్ను ధ్యానించుటను వాఁడు
వేదములను మునుల వేధసేయు
హయశిరం బొకండు హరి నేన సంధింపుఁ,
డతఁడు మాన్పు నంత సురబాధ. —౨౫౭

క. శరదాగమ శుభ్రాంభో
భర శుభ గంభీరహారి భాషణము లిటుల్
పరమేశ్వరి పరపించిన
సురసంఘము లేచె కార్యసౌరత మెఱయన్. —౨౫౮

క. పరమానందాశ్రుపరం
పర యురలం గనుల, మేన భరముగఁ బులకల్

తే. సాత్త్వికశ్రవణంబును తత్త్వవిదులు
ముత్తమంబు లటంచు వాక్రుత్తు; రందు
మోక్షదం బుత్తమము, స్వర్గమును దలంప
మధ్యమము, భోగదం బధమం బటంచు, ౨౭౨

క. త్రివిధము సాహిత్యము, స్వీ
యనిలయము నుత్తమంబు, నల వేశ్యాస్త్రీ
సదనంబున మధ్యమ మగు,
నవు నధమం బన్యాయువతులం దగు నెడలన్. ౨౭౩

తే. ఉత్తమం బాతతాయులతో యుద్ధమైన;
మధ్యమంబు విద్వేషిప్రమర్దనంబు;
నిర్నిమిత్తవివాదంబు నిర్నిమిత్త
కలహ మధమము, తామసకథయు నట్లు. ౨౭౪

క. కాన పురాణశ్రవణము
జ్ఞానం బొనగూర్చు, బుద్ధిసంపదఁ బెంచున్,
ఏనోనాశము, సంప
ద్దానంబును జేయుఁ, జెప్ప దగు దేవికథల్. ౨౭౫

వ. నావుడు సూతుం డి ట్లనియె. ౨౭౬

క. ధన్యులు మీరు మహాత్ములు;
ధన్యుఁడ నే; నుభయులమును ధన్యుల; మీరల్
ధన్యులు వినఁ దివురుటచే
ధన్యుఁడఁ గథనమున బుద్ధి దనుకుట నేనున్. ౨౭౭

## మధుకైటభులు వరంబులు పడయుట

తే. మును నొకానొక లయవేళ మునిఁగిపోయె
భువనములు మూఁడుఁ గనరాక పూర్ణజలధి;
నద్భుతం బయ్యె నప్పు డేకార్ణవంబు,
శేషుపాన్పున సుఖసుప్తిఁ జెందెను హరి. ౨౭౮

తారధ్వని యాకసమున
వారికి విన నయ్యె శ్రవణపర్వం బగుచున్. ౧౦౩

తే. వ్యగ్రులై వారు భక్తిc బరిగ్రహించి
యభ్యసించిరి దృఢముగా నదియు, వారి
కప్పుడు సౌదామినీరేఖ యంబరమున
నమ్మలం బగుచు నెలసి ప్రత్యక్షమయ్యె. ౧౦౪

తే. ఆదియె మంత్రము సగుణమౌ ధ్యాన మనుచు
నిశ్చయించి విచారించి నిష్ఠతోడ
నశనమును నిద్ర మాని జితాత్ము లగుచుc
దద్జపారాధను లైరి నక్తందివమ్ము. ౧౦౫

ఆ. వార లిట్లు తపము వర్షసహస్రమ్ము
నెరపc బ్రీత యయ్యెc బరమశక్తి;
నిపి శరీరహీన దివ్యవాక్కులు, నిచ్చు
వరముc గోరుc డనుచుc బలికె నదియు. ౧౦౬

క. సురరిపు లది విని స్వేచ్ఛా
మరణం బర్థింప నద్ది మాకిటు పల్కెన్,
మరణం బగ్గు కావుత,
మఱి సురదైత్యుల కజేయ మహామం గనుడీ. ౧౦౭

క. ఇటు దేవీపరివర్ధిత
పటు దర్ప శరీరు లగుచు వార్ధి జలములన్
నటదూర్ముల నటియించెడు
చటులిం క్రీడు నెన్న నట్టి జలసత్త్వమునేన్. ౧౦౮

మధుకైటభులు బ్రహ్మను ధర్షించుట

క. యాదృచ్ఛికముగ నొకనాc
డాదైత్యులు గాంచి రందు నబ్జాసనునిన్
వేదంబులు నలుమొగముల
నాదవినోదంబు చేయ నందించు విభున్. ౧౦౯

శ్రీపతి యోగనిద్రకు వశీకృతుఁ డౌట ధ్రువమ్ము, శక్తి సు
మ్మీ పరమేశి, తథ్యము, భజింతు ననాథశరణ్య దానినే. ౨౯౬

తే. నిద్ర హరివశమై లేదు నిశ్చయమ్ము;
హరియె యున్నాఁడు నిద్రావశాత్ముఁ డగుచు;
దేని కెవ్వాఁడు వశుఁడో, యద్దాని కతఁడె
దాసుఁ డౌఁగాక, యీశుఁ డెదారి నగును? ౨౯౭

తే. సృష్టిపాలనలయకారి శ్రీవిభుండె
కింకరుండైన శక్తికిఁ, గింకరులము
నేను శంభుండు నీ జగన్నివహ మనుచు
యోగనిద్రాస్తవము భక్తియుక్తిఁ జేసె. ౨౯౮

## బ్రహ్మకృత యోగనిద్రా స్తవము

ఉ. ఆగమసూక్తిచేత జగదాదివి నీ వని జ్ఞాతమయ్యెఁ, బ్ర
ఖ్యాగురుఁ డీ యధోక్షజుఁడు దేహ మెఱుంగక యిట్లు నిద్రఁ బొం
దోఁగుట చూచి నే నిటులఁ దొట్రిలఁజూచి విస్మయింతుఁ, జ
ల్లీ! గణుతింప నీ బహుళలీలల నేవిబుధుండు శక్తుఁడో? ౨౯౯

తే. ఈజగత్కర్త్రిఁ జైతన్యహీన మైన
ప్రకృతిగా నిన్ను వర్ణించి పలుకుసాంఖ్యు
లెంత మందవిచారులే! యెట్లు జనము
యీ హృషీకేశుఁ జైతన్యహీనుఁ జేసె! ౩౦౦

క. నీ నానాగుణానటన వి
ధానం బెవఁ డెఱుఁగఁ జాలుఁ, దల్లీ! నను సం
ధ్యానామములఁ ద్రికాలము
ధ్యానింతురు పణ్యవరులు తాత్పర్యమునన్. ౩౦౧

తే. బోధలకు బోధకారణబుద్ధి వీవు,
దేవసుఖపేతు వైన శ్రీ శివ దేవి!

సకలజనముల కీర్తియు శ్రద్ధ నీవ,
మతియు రతి నీవ, కాంతియు ధృతియు నీవ. ౩౦౨

ఉ. అక్కడ వాక్కు వెల్వడగు, నందు మనస్సు నివృత్త మౌను, నే
నొక్కటి నేర్తు దానిఁ గన నోప నటంచు, ననంత మైన నా
వాక్కులు దాని సన్నుసనవాయు వటంచును, వేదమాతవే
చిక్కునఁ జిక్కని న్నెలియఁ జెప్ప, నిఁ కేరికి సాధ్య మౌ నుమా!

తే. తర్క కోటిఁ బ్రమాణశతంబుచేత
నిను నెఱుఁగ నైతినే జగజ్జనని యనుచు,
నేఁడు ప్రత్యక్షముగ హరిచంద్రఁ జూచి
యోగిగణా, నిను హరిహరు లెఱుఁగ రంబ! ౩౦౩

క. స్వాహా యని నీనామ
వ్యాహృతి లేకుండ శ్రౌతయాజ్ఞికవిధులం
దే హోమము చేసిన యా
హారము సురల కెట్లు లందును? జననీ! ౩౦౪

క. కావ్యుఁ దేవతలకు నీ
వే వ్యాప్తిప్రదవు, విష్ణుఁ డంత పిలిచినన్
లేవం; డీ మధుకైటభ
దేవారిభయంబు నీవె తీర్పుము తల్లీ! ౩౦౫

క. ఆయ్యో బలదృప్తులై
యియ్యసురలు నిలిచి యెదుట నీ దుష్టులు నోఁ
గయ్యాం బొనరింపఁగ భయ
మయ్యెడి, రక్షింపు శరణ మంటిని దల్లీ! ౩౦౬

ఉ. నీపదపంకజంబు లెద నిల్పి భజించుచు నన్యదేవతా
రోపణ చేయ నోయుచును లోకవిధాత్రివి కామదోగ్ధ్రివౌ
నీపరమైన భావనల నృత్యము సేయుచు నీపదంబు లా
లాపన చేయుచున్ నినుఁ దలంచుచుఁ జొక్కు మహాత్ములే కృతుల్.

కరుఁ బంచాస్యు హిమాంశుశేఖరు జగత్కల్యాణకృత్త్ర్యంబకున్
హరు హుంకార విభూతి మన్మథ మహాహంకార లుంఠాకునిన్.

క. ఉద్యంతుఁ డస్తమానుఁడు
నా ద్యుమణిని నుభయసంధ్య లర్ఘ్యాహమునం
దాద్యుం డని ధ్యానింపఁగ
నుద్యోగించెదరు వైదికోత్తములు ద్విజుల్. ౩౧

క. కొందఱు కొలిచెద రగ్నిని,
గొందఱు కొలుతురు మహేంద్రుఁ, గొందఱు రవినిన్;
అందఱ కధికుఁడు విష్ణుం
డందురు ఋషివరులు గంగయుష్ట్రాలు నదులన్. ౩౨

వ. ప్రత్యక్షము, అనుమానము, శాబ్దము అని ప్రమాణములు మూఁడు. కొందఱు ఉపమానంబుతో నాలుగనియు, మఱికొందఱు అర్థాపత్తిం గలిపి యైదనియు, మీమాంసకులు అనుపలబ్ధితో నాఱనియు, ఐతిహ్యమును జోడించి పౌరాణికులు ఏడనియు, వచింతురు. ఎన్ని యన్ని ప్రమాణములను నొడివినను, పరబ్రహ్మ మప్రమాణముల కందరానిదై యొప్పు. ౩౩

తే. శ్రుతి విచారించి ప్రత్యక్షగతిని దెలిసి
శిష్టపథమున దృష్టాంతచింత చేసి
తర్క మొనరింపనగు బుద్ధిఁ దఱచి తఱచి
యిది పురాణముల్ మునులు కీర్తించుపథము. ౩౪

సీ. స్రష్టను లోకంబు సృష్టించుశక్తియు,
వైకుంఠునందుఁ దద్భరణశక్తి,
హరునందు సర్వసంహారకశక్తియు,
సంప్రకాశకశక్తి సవితృనందు,
దహనునిలో సర్వదాహకశక్తియుఁ,
బ్రేరణశక్తి సమీరునందు,

నాదిశేషునియందు నాదికూర్మంబున
ధరయందు నున్నది ధరణిశక్తి,
శివుఁడు కుండలి విడిచిన శివత నొందు,
శక్తిహీనున కసమర్థసంజ్ఞ చెల్లు,
గమనభోజనముల శత్రుదమనమందు
శక్తిహీనంబు నింద్యంబు జగతి నెందు. ౩౨౬

క. ఆశక్తియె సర్వగతం,
బాశక్తియె సర్వయోని, యదియే బ్రహ్మం,
బీశం, బని యోగి బుధుం
డాశక్తియుపాసనంబు ప్రారంభించున్. ౩౨౭

క. హరి హర విరించు లైనన్,
నరాగ్ని యమేంద్ర సూర్య వాసవు లైనన్,
సుర దితిసుం దను జనులే
గన్నై గ్రుంగెదరు శక్తివర్జితు లైనన్. ౩౨౮

క. సగుణం బని నిర్గుణ మని
యగు రెండు విధంబు లదియు; నందు సరాగుల్
సగుణముఁ గొలుతురు, నిర్గుణ
మగునది గొలుతురు విరాగు లైన యతీంద్రుల్. ౩౨౯

క. వరియించిన నర మదిగో
కనుఁగొంచును విధివిధానకలితార్చ్యలఁ ద
ద్వరివస్యాపరివర్జిత
ఖరతుల్యులు పశ్వు- లుంద్రు కలిలో మనుజుల్. ౩౩౦

మ. అదె బ్రహ్మాండము సృష్టి పాలనము సంహారంబు గావింప, స
ద్యఃపదధ్యేయంబు విధీశకేశవులకున్ యజ్ఞాదికర్మంబులం,
దదె ప్రాపించెను నాఁడె యందు విధిచే, నాఁడందు గోవిందుచే,
నదె పారాశరి నిత్యసేవ్య మని నా కాదేశముం జేసె సూ. ౩౩౧

క. అనవరతసేవ్య శక్తియె,
విను జనదు తలంప రాదు వే అను నుడువుల్,
వినికి గల బుధుఁడు కన్నుల
కనలేఁ డేశక్తిహీను ఘనజడిమంబుల్! ౩౩౪

ఆ. శక్తిరూప మిలు ప్రసంగించి సూతుండు
పరవశాత్ముఁ డగుచు భక్తియుక్తిఁ
గనుల హర్షబాష్ప కణములు దనుకఁగా
నోట మీఁటి యందుకొనియెఁ గథను. ౩౩౫

### హరి మధుకైటభులతోఁ బోరుట

సీ. హరి నేత్రంబులు వీడి నాసికయు నాస్యంబున్ విసర్జించి కం
ఠోరుభాగంబు త్యజించి బాహుహృదయాంతస్థశ మూర్ధస్థలిన్
బరిపర్జించి పదంబు లిట్లు వయసన్ సర్వాంగముల్ వీడి యం
బరమార్గంబున యోగనిద్ర సలిపెన్ భద్రప్రదాద్భుతమై. ౩౩౬

క. జృంభాసంరంభుండై
స్తంభితరూపంబు వీడి సద్యోజాతా
జ్జృంభిత చేతనుఁడై హరి
యంభోజజుఁ గాంచె నెదుట నత్యంతాస్తున్. ౩౩౭

క. జలధరగంభీరధ్వనిఁ
బలికెన్ హరి, తపము వదలి వచ్చితి వేలా?
యులికెద వేలకొ? చింతా
కులతం బొక్కెద వ దేలకో? విధి! చెప్పుమా. ౩౩౮

వ. అని యాదరంబున నడుగు విష్ణుదేవునకు బ్రహ్మదేవుం డిట్లనియె.

శా. దేవా! యీమధుకైటభుల్ శ్రవణపూర్తిన్ నీకు జన్మించి బా
హావిస్ఫూర్జితదీర్ఘదేహులు మదాంధ్యాయత్తచేతస్కులై,
నావెంటం బడినారు ఘోరముగ జన్యం బిట్లపేక్షించుచున్,
లేవయ్యా నను గావ; నీరశిరముల్ త్రెళ్లింపవయ్యా, హరీ! ౩౩౯

కోచింపక హరితో యు
ద్ధాచరణకు సిద్ధు లగుచు నార్చిరి పెలుచన్. ౨౮౫

ఉ. అంత నిరామయం బగు మహార్ణవసంచల దూర్మిమాలికా
సంతతులందుఁ గాల్నిలుపఁ జాలని చోట మహాద్భుతంబు న
త్యంతభయంకర మ్మగు మహాసమరం బొనరించె శౌరి యా
స్వాంతము వారితోడ నసహాయతఁ బంచసహస్రవర్షముల్. ౨౮౬

క. కాతెను బోఁతెలద్వంద్వము
మీఱి రుషన్ వృషభరాజుమీఁదఁ గవియుచున్
చేరెములు వాఱు భంగిని
బోరిరి మధుకైటభులును బురుషోత్తముతోన్. ౨౮౭

క. మధు వలసినఁ గైటభుఁడున్,
మధువుఁ గైటభుఁడు బడల, మఱి కైటభుఁ డై,
మధు వై మఱి యీ విధమునఁ
బ్రధనం బొనరించిరి వారు పర్యాయమునన్. ౨౮౮

తే. ఆ నిరామయమైన యేకార్ణవమున
రోమహర్షణ మైన సంగ్రామమునకుఁ
బ్రేక్షకులు నిర్వురే యంతరిక్షమందు
యోగనిద్రయుఁ బ్రీతిఁ దోఁగు విధియు. ౨౮౯

క. ఇక్కరణిన్ సంక్రుద్ధులుఁ
డొక్కమొగిన్ విరతి లేక యుగ్రాహవ సం
రక్కసులతోడఁ జేయఁగఁ
జొక్కెన్ హరి; యక్కజముగ, జొక్కరి దైత్యుల్. ౨౯౦

ఉ. పంచసహస్రవర్షము లవారణ యుద్ధ మొనర్చి యంత యో
జించెఁ ద్రివిక్రముం డిది విచిత్రము క్రొంగొడ నైతి, [illegible]
క్కించుక స్రుక్కినట్లు కనిపింపరు దైత్యు లిదేమి? వేమి? న
య్యంచితశౌర్యమున్ బలమహత్త్వము నేమయె? నెందుఁ బోయెనో?

నా దూరంబు తొలంగువార మిదె నీ వర్థించు విశ్రాంతి యీ
లే దంచున్ నెప మేల మా కనుచు దూరీభూతులై నిల్చినన్.

### విష్ణు కృత దేవీ స్తుతి

క. అతిదూరము వా రరిగినఁ
జతుర్భుజుఁడు చింతచేసె సంయతమతి యై,
దితిసుతమరణోపాయము
నతని కతిదీర్ఘ చింత నాశ్చర్యంబై. ౩౫

క. విద్యుద్రేఖాస్ఫూర్తి స
ముద్యోతిత మయ్యె జ్ఞాన మూహాంశధనుం
దాద్య శ్రీ దేవిద
హృద్యత్ స్వచ్ఛందమరణ యుక్త లటంచున్. ౩౬

శా. అమ్మా, పంచసహస్రవర్షకృత మీ యాయోధనం బంతయున్
నయ్యెన్ వ్యర్థము, వ్యర్థమయ్యె శ్రమ, మాహా, యెట్లు పోరాడెదన్?
కయ్యంబుం బొనరింపకే జయము శక్యంబౌనె ప్రార్థింపఁ గ
నెయ్యోజన్ మధుకైటభప్రముఖసం బీవేళ సాధించెదన్! ౩౭

క. దీనుఁడు రోగియు నార్తుం
డేనియు మరణింప దాన యిచ్ఛయ్యోసం, డీ
దానవుల బలమదాంధుల
నే నెటు మరణింప నిచ్ఛగింప నొనర్తున్? ౩౮

తే. అఖిలకామప్రదాత్రి విద్యాస్వరూప
శక్తి యొక్కతె యే నాకు శరణ మిపుడు,
సుప్రసన్నాత్మయై యమె చూచునెడలఁ
గోర్కె సిద్ధించు, నిక ది కొక్కకొంటు లేదు. ౩౯

క. నగ నొందుచు నిటులన్ హరి
గగనంబున యోగనిద్రఁ గని స్తిద్రన్,

ప్రావృట్తటిల్లతోపమ నవ మల్లికా
వర్షధారల జిహ్వా బడలుపరచి,
ధూమకేతురూక్ష ధూమ్రమనీలోత్పల
శూలహతుల నవయవాళి నొంచి,
కామపంచబాణ కమనీయ ఘోరమై
దేవివక్రదృష్టి తేజరిల్లె. ౩౮౨

క. పంచేంద్రియ సమ్మోహన
చంచ త్తన్మాత్రదృష్టి సాయక హతులన్
వంచితులై యసురలు వీ
క్షించుచు ననిమేషు లైరి శ్రీశివమాయన్. ౩౮౩

క. కర్తవ్యవేది దానవ
హర్తయు దేవీప్రయుక్త హాసమృగంతా
వర్త హతాద్యర్థన మో
హార్తులుగా వారి నెఱిఁగె నాక్షణమందున్. ౩౮౪

క. వారికి హరి జలధరగం
భీర మనోహర ధీర విశదస్వరుఁడై,
ధీ రాజిల, స్మిత మలర, సు
రారుల వీరత నుతించి యనె నీరీతిన్. ౩౮౫

ఉ. వీరవరేణ్యులార! యతివేలము మీ రణకౌశలంబు జే
వారులకోట్లకుఁ బెనఁగు లాడితిఁ గాని యెఱుంగ నెన్నఁడీ
సారము మీపరాక్రమ మసాధ్య మపూర్వము, మేలు, మెచ్చితిన్,
కోరుకొనుండు మీర, లొనగూర్తు వరం బది యెట్టిదేనియున్.

క. భువనానందవిధాత్రిని
భువనేశ్వరిఁ గాంచి మోహమూర్ఛావశులై,
యువలేపం బభిమానము
ఛివురింపఁగ వారు మాఱు చెప్పిరి హరికిన్. ౩౮౭

తే. యాచకులు గాఁగ మము నెంతు వా రమేశ!
మేమె దాతల మగుదుము, మెచ్చు వచ్చె;
నీ నియుద్ధ మమోఘంబు నిరుపమంబు,
కోరు వర మేదియే నిచ్చువార మేమె. ౩౮౮

క. వెంటనె హరి యా యసురల
జంటను బ్రార్థించె నిట్లు సంతుష్టుల రై
యుంటిర యే నాచే మృతిఁ
గొంటకు నై యిచ్చగింపఁ గోరుదు మిమ్మున్. ౩౮౯

ఆ. హరివరంబు వించు నసుర లచ్చెరు వంది
మోస పోతి మంచుఁ బొగిలి మిగుల
స్వార్థచింత చేసి తిలకించి రెల్లెడ
నీరు తప్పు లేని వారిరాశి. ౩౯౦

ఆ. వార లంత నిట్లు పల్కిరి హరితోడ,
నీవు మా కొసంగినావు వరము,
సత్యసత్యవచన! నిర్వహింపు ప్రతిజ్ఞ,
చంపు జలము లేని సమతలి మము.

ఉ. దానవ వీరు లంతట సుదర్శనచక్ర మనంతవక్త్రమున్
ధ్యానము సేసి నెమ్మది సురారుల కిట్లని పల్కె మందహా
సానన భాసుకుం డయి, తథాస్తు వరంబు నిజంబు సేతు మీ
ప్రాణములన్ హరింతు నిదె వారివిహీన సమస్థలంబునన్. ౩౯౨

తే. దేవదేవేశుఁ డిట్లు పల్కి దివ్యశక్తి
నూరువు లొనర్చె బహుళవిస్తారములుగ,
జలముపైఁ జూపి నిర్జలసమతలంబు,
ఒత్తె మధుకైటభుల కిట్లు పరమగురుఁడు. ౩౯౩

ఆ. ఇచట లేదు సలిల మిం దుంచెదు శిరంబు,
లేను సత్యవాక్కు నిపుడ యాదు;

మీర లట్లు వరము మీఱకుండఁ బ్రతిజ్ఞ
నెఱపనలయు మరణనిశ్చయమున. ౧౯౪

ఉ. యుక్తివివేకు లా యసురయోధులు శ్రీహరిసంప్రయుక్తధీ
రోక్తులు వించు విష్ణు విపులోరుతలిం బొడగాంచి జీవనా
సక్తి మదిన్ విచారణము సల్పి యుపాయ మెఱుంగుచున్ మహా
శక్తి సహస్రయోజనవిశాలశరీరులు గాఁగ వర్ధిలన్. ౧౯౫

శా. దేవేశుండు త్రివిక్రముం డసురవిద్వేషిప్రియుం డైన మా
యావిజ్ఞాని నిమేషమాత్ర జఘనాయామంబు ద్వైగుణ్యశ్రీ
లావిస్తార మొనర్చి పిల్చె, నసురల్ సంభ్రాంతులై విస్మయా
యావైదగ్ధ్య విమూఢచిత్తత ననన్యాయత్తులై యుండఁగా. ౧౯౬

క. లక్ష్మీక్రీడాస్థానం
బా జ్ఞాదేవిప్రసారితాకారం బౌ
లక్ష్మీనాథుని విపులా
సూక్ష్మోరుమహత్త్వ మపుడు చూచిరి దనుజుల్. ౧౯౭

క. మధువైరిసమాహ్వానము
మధుకైటభు లాలకించి [illegible]
ర్వ్యర్థులై తమ శీర్షంబుల
నధివాస మొనర్చి రప్పుడు హరియూరువులన్. ౧౯౮

క. నఱకెను మధుకైటభభా
స్వరశీర్షమ్ములను జక్రి చక్రాయుధాగ్రన్,
పరివర్జితజీవం బగు
సురారియుగళమును బ్రహ్మ చూచె నలరుచున్. ౧౯౯

క. యాదోరాశిన్ వారల
మేద స్స్రుతిడలఁ బర్వి మేదుర మగుటన్,
మేదిని యను పేర్వెలసెను
మేదినికి; నభక్ష్య మయ్యె మృత్తిక దానన్. ౨౦౦

మహితాశ్చర్యతపమ్ము వ్యాసముని నేమం బొప్ప దేవీపదో
ద్వాహవృత్తుం డయి చేసె నిస్తులలసద్భక్తిన్ శతాబ్దాంతమున్. ౨౦౮

క. వసుధకు నాకాశమునకు
శ్వసనునకును బావకునకు సరివచ్చు ఘనున్,
బ్రసవింతుం గావుత సుతు
నసమజ్ఞానప్రభావు నని ధ్యానించెన్. ౨౦౯

తే. సల్పఁగఁ దపస్సు వ్యాసు తేజస్సు నిండి
వ్యాప్తమై విశ్వ మొప్పెఁ జరాచరంబు;
నగ్నివర్ణంబులై నెగ్గె నతని జటలు;
భయపడె సురేంద్రుఁ, డభవుఁ డా భయముఁ బాపె, ౨౧౦

క. ప్రత్యక్షు డగుచు వ్యాసున
కత్యంతప్రీతిఁ గూర్చి యనె నిందుధరుఁ డిట్లు.
సత్త్వామల తేజోనిధిఁ
బ్రత్యద్భుతు జ్ఞాని సుతుఁ బడసెద వంచున్. ౨౧౧

క. దేవీవామాంగు మహా
దేవుఁ జంద్రార్ధమౌళిఁ దివిషద్గురునిన్
సేవించి ధృతి నమస్కృతిఁ
గావించి నిజాశ్రమమునకుఁ గ్రమ్మరె మునియున్. ౨౧౨

## శుకోత్పత్తి

క. ఆవ్యాసమహాముని యంతట
నవ్యక్తంబైన యగ్ని యుజ్జ్వలింపంబై
సువ్యక్తముగా నరణిన్
భవ్యము చేయన్ మథింపఁ బ్రారంభించెన్. ౨౧౩

క. మంథన మొనరుచు మునిమణి
సంధిల్లె విచార మిట్లు సద్యస్స్ఫూర్తిన్

మంథానారణి దంపతి
సంధానోజ్జ్వలిత వహ్ని సందీప్తుండై. ౨౧౪

క. సుతుఁ డెట్లు గల్గు నాకున్
సతి జాయగఁ బరిణయంబు సలిపి యెఱుఁగ; నే
వ్రతిరాం పదనిగడాయిత
స్వాతంత్ర్యతారోధి నతివ పరిణయించు టెటుల్! ౨౧౫

సీ. అట్లు చింతించుఋషికిఁ బ్రత్యక్ష మయ్యె
నప్సరోరత్నము ఘృతాచి యంబరమున;
వెంటనే కామునుమబాణవిద్ధుఁ డయ్యె,
ధృతి సహించి, వ్యాసర్షి చింతించె నిట్లు. ౨౧౬

క. పుత్రార్థి నైన నాకుం
జిత్రం బీ మోహవశత, ఛీ! బుధనిందా
పాత్రమ నగుదునె, యిదియు న
పాత్రము నా జాయగాఁగఁ బరిణయ మాడన్. ౨౧౭

తే. పూర్వము పురూరవోవిభుఁ
డూర్వశిచేఁ బరిభవంబు నొందఁడె రతుఁడై?
పూర్వహతిఁ జిక్కఁ బట్టుదు
సర్వేంద్రియము లని పూని సంయమిఁ డయ్యెన్. ౨౧౮

క. వినయదగ్ధమును ఘృతాచియు
భయవిహ్వలయై యెలుంగు పరపుచు దిశలన్
నయమున శుకియై, ముని వి
స్మయ మందఁగ నెగిరిపోయె శరవేగమునన్. ౨౧౯

క. తఱవంబడు నాయురణిన్
హిరణ్యరేతుండునోలె నెసఁగుచు దీప్తిన్
బరమాద్భుతముగఁ బుత్త్రుఁడు
వరదానమహత్త్వమునన ప్రభవము నొందెన్. ౨౨౦

చ. శిశువుశిరంబుపై సురలు చిల్కిరి పూవులవాన, దుందుభుల్
విశదములై ధ్వనించె దివి, విశ్రుత మయ్యె వరాప్సరోంగనా
గణనరహానుకారిపదలాస్యము, పాడిరి కిన్నరాళి ము
ద్వశు లయి, చూడవచ్చిరట బర్వత తుంబురు నారదాదులున్.

క. గంగాపుణ్యాజలంబుల
సంగాహనంబుఁ జేసి స్వప్రియతనయున్,
మంగళదివ్యాశీరవ
సంగతిముగ శ్రీశుకాభిసంజ్ఞితుఁ జేసెన్. [illegible]

క. సద్యస్సంవర్ధితతను
హృద్యుఁ డగు శుకు నుపనీతుఁ బుమిచి వ్యాసుండం
బాద్యర్ప్యనుమతిఁ జేసెన్
విద్యార్థి, గురూపసదనవిధిపూర్వముగా. [illegible]

క. దండము కృష్ణాజినము క
మండలువు దివమ్మునుండి మహా కేతేరన్
బండితమునులకుఁ గన్నుల
పండువుగా శుకునకుందు వాసి గ్రహించెన్. [illegible]

క. వ్యాసుండు శుకునకు వేదా
భ్యాసిం బొనరింప దివిషదాచార్యుని
న్యాసంబు చేయు నాతం
డాసంపూర్తిగ గ్రహించె నన్ని చదువులున్. [illegible]

## పురూరవుని చరిత్రము

క. ఈ యద్భుత శుకజననం
బా యమివరు లాలకించి, యనఘా, సూతా!
యే యోజఁ బ్రభుఁ బురూరవు
నాయూర్వశి పరిభవించె? నది తెలుపు మనన్. [illegible]

తే. బ్రహ్మశాపోపహతి నరభావ మొంది
యూర్వశి పురూరవు వరించె; నూర్జిత మగు
నతనిగుణరాశిచే విజితాత్మ యయ్యు,
నామె, ముందుగ నిటు సమయంబు చేసె. ౧౩౦

క. రాజా! యీ మేషద్వయ
మేజాలియుఁ బొందనీక యీక్షింపవలెన్,
భోజన మాజ్యమె నాకున్,
నేఁ జూడఁగరాదు నగ్ను నిఁగ నురక నిన్నున్. ౧౩౨

క. ఈ సమయంబుల నేదేఁ
జేసిన భంగంబు నిన్ త్యజించెద నపుడే;
నీసమ్మతి దెలుపు, మనం
జేసె బురూరవుఁడు నామె చెప్పిన ప్రతినన్. ౧౩౩

ఉ. అంతఁ బురూరవుండును నిరంతర మూర్వశిరూపముగ్ధుఁడై
యంతిపురంబులో నుపవనాంతరభూములఁ గేళిదీర్ఘికా
ప్రాంతములందు శైలములఁ బ్రస్రవణంబు లుపత్యకంబులం
దెంతయుఁ దృప్తి లేక రమియింపఁ దొడంగెఁ దదేకచిత్తుఁడై. ౧౩౪

శా. రాజ్యంబుల్ తలపెట్టఁ డొక్కపుడుఁ, బ్రదేశాగ్నుల్ భజింపండు, రా
జాజ్ఞల్ దిక్కుల నింపఁ బంపఁడు, జనాహ్లాదంబు గావింపఁ, డ
ప్రజ్ఞుండై త్యజియించెఁ గర్మములు ధర్మంబుల్ మనఃకల్పకం,
బజ్ఞుండట్లు పురూరవుండు సుమబాణావర్తసంవర్తియై. ౧౩౫

క. ఒక్క నిమేషం బేనియు
నక్కమలేక్షణవియోగ మసహము గాఁగాఁ
జొక్కుచు నూర్వశివలపునఁ
దక్క సమస్తంబు మఱచెఁ దన్మయుఁ డగుచున్. ౧౩౬

క. కొన్నేళ్ళు గడవ నిట్టుల
నున్న పురూరవునిఁ గూడి యూర్వశి భువిలోఁ,

జిన్నంబోయెను దివి; యది
గన్న సురేశుండు పల్కె గంధర్వులతో. ౪౩౬

క. ఊర్వశి లేనిది చక్షుః
పర్వంబుగ లేదు, శోభ వదలె దివము, మీ
రుర్వికిఁ జని వడిఁ గొనుఁడీ
యూర్వశియురణముల రాజు యుక్తి చెడంగాన్. ౪౩౭

క. గంధర్వులు నటు పలుకు సు
ధాంధఃపతియానఁ దరలి రప్పుడ యిలకున్.
గంధవహు మించు పరువున,
సంధిల విశ్వావసుండు సర్వాగ్రుండై. ౪౩౮

తే. అది కఠోరతమిస్ర, విహాయసమునఁ
గాలకాదంబినీమాల కాటుకోసియెఁ;
గటిక చీఁకటి దిక్కులఁ గ్రమ్మె; నప్పుడు
చేరియుండె నూర్వశినిఁ బురూరవుండు. ౪౩౯

తే. ఆ మహాగాఢతర తమిస్రాంతరమున
నూర్వశీమేషయుగము గంధర్వవరులు
నేరుపుమై హరియించి; రా యురణములును,
నఱచుచుం బోయె మింట నమ్మా యటంచు. ౪౪౦

శా. అమ్మా యంచు విహాయసాగత తదీయాక్రందనాదమ్ము శ్రో
త్రమ్ముల్ సోఁకినమాత్ర నుల్కిపడి పాదం బాదిగా మస్తకాం
తమ్మున్ దేహము మాతృభావము సముద్భ్రాంతంబుగాఁ గోపరో
షమ్ముల్ గ్రమ్మఁగఁ బల్కె నూర్వశి విభున్ శంకాంకురాంతంకయై.

ఉ. ఓయి పురూరవా! వినవటోయి యదే యురణార్భకమ్ము ల
మ్మా యని సంస్మృతశ్రుతుల మాటికి మాటికి నన్నుఁ బిల్చుచుం
గూయిడునోయి! నాకడుపు కోయుచు మోయుచు నున్నదోయి! నీ
నాయితతత్రదవమ్ము; నిను నమ్ముట నెంతటి బేలనైతిరా! ౪౪౧

ఉ. నీ వొక పూరుషుండ వని నే భ్రమఁ బొంది, నివి నేను గాఁచుకొ
న్నా వని నమ్మి, మూఢమతి న్యాసము సేసితి మేషయుగ్మముం
దీవశమందుఁ, బుత్రులుగ నే నివి సాఁకుదుఁ, జేతకాని దీ
నావనదీక్షఁ బూని యిటు లర్హమె నిద్దురఁ బోఁగ స్త్రీగతిన్?

ఉ. అనుచు లాలపించి మదనాలసభావము మాని యూర్వశీ
ధ్యాననిమగ్నుఁడై తొలఁగు నంబరమే సరిచేసికొన క యా
స్తేనులఁ బట్ట సంభ్రమగతిం బరతెంచెను మింట మేషశా
బ్దానుగతిన్ నిలుండు నిలుఁ డం చదలించుచు రాజు వేగలన్.

క. వీడినపుట్టం బెఱుఁగక
కూడం బరతెంచు రాజుకోపమునకు వా
రోడుచు విశ్వావసుముఖు
లూడనిచ్చిపోడిరి వదలి తదురణద్వయమున్.

ఉ. రోజుచు వెంట నంటెడు పురూరవు నూర్వశి చూచునంతలో వి
భ్రాజితమౌ తటిల్లత వెలార్చుచుఁ బాఱెడి దేవయోని యా
రాజును గాంచి నగ్ను సురరామ ప్రతిజ్ఞ విభంగ మయ్యె నం
వ్యాజముతో యథేచ్ఛ జనె వారసప్రేముడి విస్మరించుచున్.

క. ఆ రెండు మేకపిల్లలఁ
దీఅని తమకమునఁ జేరఁదీసి మృదువుగా
గీరుచు గోళులఁ బుణికి పు
రూరవుఁ డురమునఁ గదించి యోలత వచ్చెన్.

క. వచ్చి నిజమందిరమ్మున
నచ్చాసం గానలేక యంగజవశుఁడై
తచ్చిత్తత విహ్వలుఁడై
యుచ్చైస్స్వరావంబుతోడ నూర్వశి యంచున్.

క. త్రిమ్మరుచు దేశదేశము
నిమ్మహి సర్వంబు వెదకి యెంతయు వ్యథతో

వ. సూతుం డిట్లనియె. [illegible]

మ. అమృతాంభోనిధిసూతి శ్రీవనిత తోడై పుట్టి జైవాతృకుం
డమలజ్యోత్స్నలసామి దైవతసుధాహారాత్ముఁ డుద్యత్కళా
సముపేతుండు సరోజనాభునకు సాక్షాన్నేత్ర మాతండు చం
ద్రముఁ డొప్పు నుతింపఁగాఁ గువలయాహ్లాదుండు రాజాఖ్యుఁడై.

క. తారాయోషాసంగతి
నా రాజుకుఁ గలిగె సుతుఁడు, నతనికి బుధుఁ డన్
పే రుంచఁగ సార్థకముగ
బేరెక్కె బుధుం డటంచు విద్యల నతఁడున్. [illegible]

క. ఆతని సుద్యుమ్నుం డను
భూతలపతి సత్యవాది బుధనుతుఁడు గలఁడు,
డాతం డొకయెడ మృగయా
ప్రీతిన్ సైంధవము నెక్కి వెడలె నడవికిన్. [illegible]

క. కతిపయ పరివారముతో
నతఁడున్ వేటాడ ధనువు నాకర్ణాంతం
బు తివిచి శరప్రమోచం
బతివిస్మయముగ నొనర్చు చానందముతోన్. [illegible]

క. తిరుగుచు రురు మృగ శశ సూ
కర నికరము వ్యాఘ్ర మహిష ఖడ్గ గవయములున్
శరభంబులు సింహంబులు
నరయుచుఁ జేరెం గుమారనామక వనమున్. [illegible]

ఉ. మేరువుమూలమం దది యమేయమహత్త్వము వెల్గు దివ్యమం
దార మధూక రాజితము దాడిమ చంపక నారికేళ వి
స్తారము మాధవీ పనస సాల తమాల తతంబు రాజమం
దారవనాదితంబు భ్రమరాళికృతం బభిరామసీమమై. [illegible]

క. అందముం బూచిన తరువుల
యందంబుం గంచుఁ గోకిలార్భటి వించున్
విం దైన నతఁడు సేవక
బృందముతో నా వనప్రవేశ మొనర్చెన్. ౪౬౫

తే. అక్కజంబుగ నుద్యానమ్ముఁ దాక్షణంబ
స్త్రీస్వరూపమ్ముఁ బొంది భాసిల్లె నట్లు
వనిత లై రొప్పె నతనిసేవకజనంబు,
బడబగా మారె నతనియశ్వమ్ము గూడ. ౪౬౬

క. ఏ మిది యని రాజర్షి యి
దేమిటికి, నుపాయ మేది, యెవ్వఁడు శరణం,
బేమాడ్కి గృహము సొత్తును,
నేమించెద రాజ్య మెట్లు నే నని వగచెన్. ౪౬౭

వ. అన విని విస్మయావిష్టులై యు ట్లగుటకుం గతం బేమి? సవిస్తరంబుగఁ దెలుపు మని యడిగిన ఋషులకు సూతుం డి ట్లనియె. ౪౬౮

తే. పూర్వకాలం బొకానొక పుణ్యవేళ
నీవనంబున దర్శింప నెంచి గిరిశు
నరుగు దెంచిరి సనకాదు లాదిమునులు
దిశలు వెల్గించుచుం దమ దివ్యరుచుల. ౪౬౯

తే. గిరిశునిం గూడి క్రీడించు గిరిజ లజ్జ
నిలిచినం గాంచి ఋషు లందుఁ దొలఁగి చనిరి;
ఈ వనము చొచ్చినట్టివా రింకమీఁద
స్త్రీ లగుదు రంచు శాసించె నీలగళుఁడు. ౪౭౦

క. ఎఱిఁగినవా రెల్లరు నటు
లరుగ రుపేక్షింతురు కాని యా నుద్యానం
డెఱుఁగక కుమారవనముం
జొరుటన్ స్త్రీభావ మందెఁ జొచ్చినక్షణమే. ౪౭౧

క. చింతించుచు నుండఁగనే
దాంతరలై సిగ్గుతెరలు తొలఁచె సహజమై
కాంతకువలె సర్వాంగము
కాంతంబై హావభావకలల వెలింగెన్. ౪౭౨

తే. ఆననము నిర్గమించి యందందుఁ జెలులఁ
జేరి విహరింప నిళ యని పేరు నెలసె;
యువకుఁ డా చంద్రసూనుఁ డా యువతి బుధుఁడు
చూచె నొకవేళ నామెయుఁ జూచె బుధుని. ౪౭౩

క. వారికి నపు డన్యోన్యము
వారని యనురాగ మెదల వర్ధితమైనన్
వారలసంయోగమునఁ బు
రూరవుఁడు జనించె భాస్వరుం డయి కాంతిన్. ౪౭౪

క. అంతట నిళ తనదశకై
చింతించుచు నిక్ష్వాకులగురు వసిష్ఠు స్మరింపన్,
అంతికమున గోచరమై
యంతయు వృత్తాంత మెఱిఁగె నాతం డిళచే. ౪౭౫

తే. సర్వతంత్రస్వతంత్రుఁ డా సన్మునీంద్రుఁ
డభవు సేవించి యతనిఁ బ్రీతాత్ముఁ జేసి.
పురుషభావంబు ప్రాపింపఁ దిరిగి యిళకు
విశ్వశంకరు శంకరు వేడుకొనియె. ౪౭౬

క. సకరుణముగ హరుఁ డనెఁ బక
పక నగి యెటు లన్యత మగును బలుకు మదీయం,
బొక నెల యువతిగ నిళయు మ
ఱొక నెల సుద్యుమ్నుఁ డనఁగ నొగిఁ బురుషుఁ డగున్. ౪౭౭

తే. కులగురున్నుగ్రహమునఁ జేకొని వరంబు
రాజు స్వగృహంబుఁ జేరి పాలనము చేసె;

నొక్క నెల నేల యేలు నత్యూర్జితముగ;
నంతిపురి నొక్క నెల కాంతయై యుండుఁగు. ౪౭౮

ఆ. అట్టి నృపునిఁ గాంచి యఖిలప్రజలుఁగూడ
సంతసింపఁగరి స్వాంతములను;
యౌవనంబు ప్రాప్తమైన పురూరవుఁ
జేసి రాజుఁ దాను జేరె వనము. ౪౭౯

క. సుద్యుమ్నుఁ డట నవాక్షర
విద్యన్ నారదమునివలన విద్యోతితుఁడై
తద్యోగద్యోతిత శ్రీ
విద్యోదద్యోగోద్యతాద్యవిద్యుం డయ్యెన్. ౪౮౦

క. ఆతనిభక్తికి శ్రద్ధకు,
నాతనియమనియమములకు నాతనిధృతికిన్,
బ్రీతాత్మ యగుచుఁ జండిక
యాతనికిం గోచరించె నద్భుతరుచితోన్. ౪౮౧

శా. సింగం బెక్కి మనోజ్ఞకాంతులు దిశాస్తీర్ణంబుగా, వీరమున్
శృంగారంబును మూర్తిగా, నెదుటఁ దోఁచెన్ ఘూర్ణలోలాక్షియై,
బంగారం బగు మేనితోఁ బవడపుం బాదాధరచ్ఛాయతో,
రంగారం గల నీలకేశములతో, రాజద్విభూషాళితో. ౪౮౨

క. పరమేశ్వరి దివ్యాకృతి
కర మరుదుగఁ జూచి రాజు ఘనితభక్తిన్
శిర సొగ్గి నమస్కృతి యా
చరించి బహుమార్గములను సంస్తుతి చేసెన్. ౪౮౩

మ. ఒకచో నింతిగ నొక్కచోఁ బురుషుఁడై, యెక్కొక్కచో రెండునై,
సకలంబైన చరాచరప్రకృతిగా సంభావ్యమై, యందులో
నొకఁడుం గాక వెలుంగు దేవి నెఱుఁగన్ యోగ్యుండువాఁడొండెయా
నొకమాసం బిళయై మఱొక్క నెల సుద్యుమ్నుండునై యుండుటన్.

క. దేవి ననేకవిధంబులఁ
గావించియు స్తుతులు నతులు గడుఁగడుఁ బ్రీతిన్
దేవీసేవాసౌభా
గ్యావాప్తి యొకండె యాత్మఁ దర్శించె నుమన్. ౨౮౫

తే. ఆమహాదేవి సుద్యుమ్ను నమలభక్తి
యుక్తికిన్ మెచ్చి యాత్మసాయుజ్య మొసఁగ;
నంబికాప్రసాదముకల్మి నతఁడు చేరెఁ,
బరము, మునులకు నందని స్థిరపదమ్ము. ౨౮౬

## శుక కృత సంసార నింద

క. ఆకథ శౌనకముఖముని
లోకము విని మెచ్చి శ్రవణలోలత యొసఁగన్,
ఆకరణి జన్న శుకుకథ
నాకర్ణింపంగ వేఁడు కయ్యెడు ననఁగన్. ౨౮౭

వ. సూతుం డి ట్లనియె. ౨౮౮

తే. శుకుఁ డటుల దేవగురునియంతికమునందు
బ్రహ్మచర్యవ్రతాళి సర్వంబు నెరపె,
వేదవేదాంగధర్మశాస్త్రాదు లెల్లఁ
జదివె సరహస్యముగను ససంగ్రహముగ. ౨౮౯

చ. గురుకులవాసమిట్టు లనుకూలసమాప్తి మొనర్చి, యిచ్చియున్
గురున కభీష్టదక్షిణ, శుకుండు సమావృతుఁడై ప్రియంబుగాఁ
దిరిగి నిజాశ్రమంబు కరుఁదెంచినఁ, బుత్త్రునిఁ జూచి ప్రీతుఁడై
శిరమును మూరుకొం చడిగె క్షేమము వ్యాసుఁడు మాటిమాటికిన్.

క. అతివేగంబున వ్యాసుఁడు
సుతుని నన్యాశ్రమిగ నుంటఁ జూచి, వరించెన్
అతనికి దారగ నొకముని
సుతఁ గన్యన్ శుచినితాంతశోభనఁ గాంతన్. ౨౯౧

శా. పారాశర్యుఁడు ప్రేమ మీఱ సుతుఁ బిల్వం బంచి యంకస్థలిన్
జేరందీసి శిరంబు మూర్కొనుచుఁ బాణిం జుంచుపై దువ్వుచున్
గారాబంబున రాయుచున్ జుబుక మానందాశ్రుధారల్ ఝరీ
పారంపర్యత జాఱ యంగములు ముంపం బల్కె నీరీతిగన్. ౪౯౨

శా. ఎంతో ఘోరతపంబుచేఁ గలిగితో యీ కుఱ్ఱ! నా కెంతయున్
సంతోషంబుగ నేర్చినాడవు శ్రుతుల్ శాస్త్రంబులున్ ధర్మముల్,
కాంతం జేకొని పుత్త్రుఁ గాంచి మఱియున్ గార్హస్థ్యధర్మంబునన్,
శాంతుం జేయు పితౄణబాధవలనన్ నన్నున్ భవత్పూర్వులన్.

మ. జననం బాది విరక్తుఁడౌ శుకుఁడు వ్యాసప్రోక్త సంరక్తి దీ
పనవాక్యంబులు గొల్ప నచ్చెరువుఁ, దా భాషించె; నేఁ దత్త్వబో
ధనమర్థించి సమాశ్రయించితిని వేదవ్యాస! ధర్మజ్ఞ! శి
ష్యుని శాసింపవె, యానతిన్ శిరమునన్ యోజింతు మాటేటికిన్?

వ. వ్యాసుం డిట్లనియె. ౪౯౩

క. శతవర్ష తపమ్మునఁ బశు
పతి నారాధించి నిన్నుఁ బడసితి, నొకభూ
పతి వేఁడి తెత్తు విత్తము,
సతిఁ గొనుమా యౌవనంబు సఫలము గాఁగన్. ౪౯౪

వ. శుకుం డిట్లనియె. ౪౯౫

తే. ఏమి సుఖ ముండఁ గలదో వచింపు, తండ్రి!
యీ మనుష్యలోకాన నిరామయంబు;
సుఖము దుఃఖవిద్ధమ యైన సుఖ మటంచు
నెయ్యెడం బల్కఁబోరు గదయ్య ప్రాజ్ఞ! ౪౯౬

సీ. వనిత గ్రహింపఁ దద్వశుఁ డౌను, సుఖ మేడఁ
బరతంత్రునకును స్త్రీవశున కందు?
లోహకాష్ఠ నిబద్ధుఁడును విముక్తుం డగు,
సుతసతీబద్ధుఁ డేపారిదిఁ గాఁడు;

వపువులే విణ్మూత్ర భవనము, లం దంగనా
తనువులు విప్రేంద్ర! తన్మయంబు;
లట్టి నారీదేహ మనుభవింప బుధేంద్రుఁ
డెట్టి ప్రీతిం బొంద నిచ్చగించు?
నే నయోనిజుండ, నేలాగు రతి కల్గు
యోనిసుఖమునందు నో మహర్షి!
యాత్మరతుఁడ నగుచు నాత్మలో రమియించు
నాకుఁ దుచ్ఛరతుల పోక లేల? ౫౧

ఉ. వేదములుం దదంగములు వింటిని శ్రీగురులొద్ద, నైన ని
ర్వేదము తీఱ దయ్యె, భవభీతి ననన్యశరణ్యుఁడనై భవ
త్పాదము లాశ్రయించితిని, తత్త్వము దెల్పి యనుగ్రహింపు, దే
వా! దయ పూని భీకర భవాబ్ధిఁ దరించు నుపాయ మెద్దియో! ౫౨

సీ. భవవిభ్రమణమందుఁ బవలు రేలుఁ జరించు
రవికట్లు దివిని విశ్రమణ మున్నె?
తత్త్వంబు చింతింపఁ దండ్రి! సంసారుల
సుఖము మూఢుల కీటసుఖము గాదె?
వేదశాస్త్రంబులు విధి నభ్యసించియు
రాగియౌ వాఁడు మూర్ఖపశుసముఁడు;
మానవభవ మొంది మానఁడే రాగంబు
పత్నీగృహాదులఁ బండితుండె?
మూఁడు మాయాగుణంబులగో డెఱుంగు
వాఁడె మేధావి బహుశాస్త్రపారగుండు;
గ్రహణముం జేతఁ బూరుషు గృహ మటంచు;
రయ్యో! సుఖ మేదఁ గారాగృహమ్మునందు? ౫౩

వ. వ్యాసుం డి ట్లనియె. ౨౦౨

క. గృహ మనఁ బోలదు బంధన
గృహమును, దత్కారణంబు; కేవల మెద ని
స్స్పృహమై విముక్తుఁ డౌనెడ
గృహస్థుఁ డేనియు విముక్తికిం జాలు శుకా! ౨౦౩

క. సత్యము తప్పక శుచియై
నిత్యము వేదోక్త శ్రాద్ధ నియమాదిక స
త్కృత్యములచే గృహస్థుఁడు
స్తుత్యము క్రమముక్తి గాంచు సుమ్మా, వత్సా! ౨౦౪

శా. వానప్రస్థుఁడు బ్రహ్మచారియుఁ బరివ్రాట్టైన మధ్యాహ్నమం
దేనాఁడుం దము తామ రోయుచును నేఁ డేడంచు సాంసారికా
స్థానవ్రాతము లాశ్రయింతురు గదా! సంసారులే లేని యో
జ్ఞానుల్ సద్వ్రతశీలు రెట్లు తనుసంత్రాణంబు సాధింతురో? ౨౦౫

తే. వత్స! గార్హస్థ్యమునకంటెఁ బరతరంబు
నెందు ధర్మంబుఁ జూడము, నెందు వినము;
జ్ఞాను లాచార్యులు వసిష్ఠసన్మునీంద్రుఁ
డాదిగా నాశ్రయించి రా యాశ్రమంబె! ౨౦౬

క. ఏమి యసాధ్యము వేదో
క్తామలవిధి నెరపువాని కిహపరములలోఁ?
గామించిన సజ్జన్మం
బే మోక్షము స్వర్గ మేది యేని లభించున్. ౨౦౭

సీ. ఒక యాశ్రమము వెన్క నొక యాశ్రమము పొంద
యుక్త మంచును ధర్మరక్తు లందు;
రటుగాన నీవును నగ్ని సంపాదించి,
శ్రద్ధతో సతముఁ గర్మము లొనర్చి,

దేవతలను బిత్రుదేవతలను మను
ష్యులఁ దనియించి విధ్యుక్తరీతి,
ధర్మజ్ఞుఁ బుత్త్రు నుత్పాదించి, యాతని
గార్హస్థ్యవిధుల సంకలితుఁ జేసి,
యంతట గృహం బెడలి వనస్థాశ్రమంపు
వ్రతము గైకొని పిమ్మట యతివి తుదకు
నగుట యోగ్యంబు, పిన్నప్రాయంబునందె
సంన్యసించుట యది సమంజసము గాదు. ౫౦౮

క. ఎఱుఁగవు తండ్రీ! యింద్రియ
దురంత దుశ్చేష్టితములు తూలించు నరుల్;
మఱియు సపత్నీకున కవి
భరింప సాధ్యములు కాని బరువులు వత్సా! ౫౦౯

క. కావున నింద్రియవిజయము
కావింపఁగ ధర్మపత్ని గ్రహియించి విధుల్
సేవించి ముదిమిఁ దపమున్
గావింపుఁ డటంచు శాస్త్రగణములు పలుకున్. ౫౧౦

క. ఎఱుఁగవె విశ్వామిత్రుఁడు
పరాశరుండున్ మహానుభావుఁడు విధియున్
తరుణీవశతం జిక్కిరి
వరియింపుము కన్య, నాదుపలుకులు వినుమా. ౫౧౧

వ. శుకుం డి ట్లనియె. ౫౧౨

ఉ. ఒల్లనయా గృహం, బది మహోద్ధురవాగుర, సౌఖ్య మందులోఁ
గల్ల, ధనాతురుం డెటు సుఖంపడ సాధ్య మగున్? జగత్త్రయీ
వల్లభుఁ డింద్రుఁ డేని పలుపాట్లు పడున్ దప మింత చేసినం
దల్లన నడ్డు వచ్చుచు, సుఖాత్ముఁడు నిస్స్పృహభిక్షు వొక్కఁడే.

చ. సుఖ మెఱుఁగండు బ్రహ్మ మధుసూదనుఁ డేని మనోహరేందిరా
సఖుఁ గొన నేర్చియుం బరమ సౌఖ్యము నందఁ డనేకయత్నస
మ్ముఖుఁ డయి యుద్ధముల్ సలుపు మూర్ఖనిశాటులతోఁ, ధనాధిరా
ట్సఖుఁడు తపం బజస్రమును సల్పుట దుఃఖమె యంచు నెంచెదన్.

ఉ. లోలుపుఁ డైనవో ధనికుఁడున్ సుఖనిద్ర క్షణంబు పొందఁగాఁ
జాలఁ, డిలన్ దరిద్రుఁ డొక సౌఖ్యము నొందుట సాధ్యమా నే, యిం
కేల మహాత్మ! నీ వెఱిఁగి యెర్గియు సంసృతిదుఃఖజాలన
మ్మేళన సేయ నిట్లు నియమించెదు నన్ను భవత్తనూభవున్? ౨౧౫

క. దుఃఖము జన్మము, జరయుం
దుఃఖము, మరణంబు నొంద దుఃఖము, మరలన్
దుఃఖము గర్భావాసము,
దుఃఖమయం బీ జగత్తు సంసృతినోం. ౨౧౬

శా. భార్యాపుత్రులు పౌత్రులుం బరిజనుల్ భారంబుగాఁ దన్నుఁ దో
ద్ధుర్యత్వంబున లోభతృష్ణల మహాంధుం డౌచు సంపన్నులన్
ఆర్యా! దేహి యటంచు దీనముఖుఁడై యాచించు విద్వాంసుఁ డే
మర్యాదం గను? నిత్యమున్ మరణశుంభద్దుఃఖముం బొందఁడే!

క. ఏకోదరునిం జింతలు
పోఁకవు, వాఁ డెట్లో కడుపు సుష్ఠుగ నింపున్,
జేకొని మూలమ్ములనో,
యాకలములనో ఫలములనో, యాఁకలి యడఁగన్. ౨౧౭

తే. కర్మకాండంబున మదాత్మ కనదు రక్తి;
పలుకు ప్రారబ్ధ సంచిత వర్తమాన
కర్మ లవి మూఁడు క్షీణించు మర్మ మేదొ,
యోగమో జ్ఞానమో యవ్యయోత్సవంబు. ౨౧౮

క. జలగవలెన్ నిరతంబును
లలన తనూరక్త మెల్ల లాలనఁ బీల్చున్;

దెలియక మూర్ఖుఁడు భ్రమపడు
లలితము లగు భావచేష్టలన్ మోహితుఁడై. ౫౨౦

క. గొంగ హరించును విత్తమె,
యంగన భోగముల బలము నైశ్వర్యంబున్
రంగైన నుడుల మనమున్
దొంగిలు సర్వమ్ము; నన్నుఁ ద్రోయకు మందున్. ౫౨౧

ఉ. ఈ విధిఁ బల్కు పుత్రునినిరీహత కెంతయు దుఃఖితాత్ముఁడై
భావన చేసె వ్యాసభగవానుఁడు నేమి యొనర్తు నంచు, నా
పావనమూర్తికన్నుల నవార్యములై ప్రవహించె నశ్రువుల్
మై వడఁకెన్ మనస్సు కడు మ్లానత నొందె నెసంగె గ్లానియున్.

తే. అట్లు శోకపరీత దీనాత్ముఁ డగుచు
వగచు జనకుని ముని భగవానుఁ గాంచి
విస్మయోత్ఫుల్ల నేత్రారవిందుఁ డగుచు
శుకుఁడు తలపోసె నిట్లు వ్యాసుండు వినఁగ. ౫౨౩

క. ఆహా! మాయాబల మిది
మోహంబునఁ బండితుల నె ముంచెడి బలిమిన్;
మోహితుఁగా వేదాంత
వ్యాహర్త శ్రుతిప్రమాణు వ్యాసు నె చేసెన్. ౫౨౪

శా. ఏ దీ మాయ యి దెంత దుష్కర? విమోహీభూతునిం జేసె నీ
వేదవ్యాసుఁ బురాణకర్త జయసంవిద్వక్తఁ బారాశరిన్
శ్రీదైత్యారికళాంశసంభవు జగత్ క్షేమంకరాకారు, నే
నా దేవిన్ శరణంబు చొచ్చెద నమేయన్ ధ్యేయ మాయామయన్.

ఉ. ఏమన నౌ నహో! బల, మ దెంతటి వీర్య మహో, ప్రభుండు మే
ధామయుఁ డీశ్వరుం డితఁడు ధైర్యము దక్కి విభగ్నపోతుఁడై
భ్రామిలు ప్రాకృతాపణికుభాతిఁ దదీక్షణనిర్మితాత్మమా
యామయ వార్ధి మగ్నుఁ డయి యట్టిటులై యురలించు నశ్రువుల్.

తే. బ్రహ్మ విష్ణు హరాదులే భ్రాంతు లైన
నెవఁడు మాయావశుండు గాఁ డిత్రిలోకి?
నితఁ డెవఁడు? నే నెవండ? ని దెట్టి భ్రమము?
పాంచభౌతిక దేహ సంబంధ మేమి? ౪౨౭

తే. సర్వకారణకారణ, సర్వదేవ
జనని, బ్రహ్మాదులకును నీశ్వరిని, దేవి,
మఱిమఱి శుకుండు మనసా నమస్కరించి,
పలికె నిటు తండ్రి శోకవిహ్వలునిఁ గాంచి. ౪౨౮

క. అందఱకు బోధ చేసెడి
నిం దెలుపం దరమె నాకు? నే నీ జనిలో
నందనుఁడ నైతి నీ, కా
ముం దెవరమొ తెలియ వశమె? మోహ మి దేలా? ౪౨౯

ఆ. అన్నపానములన యాఁకలి దగ తీఱు,
బుత్త్రదర్శనమునఁ బోవునొక్కొ?
శ్రవణగంధములను జెవియు ముక్కు రమించుఁ,
బుత్త్రుఁ గాంచి తనివిఁ బొందఁ బోవు. ౪౩౦

క. పుత్త్రునికంటెన్ ధనమే
పాత్రము సాధింప సుఖము; పశువుగ నుండం
బుత్త్రు నజీగర్తుఁడు మును
ధాత్రీపతి కమ్మలేదె ధనలోభమునన్? ౪౩౧

ఉ. సంసృతివాసనా భయద జాల నిబద్ధము కాదు బుద్ధి, వి
ధ్వంసుఁడ వన్యదుర్లభభవం బిది నాది కృతార్థ మానటుల్
ధ్వంసముగా మదాత్మఁ గల ధ్వాంతము, చీఁకటి పాఱఁద్రోలు నా
హంసుఁడువోని జ్ఞానకలికార్ద్రరుచుల్ వెలిఁగింపు నామెదన్. ౪౩౨

## శ్రీ దేవీ భాగవతావతరణము

తే. బుద్ధిమంతుఁడు వ్యాసునిపుత్రుఁ డిట్లు
శాంతుఁడై తురీయాశ్రమిసదృశబుద్ధి
నడుగఁగ శుకుండు, వ్యాసమహర్షి మిగులఁ
బ్రీతుఁడై పల్కె నాదరస్మితుఁ డగుచు. ౫౩౩

చ. చదువు శుభంబు భాగవతసంహిత పుత్రక! బ్రహ్మసమ్మితం
బది, శుక! పంచలక్షణసమన్వితకోశము నాతిదీర్ఘమై
నది, పదిరెండుస్కంధముల నయ్యది వెల్గుఁ, బురాణరాశి క
య్యదియె విభూషణంబు, కలయన్నిట నా కభిమానపాత్రమున్.

క. అది విన్నంతన నరునకు
సదసద్జ్ఞానము వివేకచతురత గలుగున్;
మొదలన్ దాని నెఱింగెను
సదమలమతి యచ్యుతుండు; చదువుము నీవున్. ౫౩౫

చ. హరి వటపత్రగర్భమున నర్భకుఁడై శయనించియుండి య
బ్బురపడి చింత సేసె, నెటు పుట్టితి? నాజనయిత్రి యెవ్వ? రే
పరికరజాతజాతుఁడను? బాలుఁడ నేటకుఁ గారణం బెదో?
యెఱుఁగుట యెట్లొ? సర్వము చిదేకరసం బది యంచు వ్యగ్రుఁడై.

తే. అట్లు చింతించెడి ముకుందుఁ డాలకించె,
నీ సమస్తమహంవాచ్య మేన సుమ్ము;
ఇతరము సనాతన మ్మైన దేమి లేద;
అను నఖిలధాత్రి శ్లోకార్ధ మంబికోక్తి. ౫౩౭

ఉ. ఆ శుభవాణి శౌరి హృదయాబ్జములోఁ బదిలంబు సేసి, యా
పేశలసత్యవాక్యవరిప్రేరణ వర్తిలెఁ? బుంనపుంసక
స్త్రీశమొ, యెట్లెఱుంగు టని చింతిలి, భాగవతంబు నెమ్మదిన్,
శ్రీశుఁడు కాంచి మాటికి జపించి దృఢం బొనరించెఁ దచ్ఛ్రితిన్.

ఉ. ఆయెడ నామహాత్మ్యవిమలాత్ములకుం బొడకట్టె లక్ష్మి శాం
తాయతనేత్రయై వరశుభాంబరభూషణయై చతుర్భుజా
ధ్యాయుత శంఖ చక్రకగదాబ్జ మహాయుధయై మృదుస్మితా
ప్యాయసితాస్యయై స్వసదృశాత్మవిభూతిసఖీసమాఢ్యయై. ౨౩౯

క. రతి భూతి బుద్ధి కీర్తియు
స్మృతి మతి స్వధ స్వాహా శ్రద్ధ మేధయు దయయున్
ధృతి జృంభ తంద్ర నిద్రయు
గతి లజ్జయుఁ బుష్టి తుష్టి క్షమయున్ క్షుధయున్. ౨౪౦

క. వరభూషణాంబరాయుధ
ధరలై మందారమాల్యదాపితశిఖలై
యిరువది యొక్కరు శక్తులు
పరివేష్టింపంగఁ జక్రి పరికించె శివన్. ౨౪౧

తే. ఆ నిరాధారమైన యేకార్ణవమున
సఖులఁ గూడి మహాలక్ష్మి శాంతరమ్య
మందహాసంబు పరగింప మాధవుండు
గాంచి విస్మితుఁ డగుచుఁ జింతించె నిట్లు. ౨౪౨

ఉ. మాయదుగ నున్నదీ యుదధి, మానిను లెల్లుదయించినారు, నే
నీయెడ నుంటి నేల, యివ రెందుల కిట్లిట నుంచినారు, నా
కీయుమ యేమి కావలయు, నెవ్వరొ, యేటికిఁ గానవయ్యె, నే
దే యనువచ్చునో, తగవొ, యే నిట నుందునొ, వెళ్ళిపోదునో?

క. ఏ మొనరించిన నే మగు
నేమో తెలియంగఁ జాల, నేల విచారం
బీ ముగ్ధబాలభావము
తో మానం బూని యుండుదున్ నిశ్చింతన్. ౨౪౪

తే. అట్లు వటపత్ర చిత్ర శయ్యాంతరమున
బాలభావంబు ధరియించి పవ్వళించి

విస్మయోన్ముగ్ధుఁ డగు మహావిష్ణుఁ గాంచి
దేవి సస్మితయై పల్కె నీవిధాన. ౫౪౫

క. ఏలా విస్మయ మందెద
వీలాగున, నన్ను మఱచు టే మబ్బుర మహా,
లీలామాయాశబలిత
హేలాబ్రహ్మాంబుచేత నీరిత మిదియున్. ౫౪౬

క. నే నీ సాత్త్వికశక్తిని
గానా, నిన్నెపుడు విడువఁ గాదె ముకుందా!
నేనున్ నీతో మఱిమఱి
పూనుదు జన్మంబు సృష్టిపూర్వం బెపుడున్. ౫౪౭

శా. నీనాభిన్ జనియించి బ్రహ్మయుఁ దపోనిష్ఠన్ రజశ్శక్తి సం
ధానాత్ముం డయి రక్తరంజనకళాధారేయుఁడై లోకమున్
దా నిర్మించు, మనస్సునైదయిన భూతశ్రేణిఁ బంచేంద్రియ
శ్రేణిన్ దక్కు పదార్థసంచయముతోఁ జెల్లున్ జగత్సృష్టయై. ౫౪౮

క. లోకము సృజించు నిటు విధి;
లోకము రక్షింతు వీవు; భ్రూప్రభవుండై
లోకస్రష్టకు, రుద్రుఁడు
లోకము కల్పాంతవేళ లోఁగొను హరుఁడై. ౫౪౯

ఉ. నీహృదయాబ్జపీఠమున నిత్యము నే ననపాయనై దృఢ
స్నేహమునన్ వసించెదను, నీవశవర్తినినై, సురారిసం
దోహ మదాపహర్త్రి నయి, తోడయి యుండి జయంబు గూర్తు, సం
దేహము మానుమా, కనులఁ దేరి కనుంగొను నన్ను సాత్త్వికిన్.

ఉ. మంగళదేవివాక్యముల మాధవుఁ డెంతయుఁ బ్రీతి నొంది ప
ల్కెం గమలేక్షణా! వినఁబడెన్ మును నాకు స్ఫుటాక్షరంబుగాఁ
గం గమనీయగీతము సగంబు శివంబు పరంబు గోప్యమం
చుం గనుపట్టు నెవ్వరివచోవిధి యయ్యది దెల్పవే సతీ! ౫౫౧

ఆ. పేద కలను గన్న పెన్నిధియుంబోలె,
మరల మరల దాని స్మరణసేతు,
మనన సేతు దాని మఱిమఱి మనసులో,
మరులు గొన్న ప్రణయపరువిధాన. ౨౨౨

క. హరిమధురవాక్యముల నా
వరవర్ణిని యాలకించి పరమప్రీతిన్
చిఱునవ్వొలయు ముఖంబునఁ
బరికించి మనోహరముగఁ బల్కెను హరితోన్.	౨౨౩

ఉ. ఓయి చతుర్భుజా! యెఱుఁగుదోయి గుణాన్విత నౌట నన్నుఁ, గా
నీ యెఱుఁగంగ నేర వల నిర్గుణ నా సగుణాలయన్ముని
ధ్యేయను మూలశక్తి భువనేశ్వరి, నా పరమేశి సుమ్ము నీ
కాయెడ నర్ధగీతము దయన్ వినిపించినయట్టి దమ్మెయిన్.	౨౨౪

శా. ఆ శ్లోకార్థము విన్న భాగవతగుహ్యార్థప్రకాశంబు నో
సుశ్లోకా! యొనరించె నీపయిఁ గృపన్, శోభాస్పదం బద్ది, శా
స్త్రశ్లాఘ్యం బది, వేదసార మది, విస్మార్యంబు కా దద్ది, పు
ణ్యశ్లోక్యం బది, రక్షణీయ మది, దివ్యంబుం బరం బచ్యుతా! ౨౨౫

మ. హరి! నీ వెంత యదృష్టశాలి వవుదన్నా! యా మహావిద్యయే
కరుణాపూరతరంగితాత్మ యయి వాగ్రత్నంబు విన్పించె నీ
కరవిందాక్ష! త్రిలోకిలోన నల శ్లోకార్థంబుకంటెం బరం
బెఱుఁగ నెన్నినది లేదు, దేవికిని నీ వెంతేఁ బ్రియుండౌ దౌహహో!

తే. ఆ మహాలక్ష్మివాక్యంబు లాదరించి,
యది మహామంత్ర మను నిశ్చయమునఁ గుదిరి
హృదయకుహరాంతరమున ధరించి దాని
నెల్లవేళ జపించుఁ బద్మేక్షణుండు.	౨౨౭

ఉ. అంతటఁ గొంతకాలమున కాతనినాభి జనించి బ్రహ్మ దే
వాంతకభీతి విష్ణు శరణాగతుఁ డైన, మహారణంబు వి

క్రాంతి నొనర్చి, శౌరి మధుకైటభులన్ మథియించి మించి య
త్యంతరతిన్ జపించె విశదాక్షర మా మనుగీతికార్థమున్. ౫౫౮

తే. అట్లు జపియించుహరిఁ గాంచి యా విరించి
యపుడు ప్రశ్నించె, నీచేయు జప మ దేమి?
యెవ్వారి స్మరించి యెడఁద రమించుచుందు?
వఖిలజగదీశ! నీకంటె నధికుఁ డెవఁడు? ౫౫౯

వ. నావుడు శ్రీహరి యి ట్లనియె. ౫౬౦

క. ఎందును భగవతి నీ నా
యందుఁ గ్రియాకారణాత్మ యగు శక్తి వెలుం
గొందుఁ, దదాధారంబై
పొందున్ రూపంబు జగతి పూర్ణాంబుధియున్. ౫౬౧

ఉ. ఈ సచరాచరాత్మజగ మెల్ల నదే సృజియించు, నాపరా
ఖ్యా సముదీర్ణ శక్తియె యనాది ప్రసన్నయె యైన మోక్షసు
శ్రీ సముపాప్తిహేతు వయి చెల్లు నదే, మఱియున్ నరాళికిన్
శ్రీసకలేశ్వరేశ్వరియె చిచ్ఛలుఁ సంసృతిబంధ హేతువౌ. ౫౬౨

తే. అల్ల చిచ్ఛక్తిసంభవం బం చెఱుఁగుము
నేను నీవు విశ్వ మ్మెల్ల, నిశ్చయ మిది;
భాగవత మది గీతార్థపరము నాకుఁ
బల్కెఁ, నది విస్తృతం బగు ద్వాపరాది. ౫౬౩

క. అని కరుణించిన హరి, దా
నిని గ్రహియించెను విరించి; నీరజజుఁడు, సం
దను నారదు దీక్షించెను;
మునికులమణి యతఁడు నాకు బోధించె దయన్. ౫౬౪

సీ. దాని నేఁ జింతించి ద్వాదశస్కంధంబు
గా విస్తరించితి దేవిచరిత;

బ్రహ్మసమ్మిత మది పంచలక్షణయుక్త
పుణ్యపురాణమ్ము, పూతచిత్త!
వేదార్థసారంబు వేదాంతసారంబు
ధర్మశాస్త్రసమంబు శర్మదంబు
వృత్రాసురవధాది వివిధకథాఢ్యంబు
భాగవతాఖ్య దివ్యపురాణ;
మది పఠించిన వినినఁ బుత్రార్థదంబు,
పరమశాంతి దీర్ఘాయుష్యకరము శివము,
జ్ఞానవిబోధ మజ్ఞాననాశకం బ
పార సంసార వారాశి తారణంబు. ౩౬౫

తే. అది పదేన్మిదివేల సంఖ్యం దలిర్చు
శ్లోకములఁ బొల్చు; దాని సుశ్లోక! నీవు
సంగ్రహించి ధరింపు హృత్సారసమున,
వినెదు నీతోడ రోమహర్షణియుతుండు. ౩౬౬

వ. సూతుం డిట్లనియె. ౩౬౭

ఆ. వ్యాసుఁ డిట్లు పల్కి భాగవతం బెల్ల
శుకునితోడ నాకు శ్రుత మొనర్చె;
నేను దాని రత్ననిధిఁబోలె గ్రహించి
హృది ధరించినాఁడ దృఢనియుక్తి. ౩౬౮

### వ్యాసుండు శుకుని జనకుని జూపఁ బంపుట

క. శుకుఁడు పురాణము వినియును
వికలుం డేకాంతశూన్యవృత్తియు నగుచున్
వికసన దొలఁగిన నది గని
యొకనాఁ డిట్లనియె వ్యాసుఁ డొద్దిక శుకుతోన్. ౩౬౯

ఉ. ఏల శుకా! నిరంతరము నిట్లు ఋణార్దితనిర్ధనుండునుం
బోలె నితాంతచింతఁ గను మూసి తపించెదు ? నీకుఁ దండ్రినై
బాలక! నేను గల్గఁగ లవంబు కొఱంత యొసంగఁ జాలునే ?
చాలు, లగింపుమీ యెద నచంచలకీలిక జ్ఞానదీపికన్. ౫౭౦

తే. ఐన శాంతింపదేని మోహము త్వదాత్మఁ,
జనుము మిథిలాధినాథుని జనకు నడుగ;
నాతఁడు విదేహరాజర్షి యఖిలవేత్త
తథ్యవాక్కు జీవన్ముక్తధర్ముఁడు శుచి. ౫౭౧

వ. అనుడు శుకుం డిట్లనియె. ౫౭౨

క. అన్నా! యచ్చెరువయ్యెడి
నున్నె వంధ్యాసుతుండు నుర్వీస్థలిలోఁ ?
దిన్నది తినకున్నదియున్,
జన్నది చనకున్న దగుట సాధ్యమె యెందున్ ? ౫౭౩

క. ఏవిధి రాజగు నాతఁడు
జీవన్ముక్తుఁడు విదేహచిహ్నుండును నౌ!
నేవిధిఁ జోరుఁడు ముని యని,
నావాఁడున్ వైరి యనెడి జ్ఞానం బుడుగున్ ? ౫౭౪

క. శీతోష్ణంబుల సుఖదుః
ఖాతురతం గనక యబ్జమట్లు జలములం
దేతీరున నంటక గృహిం
యాతం డున్నాఁడొ చూడ నద్భుత మయ్యెన్. ౫౭౫

క. దండింపక దుష్టాత్ముల
నుండం గలఁ డెట్టు లేలు నుర్వీపతి ? య
ట్టిం డెటు ముక్తుం డనఁ బా
త్రుం డగు ? నది చూడ నేగుదున్ గురుదేవా ! ౫౭౬

తే. అంచు సెల వీయ వేఁడి సాష్టాంగపడిన
శుకుఁ గవుఁగిలించి పల్కె వ్యాసుండు ప్రీతి,
స్వస్తి గావుత నీకు దీర్ఘాయు రస్తు
తిరిగి యాశ్రమమునకు సత్వరము రమ్ము. ౫౭౪

ఆ. జనకునొద్ద కేఁగి సందేహముల్ పేఁగి,
యెందుఁ బోక మరల యిందె రమ్ము,
నీ ముఖంబు గాంచి నే నాత్మ సుఖయింతు,
నిన్నుఁ జూడకున్న నిలువలేను. ౫౭౫

తే. తండ్రికి నమస్కరించి ప్రదక్షిణంబు
సలిపి చాపవినిర్ముక్త శరము వోలెఁ
గదలెను శుకుండు మిథిలాభిగమనకాంక్ష
జనకు దర్శించి యడుగఁగా సందియములు. ౫౭౬

మ. శుకుఁ డాదారి గిరుల్ నదుల్ పురవనస్తోమంబులున్ దాఁటుచో
నొకచో మౌనుల యజ్ఞదీక్షితుల యాగోద్యుక్తులన్ గొందుచో,
నొకటన్ శైవుల శాక్తవైష్ణవుల సూర్యోపాసనాభ్యాసక
ప్రకరంబున్ బహుధర్మనిష్ఠులఁ గనెన్ స్వాంతంబునన్ నవ్వుచున్.

క. రెండగు నేఁడుల మేరువు,
నొండొకటన హిమనగంబు, నొగి దాఁటుచు నా
తం డాపై మిథిలాపురి
కొండొక కాలమునఁ జేరెఁ గుతుకము మీఱన్. ౫౭౮

క. ఆ మిథిలానగరమ్మున
క్షేమమ్మునఁ బ్రజలు సుఖులు శిష్టాచారుల్
గా మదిఁ గని యలరుచు నభి
రామంబుగ శుకుఁడు చేరె రాచనగరికిన్. ౫౭౯

శుకుఁడు ప్రతీహారునిచే నివారితుం డగుట

క. ముందుకు నడచెడి వ్యాసుని
నందను వారించి క్షత్త నయమున ననె, నీ
వెందుల కిట్టు వడిఁ బోయెద?
విందులఁ బని యేమి చెప్పు మెవ్వడ వనుచున్. ౫౩

తే. ఆ ప్రతీహారు ప్రశ్నంబు లాలకించి
మాఱు పలుకక స్థాణువుమాడ్కి శుకుఁడు
నగరిద్వారంబు వెలువడి నవ్వుకొనుచు
నిశ్చలత విస్మయంబుతో నిలువఁబడియె. ౫౪

వ. ప్రతీహారుఁ డిట్లనెను. ౫౫

తే. వటుక! మూగవాఁడవ యేమి? పలుక వేమి?
రాఁ గతం బేమి? పని లేక రా నెలుఁగాదు;
నగరు రాజాజ్ఞ లేనిది తగదు చనఁగ;
నందు నజ్ఞాతకులశీలు రరుగరాదు. ౫౬

తే. నీవు మిగుల తేజస్వివి, నిశ్చయముగ
బ్రాహ్మణుండవు వేదవిద్వరుఁడ వవుదు;
కులము కార్యంబు నాకు వాక్రుచ్చి, పిదప
యిచ్చ వచ్చినరీతి నీ వేగ నగును. ౫౭

వ. అని విని ప్రతీహారికి శుకుం డిట్లనె. ౫౮

క. ఏటికి నిట వచ్చితి, నీ
మాటల నది ప్రాప్త మయ్యె, మా టేటిఁ కేలం!
సూటిగ విదేహనగరముఁ
జేరెద చూడంగ మాకుఁ జొప్పడకుంటన్. ౫౯

క. నే నీ విదేహనరపతిఁ
గానంగా రెండు గిరులు గడచి యిటు వృష•

ధ్యానముఁ జూపితి బుద్ధివి
హీనత, నా తండ్రి నన్ను నిటు తెలియించెన్. ౫౯౦

క. పురుషుఁడు ధనాశ భ్రమపడుఁ;
బొరపడితి ధనాశ లేక మోహవశుఁడనై;
మరలింపఁగఁ బ్రారబ్ధము
తరమా, విధివంచితుండఁ దథ్యము నేనున్. ౫౯౧

క. ఎక్కడి మేరునగాగ్రం!
బెక్కడి మిథిలాపురంబు! నే కాల్నడతో
నొక్కట తీర్థము వేదము
లిక్కడ రాఁగా, విదేహ మిది చేరఁ గాదుఁ! ౫౯౨

తే. ఇట్లు శుకుఁడు పల్కి యింకేమి యనఁబోక
నిలిచి యుండఁ జూచి, 'నిశ్చయమ్ము,
ద్విజవరుండు వీఁడు విజ్ఞాని' యని పొగ్డి
సామపూర్వకముగ క్షత్త పలికె. ౫౯౩

కం. నీ యిచ్ఛ యిట్లు వచ్చిన
నాయెడఁ జనుమో మహాత్మ! యపరాధమ్మున్
నా యది క్షమింపు, క్షమయే
నీయట్టి విముక్తజనుల సొక్కపు బలమౌ. ౫౯౪

వ. శుకుం డిట్లనెను. ౫౯౫

క. తప్పేమి చేసినాఁడవు!
తప్పదు ప్రభుకార్యవశత దాసున కెపుడున్;
తప్పెల్ల నాది, యెఱిఁగితి,
నిప్పుడు, పరగృహము చొచ్చి యిట్లయితిఁ గదా! ౫౯౬

తే. అంత శుకు ద్వారపాలకుఁ డడిగె నిట్లు,
లేమిటి సుఖంబు, దుఃఖ మ దేమిటి ద్విజ!

యేమి సేయఁగవలె శుభ మిచ్ఛయించు
వాఁ డని యడుగ శుకుఁ డిట్లు బదులు పలికె. ౯౭

తే. చిత్తవృత్తులభేదంబుచేత జనులు
రాగులు విరాగు లని యిరువాగువారు;
వీతరాగులు ముత్తెగల్, జ్ఞాతుఁ డంచు,
మఱియు నజ్ఞాతుఁ డంచును, మధ్యముఁ డని. ౯౮

తే. ద్వివిధమై రాగిజనము కీర్తింపఁబడియె,
నందు, మూర్ఖులు చతురు లటంచు; ననలఁ
జతురతయు రెండు విధములు, శాస్త్రజన్య
మొకటియుఁ, మతిజన్య మింకొకటి యగుచు. ౯౯

తే. మఱియు రెండు విధమ్ములై నుతి వహించు.
యుక్త మంచును, మఱియు నయుక్త మంచు;
నీవిధంబునఁ గురిపించి యేకధారఁ,
బలుకుశుకుఁ గాంచి యిట్లని పలికె క్షత్త. ౧౦౦

తే. నీవు విద్వాంసుఁడవు భూమిదేవవృషభ !
నేను మూర్ఖుఁడఁ దెలియఁగా నేరకుంటి;
నీవచించు మహార్థ, మో ధీవిశాల !
విస్తర ముపన్యసింపుము విపులముగను. ౧౦౧

వ. శుకుం డి ట్లనియె. ౧౦౨

సీ. రాగంబు సంసారభోగంబులం దున్న
వాఁడు రాగి యటంచుఁ బలుకఁబడును,
వానిదుఃఖంబులు బహుభంగులై యొప్పు,
వానిసుఖంబులుం బలువిధములు;
వనితా సుతారామ ధనము లొంది సుఖించు
నవివేకి దుఃఖించు ననునిమిషము;
సౌఖ్యం బతం డెప్డు సాధింపఁగా సుఖో
పాయవిచారంబు సేయవలయు;

నతఁడు సుఖవిఘ్నకారియే యగు నరాతి,
పరగు మిత్రంబునై సుఖోత్పాదకంబు;
యందుఁ జతురుండు మోహంబు నంది చెడఁడు;
మూర్ఖుఁ డగువాఁడు సర్వత్ర మోహితుఁ డగు. ౬౦౩

సీ. ఆత్మరక్తి విరాగి కగుసుఖ మాత్మాను
 చింతన వేదాంతచింతనమ్ము
నేకాంతసేవనం బివి మాత్రమే, తక్క
 తుచ్ఛసంసృతికథల్ దుఃఖము లగు;
శుభ మిచ్ఛగించెడి శుద్ధవిజ్ఞానికి
 బహుశత్రుజాలంబు పరగుచుండుఁ;
గామంబు క్రోధంబు ఘనశత్రుసైన్యంబు,
 మఱి ప్రమాదాదుల మాట లేల?

వెదకి చూచిన నిమ్మహావిశ్వమందు
సర్వము విరాగిజనునకు శత్రుబలమె;
యోగతనికి బంధువై యుండి యాత్మరక్ష
చేయు, సంతోష మొక్కటే సృష్టి నెందు. ౬౦౪

ఆ. వానిపల్కులు విని ద్వారపాలకుఁడును
ద్విజుఁడు జ్ఞాని యనెడు స్థిరమనీష
నతిమనోజ్ఞమైన యాకక్ష్యను ప్రవేశ
పెట్టె శుకుని మిగులఁ బ్రీతితోడ. ౬౦౫

క. శుకుఁ డట్టులు చని నగరము
సకలంబుం గాంచె విపణి సరణి క్రయకా
రక వివిధద్రవ్యార్థ్యము
వికీర్ణజనసంకులంబు విత్తాశ్రయమున్. ౬౦౬

క. కామము లోభము మోహము
తో మద మాత్సర్య రాగ ధూర్తత్వములన్

భీమవివాదనినాద
స్తోమము త్రైవిద్యజనము చొప్పుం గాంచెన్. ౬౦౪

## ద్వితీయకక్ష్యాప్రవేశము

తే. పరమతేజస్వి రెండవ భాస్కరుండు
వలె వెలుంగుచు నటు వోయి వ్యాససుతుఁడు,
దరియఁగ ద్వితీయమందిరద్వారి మఱియు
వారితుం డయ్యె నొకప్రతిహారిచేత. ౬౦౫

తే. కట్టెవలె నడ్డు నిల్చిన క్షత్తఁ గాంచి
మాఱు మాటాడక శుకుండు ద్వారి నిలిచె,
మోక్షమే చింత చేయుచు ముగ్ధుఁడట్లు
ధ్యాని యొకింతయును సమదర్శి యతఁడు. ౬౦౬

క. ఒక్క ముహూర్తావధి యట
నక్కరణిన్ నిల్వ శుకుఁడు నాతని నాలో
నొక్క ప్రధానామాత్యుఁడు కని
ప్రమోదమున ద్వితీయకక్ష్యలోనం జేర్చెన్. ౬౦౭

ఉ. అంతఁ దొక రమ్యమహా నుపవనావని గొప్ప మరందబిందు
స్యందము దిగ్దిగంతర విసారి పరాగము విభ్రమస్సదం
దిందిర ఝంకృతి ధ్వనిక సమీరిత రావము కేళిదీర్ఘికా
నందిత రాజహంసము మనఃప్రభవోజ్జ్వల మందిరంబునై. ౬౦౮

ఉ. ఆ వనభూమిమధ్యఁ జెలువారు నొకానొక కాంతకాంతి రా
జావసథంబు, వ్యాససుతు నందు వసింపఁగఁ జేసి పూజ్యసే
వావిధు లెల్లఁ దీరిచి యసాధారణమైఁ బరిచర్య చేయ వే
శ్యావనితాశతంబు శుకుసన్నిధి నుంచె నమాత్యుఁ డర్మిలిన్. ౬౦౯

ఉ. ఆ పొలఁతుల్ నవోదిత వయస్సుకుమార శరీర, లంగనో
ద్దీపక దీపికా సదృశ దివ్యదృగంతలు, చక్రవృత్త శై

శోపమ పీవరోన్నత పయోధర నమ్రలు, శ్రోణిభార సం
దాపిత మత్తయాన, లల దైవతభామలజోడు లందఱున్. ౧౦౩

ఉ. వారలు కాకలీ కలరవ ప్రియకంఠలు, గీతరాగని
స్సారణ చారణీ కళలు, సార చతుర్విధ వాద్య వాదనల్,
ధీరలు నృత్యవిద్య, నవధీజితరంభలు, కామదేవదీ
క్షా రసపాన శౌండలు, ప్రగల్భలు మంజువచోవిచాలనన్. ౧౦౪

మ. శుకు సంగంబుల నిండుజవ్వనపురోచుల్ చిందు వారందఱన్ సుధాం
శుకళాస్నిగ్ధముఖై ముఖంబున స్మితజ్యోత్స్నల్ వెలుంగొంద శా
రికలం గీరపికాళిఁ గేరెడు వచశ్శ్రీ పొంగువారంగ ద
ర్పకరమ్యోజ్జ్వలరూపుఁ గాంచి వనితల్ కాముకార్తలై రందఱున్.

క. ఎన్నఁడు నోడ్డం దమచేఁ
బన్నిన మోహాంపుటురులఁ బట్టుచుఁ బరమా
త్మోన్నతి నెఱుఁగని నట్టిన
యన్నులు విజ్ఞానముగ్ధ లగు టది యరుదే? ౧౦౫

చ. పరియుపచర్యలన్ సలుపఁ బంచి యమాత్యుఁడు నిష్క్రమింపఁగా,
లలనలు పంచబాణభరలోలసలై శుకుఁ జేరి తియ్యప
లుక్కులచవిఁ జూపుచుం గుసుమకోమలపాణుల నూఁది గారుణ
పలచితకుట్టిమంబుల సువర్ణగృహంబునఁ ద్రిప్పి రెల్లెడన్. ౧౦౬

తే. తేటవాలోపపన్నేష్ట దివ్య వివిధ
మృష్ట రుచిరాన్నకలన సంతుష్టుఁ జేసి,
పరివనిత లర్చించిరి పరమభక్తి,
శుకు యథాశాస్త్ర నిర్దిష్ట శుద్ధవిధిని. ౧౦౭

శా. ఆ రంతన్ శుకుఁ గేళికావనములో నాహ్వాళికం బోవఁగాఁ
బ్రేరేపించి, ప్రియోక్తులన్ వసంతశ్రీఁ జూపి వర్ణించుచున్,
శారీ కోకిల కేకికా కలరవ స్వానంబు విన్పించుచుం,
జేరం దీసిరి దీర్ఘికాతటము కాంచీనాదముల్ పొంగఁగా. ౧౦౮

పాణి పాణిఁ దెమల్పఁ బద్మపాణి యొకర్తె,
బిగియ నూఁదఁడు విడిపించుకొనఁడు;
కన్దూఁపులు నిగుడ్పఁ గామాక్షి యొకరిత,
తూలఁడు లోలుఁడై తొలఁగి కనఁడు;
గోటఁ జెక్కిలి మీటఁ గోపన యొక్కతె,
పులకరింపఁడు చెంప పులుముకొనఁడు;
పెద నంటి ముద్దాడ బింబాధర యొకర్త,
మఱు ము ద్దిడఁడు మోము మలచికొనఁడు;

కాముబారిఁ జిక్కి కామినీతతి తనుఁ
జుట్టు ముట్టి చిక్కు పెట్టుచుండఁ,
బట్టువడఁడు, వారిఁ బదరఁడు, తొలఁగఁడు,
పాదుకొల్పి మాతృభావ మెడఁద. ౬౦

ఉ. మారుఁడు తోలఁగా నొక కుమారిక, పో దిగనాడి సిగ్గు, పై
జారఁగఁ బైట, నిక్కిన కుచద్వయితోఁ శుకుఁ బ్రొమ్ము గ్రుమ్మి, చే
జారఁ గవుంగిలింపఁ, జను లంట శుకుం డఱచేతఁ, బొం
గారెను పాలు, కన్న శిశు వంటినజాలున, దానిచన్నులన్. ౬౧

ఉ. ఆఁకలి దీర్పఁ జాలు రుచిరామ్రఫలం బటువోలెఁ జూపులం
దాఁక దురాశ దీపికఁ బతంగము చుట్టి నిరాశ పొంది య
ట్టాకలఁ దూలునట్లు, దగ యాఱ మరీచికనీటికై మృగా
నీకము రీతి నంటి, శుకునిం, బడయం గనరైరి కామినుల్. ౬౨

శా. సాయంకాలనసాంతవాయువులు సంచారింప నాశాళి వే
శ్యాయోషల్ రచియించి రొక్క సుమశయ్యన్ నేరు పొప్పం ప్రా
ప్యాయత్తాస్తరణంబుగా సురభిధూపాఢ్యంబు గాఁగా శుకా
వ్యాయామార్థంబుగ దివ్య రమ్య వివిధోపస్కార పూర్ణంబుగా. ౬౩

మ. శుకుఁ డా చేడలగోల యుల్ల తొలఁగం జూ పోపి యందున్న దీ
ర్ఘికనీటం గుశపాణియై కరపదశ్రీశౌచపూతాత్ముఁడై

యకులంకస్థితి నేకచిత్తుఁడయి సంధ్యాకృత్యముల్ దీర్చి యం
దొక యామంబు నివాతదీపికలతో నొప్పారె ధ్యానస్థుఁడై. ౬౨౪

మ. ధ్యానానంతరమందుఁ దద్రచితశయ్యాసీమ మైవ్రాల్చి తా
రానాథోదయమీలితాబ్జములమేరన్ నేత్రముల్ మూయఁగా
నా నాళీకనిభాస్యలాడి రట మంద్రాలాపసాంద్రంబుగా,
జో నాముద్దులబాల! జో శుకశిశూ! జో యం చయత్నంబుగా.

తే. శుకుఁడు యామద్వయము సుఖసుప్తి నొంది,
యంత నామీఁది యామినీయామ మెల్ల
ధ్యానసంస్థితుఁడై స్నాన మాచరించి,
తీర్చి ప్రాతఃక్రియల్, పొల్చె స్థిరమతి యయి. ౬౨౬

శుక జనక సంవాదము

క. జనకుఁడు శుకునాగమనము
విని సత్వరగతి నమాత్యవృతుఁడై శుచియై
తనకుఁ బురోహితు ముందిడు
కొని చని యర్చించెఁ బాద్య గో వాసఁగి మొదల్. ౬౨౭

క. అన్యోన్యకుశలభాషణ
విన్యాసోపరి సుఖోపవిష్టు లయిన, రా
జన్యుఁ డడిగె నిస్పృహుఁ డగు
మున్యాగమనమునకుఁ గతము దెలుప శుకున్. ౬౨౮

వ. శుకుం డి ట్లనె. ౬౨౯

ఉ. దారఁ బరిగ్రహింపు మని తద్దయు మాపితృపాదు లాడ, సం
సారము నియ్యెడన్ సయితి సంకెలయన్ దృఢనిశ్చయంబునన్;
వా రటు నాకు సంశయనివారణ సేయ విముక్తచిత్తు సం
సారి విదేహు నిన్ జనకజానిని జూడఁగఁ బంపిరిమ్మెయిన్. ౬౩౦

మ. మఱియున్ వా రిటు లానతిచ్చిరి, "శుకా! మా తేల? పాలించు భూ
వరుఁడై రాజ్య మకంటకమ్ముగను, జీవన్ముక్తుఁడై మాయవా
గురలం జిక్కక యావిదేహనృపుఁ, డో పుత్రా! వనావాసివై
మఱి నీ వేటికి భీతి నొందెదవు సంసారంపుదారిం గొనన్? ౬౩౧

తే. దారను గ్రహింపు శంకలు దీఱవేని,
పొమ్ము, కను మా విదేహభూపునివిధమ్ము;
తీఱదే దాననీదుసందేహ, మతనిఁ
బ్రశ్న సేయుము, వడిఁ బోయి ర"మ్మటంచు. ౬౩౨

తే. మోక్షకాముఁడ నేను భూభుజవరేణ్య!
తపమొ స్వాధ్యాయమో యజ్ఞతర్పణమ్మొ
వ్రతములో తీర్థసేవయో, పలుకు మనఘ!
మోక్షకారణ మది, జ్ఞానమో మహాత్మ! ౬౩౩

వ. జనకుం డిట్లనె. ౬౩౪

సీ. వినుము మోక్షార్థియౌ విప్రుండు మున్నుండ
యుపనీతుఁడై, గురునొద్ద శ్రద్ధ
వేదవేదాంగముల్ వేదాంతము పఠించి,
గురు దక్షిణం దుష్టి గూర్చి మిగుల,
నంత సమావృత్తుఁడై దార గ్రహియించి
సంసారియై, కొల్చి జాతవేదు,
సత్యవాక్కు నిరాశి సంతోషి శుచియునై
గతకల్మషుఁడు ధర్మకర్ముఁడు నయి,
పుత్రపౌత్రులఁ గాంచి సంభూతతృప్తి,
నంతపైని వానప్రస్థునాశ్రమంబు
పూని నిరతతపంబుచేఁ బూతుఁ డగుచు,
శత్రుషట్కంబును జయించి శాంతుఁ డగును. ౬౩౫

క. అంత విరక్తుం డయినం
గాంతను నిజపుత్రుఁ గావఁగాఁ బూనిచి, యా
త్మాంతరమున విధి నగ్నుల
శాంతముగ ధరింపవలయు సంన్యస్తుండై. ౬౩౬

తే. నలువదెనిమిది సంస్కారములను శ్రుతులు
చెప్ప; నందు గృహస్థుకుఁ జెప్పఁబడియె
నలువదియు; తక్క శమదమాదు లెనిమిదియు
మోక్షకామి విరాగి యా మునికె సుమ్ము. ౬౩౭

ఆ. ఆశ్రమంబునుండి యాశ్రమం బిట్టులె
యొకటివెనుక నొకటి యొగి గ్రహించి,
తుది విరక్తమైన మది యతి కావుట
శిష్టశాసనంబు చెప్పు క్రమము. ౬౩౮

వ. శుకుం డిట్లనె. ౬౩౯

క. హృదయంబున వైరాగ్యం
బుదయంబై జ్ఞానదీప్తి యుజ్జ్వలితంబై
పొదలినయాతఁ డవశ్యం
బెది చేపట్టంగవలయు, గృహమో? వనమో? ౬౪౦

వ. జనకుం డిట్లనెను. ౬౪౧

ఆ. ఎంతయో బలీయ మింద్రియగ్రామంబు
బహువికారకర, మపక్వబుద్ధి
సుతసుఖాదులందుఁ జూపట్టిన సుఖేచ్ఛ
యతికి, నా వికారమడఁచు టెట్లు? ౬౪౨

తే. శాంతి నందదు వాసనాజాల, మద్ది
దుర్భరము గాన దానితొండుడుకు నడఁచి
మెల్లమెల్లన వాసన లెల్ల సడల
నన్నియు శమింప సన్న్యాసి యౌట మేలు. ౬౪౩

క. మూలమునుండి పిపీలిక
యేలీలన్ మెల్లమెల్ల వృక్షాగ్రమునన్
వ్రేలుఫలమునకుఁ బ్రాఁకం
జాలునొ, యట్టిద గృహస్థసత్పథము శుకా! ౬౦౦

క. అడ్డేమి చూడఁ బోవక,
యుడ్డీనించుచు విహంగ మొకదాఁటున మా
ఱొడ్డిన నలసెడి ప్రాణపు
గొడ్డ మగు దురధ్వ మగును కుజ్ఞయతులకున్. ౬౦౧

క. జతనం బున్న తనువున
క తటస్థంపడు, నథఃస్థయానుఁడు పడునే?
యతియై పతితుం డైనన్
గతి గానక యట్టివాఁడు కడు నిడుమఁ బడున్. ౬౦౨

తే. ప్రబలము మన స్సది జయింప వశము గాద
యెందు నకృతాత్ము లగువారి కీధరిత్రి;
నాశ్రమానుక్రమంబుచే నందువలనఁ
గ్రమముగా దాని నిర్జింపఁ గడఁగ వలయు. ౬౦౩

శా. శాంతుండై కృతబుద్ధియై సుమతియై సంప్రాప్తవిత్తంబు
సంతోషించుచు శాస్త్రచోదితవిధుల్ సర్వం బనుష్ఠించుచుం,
జింతాకార్యము లుజ్జగించుచు సమస్థేమాత్ముఁడై లాభనం
బెంతో యంత యలాభమం దగు గృహస్థేసన్ విముక్తుం డగున్.

ఉ. చూడుము నన్ను, రాజు నయి చూచుచు నుందు ననేక ... ములల్
క్రీడలు భోగముల్ సలుపురీతిన యుందును గాని నాపునం
జేడను గామశృంఖల లగింపఁగ నీక విముక్తబుద్ధి ను
న్నాఁడను; నీవు నట్లు గురునాజ్ఞ విముక్తత నొందనా శుకా! ౬౦౫

తే. బంధనము బంధన మటందు బ్రాహ్మణేంద్ర!
యాత్మ బంధింపఁ దరమె నిరంజనంబు;

నది యగమ్యము హేతుప్రత్యక్షములకు
దృశ్య మెట్లదృశ్యంబు బంధింపఁ గలుగు ? ౬౫౦

మ. మనసే నిర్మల మైన సర్వమలముల్ మాయుం, దదప్రాప్తిలో
మునుఁగం దీర్ఘసహస్రజాతముననే మోక్షంబు రాఁబోవ దీ
తనువుం జీవుఁడు నింద్రియంబు లణుమాత్రంబేని కాఁబోదిఁకన్
మనసే మూలము బంధమోక్షముల కెన్నన్ సౌఖ్యదుఃఖాళికిన్.

తే. నిత్య బుద్ధ శుద్ధ నిర్వికారం బాత్మ,
యెందు నెవరికట్టు కంద దద్ది;
బంధమోక్షణములు పరగు మనస్సులో,
నది యడంగు నెడల నవి యడంగు. ౬౫౨

ఆ. శత్రుమిత్రు లనుచు సము లను భేదముల్
మనసునందుఁ గల్గు మార్పులు సుమి;
యెట్టులట్లు భేద మేకాత్ముఁడగువాని
యందు ద్వైతదర్శనాత్త మదియు. ౬౫౩

క. జీవుల నెల్లెడ నహ మను
భావన బ్రహ్మమ్ము సుమ్ము, పలుకు లిఁ కేలా?
జీవుఁడు బ్రహ్మము రెం డను
భావ మవిద్య కలిగించు భ్రాంతియె సుమ్మా. ౬౫౪

తే. ద్వైతబుద్ధి యవిద్యచేఁ బ్రభవ మందు,
నాయవిద్య తొలంగుటే యగును విద్య;
యిదియు విద్య, యవిద్య యియ్యది యటంచు
నెఱుక కల యంతటను వివేక మెఱుఁగవలయు. ౬౫౫

క. ఆతపము లేక ఛాయా
శీతలసౌఖ్యం బెఱుంగఁ జెల్లునె యెందే?
నాతీరున యవిద్య వి
నాం తెలియుట యెట్లు విద్య నాఁబడుదానిన్ ? ౬౫౬

తే. గుణము లవి ప్రవర్తించును గుణములందు;
భూతములు నట్ల వర్తించు భూతములను;
యింద్రియార్థంబులఁ జెలంగు నింద్రియంబు;
లందులో నాత్మదోష మావంత యున్నె ? ౬౫౭

క. రక్షార్థము మర్యాదలు
శిక్షించును వేద మదియు శ్రీపథ మిఁక, ధ
ర్మాక్షయములు వర్ణాశ్రమ
శిక్షకములు సౌగతకుపథము లౌరు తెరువుల్. ౬౫౮

వ. అన విని శుకుం డిట్లనెను. ౬౫౯

సీ. సంశయ మిసుమంత శాంతింపనో రాజ!
ముక్తి నెట్టిచ్చు వేదోక్తవిధులు!
సోమపానము హింస యామిషభక్షణ
ప్రత్యక్షముగను సురాగ్రహంబు
ద్యూతాద్యనాచార జాతంబు వినఁబడు;
శశిబిందుఁ డనెడి రాజన్యుఁ డొకఁడు
సత్యవాక్యుఁడు ధర్మశాస్త్రజ్ఞుఁ బహుయజ్ఞ
ములు భూరిదక్షిణములఁ జేసె

చర్మములరాసి చద లంట జలము చెమ్మఁ
ధారఁ జర్మణ్వతీనదీవారి వెలసె;
నతఁడు దివి కేగ భువిఁ గీర్తి యచల మయ్యె
శ్రుతివిధులు రతాదులును ధర్మపుటె, జనక! ౬౬౦

వ. జనకుం డిట్లనియె. ౬౬౧

తే. హింస యజ్ఞార్థమైన నహింస యగును;
నార్ద్రకాష్ఠయోగంబున నగ్ని యందు
ధూమమట్లు లుపాధిచేఁ దోఁగు నదియు:
రాగి కగు హింస, కాదు విరాగి కదియు. ౬౬౨

క. నీరాగులై స్పృహ యహం
కారము వర్జించి మోక్షకాము లయిన సం
సారులు శ్రుతిచోదిత మెది
ప్రారంభించిన నహింస పరమ మది శుకా! ౬౬౩

వ. శుకుం డి ట్లనియె. ౬౬౪

క. సందేహ మయ్యె రాజా!
యెందుక్ మాయానిమగ్నుఁ డెటు నిస్స్పృహుఁ డౌ?
డిందనిచో మోహము మదిఁ,
బొందునె మోక్షంబు నెంత పొడవు చదివినన్! ౬౬౫

క. లోపల నిండిన తమముం
బాపంగా శాస్త్రబోధవలనఁ దరంబే?
దీపమె చీఁకటిఁ దోలఁగ
నోపును, మఱి దీపవార్త యోపునె భూపా! ౬౬౬

క. బుధుఁ డగువాఁ డెల్లప్పుడు
విధిగా నద్రోహి యగును వివిధప్రాణి
వ్యథ మాని యుండవలె నీ
పథమును సాధ్యమె గృహస్థభాజనున కిలన్? ౬౬౭

సీ. విత్తవంతుఁడ వీవు విత్తైషణయు లేదె,
రాజ్యైషణయు లేదె రాజ వవుదు,
రణభూమిలో నీకు రణజయైషణ లేదె,
సవనభూమిని లేదె హవనబుద్ధి,
చోరునిలో నీకుఁ జోరబుద్ధియు లేదె,
తపసిలో సాధుచింతయును లేదె,
స్వపరత్వమును లేదె వస్తుసంచయములో,
మిత్రబుద్ధియు లేదె, శత్రుబుద్ధి,

శుభరసంబులఁ దనియవే చొక్కి యందు?
నశుభరసముల దూరంబునందు నిడవె?
స్వప్నము సుషుప్తి జాగ్రదవస్థ లేవె?
యేయెటు విదేహుఁడవును దురీయుఁ డవుదు? ౬౬౦

క. రథ గజ తురగ పదాతుల
కధిపుఁడ, నివి నావశంబు లని పొంగవొకో?
మధురము తిని తని వొందవొ,
పృథగీక్షణ లేదొ వ్యాళ మిది మాలయు నాఁ? ౬౬౧

క. సమ లోష్ఠ కాంచనుండే
విముక్తుఁ డేకాత్మబుద్ధి విశ్వహితుం డౌ;
రమియింపదు నాచిత్తము
ప్రమదలపై గృహమునందు రవ్వంత నృపా! ౬౬౨

తే. స్పృహ మమత సంగమును వీడి మృగమువోలెఁ
బత్ర మూల ఫలాశన మాత్రుఁడ నయి
శాంతముగ నొడ్ల నడుగ కేకాంతి నగుచు
ద్వంద్వములు లేక చరియింపవలతు, రాజ! ౬౬౩

క. ఏటికి గృహధనములు? నా
బోటి విరాగికిని నేల బోటి వినఁగ నీ
మాటలు రాగమయమ్ము, లిఁ
కేటికి, ముక్తుండ ననుట బుతమె విదేహా! ౬౬౪

క. ఒకపరి శత్రుజచింతయు,
నొకసరి ధనజాతచింత, యొకొకవేళన్
సకలానీకజచింతయు,
వికలాత్ముఁ నొనర్చు నిన్ను, విడుచునె చింతల్? ౬౬౫

క. మితభోజనులై శ్రితసు
వ్రతులై జితమతులు నైన వైఖానసవి

శ్రుతమును లే సంసృతిమో
హితులు గద, యసత్య మంచు నెఱిఁగినవారల్ ! ౨౭౮

సీ. మీవంశమునవారి కీ విదేహాభిధ
కుటిలంబు కాని నిక్కువము గాదు;
నీపూర్వులు విదేహ నృపనామధారులే
కాని, వారటు గారు కర్మచేత;
విద్యావిహీనుని విద్యాధికుం డని,
మేటి దరిద్రు లక్ష్మీధరుఁ డని,
జనుషాంధు మార్తాండసంజ్ఞఁ బిల్చెడి
సాటిదే, యన్వర్థసంజ్ఞ గాదు;
నేను వింటి మీ పూర్వుఁడు నిమినృపుండు
కులగురు వసిష్ఠు యజ్ఞంబు సలుపఁ బోవఁ
బిలువఁగా, నాతఁ డింద్రునివలన మున్నె
యజ్ఞమునకు నిమంత్రితుం డగుటఁ జేసి. ౨౭౯

మధ్యాక్కర — సురపతి జన్నంబు పూర్తి కావించి సొరిది వెన్వెంట
జరిపింతు నీయజ్ఞదీక్ష, నీయజ్ఞ సంభారములను
బరువడి నీలోన కూర్పు మంచును బల్కి తాఁ జనిన
గురునిఁగా నోరుఁ బిల్చి క్రతువు గావించెఁ, గోపించి నిమియు.

వ. అది విని యా యధర్మమున కల్గి వసిష్ఠుఁడు శాప మిచ్చె, నీ
విది తగ దం చెఱింగియు వరించితి వన్యగురున్ దురాగ్రహో
న్మదమతివై, శరీరపతనం బగుఁగావుత మంచు; నట్లుకా
నది మొదలున్ విదేహవిదితాఖ్య నెసంగిరి త్వత్కులోద్భవుల్.

కం. మఱియును నిమియు వసిష్ఠుని
గురుఁ డనియుఁ దలంప కెదురుకొని శాపం బీ,
నిరువురతనువులు పడె, న
ప్పేరు వగు నిట్టిరు విదేహాభిఖ్యు లగుటయున్ ! ౨౮౨

వ. జనకుం డి ట్లనియె. ౬౭౯

క. నిజము వచించితి నైనను
భజింపు చెవి యొగ్గి నాదు పలుకు మునీంద్రా!
నిజజనకు వీడ నెంచెదు
విజనవనం బాశ్రయింప వేడుక పడుచున్. ౬౮౦

క. అందున్ మృగసంతతి ని
న్నొందదె? భూతములు నైదు నుండక సన్నే?
పొందవె యాఁకలిచింతయుఁ,
జెందనె దండాజినముల చింతయు నెపుడున్? ౬౮౧

క. అంతియు మదీయరాజ్యపుఁ
జింతయు, నా కే వికల్పచింతన లేదే;
యింతటి దూరము వచ్చితి,
వెంత వికల్పోపహతుఁడ వీవు తలంపన్! ౬౮౨

తే. నేను బద్ధుండఁ గా నని నిశ్చయించి
సుఖముగ భుజింతు నిద్రింతు సుఖుఁడ నగుచు;
నీవు బద్ధుండ వౌ దను నిత్యశంక
దుఃఖ వయితివి; సుఖయింపు తూల్చి దాని. ౬౮౩

క. ఈ దేహము నా దనుటయుఁ
గా దనుటయు బంధ మోక్ష కారణములుః సు
మ్మా, దాసులు ధనగృహములు
నీ దేశము నా వటంచు నెన్నఁడుఁ దలఁపన్! ౬౮౪

శుకుఁడు గృహస్థాశ్రమము స్వీకరించుట

తే. ఆ వచస్సుల శుకుఁడు ప్రీతాత్ముఁ డగుచు
వ్యాసునాశ్రమముం జేరె; నతిరయమున

వచ్చు సుతుఁ గాంచి యల్లంత, వ్యాసమౌని
పొంగి యెదురేగి చేసె నాలింగనంబు. ౬౮౫

క. శాంతుఁడు పరనిర్వృతి గత
చింతుఁడు నగు శుకు నెఱింగి చెలఁగి యతండున్
సంతసమునఁ "బీవరి" యను
కాంతను బుత్త్రునకుఁ బెండ్లి కావించె దమిన్. ౬౮౬

వ. శుకయోగియు, యోగమార్గంబు దప్పక గార్హస్థ్యంబు నడపుచుఁ బీవరియందుఁ గృష్ణుండును, గౌరప్రభుండును, భూరియు, దేవశ్రుతుండు, నను నలువురు కుమారులను, కీర్తి యను కన్యను గాంచి, కీర్తిని విభ్రాజపుత్త్రుం డైన యణుహుం డను మహాత్మున కిచ్చి పరిణయంబు గావించె. ౬౮౭

ఉ. వారికి బ్రహ్మదత్తనరపాలుఁడు కల్గె, నతండు వీరతన్
వైరుల నాక్రమించి ధరపాలన చేసి, యనంతరంబునన్
నారదమౌనిదానకలనన్ భువనేశ్వరి నాశ్రయించి ష
డ్వైరుల గెల్చి జ్ఞాని యయి బ్రహ్మపదంబును గాంచె ముక్తుఁడై.

### శుకుఁడు విరాగియై మోక్షంబు నొందుట

శా. ఆలీలన్ శుకయోగి తండ్రిదరి గార్హస్థ్యంబు వెళ్ళించి, పైఁ
గైలాసాచలశృంగభూమిఁ బితృసంగంబున్ వధూసంగమున్
బాలాపత్యసమస్తసంగములుఁ బోవంబెట్టి, నిశ్చింత మే
ధాలక్ష్యం బగు పేర్మి నిశ్చలత నాత్మధ్యాని యై నిల్చెనన్. ౬౮౯

శా. అంతం గొండొకకాల మేగ శుకుఁ డాత్మారాముఁడై సిద్ధుఁడై
చింతం గొల్పుచు సర్వభూతములకున్ విద్యుత్ప్రభాపుంజభా
స్వంతుండై నెగసె న్విహాయసిని భాస్వద్బింబసంభేదియై
భ్రాంతంబై గిరిశృంగ మచ్చట ద్విధా వ్రయ్యంగ నుత్క్షిప్తమై.

మ. సకలాదిత్య మునీంద్ర సిద్ధ బహుధా సంస్తూయమానాత్ముఁడై
శుకుఁ డాకాశపథంబునందుఁ బృషదశ్వుండట్లు స్వచ్ఛందుఁడై
ప్రకటాశాలి ద్వితీయభాస్కరుని రేవ న్వెల్గుచుం బోవఁ దం
డ్రికి నుత్పాతపరంపరల్ కనఁబడెన్ భీశోకముల్ గూర్చుచున్.

ఉ. వ్యాసుఁడు శీఘ్రయానమున నా శుకహాని తపస్సుచేయు కై
లాసశిరఃప్రదేశమును డాసి యటన్ శుకుఁ గానలేక పే
రాస శుకా శుకా యని విలాప మొనర్చి పరిభ్రమింప మా
ర్మ్రోసె గిరీంద్రకందరములుం గరుణాశ్రుతులన్ శుకస్మృతుల్

శా. జ్ఞానోద్దీప్తికృతావతారుఁ డగు వ్యాసబ్రహ్మ యీరీతిగా
దీనుండై విరహాభిభూతుఁ డయి క్రందింపన్ శుకా యంచు న
క్షీణావేశత సర్వభూతగతసాక్షీభూత యా శ్రీ ప్రతి
ధ్వానించెన్ శుక యంచు; నేఁడు స్ఫుటమై తద్ధ్వాన మాలింప నౌ!

క. పారాశర్యుని దుఃఖము
దేరుప శివుఁ డరుగుదెంచి తెలియఁ బలికె, నీ
కీ రీతిని శోకించుట
ధీరాశికిఁ దగు నటయ్య; తేరుము వత్సా!

క. నీపుత్రుఁడు సుకృతాత్ముల
కే పడయఁగరాని పరమ మిాద్యగతిఁ గనెన్,
నీ పుత్రజన్మచే నీ
కే పుణ్య విమల నితాంత కీర్తి లభించెన్.

క. వ్యాసుండు పలికె నిట్లని:
యో సాంబసదాశివా! మహోజ్జ్వలమూర్తీ!
నాసుతునిఁ గనులఁ గాంచక
యే సుంతయు నోర్వఁ జాల నే మందుఁ బ్రభూ!

చ. అది విని జాలి నొంది శివుఁ డాతనిపార్శ్వమునందు సర్వదా
హృదయసుఖంబుగా శుకమునీశ్వరుఛాయ కనంగ నౌనటుల్

సదయమతి న్వరం బొసఁగి చన్న మహేశుఁడు, గాంచి దానినే
యెదఁ బదిలం బొనర్చి యెటులే వినివర్తితుఁ డయ్యె వ్యాసుఁడున్.

క. శౌనకముఖ మునిలోకం
బా నిస్తుల శుకవిమోచ నాఖ్యానంబున్
వీను లలర విని, వ్యాసుఁడు
పై నే మొనరించె మాకుఁ బల్కు మనంగన్. ౧౯౮

వ. సూతుం డి ట్లనియె. ౧౯౯

**వ్యాసుండు జన్మభూమికిఁ దిరిగి వచ్చుట**

సీ. వ్యాసునిదరి మున్ను బహుకాల శుశ్రూష
వేదముల్ చదివిన విదిత హాను
లసిత వైశంపాయన సుమంతు దేవల
జైమిను లాదిగాఁ జనిరి మున్న,
పుత్రుండు శుకుఁ డట్లు ముక్తుఁడై చన శూన్య
మట్లుగఁ దోఁప నిజాశ్రమంబు
తనుఁ బాసి విలపించు తల్లి నాత్మఁ దలంచి
వెడలి చేరె యమునాద్వీపభూమి,
వేగఁ దన జన్మభూమిఁ బ్రాపించి యాతఁ
డందుఁ దనతల్లిఁ గానక యెందుఁ బోయె
నామె యనుచు నిషాదుల నడుగ, వారు
చెప్పి, రామె శంతనుఁ బెండ్లి చేసికొనుట. ౨౦౦

ఉ. వ్యాసునిఁ గాంచి దాశపతి స్వాగతవాక్య పురస్సరంబుగా
నాసన మిచ్చి పల్కెను గృతాంజలియై యిటు, నీదురాకచేఁ
జేసితి జన్మ సార్థకము, చేసితి వంశము పావన, మ్మదే
నో సెల విమ్ము రాక కిటు లున్న నిమిత్తము కూర్తు నోప్రభూ !

తే. వ్యాసుఁ డేమియుఁ గోరఁ బో కాదరించి
రమ్యము సరస్వతీనదీప్రాంతభూమి
నాశ్రమము చేసికొని తపం బాచరించె
శ్రవణపర్వంబుగా మాతృసౌఖ్యకథలు. ౨౦౧

## చిత్రాంగద విచిత్రవీర్యుల చరిత్రము

క. అమితద్యుతులై శంతను
నృపమణికి సత్యవతివలన నిరువురు తనయుల్
సముదితులై కొలిపిరి మురి
పెము చిత్రాంగద విచిత్ర వీర్యు లనంగన్. ౨౦౨

క. వారలు వీరులు శత్రువి
దారణులై వెలసి గాంగతనయుని భీష్మున్
జేరి కొలువ శంతనునృపుఁ
డేరి కసన్ నేరవయ్యె దేవగణములున్. ౨౦౩

తే. కొంతకున్ దివి కేఁగఁగా శంతనుండు
ప్రేతకార్యంబు లొనరించి, భీష్ముఁ డపుడు
రాజ్యపదవిఁ జిత్రాంగదుఁ బ్రాజ్యుఁ జేసి
తాను దేవవ్రతుం డనంగా నెసంగె. ౨౦౪

సీ. చిత్రాంగదుఁడు మత్తచిత్తుఁడై క్రూరతఁ
బరదుఃఖకరుఁ డయి పరగుచుండ
నొకనాఁడు మృగయామహోత్సాహియై వన్య
మృగములఁ వేటాడి మించి తిరుగ
నతనిఁ జిత్రాంగదుఁ డనెడు గంధర్వుండు
గాంచి కయ్యమునకుఁ గాలు ద్రవ్వ;
సదృశనాములు మఱి సదృశవీర్యులు వారు
చిత్రంబుగాఁ గురుక్షేత్రమందుఁ

శుభముహూర్త మొకటి చూచి తమ్ముని పెండ్లి
చేయనుండ, నందు జ్యేష్ఠకన్య, 202

## అంబోపాఖ్యానము

తే. అంబ ముగురిలోన నతిచారులోచన
యరసి తన వివాహ యత్నములను
సాళ్వపతికుమారు సందర్శనము చేసి
పలికె నిట్లు లజ్జ దలను వంచి. 203

ఉ. ఓకురువంశదీపక ! మహోజ్జ్వలకీర్తి ! సమస్తధర్మమూ
ర్తీ ! కరుణింపు నాపయి, వరించితి సాళ్వనృపాలు మున్న, ప్రే
మాకులుఁడై వరించె నను నాతఁడు, నే వృతపూర్వ నౌదు, ధ
ర్మాకలితుండు బల్లిదుఁడు నౌదు, రుచించినరీతిఁ జేయుమీ ! 204

శా. అంబావాక్యము లెల్ల గంగతనయుం డాలించి, విప్రేంద్రవా
రంబుం దల్చి సగౌరవమంత్రులను సంప్రశ్నించి వా రిచ్చు నా
జ్ఞం బాలించెడువాఁడునై వదలెఁ బూజావాక్యపూర్వంబుగా
నంబా! నీ మన సెట్లు వచ్చె నటు సేయం బొమ్మటంచుం గృపన్.

ఉ. శాంతనవుండు తన్నటు విసర్జితఁ జేయ యథేచ్ఛ సంతసం
బ్వాంతికభూమి కేగి, ప్రియురాలను నీ కని నిన్న భర్తగాఁ
జింతనచేయు టెల్లను వచించితి, భీష్మననుజ్ఞ నొంది నీ
చెంతకు వచ్చినాను, చెయి చేత గ్రహింపు మటంచు వేడఁగన్.

క. ప్రణయభరమ్మున మఱిమఱి
తను జూచుచు మరల వ్రీడఁ దల వంచుచు ని
ట్లను నాకలికికి సాళ్వుఁడు
మనమున నొక జాలి లేక మఱి యిటు పలికెన్. 205

తే. నిన్ను రాజులు నీతండ్రి నేనుఁ జూడఁ
గెల్చి చేకయి భీష్ముఁ డెక్కించె రథము;

నేఁ బరోచ్ఛిష్టకన్యపాణిం గొనంగ
నెట్టినే పొమ్ము మాతృరూపిణివ, యంబ! ౨౦౮

క. పలుకఁగ నిటు సాళ్వుం డా
లలన, కనుల జడులవలెను రాలఁగఁ గన్నీ,
రెలుఁ గెత్తి యేడ్చుచుం జని
నిలిచి పలికె నిట్లు భీష్మునికటస్థలిలో. ౨౦౯

తే. నేను నీచే విముక్తనైనాను గాన
నన్ను సాళ్వుండు గ్రహియింపకున్నవాఁడు;
దయను ధర్మజ్ఞ! గ్రహియింతఁ దగును నీవ,
కానిచో నేను మరణింతు, నూన మిదియ. ౨౧౦

ఆ. భీష్ముఁ డిట్లు పల్కె విను నిన్ను గ్రహియింప
నన్యచిత్త వగుట నర్హ మగునె?
నీవు తండ్రికడకు నిశ్చింతఁ బొమ్మన్నఁ
బోక వనికిఁ బోయి పూనెఁ దపము. ౨౧౧

సీ. కాశీపురాధీశకన్యల నిర్వుర
నంబికాంబాలికాఖ్యాత లైన
యతిరూప లావణ్యవతులఁ బెండిలి యాడి
విస్రబ్ధత విచిత్రవీర్యనృపుఁడు
గృహమున నుపవన క్రీడాగృహంబుల
నానావిహారవిధానుఁ డగుచు
వారలఁ గూడి మనోరమంబుగఁ దొమ్మి
దేండ్లకాలంబు రమించి మించి

రాజయక్ష్మంబుచే శరీరంబు విడువ
సత్యవతి పుత్రదుఃఖార్తిఁ బొగిలి పొగిలి,
యుత్తరక్రియ లైనంత నొక్కనాఁడు
పలికె నేకాంతమున భీష్ముఁ బిలిచి యిట్లు. ౨౧౧

క. పుత్త్రా! రాజ్యము గొనుమీ
పితార్జిత మిదియు నీకుఁ బ్రీతిన్ భ్రాతృ
క్షేత్రము గ్రహించి కను మొక
పుత్రకుని యయాతికులము పొంపిరివోవన్. ౨-౧౩

వ. భీష్ముం డి ట్లనెను. ౨-౧౪

క. ఇల్లిల నందు వెలుఁగవె,
తల్లీ! పితృర్థ మేను దాల్చినవ్రత, మే
నొల్లను రాజ్యము చేయఁగ,
నొల్లను దారను గ్రహించు, టొల్ల ననృతమున్. ౨-౧౫

## వ్యాసకృత భారతవంశోద్ధరణము

సీ. భీష్మునిసత్యవాక్ప్రస్తారము న్వాని
మారు మాటాడఁగా నేరనిదయి
దీర్ఘకాలము రాజు స్థిరపడకున్న రా
జ్య మరాజకంబై యశాంతి నొందు
నని వంతఁ గుందు సత్యవతి కుపాయంబు
భీష్ముఁడు మంత్రించెఁ బ్రీతి నిట్లు:
క్షేత్రజుఁ బుత్త్రు విచిత్రవీర్యునకు ను
త్పాదింప నాతనివధువులందు

సిద్ధునిఁ గులీను ద్విజు నియోగింపు మొగ్గు
కాదు, కులరక్ష కిది వేద చోదితంబ;
యట్టి నీపౌత్రునకు రాజ్య మప్పగింపు,
నేను తచ్ఛాసనంబ పాలించువాఁడ. ౨-౧౬

క. అనుడి విని నెను వెంటనె
కానీనుని నిజతనూజుఁ గదియింపఁ దలం,

పా నిముసమునన వ్యాసుఁడు
కానంగా నగుచుఁ దల్లికాళ్ళకు మ్రొక్కెన్. 227

సీ. ఆ మహాతేజు విగతధూమాగ్ని తేజుఁ
గాంచి భీష్ముండు భక్తి నర్చించెఁ; దల్లి
యాదరంబున వీక్షించి యనియె నిట్లు
సుందమందాక్షరముల ననిందితముగ. 228

క. భారతవంశవివర్ధన
భారేయత యెసఁగ భ్రాతృదారకు సుతుఁ జే
కూరుపు వడి నీతేజో
ధారణచే సుందరాంగుఁ, దండ్రీ! యనుచున్. 229

సీ. వ్యాసుఁడును మాతృవాక్యంబు లాలకించి
యాప్తవాక్యంబుగా నెంచి యాదరించి,
యోంకృతి యొనర్చి యట నిల్చె నొక్కకొంత
యంబికాఋతుకాల సమ్యఙ్నిరీక్ష. 230

క. మునిసంగంబున నంబిక
కనె నొక పుట్టంధుఁ బుత్రు ఘనదృఢగాత్రున్;
గని వాని సత్యవతి పె
ల్చన సంబాలికను బనిచె సంతతికోఱకై. 231

క. ఋతుకాలంబున మునిసం
గతి నామెకుఁ బాండుసుతుఁడు కలిగిన వగతో
నితఁడును నృపుఁ డగుట కన
మ్మతుఁ డని యంబికను బంచె మఱియొకయేటన్. 232

క. ఆ సత్యవతియు మగలన్
వ్యాసునిఁ బ్రార్థించి యామెఁ బంచిన, నది, లో
నీసునఁ, బోవక, ప్రేష్య
దాసిని వ్యాసాంతికమునకుఁ దాఁ బంపించెన్. 233

క. ఆమెకు ధర్మాంశ శుభ
శ్రీమహితుండు విదురుఁ డొదవె; స్థితమతి వ్యాసుం
డీమాడ్కి ధర్మమార్గా
రాముం డయి భరతవంశరక్షణ చేసెన్. ౨౩౫

ఇంద్రవజ్ర— కల్యాణ భూమా పరకాంతి సీమా!
కల్యాగతాఘాంధ్య వికర్తనశ్రీ!
కల్యప్రభావాఢ్య! జగద్గురు! శ్రీ
కల్యాణనామా! యతికాండ సోమా! ౨౩౬

గద్యము ఇది— జగద్గురు శ్రీ కల్యాణానందభారతీ స్వామి కరకమల
ప్రసాదాసాదిత శ్రీ కవిసమ్రాట్పట్టాభిషేకశ్రీక, హారితసగోత్ర
పవిత్ర, ఆపస్తంబసూత్ర, శ్రీ మహాలక్ష్మ్యంబా హనుమచ్ఛాస్త్రి
పుత్ర, వేంకటలక్ష్మీ నరసింహశాస్త్రి విజ్ఞానయోగ దర్పణ ప్రతి
బింబిత శ్రీదేవీభాగవతంబునందుఁ బ్రథమస్కంధము. ౨౩౭

*

*

శ్రీః

# శ్రీ దేవీ భాగవతము

## ద్వితీయ స్కంధము

శ్రీనారాయణ పద సం
మానిత ! నిజభక్తలోక మంగళకరణా !
నేనుత ! శ్రీకల్యాణక
నిగమ రహస్యభాష్య రచనా నిపుణా ! ౧

వ. అవధరింపుము, సూతునకు ఋషు లిట్లనిరి. ౨

### మత్స్యగంధ్యుత్పత్తి

క. నీవాక్యము లత్యాశ్చ
ర్యావహములు, మిగుల సందియం బయ్యెడి మా,
కేవిధి వ్యాసునిమాతను
చేవేరిగ శంతను నరదేవుఁడు గొనియెన్ ? ౩

క. ఏవిధమున సత్యవతికి
నావిర్భవ మందె మౌని వ్యాసుండు ! జగ
త్పావనుఁ డుభయుల జన్మక
థ[illegible] విస్తృతి వినుచు మాకు దమ[illegible] సుంతా ! ౪

వ. సూతుండిట్లనియె. ౫

ఉ. పరమమునీంద్రులార! యెద భావనచేసి నమస్కరించి యా
పరమ ననాదిశక్తి సురవందిత భక్తసమస్తకామనా
వరదను వాగ్భవాలయ, నవారణఁ జెప్పెద నాలకింపుఁడీ
యెఱుఁగఁ దలంచినట్టి శుభ మిద్ధ పురాణ కథా విధానముల్. ౬

చ. ఉపరిచరుండు నా విదితుఁ డుత్తమధార్మికుఁ డుండెఁ జేదిదే
శపతి మహాతపస్వి; సురశాసనుఁ డాతని కిచ్చె మెచ్చి యు
చ్చపుఁ బటికంపుఁదాజిగి నెసంగు విమాన మొకండు; దానిపై
నెపుడుఁ జరించుఁ దా నుపరి నెల్ల జగంబులఁ బూజ్యమానుఁడై. ౭

వ. అది కతంబుగా ధర్మనిత్యుం డగు నమ్మహీపతి యుపరిచరుం డను పేరఁ బరఁగె. అయ్యుపరిచరవసువునకు గిరిక యను నర్ధాంగియందు బృహద్రథుఁడు, మణివాహనుఁడు, సౌబలుఁడు, యదువు, రాజన్యుఁడు, నను నేవురు సుతు లుదయించిరి. వారలు నానారాజ్యంబులఁ దండ్రిచే నియుక్తులయి వంశకర్తలై వెలసిరి. ౮

మధ్యాక్కర — అతనికి నొకనాఁడు ధర్మపత్నియగు నాసాధ్వి గిరిక
ఋతుకాలసుస్నాత శుచియుఁ బుంసవనేచ్ఛ నెసంగఁ
బితరులు మృగములఁ దేర నానతిఁ జే వేటఁ బొమ్మన్నఁ
బితృవాక్యగౌరవం బెంచి యాతండు వేటకే పోయె. ౯

చ. అతఁ డటు లాదిసంబు మృగయారతిఁ బోయి వనాంతరంబునన్
ఋతుమతియైన యాత్మరమణీమణిశ్రీకరరూపమే సదా
మతిఁ దలపోయుచుండ నొకమాత్ర స్ఖలించినఁ జేజ, మందుఁడున్
వితథము కాకయుండ నిలిపెన్ వటపత్రపుటాంతరంబునన్. ౧౦

ఉ. అంత సమోఘవీర్యుఁ డగు నాతఁడు యోజన చేసి వారిఁ బ
ర్ణాంతరితార్ద్రసంపుటమునం దభిమంత్రణపూర్వకంబుగా,
నంతికభూమి నిల్చి నడయాడెడి శ్యేనముఁ బిల్చి దానిఁ జం
చ్వంతరమందు నుంచి యది యార్తవయౌ సతి కీయఁ బంపెన్.

క. అటు సను నా శ్యేనముఁ గని
పుట మామిష మనెడు భ్రాంతి పుట్టి గ్రసింపం
బటుదర్పితమై తాఁకెను
జటులగతి మఱొక్క పత్త్రి చను చడ్డంబై. ౧౨

క. అన్యోన్య నఖవిదారణ
నన్యోన్య గరుత్ప్రపీడ నాఘాతముచే
నన్యోన్య చంచువిదళన
జన్యం బయి శ్యేనయుగ్మజన్యం బెసఁగెన్. ౧౩

క. ఆ రెండు డేగ లటు దివిఁ
బోరంగా జాఱి పత్త్రపుటగత తేజ
స్సారము, క్రిందన్ యమునా
వారిం బడిపోయె నధిక భాసుర మగుచున్. ౧౪

ఉ. ఆ యమునానదీ శుభజలాంతరమం దొక బ్రాహ్మణుండు సం
ధ్యాయతనిష్ఠుఁడైనఁ గని, యచ్చర యద్రికనామ యాటకై
పోయి, జలాన వానిపదముం గ్రసియించిన, ధ్యానభంగరో
షాయితుఁడై శపించెను ఝషం బయి యుండఁగ దాని నమ్మెయిన్.

తే. శఫరియై యట్టు లద్రిక జలములందు
సంచరించుచు నా శ్యేనచంచుగళిత
వసునృపామోఘతేజంబు వడి గ్రహించి
గర్భము ధరించెఁ, బ్రసవించు కాల మయ్యె. ౧౫

ఉ. ఆ పెనుమీను చంచలరతాభతళత్తళకాంతి సూర్యక
న్యాపగమేఘనీలసలిలాంతరవీథి భ్రమింపఁ జూచి చూ
పోపఁగ జాలరుల్ వలల నొడ్డి చలంబునఁ బట్టి తెచ్చి యా
చేపను బ్రీతి నర్పణము చేసిరి కాన్కగ దాశభర్తకున్. ౧౬

తే. దాశరాజమహాసనాంతరమునందు
దానియుదరంబు వ్రయ్యఁ, జిత్రంబు గాఁగ

వెడలి రందుండి తేజు వెల్గెడి కుమారుఁ
డొకఁడుఁ గడు శుభాకార కన్యక యొకర్తు. ౧౮

క. అది యెఱిఁగి విస్మయంపడి
ముదమున దాశుఁడు, వారి భూమీపతి యై
పొదలు నుపరిచరవసుపతి
పదముల కర్పించె భక్తిభావముతోడన్. ౧౯

క. ఉపరిచరుండును వారల
విపరీతోద్భవచరిత్ర విస్మితుఁ డయి, దా
శపతికిఁ గన్య నొసంగి, త
నపుత్రునిఁగ నక్కుమారు ననువునఁ గొనియెన్. ౨౦

క. వసుపుత్రుం డగు నాతం
డెసఁగెను బితృతుల్యవీర్యుఁ డెంతయు రుచితో
నసదృశుఁ డయి ధార్మికుఁ డగు
వసుధేశుఁడు మత్స్యరాజ వరనాముఁడు నై. ౨౧

తే. వసుమహారాజుచే దాశపతికి దత్త
యైన కన్నియ నల్లని దగుటఁ గాళి
నా ఝషోదరి యనఁగ నన్వర్థసంజ్ఞ
మత్స్యగంధియు నా వర్ధమాన యయ్యె. ౨౨

వ. అన విని ఋషు లి ట్లనిరి. ౨౩

క. మఱి యద్రిక పాపం బ
ప్సరస మహానసమునందు సందారిత యై
తిరిగి నిజరూపమున భూ
సురశాపవిముక్తి నొంది చొచ్చెనొ దివమున్ ? ౨౪

వ. సూతుం డి ట్లనియె. ౨౫

క. చాపలకృత హాసక్రియ
శాపము ప్రాపించి యదియుఁ జకిత యగుచు సం
దీపిత సర్వాంగముతో
నా పారునిపదము పట్టి ప్రార్థన చేసెన్. ౨౬

క. సహజదయాపేశలుఁ డగు
మహాత్ముఁ డా విప్రవరుడు మతిఁ గరఁగి, శుగా
వహమై కుందకు మీనై
నహించి కవల మఱి ప్రకృతి వడయుదు వనియెన్. ౨౭

క. ఆవిధముగనే యద్రిక
యా విప్రామోఘవాక్యహతి మీనయి, య
ట్లావాసవయుగ్మముఁ గని
ద్యోవాసము దివ్యతనువు నొందెన్ మరలన్.  ౨౮

మ. అటులా యద్రికగర్భజాత యగు కన్యారత్నమున్ దాశరా
డుటజంబందుఁ బ్రవర్ధమాన యయి ప్రద్యోతించె నావిర్భవ
త్పటు నక్షోరుహ పుష్పమంజరులతోఁ బ్రత్యగ్రసర్వాంగ వి
స్ఫుట లావణ్య సుధా ప్రపూరములతోఁ బుష్పాప్తునస్త్రింబనన్.

## వ్యాస జననము

తే. ప్రాప్తయౌవన యయి తండ్రిపనుల నదియు
యామునతటంబునన్ సల్పు నప్పుడప్పు;
డొకనాఁడు పరాశరుం డుత్తమముని
యచోటు ప్రాపించెఁ దీర్థయాత్రాగతుఁ డయి. ౩౦

ఆ. యమున రేవునందు నశనంబు గుడిచెడి
దాశవిభునితోఁ బరాశరుండు
పలికె నిట్లు, నన్నుఁ బడవపైఁ గాళింది
యవలిరేవు జేర్పు మనుచుఁ బ్రీతి. ౩౧

తే. సంభ్రమంబున దాశుండు సవిధభూమి
మెలఁగు వాసవిఁ దనసుతఁ బిలిచి పలికె,
"లేమ! శుచిహాస! ధర్మాత్ముఁ డీమహాత్ముఁ
డడుగుఁ, బరపారముం జేర్పు ముడుపమునను. ౩౨

క. వడి నది పితృతాజ్ఞను ముని
నుడుపం బెక్కించి గడపుచుండ యమున నా
జడదారి దైవవశమునఁ
బడెఁ గామావర్తమందు బాలం గంచున్. ౩౩

క. శింజాన కంకణ ధ్వని
శింజినినాదంబు చేసి శ్రీసుతుఁ డేయన్
వ్యంజితయౌవనకుడిచే
యిం జోడించె వలకేల నెలమిన్ మునియున్. ౩౪

శా. కామార్తుం డగు హానిఁ గాంచి పలికెం గంజాక్షి లేనవ్వుతో
నోహానీంద్ర! వసిష్ఠపౌత్రుఁడవు నెంతో ధర్మశీలుండ వో
దీమాడ్కిన్ ఝషగంధదేహ నగు నన్నేలా చేయిం బట్టె దో
హో మందాత్ముఁడువోలె, నన్యాయమునే నొక్కింత యూహింపనో!

క. అయ్యో! నినుఁ గా దన భయ
మయ్యెడి, నిసుమంత యోర్చు మద్దరి జనుదాఁ
కయ్యా! యని వేఁడిన ముని
యయ్యెడఁ దత్కరము వదలి యద్దరిఁ జేరెన్. ౩౫

తే. అట్లు దరిఁ జేరి తద్దయు నామునీంద్రుఁ
డాఁగ కా మత్స్యగంధఁ గామాతురుఁ డయి
పట్టఁ బోవఁగ నిలు నెల్ల వడఁక నదియు
ననియె నిట్లని సమ్ముఖుం డయిన మునికి. ౩౬

క. స్వామీ! మీనొప్పల వలచెడి
నామే నిది, నీది దివ్య నవ్య సురభిళం;

శామోదకారణం బగుఁ
గామంబు సమానరూపకలితుల కెందున్! ౩౮

ఉ. ఆ వచనంబులన్ విని క్షణాంతరమందుఁ బరాశరుండు శ్యా
మానపువున్ మనోజ్ఞసుషమప్రభమై మృగనాభిఘుంఘుమం
బౌ వల పెల్లదిక్కుల నవాప్తిగ యోజనగంధిఁ జేసి కై
కై వడిఁ గీల్పఁ జూడ, నది కప్రపుఁబల్కులఁ బల్కె నీగతిన్ ౩౯

క. దేవా! బయ లిట, నావిత
యూసలిదరినుండి చూచు నదె, పవ లిది సు,
మ్మావంత యోర్చి నిశకై
నీ వుండు, దివారతంబు నింద్యము కాదే? ౪౦

తే. సత్యవతియోగ్యవాక్కుల సంతసించి
యాత్మమహిమంబుచే నిమేషాంతరమున,
సందు నిగుడఁ గల్పించి నీహారతమము,
పిలిచె మఱి దాని ముని తనప్రియము దీర్ప. ౪౧

చ. అది మృదుమందవాక్యముల సంతట నిట్లు వచించె, నోకృపా
సదమల! నేను కన్యకను; సత్య మమోఘమహాశుభప్రభా
స్పదుఁడవు నీవు, న న్మొద మెసంగ భుజించి యథేచ్ఛఁ బోదు, నా
కెది గతి యాను గర్భము ధరించినఁ, దండ్రికి నే మనంగ నౌ?

వ. పరాశరుం డి ట్లనియె. ౪౩

క. చారుదతి! నాకుఁ బ్రియముం
గూరిచి కన్యావ్రతంబు కోల్పోవుసుమీ!
భీరు! మ ఱెయ్యది వలతువో,
కోరుకొనుము వాంఛితమ్ము గూర్చెదఁ బ్రీతిన్. ౪౪

ఉ. మానిని పల్కె, నీపదసమర్పిత మైన మదీయమాన మె
ట్లేనియుఁ దల్లిదండ్రు లొకయింత యెఱుంగకయుండ, నాకుఁ గ

న్యానియమంబు నీఁగక భవాదృశపుత్త్రుఁడు గల్గునట్లు, నా
కీ నవసౌరభంబు, వయ సెప్పుడు నిల్వ, ననుగ్రహింపవే. ౪౫

వ. పరాశరుం డి ట్లనియె. ౪౬

క. సుందరి! తథాస్తు నీకున్
నందనుఁ డుదయించి యిపుడ నావలనన, గో
విందునియంశమునఁ, ద్రిలో
కిం దెల్లము సేయుఁ దనదుకీర్తిని శుచియై. ౪౭

ఉ. ఓవరగాత్రి! మున్ను కనియుంటి ననేకల దివ్యరూపరే
ఖావిలసత్స్వరాంగనలఁ, గాని యొకప్పు డెఱుంగ లౌల్యమున్;
దైవవశంబుచేతఁ బ్రకృతమ్మున వైష్ణవతేజ మూని సం
భావితమై వెలుంగ నిను బాల! వరించితిఁ దత్ప్రసూతికిన్. ౪౮

క. నీవుం జాలరిదానవు
కా వచ్చర కన్న వసువుకన్యవు, త్రిజగ
త్పావనుని వేదవిభజన
గావించు పురాణకర్తఁ గాంచెదు సుతుఁగా. ౪౯

వ. సూతుం డి ట్లనియె. ౫౦

తే. సత్యవతి యీకోన మహాప్రసాద మనుచు
దానివశమున విష్ణుసత్త్వంబుఁ గూర్చి,
స్నాతుఁడై వడిఁ గాళిందిజలములందు
రాణఁ దనయిచ్చ నేగెఁ బరాశరుండు. ౫౧

ఉ. ఆ యమునాంతరీపమున నప్పుడ గర్భము దాల్చి కామదే
వాయితదేహు బాలకుని వాసవియుం బ్రభవించె, వాఁడు శీ
ఘ్రాయతిమైఁ బ్రవృద్ధిఁ గని, యాత్మ తపోరతినిష్ఠమైన, దం
డాయితుఁడై నమస్కృతి యొనర్చి వచించెను దల్లి కిమ్మెయిన్.

తే. అమ్మ! సెలవిమ్ము నాకుఁ దపమ్ము సేయఁ
బోయెద, మఱెప్పు డవసరం బాయె, నన్నుఁ
దలఁపు, మప్పుడ నీకుఁ బ్రత్యక్ష మౌదు,
స్వస్తి కావుత మని పల్కి చనె యథేచ్ఛ. ౫౩

తే. అదియుఁ బొంగుచు నానాఁటి యద్భుతములు
మననసేయుచు వైష్ణవమాయ గాఁగఁ,
గమ్మ కస్తురితావులు చిమ్మ రమ్య
తనువిలాసమ్ముతోఁ జేరెఁ దండ్రికడకు. ౫౪

క. ద్వీపన్యస్తుం డగుటను
ద్వైపాయనుఁ డనఁగఁ బరగి బాలుఁడు కృష్ణాం
శాపత్తి నాశువర్ణన
దీపితదేహంబుతోడ దిశల వెలింగెన్. ౫౫

క. అతఁడున్ బహుతీర్థంబులఁ
గృతావగాహుఁ డయి శ్రద్ధఁ గెరలి తపమునన్
శ్రుతివిభజన వ్యాసపదాం
చితుఁడై జయకృతిఁ బురాణ నివహముఁ గూర్చెన్. ౫౬

సీ. భాగించి వేదముల్ పైలు వైశంపాయ
నుని జైమిని సుమంతుఁ డనెడువాని
నసితుసి దేవలు నాత్మజుం డగు శుకు
నధ్యాపన మొసర్చునట్లు పంచి
ద్వాపరాంతంబున ద్వైపాయనుం డిట్లు
వేదరక్షణ చేసి వినుతి కెక్కె;
సత్యవతీజన్మ చరితంబు వ్యాసుని
జనన పుణ్యాఖ్యానమును బఠించు

నరుఁడు పాపవిముక్తుండుఁ బరుఁడు నగును,
ఘనులు కారణజన్ములు ననఘు, లట్టి

వారిచరితల దొసఁగు లెప్పాట రావు,
సత్యవతి మఱి పెండ్లాడె శంతను నృపు. ౫౭

**గంగాశాపవృత్తాంతము**

వ. ఋషు లి ట్లనిరి. ౫౮

క. ఆనందతుందిలములై
మానసములు పొంగె విన్న మానితకథలన్,
కాని, మఱి సంశయమ్ములు
పూని విడువకున్న వవియుఁ బోఁ దెలుపు దయన్. ౫౯

సీ. వ్యాసునిమాత సత్యవతీశుభాఖ్యాత,
శంతనుపతి కెట్లు కాంత యయ్యెఁ?
పౌరవుండు స్వధర్మపరుఁ డెట్లు వరియించెఁ
గులహీనను నిషాది లలనఁ గాఁగ?
శంతనుని ప్రథమసతి యెవ్వ? రామెచే
వసువంశమున భీష్ముఁ బడసె నెట్లు?
భీష్ముండు జ్యేష్ఠుండు వీరుండు ధర్మిష్ఠుఁ
డుండఁగాఁ జిత్రాంగదుండు నృపుఁ

తమ్ముఁడు విచిత్రవీర్యుఁడు ధరణిఁ గొను ట
దేల? పిమ్మట నే నట్లు గోళకులను
గోరు టది యేల? భీష్ముం డపారతేజుఁ
డేటికి వివాహమున కిచ్ఛయింపఁడయ్యె? ౬౦

ఆ. బహుజుగుప్సితంబు పరదార నెనయుట,
యందు భ్రాతృభార్య నందు టధమ,
మట్టి దెట్లు చేసె వ్యాసుండు వేదవే
దాంతవేత్త శుచినితాంతమూర్తి? ౬౧

వ. సూతుం డి ట్లనియె. ౬౨

ఉ. ఆకథలన్ వినుండు మునులార! మహాభిషసార్వభౌముఁ డై
క్ష్వాకుఁడు వాజపేయశతకంబును వేలుగ నశ్వమేధముల్
వీఁక యజించి ధర్మపదవిన్ బరిపాలన చేసి ధాత్రి య
స్తోక మొనర్చి, శక్రపరితోషము, పొందె సువర్గసౌఖ్యముల్. ౬౩

చ. అతఁ డొకనాఁడు బ్రహ్మసదనాంతరభూమికిఁ బూజకై సుర
ప్రతతిని గూడి పోయె, నట వచ్చెను గంగయు, నప్పు డందు మా
రుతవశమై తొలంగిన మరుద్ధునియంబర, మెల్ల రందు స
న్నతముఖు లైరి చూడ కటు నగ్న, మహాభిషుఁ డొక్కఁడున్ వినా. ౬౪

ఉ. ప్రేమముతో వియన్నదిశరీరవిలోకనలోలుఁ డైన వాఁ
డా మహితాత్మబుద్ధి తనయం దనులగ్నముగా నెఱింగి గం
గామహిళాలలామయు నికామగతిం బ్రతిదృష్టి వానిక
మ్రామలకాంతిమూర్తి ననురక్తమతిం దిలకింప సాగినన్. ౬౫

క. కామవిమోహితులై వా
రామాడ్కిన్ లజ్జ వీడి యరసిన, నలుకన్
భూమిం బుట్టుఁ డటంచును
దామరసోద్భవుఁడు వారి తద్ద శపించెన్. ౬౬

చ. విధిసమవాప్తశాపుఁ డయి వీరుఁ డతం డిల ధర్మనిష్ఠుఁ డే
బుధమణి నాకుఁ దండ్రి యయి పొల్పెసలారఁగ నప్పుఁ డెంచు ని
ర్మథన మొనర్చి, పౌరవకులప్రభవిష్ణుఁ బ్రతీపుఁ దండ్రిగాఁ
బ్రథితమతిన్ వరించెను గరం బనురక్తి మహాభిషుండునున్. ౬౭

క. ఆసమయమునన వసువులు
స్త్రీసముపేతులు యథేచ్ఛఁ గ్రీడించుచు వి
చ్చేసిరి వసిష్ఠునాశ్రమ
భూసముపాంతమున, కట్లు పోవుచు వారల్. ౬౮

తే. పృథువు మొదలగు నవ్వసుశ్రేష్ఠులందు
వెలయు ద్యోనాముఁ డుత్తముఁ డలఘుమహిముఁ,

డతని పత్ని విలోకించె నందుఁ దిరుగు
నందినీధేనువును గనువిందు గాఁగ. ౧౯

క. ఈనైచికి యెవ్వరి దని
వానిం బ్రశ్నింప నదియు, వాఁ డి ట్లనె, నీ
ధేనువు వసిష్ఠునిది, పా
లానిన యౌవనము గల్గు నయుతాయువుతోన్. ౨౦

మ. అది యా సుందరి యాలకించి ముకిపెం బావిర్భవింపంగఁ బ
ల్కెఁ, దనర్చున్ భువిలో నుశీనరునిపుత్రీరత్న మస్మత్సఖీ
పదనిర్వర్ణిత, దాని కీ మొదవు గోవత్సంబుతో సర్వకా
మద నర్పింతు జరారుజల్ చెనకకుండన్; దాని వేఁ డెమ్మనెన్. ౨౧

క. ఆ వనితాప్రేరణచే
ద్యోవసు వసుఁగులను గూడి దొంగిలె నైశం
బావంతయుఁ గొంకక ముని
దేవుఁ దాంతునిగ నెంచి ధేనువుఁ దరపిన్. ౨౨

ఉ. ఆ మునినాథుఁ డంతట నిజాశ్రమభూమికి వచ్చి యచ్చటన్
హోమపుసౌరభేయి నయనోత్సవకారిణి లేఁగతోఁ గనన్
రామికిఁ జింత నొంది గహనమ్ములలో గిరిగహ్వరంబులన్
భ్రామిలి రోసి రం డనుచుఁ బల్మరుఁ జీరియు వ్యర్థయత్నుఁడై. ౨౩

క. ధేనువు రామికిఁ గతమున్
ధ్యానించి యెకింత, యెఱిఁగి యతికుపితుండై
మౌని శపించెను, త న్నవ
మానించుట వసువు లెల్ల మనుజులు గాఁగన్. ౨౪

చ. వసువు లెఱింగి కంపిలుచు వచ్చి వసిష్ఠుని మ్రొక్కి దీనమా
నసు లయి యావు నిచ్చి శరణం బని వేఁడఁ బ్రసన్నుఁడై యతం
డొసఁగెను శాపమోక్షణ మొకొక్క శరత్తున వారికెల్ల ద్యో
వసు వొకరుండు మానుషభవంబున దీర్ఘము నిల్చునట్లుగా. ౨౫

తే. శప్తులై యట్లు వసువులు చనుచుఁ జింత,
శప్త యయి బలుచింతతోఁ జనెడి దేవ
గంగను సరిన్మతల్లి మార్గమునఁ గాంచి
పల్కి రిట్లని వారలు ప్రణతు లగుచు. ౭౬

ఉ. తల్లి! దురంతచింత మముఁ ద్రచ్చెడిఁ బ్రాకృతయోని నెట్లు వ
ర్తిల్లఁగ నౌ సుధాశనవరేణ్యుల మే మని, కాన నీవు మా
తల్లివి గమ్ము, శంతనునృతల్లజుఁ బొందుము, పుట్టినంత మ
మ్మెల్లర వేగ నీటఁ బడ నేయుము శాపవిమోక్షణంబుగా. ౭౭

తే. గంగ యియ్యకొనంగఁ దలంగి చింత,
చనిరి వసువులు తమలోకమునకు మరలి,
యరిగెఁ జింతతో గంగ, మహాభిషుండు
జన్మమునకై ప్రతీపబీజమునఁ జేరె. ౭౮

క. ఒకనాఁడు ప్రతీపనృపా
లకుఁడు త్రిపథగాతటమునఁ బ్రధ్యాతసహా
స్రకిరణుఁడై యుండం గాం
గ కమల భంగములపై నకస్మాద్గతయై. ౭౯

క. అంగన వరవర్ణిని విమ
లాంగఁ బ్రతీపనృపదక్షిణాంకతలారూ
ఢం గాంచి, దాని నటు సే
యం గత మే మంచు విస్మయంపడి యడిగెన్. ౮౦

ఆ. ఆ ప్రతీపుప్రశ్న మాలించి యది పల్కెఁ
గురుకులేశ! నిన్నుఁ గోరుచుంటి,
నను గ్రహింపు మన్న నవయౌవనాంగను
దానిఁ గాంచి పల్కె నా నృపుండు. ౮౧

శా. ఓ కల్యాణి! పరాంగనాగమన మే నొక్కప్పుడుం బూన, నం
తే కా కింకొక ధర్మముల్ విను మపత్యేష్ట స్నుషాస్థాన మా

నీ కుర్వ్యాక్కోలితి కానఁ గోడలివి కమ్మా, నీదుభాగ్యంబుచే
నాకాంక్షించెడి పుత్రునిం బడయుపుణ్యంబుల్ లభింపం దగున్. ౮౨

క. ఆ దివ్యాంగన యది యా
మోదించి యథేచ్ఛఁ జనిన, భూపుఁడు తన ప్రా
సాదంబును జేరెను లో
లోఁ దద్వ్యథ మెంచి పుత్రిలోలుపుఁ డగుచున్. ౮౩

ఉ. అంతటఁ గొంతకాలమున కాతఁడు పుత్రునిఁ గాంచి తా నర
ణ్యాంతరభూమికిం దపసియై చనుచున్ సుతుఁ బిల్చి పూర్వవృ
త్తాంతముఁ దెల్పి, యొక్క శుచిహాసిని నిన్ను వరించు, దాని నొ
క్కింతయుఁ బ్రశ్న సేయక గ్రహింపుము కూయుచుధర్మపత్నిగా. ౮౪

తే. అంచుఁ బుత్రుని శాసించి, యఖిలరాజ్య
రమయు నాతని కిచ్చి, విరక్తుఁ డగుచు
వనమునఁ బరాంబికాధ్యానవశత నిల్చి
దేహము త్యజించి దివి కేగె దివ్యదీప్తి. ౮౫

క. ఆతనిపుత్రుఁడు నిజపితృ
పైతామహమైన సార్వభౌమికరాజ్య
శ్రీశోఁ బాలించెఁ బ్రజం
బ్రాతగ శంతనుఁడు ధర్మదండుం డగుచున్. ౮౬

## గాంగేయోత్పత్తి

క. శంతనుఁ డొకతఱి గంగా
ప్రాంతాటవి వ్యాఘ్ర ఖడ్గ భల్లూక మృగా
క్రాంతిని వేటాడుచు నటఁ
గాంతను మృగశాబనేత్రఁ గాంతం గాంచెన్. ౮౭

సీ. చూచినంతన దానిఁ, దోఁచెను దండ్రిచే
నిర్దిష్టయైన దీ నెలఁత యనుచు,

సాక్షా న్మహాలక్ష్మి సాకార మైనట్లు
తోఁచు నానాతినిఁ జూచి చూచి,
యెంతకుఁ దని వంద కెల్లదేహంబున
హార్ద కంచుకిత రోమాంచుఁ డయిన
నతని లక్షించి మహాభిషుం డితఁ డని
నదియు శంతనునిఁ బ్రేమాన్విత యయి
కాంచి చిఱునవ్వుతో నంతికంబుఁ జేరఁ
బ్రీతమానసుఁడై రాజు నాతిఁ జూచి
ప్రణయమున నార్ద్రమగు కంఠరవముతోడ
మృదుమధురవాక్యములఁ బల్కరించె నిట్లు. ౭౭

క. నీ వెవతెవో దేవాంగన
వో విద్యాధరివో భుజగయువతివో మర్త్య
స్త్రీవో, గంధర్వివో, నా
దేవేరివి గమ్ము; నిన్నిదే ప్రార్థింతున్. ౭౮

తే. గంగగా నతఁ డెఱుఁగఁడు గాని దాని,
యది యెఱుంగు మహాభిషుం డనుచు వానిఁ,
దలఁచి వసువులప్రార్థనఁ బలికె నదియు
స్మితరుచుల్ ముఖసీమపైఁ జిందు వోంద. ౮౦

ఉ. రాజ! ప్రతీపుపుత్త్రుఁడవు భ్రాజితకీర్తివి నిన్ను బోంటి నీ
రేజశుభాస్య యెవ్వతె వరింపదు? నే నెది చేసినన్ శివం
బేఁ జెడు గైనఁ గా దనుచు నెన్నఁడు నప్రియ మాడవేని నీ
తోఁ జెలిమిన్ నయింతుఁ, బరితోషముగా నిటు బాస చేసెదే? ౮౧

క. దానికి నతఁ డియ్యకొనన్
వానినిఁ బతిగా గ్రహించి స్వర్వాహినియున్
మానుషరూపముఁ దాలిచి
యా నృపుమందిరముఁ జేరె నాత్మేశ్వరియై. ౮౨

శా. గంగాసంగతి శంతనుం, డతనిసాంగత్యంబునన్ గంగ, పొం
గంగాఁ గేళి రమించి రిర్వురు నభంగప్రౌఢిఁ, బౌలోమితో
డం గీర్వాణవిభుండు, శ్రీవనితతోడం గృష్ణ దేవుండుఁ బో
లెం, గంగాంగనఁ గూడి భూపుఁ డెఱుగన్ లేఁడయ్యెఁ బెక్కబ్దముల్.

తే. గంగ గర్భిణి యయి కొంతకాలమునకు
వసువు సుతునిఁగాఁ గని తనప్రతిన నెంచి
పుట్టినంతన పాల్గారు బుడుత నామె
పొంగి పాఱెడి గంగమ్మ పొట్టఁ బెట్టె. ౧౪

తే. అట్లు రెండవమాఱు మూఁ డయిన మాఱు
నాలుగవ మాఱు నైదైన యట్టిమాఱు
నాఱగున్మాఱు మఱియు నేడైనమాఱు
ముంచె వారిఁ బుట్టినవారిఁ బుట్టినట్లు. ౧౫

తే. అది మఱియును నంతర్వత్ని యయిన, రాజు
తీవ్రముగ దీర్ఘముగను జింతించె నిట్లు,
లేమి సేయుదు? నావంశ మేవిధాన
సుస్థిరం బగు నిది యిట్లు సుతులఁ జంప? ౧౬

క. ఈ పాపిష్ఠ హరించెను
పాపల నేడ్వురను వరుస, వారించిన చో
రేపే చను, వారిత కా
కీ పర్యాయమును జరుపు, నేది విధి? యంచున్. ౧౭

తే. దీక్షితుం డయ్యెఁ దుది వంశరక్షణమున,
నంతఁ గాలక్రమమ పుట్టె నష్టముఁ డగు
వసువు ద్యోనాముఁ, డాతఁ డెవ్వాఁడు మున్ను
స్త్రీజితుండు హరించె వసిష్ఠు మొదవు. ౧౮

క. జనియించిన యాబాలునిఁ
గనుచునె శంతనుఁడు కాంతకార్శ్యం బడి యి

ట్లనె, నీదాసుఁడఁ బ్రార్థిం
తును, బుత్త్రుని వీనిఁ గరుణతో నా కిమ్మా! ౯౯

క. అయ్యో! ముంచితి వేద్వర
నియ్యర్భకు బ్రదుక ని, మ్మిఁ కే మడిగిన నీ
కయ్యది కూర్చెద, వంశము
శ్రేయ్యాక కావు, ప్రజ లేక త్రిదివం బున్నే? ౧౦౦

ఆ. అట్లు వేఁడుచున్న నాతన్ని వినకుండఁ
బుత్త్రిఁ గొంచుఁ బోవఁ బూనియుండ,
దుఃఖజాత కోప ధూమ్రాక్షరముల రా
జనియె నపుడు దాని కడ్డ మగుచు. ౧౦౧

ఉ. ఓసి పిశాచి! రక్కసి వటోసి? యొకింతయుఁ బాపభీతి లే
కీసరణిన్ వధించితివ యేద్వరఁ బాపల, నీ వె ఱుగితే
నీ సరి పొమ్ము, వంశము హరించెడి నీవెడపొత్తు లేల? నిం
దీసుతు నుంచు, మీవు జనియించిన యిల్లది యెంత దుష్టమో!

తే. ఇట్లు వచియించువిభుని గణింప కదియు
శిశుఁ గుమారుని సందిటఁ జేర్చికొంచు
నవుగుచున్ రోషతామ్రనేత్రాంత యగుచుఁ
బల్కె ని ట్లని వానికిఁ బ్రతివచనము. ౧౦౩

సీ. సమభయంగం బయ్యెఁ జనుచుంటి నీపుత్త్రిఁ
బాలించి పెంచెడివాంఛ కలదు,
దేవకార్యము దీర్ప దివినుండి దిగిన ది
వ్యాపగం గా నన్ను నరయురాజ!
మానుషజన్మంబు పూని వసిష్ఠుచే
శప్తులై వసువులు చనుచుఁ జింత,
జననివి క మ్మని నను వేఁడ నూకొంటిఁ,
బుత్త్రిలు వసువులు పుట్టి నీకు

మున్న యేడ్వురు శాపవిముక్తు లైరి;
వసువు వీఁడు మహాత్ముండు వయసు వచ్చు
వఱకుఁ బోషించి నీ కిత్తు భయము వలవ,
దేగెదను నన్ను నీవు వరించి నెడల. ౧౦౪

క. గంగయు శంతనుతో నీ
భంగిం బలుకుచు నె వెంట బాలకుఁ గొని చూ
డంగా రాక యరుగ రా
జుం గాంతా పుత్త్ర విరహ శోకార్తిం బడెన్. ౧౦౫

ఉ. అంతటఁ గొంతకాలమున కా విభుఁడున్ మృగయావినోదవి
శ్రాంతి వనాంతరంబున మృగంబుల నేయుచుఁ బోయి పోయి గం
గాంతికభూమిఁ జేరి తిరుగాడుచు నచ్చటఁ జిత్రమై సమీ
పాంతరమాత్రఁ గాంచె నమరాపగనీరము సన్నగిల్లుటన్. ౧౦౬

క. శర మబ్బురపడి దిక్కులు
పరికింపఁగఁ గానఁబడియె బహుమార్గణముల్
పరపించు మహాచాపుఁడు
పరమాద్భుతకర కుమారవరుఁ డొకఁ డచటన్. ౧౦౭

తే. అవని భరియింపరాని గంగాంబువేగ
మాత్మ లఘుహస్తతా విముక్తాంబకముల
సేతువునఁబోలెఁ గట్టు నా చిన్నవానిఁ
గాంచి, నా సుతుఁ డగునో యటంచు నెంచె. ౧౦౮

క. రారా! యెవరికుమారుఁడ
వోరీ నీ వనుచుఁ జీరుచుండెడు నెడలో
మాటాడక బాలుఁడు శ్రీ
దారతిఁ బాఱుచు నె కన్ను బ్రోముచుఁ జనియెన్. ౧౦౯

క. భూపుం డా కొమరుని నిజ
రూపం బెఱుఁగం దలంచి ధ్రువమతియై గం

గాపగఁ దలఁపఁగ వెనుకటి
రూపము గొని నిల్చె నెదుర రుచిరాకృతియై. ౧౧౦

తే. గంగ! చెప్పవే యిప్పుడు నేఁ గన్న బాలుఁ
డెవ్వని కుమారుఁడో, చూపవే మదీయ
పుత్త్రికుని నంచు శంతనుభూభుజుండు
వేఁడ సంప్రీతి గంగ మాటాడె నిట్లు. ౧౧౧

సీ. ఇడుగో భవత్పుత్త్రుఁ డీతఁ డష్టమవసు,
వితని రక్షించితి నిద్ధతేజు,
గాంగేయుఁ డితఁడు నీ కరమునం దుంచితిఁ,
గులకీర్తికరుఁ డయి వెలయుఁ గరము,
వేదజాలము, ధనుర్వేదంబు సర్వంబు
నభ్యసించెను వసిష్ఠాశ్రమమున,
జామదగ్న్యుఁ డెఱుంగఁ జాలె నే విద్యల
నవి యెల్ల నీ బాలుఁ డభ్యసించె;

వీఁడు సర్వార్థ కుశల పవిత్రమూర్తి;
కొని సుఖం బుండు రాజేంద్ర! కొడుకుఁ గూడి;
యనుచు సుతు నిచ్చి తా మాయమయ్యె గంగ,
శంతనుఁడుఁ దోఁగెఁ బరమహా సౌఖ్యవార్ధి. ౧౧౨

ఆ. పుత్రుఁ గౌఁగిలించి మూర్ధంబు మూర్కొని
రథమునందు నాదరమున నుంచి
హస్తినాపురంబు నతిరయంబునఁ జేర్చి
యొనరఁ జేసె నట మహోత్సవమ్ము. ౧౧౩

మధ్యాక్కర — దైవజ్ఞునిం బిల్చి యతని శుభముహూర్తంబు ప్రశ్నించి
రావించి సచివులఁ బ్రజల నెల్లరఁ బ్రముఖుల శుభుల
యౌవరాజ్యమున గాంగేయు శంతనుం డభిషిక్తుఁ జేసి
తా విస్మరించెను గంగ, గుణశాలిఁ దనయునిఁ గంచు. ౧౧౪

క. గంగావతరణకథయున్
గాంగేయాది వసు జన్మకథలును విన్నన్,
గ్రుంగును పాపము, సిరి యు
ప్పొంగును, జెప్పితిని వ్యాసముఖసముదితముల్. ౧౧౪

**స త్య వ తి ని శం త నుఁ డు పెం డ్లా డు ట.**

వ. ఋషు లి ట్లనిరి. ౧౧౫

క. గంగా వసు చరితంబులు
గాంగేయోత్పత్తికథయుఁ గడు మే, లే లీ
లం గంధవతిని దాశసు
తం గాంతగ శంతనుపతి తా గ్రహియించెన్? ౧౧౬

వ. సూతుం డి ట్లనియె. ౧౧౭

తే. ఆ కుమారునిఁ బ్రాపించి హరుఁడు వోలెఁ
దనకుమారునిఁ గూడి శంతనుఁడు గూడ
నలరె నాలు గేఁడులు మృగయావినోద
పరత, రాజర్షి హస్తినాపురవిభుండు. ౧౧౮

మ. ఒకనాఁ డాతఁడు బాణపాతన నరణ్యోర్వీన్ వరాహంబులన్
వృకసంఘంబుల ఖడ్గభల్లుకములన్ జెండాడుచుం బోయి పో
యి కళిందాత్మజతీరభూమిని యదృచ్ఛాచారతిప్రాప్తుఁడై
ముకుద్రోణమ్ములఁ గ్రోలె దివ్య సుపిమామోదం బపూర్వం బెదో.

మ. అది కస్తూరిది కాదు, సాంకుమదమేనీ గాదు, మందారజా
తిది కానోపదు, మాలతీ వకుళ జాతీ జాతియుం గాఁగఁ దోఁ
పదు, మల్లీసుమ కేతకీదళ సముత్పన్నంబు కా; దైన నీ
హృదయాహ్లాది సమస్తగంధభర ధౌరేయంబుగాఁ బొల్చెడిన్.

ఉ. ఎన్నఁడు నిట్టిగంధము వహించినవాయువు మున్ను వీవఁగాఁ
గన్నది లేదు, క్రొత్త యయి ఘ్రాణవిమోహక మయ్యె; నెందు ను

త్పన్న మగుం గనుంగొనియెదం జని, నే నని శంతనుండు వా
తోన్నయనానుసారి యయి యొయ్యనఁ గానన మెల్లఁ గ్రుమ్మరెన్.

ఉ. క్రుమ్మరువాఁడు కాంచె నొకకోమలి నా యమునాతటమ్ము ప్రాం
తమ్మున మాసినట్టి వసనమ్ము ధరించి, విభూషణాళి శూ
న్యమ్మయినన్ నిసర్గ సకలాంగ మనోహర చారురూప న
వ్య మ్మగు యౌవన మ్మతిశయమ్మున కి మ్మగు కొమ్మ నిమ్ముగా.

క. ఈగంధము నిశ్చయముగ
నీ గుబ్బమిటారిమేనిదే యగు; నిదియున్
నాగాంగనయో సురసతి
యో గంధర్వియొ మనుష్యయోషయొ తెలుపన్ ! ౧౨౪

క. ఎవ్వతె యగు మఱి యిది ? యి
ట్లివ్వనమున నుండ నేల ? నెటనుండి యిచో
నెవ్విధి వచ్చెనో యని బల్
దవ్వుగఁ జింతించి రాజుదరిఁ గనఁ డాయెన్. ౧౨౫

తే. కామవశగతుఁడై యాతఁ డామెఁ గాంచి
యెడఁదలో గంగనే స్మరియించుకొనుచుఁ
దటమునం దున్న యా చిన్నదాని నిట్లు
పృచ్ఛ చేసె సందేహనివృత్తికొఱకు. ౧౨౬

ఉ. ఎవ్వతవే ప్రియాకృతివి , యెవ్వరిపుత్రిక వౌదు ! వెందుకై
యివ్వననిర్జనస్థలిని నిట్లు చరించెద వొంటి ? బాల ! నీ
వివ్వఱకే వివాహితవొ యేమొ వచింపవె, నిన్నుఁ జూడఁ గాల్
గ్రువ్వు మరుండు పైని నిదిగో, యెట కేగెద; వేమి సేసెదే ! ౧౨౭

తే. అట్లు ప్రశ్నపరంపర లడుగు నృపున
కంబుజేక్షణ బదులు మాటాడె నిట్లు
మోమునం దళు కొత్తు లేమొలకనవ్వు
కౌముదులు దంతకౌముదీకాంతి నెనయు. ౧౨౮

ఉ. ఓ నృపమౌళి! దాశపతి యోమెడి పుత్రుని; కన్యనౌదు నీ
స్థానమునన్ జలానఁ బితృశాసన మూని తరిన్ వహించి యు
న్నా నిదె యాత్మధర్మ మని; నాపిత యిప్పుడ యింటి కేగె; నీ
యాన నిజంబు తెల్పితి నటంచు వచించి, ధరించె మౌనమున్.

క. కామాతురుఁడై శంతను
భూమీపతి పల్కెఁ; నన్నుఁ బొలఁతీ! పతిగాఁ
గామింపుము, కురునాథుఁడ,
లేమా! తారుణ్యకలిక వృథ కాకుండన్. ౧౩౦

మ. మృగశాబాక్షి! మదీయమానసము నీ శ్రీరూప మీక్షించినా
దిగ స్వాయత్తము గాక యున్నది, యపత్నీకుండ నే నిప్పు, డిం
పుగఁ గైకొందును ధర్మపత్నిగ నినుం బూజావిశేషానుపూ
ర్వగ దాసుండును బోలె నీవశత వర్తింతున్ సరే యందువా! ౧౩౧

క. అమృతాస్వాదరసం బటు
రమణీయము లతనినుడుల శ్రవములు తనియన్
బ్రమదంబున సాత్త్వికభా
వము పొడమఁగ ధృతి వహించి పలికె నది యిటుల్. ౧౩౨

ఉ. నీ మన సెట్లు నాపయిని నిల్చెనొ యట్టులె నామనంబు నీ
పై మమకారభావమున బ్రాలెడి, నైన స్వతంత్రఁ గాను, న
న్నోమెడి తండ్రి దాశవిభు నొద్దకుఁ బోయి వరింపు మెంతగాఁ
గాముఁడు వేచుచున్నఁ గులకన్యక ధైర్యము తూల నిచ్చునే! ౧౩౩

తే. కామమోహితుఁడై ఱేఁడు గంధవతిని
దాశు నర్థించుపొంటె సదనము చేరఁ,
గనుచు విస్మితుఁడై వాఁడు ప్రణతుఁ డగుచు
ననియె నిటు శంతనునకుఁ గృతాంజలి యయి. ౧౩౪

క. ఓ రాజ! నను గృతార్థుని
నీరాక యొనర్చె, నేను నీదాసుండన్;

చేకొనుము నీవచ్చిన
కారణ, మది యాజ్ఞగాఁగఁ గావింతు వడిన్. ౧౩౫

తే. దాశపతిపల్కు వించు భూమీశుఁ డలరి
ఎల్ల యోజనగంధిఁ దదాత్మజాత
ధర్మపత్నిగ నొసఁగఁ బ్రార్థనము సల్ప
నది విని వచించె దాశరా జతని కిట్లు. ౧౩౬

ఉ. నీవు వరించు నాతనయ నీకొసఁగం బ్రియమయ్యెఁ గాని, దే
వా! వర మొక్కటీయ నినుఁ బ్రార్థన సేసెద; దీనిపుత్రునే
భావినృపాలుఁ జేయునటు బాస యొనర్చెదె? యట్లులైనఁ గ్రొం
దావులయిక్క నీకలికి దానము చేసెద నీకుఁ బత్నిగా. ౧౩౭

క. దాశునిపలుకులు విని భూ
మీశుఁడు గాంగేయు నెడఁద నెంచినకతనన్
లేశము మాటాడక చిం
తాశల్యముతో గృహంబునకు మరలి చనెన్. ౧౩౮

క. ఇంటికి వచ్చినదాదిగఁ
గంటికి నిద్దురయుఁ నన్నకణ ముదరమునం,
దొంటికి స్నానము లేకయు
నొంటిగ శంతనుఁడు చింత నొందఁగం జొచ్చెన్. ౧౩౯

క. తాఁ గాంచిన కన్యామణి
మైగంధం బొక్కవైపు మలచిన, నవలన్
లాగం గాంగేయస్మృతి
యూఁగున్ శంతను నెడంద యుయ్యేలలాగై. ౧౪౦

తే. అట్లు చింతాతురుం డయి యనవరతము
మానియై దినదినకృశమానుఁ డైన
వానిఁ గని యిష్టసుతుఁడు దేవవ్రతుండు
చేరి యొకనాఁడు జనకుఁ బ్రశ్నించె నిట్లు. ౧౪౧

క. నృపశార్దూలా! నీ కిపు
డపరాజితరిపు డెవండు నైనం గలఁడే,
నిపుడే నీవశుఁ జేసెదఁ
జెప్పుమా సత్యంబు నీదు చింతకుఁ గతమున్. ౧౪౨

క. గురువులచింతాశల్యముఁ
బెరుకం దొరకొనని సుతుని పెం పది యేలా!
తిరిగి గతజన్మఋణమున్
సరిపరచఁగఁ బుట్టినట్టి జడమతి యతఁడో. ౧౪౩

సీ. రాజ్యంబు విడిచి శ్రీరాముఁడు సీతతో
నడవులఁ దిరిగెఁ బిత్రాజ్ఞఁగాదె,
క్రీతుఁడై రోహితుం డాతతవిక్రముం
డర్చించె విప్రుఁ బిత్రాజ్ఞఁ గాదె,
యజ్ఞయూపం బెక్కె నా శునశ్శేఫుండు
నంగీకరించె బిత్రాజ్ఞఁగాదె,
తల్లికంఠము జామదగ్న్యుండు ఖండించె
నస్మద్గురుండు పిత్రాజ్ఞఁగాదె,

నేను గలుగంగ నీకుఁ జింతింప నేల?
యెంతటి యసాధ్య మగు నర్థ మేని నీక
నిదె ధనువు చేతఁ బట్టి సాధించి నాదు
పొలుపు చరితార్థ మొనరింతుఁ, దెలుపు దాన. ౧౪౪

తే. ఆ పలుకు లాలకించి మాటాడె నిట్లు
మనసులో శంతనుఁడు లజ్జమానుఁ డగుచు,
నొక్కటే చింత, పుత్త్రుండ వొక్కఁడ వని
రణములో శూరుఁడవు నపరాఙ్ముఖుఁడవు! ౧౪౫

క. పితృమత మెఱుఁగక దేవ
వ్రతుఁ డంతట వృద్ధ మంత్రివర్యులఁ బంచెన్

పితృచింతకుఁ గత మరయఁగ
నతిరయమున నెఱిఁగి తెల్పి రతనికి వారల్. ౧౭౬

క. ఆ వృద్ధామాత్యులతో
రా నైళమ కదలి దాశరాట్సదనంబున్
దేవవ్రతుండు చేరి మ
హావినయము బ్రీతి గదుర ననె దాశునితోన్. ౧౭౭

తే. మాతగా నాకు, మాతండ్రినాతి గాఁగ
నిమ్ము నీసుత, నిదిగో ప్రార్థించుచుంటి;
ననిన దాశుండు నీ వుండ నామెసుతుఁడు
రాజు గాఁ; డీవ కొను దాని రాణిగాఁగ. ౧౭౮

ఆ. వాసవాక్కు వించుఁ బ్రత్యుత్తర మొసంగె
గంగపుత్త్రుఁ డెల్లరుం గలంగ,
దల్లి కేవలమ్ము దాశేయి, నే నొల్ల
రాజ్య, మామెసుతున రా జొనర్తు. ౧౭౯

క. దానిన్ దాశుఁడు తృప్తిం
బూనక యిట్లనియె, రాజపుత్త్రా! నీ వా
గ్దానము పాలింతువు, కా
నీ, నీసుతుఁ డట్లు బలియుఁ డెట్లియ్యకొనున్? ౧౮౦

క. అంతట నెల్లరు వినఁగా
శంతనుపుత్త్రుండు పూనె శపథం బిట్టుల్;
గాంతాగ్రహణము వదలి చ
రింతును భీష్మవ్రతంబు నిది నిజ మంచున్. ౧౮౧

ఉత్సాహ—ఆప్రతిజ్ఞ చేయ దాశుఁ డాలకించి ప్రీతుఁడై
క్షిప్రగతి నొసంగె సుతను జేయ రాజమహిషిగా,
నీప్రకార మామె యామహేంద్రు నొందె భర్తగా
నాప్రభుం డెఱుంగఁ డామె వ్యాసు మున్న కాంచుట.

క. శంతనునృపు సత్యవతీ
కాంత యిటు వివాహ మాడి కనె సుతయుగ్మం,
బంతట వారిరువురుఁ గా
లాంతరగతులైన, వ్యాసుఁ డర్థితుఁ డయ్యెన్. ౧౫౩

## ధృతరాష్ట్రాద్యుత్పత్తి

క. అంబిక మునిఁ గని మూయుట
నంబకము, లల ధృతరాష్ట్రుఁ డంధుఁడు పుట్టెన్;
అంబాలిక తెలతెలనో
టం బాండుం డగుచు వ్యాసునలుకం బుట్టెన్. ౧౫౪

క. కామకలాకోవిదయై
నేమమునన్ దాసి వ్యాసు నెలరించుటచే
శ్రీమద్ధర్మాంశంబున
నామెకు విదురుండు పుట్టె నవితథయశుఁడై. ౧౫౫

తే. అంధుఁ డగు ధృతరాష్ట్రుఁ డనర్హుఁ డగుట
భీష్మననుమతిం బాండుఁడు పిన్న యయ్యు
రాజ్యభారంబు దాల్చె విశ్రాంతబుద్ధి
విదురుఁ డాతనిమంత్రియై వెలసి కొలిచె. ౧౫౬

తే. భార్య లిద్దఱు ధృతరాష్ట్రపతికి సుబల
పుత్రి గాంధారియున్, వైశ్యపుత్రి యొకతె;
యట్లు పాండుఁ డిద్దఱఁ బెండ్లియాడె శౌరి
సేనిఁ గుంతిని, మద్రభూజానిసుతను. ౧౫౭

ద్విపద— కాంచెఁ బుత్రశతంబు గాంధారి ప్రియులఁ,
గాంచెను సుతు వైశ్యకాంత యుయుత్సుఁ.
గన్యయై పితృగేహగతయై సుతుని న
దాన్యుఁ గర్ణునిఁ గుంతి తరణిచేఁ గాంచె;

నటుపైనిఁ బెండ్లాడె నది పాండురాజు;
నిటు సూతుఁ డాడ, మునీంద్రు లి ట్లనిరి:
ఏమి చిత్రము సూత! యిటు లాడె దీవు!
తా ముందు సుతుఁ గాంచి తదనంతరమునఁ
బాండురాజుకు ధర్మపత్ని యె ట్లయ్యె?
నిండెను గుతుకంబు నెమ్మనంబులను
గర్ణజన్మ కథానకము విస్తరముగఁ
గర్ణముల్ తనియ వక్కాణింపు మన్న,
దానిఁ బ్రారంభించెఁ దా సూతుఁ డిటుల. ౧౫౮

క. ద్విజులార! శౌరసేనా
త్మజ కుంతి మొద లది, చిన్నతనమున నె తదీ
యజనకుననుమతి దానిని
నిజసుతఁగాఁ గుంతిభోజనృపుఁడు గ్రహించెన్. ౧౫౯

క. దుర్వాసుఁడు శ్రీసేవాం
తర్వాసుఁడు కుంతిభోజుదరి నొకయేఁ డ
చ్చెర్వుగఁ జాతుర్మాస్య
పర్వము గడపించెఁ బుణ్య పర్వము గాఁగన్. ౧౬౦

క. ఆమునిపరిచర్యలకై
నేమింపఁబడిన కుంతి నియమము తో సు
స్థేమాకృతి భజియించి ప
రామోదముఁ గూర్చె బ్రాహ్మణాగ్రణి; కతఁడున్, ౧౬౧

క. దీనిని సకృదుచ్చారణ
తో నేవేలుపును బిలువఁ దోఁచించి యతం
డోనాతి! కూర్చుఁ గామము
సూ నీ కని యిచ్చె నొక్క శుభమంత్రంబున్. ౧౬౨

క. తనదారిఁ దుర్వాసుఁడు
చనినయనంతరమ కుంతి, సత్యము లగునే
మునిమాటలు, మంత్రోచ్చా
రణమహిమఁ బరీక్ష సేయ రాదే యనుచున్. ౧౬౩

క. కన్యాసాధారణగుణ
జన్యం బగు చాపలంబు సందడి గొనఁగాఁ
బుణ్యాస్పద మేవేలుపు
ధన్యాకృతి విశ్వసింతు ధ్యానమునందున్? ౧౬౪

క. అంచుం గొంతి మదిం జిం
తించెడు నెడఁ జూడఁ దూర్పుదిక్కున నరుదై
నించుచు నరుణారుణరుచి
సంచయములు దిశలఁ గర్మసాక్షి జనించెన్. ౧౬౫

క. ఉదయించెడు నా సూర్యుని
హృదయములో నిలిపి కుంతి యిటు గమ్మని త
త్పదసంధానముతో వి
ప్రదత్తమంత్రము పఠించి భానుం బిలిచెన్. ౧౬౬

శా. ఆ మంత్రాక్షరమాల జిహ్వ నొకమా రావర్తితంబైనయ
న్నే మార్తాండుఁడు తిగ్మరశ్మిఁ దనలోనే! యూఁగి, కేయూరబా
హామేయంబు కిరీట కుండల మనోజ్ఞార్ద్రప్రభంబౌ మెయిన్
సామీప్యంబున నిల్చె భోజజకుఁ జెల్వుగ్ మానుషాకారుఁడై.

క. వచ్చెడు న య్యినదేవుని
నచ్చెరువడి కాంచుచుండ నాకస్మికమై
యుచ్చలితస్వాంతకుఁ గన
వచ్చె నిజోద్దోష మప్పుడు బహుచిత్రముగా. ౧౬౭

క. అంతటఁ బ్రాంజలియై భా
స్వంతునిఁ బ్రార్థించెఁ గుంతి, ప్రభు! నీరాకన్

సంతుష్ట నైతిం, గరుణా
స్వాంతా! నిజమండలంబుఁ బ్రాపింపు దయన్. ౧౬౯

వ. సూర్యుం డి ట్లనియె. ౧౭౦

క. ఆహూతుఁడనై మంత్ర
వ్యాహృతిబలవశుఁడ నగుచు, నంగజుఁ బెదలో
నాహరింపఁగ నిట రా
మోహము దీర్పకయ నన్నుఁ బో మ్మనఁ జన్నే? ౧౭౧

క. అనుడు ని ట్లని కుంతి పలికె,
నిదె నీకు నమస్కరింతు నేఁ గన్నెను, నీ
కుఁ దగు నె పలుకఁగ నిటు ల
య్యా! దురితములు, సర్వసాక్షి వగు ధర్మాత్మా! ౧౭౨

వ. సూర్యుం డి ట్లనియె. ౧౭౩

శా. నీకై వచ్చి వృథా నివర్తితుఁడనై నేఁ జన్న దేవాళిలో
నా కౌనే తల యెత్త? సిగ్గుపలు కూనన్ మందచిత్తుండనై
కోకా! కుంతీ! విను నాదుపల్కపుడ నన్నొందన్ నడి ర, మ్మటుల్
రాకున్నన్ శపియింతు నిన్ను నల మంత్రం బిచ్చు నావిప్రునిన్.

క. వరదాత నగుచు నిన్నుం
గరుణించెద నన్నుఁ గూడఁ, గన్యావ్రతమున్
స్థిర మగు, నెవ్వరు నెఱుఁగరు,
మఱియున్ ననుఁ బోలు పుత్రమణియుం గలుగున్. ౧౭౫

ఆ. అట్లు పల్కి తరణి యతిలజ్జితాత్మయై
తన్మనస్కయైన దానిఁ గుంతి
నిచ్చ ననుభవించి యిష్టవరం బిచ్చి
మరలఁ జేరెను నిజమండలంబు. ౧౭౬

తే. కుంతి గర్భము దాల్చి నిగూఢవృత్తి
నాత్మమందిరసంస్థిత యగుచుఁ గడపె;
నది యెఱుఁగు నొక్క ప్రియధాత్రియే మఱొక్క
రెఱుఁగ, రామెమాతయునేని యెఱుఁగ కుండె. ౧౭౭

క. నవమాసంబులు నిండినఁ
గవచముతోఁ గుండలములఁ గడు నొప్పుచు రెం
డవ భాస్కరుఁడో యన సం
భవ మయ్యెఁ గుమారనిభ కుమారుఁ డబలకున్. ౧౭౮

తే. అట్లు గోప్యంబుగా జన్మమంద సుతుఁడు,
సిగ్గుపడుచును దుఃఖించు చెలియఁ జూచి
యూరడించుచు ధాత్రి, నే నుంటి దిగులు
నొంద నే లని మందసం బొండు దెచ్చె. ౧౭౯

తే. సుదతి విడుచుచు బాలు మంజూషయందు,
విడుచుచున్ వేడికన్నీరు, నుడివె నిట్లు :
లేమి చేయుదు నాతండ్రి! యెంత మంద
భాగ్య! నినుఁ బ్రియ శుభమూర్తి వదల వలసె! ౧౮౦

మ. నిను సర్వేశి పరాపరాంబిక కృపన్ నిత్యంబు నోమున్, జగ
జ్జననీభూతయె స్తన్య మిచ్చి పరిరక్షం జేయుఁ, గాత్యాయనీ
మనుసంభావితఁ గామదన్ భగవతిన్ మన్నాథ దుర్వాసుఁ డ
న్మునిమాణిక్యపదాంబుజాతయుగలంబుం గొల్తు ని న్గానఁగాన్. 

ఉ. ఎన్నఁడు చూతు నిన్ను, మఱియెన్నఁడు నీలలితాననాంబుజ
సన్న వచోమరందమును స్వాదుగ నేఁ జవిఁ జూడఁ జాలుదున్,
నిన్ను రవిప్రభూతు నిటు నిర్ఘృణ స్వైరిణి యట్లు నిర్జనా
పన్న వనంబునందు నుసుపం గమకించెద నన్న! దుష్టనై. ౧౮౧

మ. గతజన్మంబులఁ బూజ సేయఁ ద్రిజగత్కర్త్రిన్ జగన్నేత్రి వాం
ఛితసంధాత్రి స్వభక్తధాత్రి నతసుశ్రీదాత్రి శ్రీమాతృకన్,

నతి గావింప శివాపదాబ్జములద్వంద్వంబుఁ సదా భక్తితోఁ,
సుతదారాభాగ్యము చేతులారఁ గని నే శోకింతు నేఁ డిట్లుగా. ౧౮౩

ఉ. మందసమందు బాలు నిడు, మాటికిఁ దీసి యురంబు కద్దుచుం
గుందు, జనంబు చూచు నని కొందల మందుచు నంద యుంచు, నే
ష్పుం, దను దాన దూఱుకొను, సూర్యుని దూఱును, మ్రొక్కు, బాలుమో
ముం దనివారఁ గాంచి యొక ముద్దిడు ధాత్రికి దాని నిచ్చుచుఁ.

తే. ఎట్టకేలకు మంజూష నిచ్చి కుంతి
పుచ్చి ధాత్రిని, స్నాతయై పొదలెడు వెఱ
నడఁగి యుండెను బితృవేశ్మమం, దటు గొని
ధాత్రి మంజూష గంగహస్తముల దాచె. ౧౮౪

క. గంగాప్రవాహమునఁ బో
నంగా సూతుండు చూచి పట్టెనఁ, దద్రా
ధాంగన వేఁడిన సుతుఁగాఁ
గం గొనె, నిటు సూతునింటఁ గర్ణుఁడు పెరిగెఁ. ౧౮౫

తే. పాండుఁడు స్వయంవరమ్మునఁ బడసి కుంతి,
మఱియుఁ బెండ్లాడె మాద్రిని మద్రపుత్రి;
నాతఁ డొకనాఁడు వేడ్క వేఁటాడువాఁడు
మృగమని భ్రమించి, యేసె రమించుమునిని. ౧౮౬

క. కుపితుండై యపు డాముని
శపియించెం బాండునృపుని, సాంగత్యముతో
నెపు డీ వెనసెదు నిజసతి,
నపుడే మరణింతు విది యథార్థ మటంచుఁ. ౧౮౭

తే. శప్తుఁడై పాండుఁ డిటు శోకతప్తుఁ డగుచు
రాజ్యముఁ ద్యజించి వనవాసరతిని దరలఁ
గుంతియును మాద్రియును వానిఁ గూడి చనిరి
సలుప సేవ సతీధర్మసంశ్రిత లయి. ౧౮౮

సీ. గంగాతటంబునం గల యాశ్రమంబుల
మౌనులసేవ ధర్మములు వినుచుఁ,
దప మొనర్చుచుఁ గథాతత్పరుండై విని
మునిభాషితము సనాతనము నిట్లు:
స్వర్గంబుఁ గన నేర్చు మార్గంబు శూన్యం బ
పుత్రున కటుగానఁ బురుషుఁ డెపుడు
నేయుపాయంబుచే నేనిఁ బుత్రునిఁ గాంచ
దొరకొనవలె స్వర్గ మరయు నాతఁ

డంశజుఁడు, పుత్రికాపుత్రుఁ డనఁగ, క్షేత్ర
జుం డనఁగ, గోళకుం డనఁ, గుండకుఁడు, స
హోఢ కానీన విక్రీతు, లుగ్రవనప
థంబునం బ్రాప్తుఁడు, నశక్తదత్తుఁడు నన. ౧౯౦

తే. పదివిధంబులు పుత్రులు; వారలెల్ల
వసువు గ్రహియింప నర్హు లౌవార; లైన
రమణనో నుత్తరోత్తరక్రమముగాఁగ
నగుదురు నికృష్టు లెన్న ధర్మాచరణకు. ౧౯౧

సీ. ఆవాక్యముల్ విని వేవేగఁ బాండుండు
కుంతితోఁ బల్కె నేకాంతమందు;
నబల! తపోనిష్ఠుఁడౌ మహాని నొక్కనిఁ
బొంది యుత్పాదింపు పుత్రు నొకని;
నాయాజ్ఞచే దోష మేయింత లేదు; మ
హాత్ముండు సౌదాసుఁ డనెడు రాజు
మును వసిష్ఠునికృపఁ గనెఁ బుత్రు నన వింటి;
నని పల్కఁ బాండున కనియెఁ గుంతి;

దేవ! దుర్వాసుఁ డిష్టసిద్ధిప్రదంబు
మంత్ర మొసఁగెను; దాన నిమంత్రణంబు

నెట్టిదేవునిఁ జేసిన నిట్టి యతఁడు
వచ్చి నాయత్తుఁడై నాదుపజ్జఁ జేర. ౧౯౨

క. అంతట భర్త్రనుమతి నా
కాంతి, మఱి ధర్మదేవుఁ గామింపంగాఁ,
జెంతకు వచ్చెన్, దద్రతిఁ
గుంతి, యుధిష్ఠిరుని మొదటి కొడుకుఁగఁ గాంచెన్. ౧౯౩

తే. వరుస, నటు వాయుచే వృకోదరుని, మఱియు
జిష్ణుని శతక్రతువరంబుచేతఁ గాంచె;
నీవిధంబునఁ గుంతి మూఁడేండ్లవరుసఁ
బుత్రులం గనె మువ్వుర భూరిబలుల. ౧౯౪

క. సుతసంచింతాశాంతికిఁ
బతి నర్థింపంగ మాద్రి పాండునకు సంతో
షితుఁడై వేఁడినఁ, గుంతీ
సతి తన్మంత్రము బోసంగె సవతికిఁ గృపతో. ౧౯౫

తే. ఏకపుత్రప్రబంధార్థినే యనుజ్ఞఁ
బడసి యది యశ్వినీదేవతల స్మరించి,
నకులు సహదేవుఁ గవల సుందరులఁ గాంచెఁ;
బంచపాండవు లిటు సముద్భవముఁ గనిరి. ౧౯౬

శా. ఏకాంతంబున నుండఁగా విధిబలప్రేరేపితుండై కురు
క్ష్మాకాంతుం డొకనాఁడు మాద్రిఁ గని తత్కాంతాకృతీక్షన్ మనో
జాకృష్టుం డయి తన్నుఁ దా మఱచి డాయన్ దాని భోగింపఁగా,
నాకంజేక్షణ వద్దు వద్దనె సమేధాలాపముల్ మీఱఁగాన్. ౧౯౭

క. వినన్ వినకే పాండు
క్ష్మానాథుఁడు కౌఁగిలించి గాటపుఁదమితో,
దాని దృఢపరిరంభము
లోనే మునిశాపయుక్తి లోకము విడిచెన్. ౧౯౮

ఉ. పాండుఁడు ప్రాణముల్ వదలి వ్రాలిన భూతలమందు మాద్రియున్
ఖండితనాగవల్లి తరుకాండమునుండి తొలంగునట్లు జా
రం డిగి నేలపైఁ బడె నిరంతర రోదనఘోష మెల్లెడన్
నిండ, వడిం దదార్తరవనీతులు గాఁగఁ బృథాదు లెల్లరున్. ౧౯౯

క. మునులు యథావిధిఁ బాండుని
తను వగ్నుల గంగదరిని దహనము సేయన్
దనసుతుల నిచ్చి కుంతికిఁ
జనెఁ దనపతితోడ మాద్రి సహగమనమునన్. ౨౦౦

క. అట నివసించెడి మును లం
తట జలదానాదికమ్ము తగ సలిపిన పి
మ్మటఁ గుంతిని సుతపంచక
ముతొ గొని తమ వెంటఁ జనిరి హస్తినపురికిన్. ౨౦౧

క. ఎదురు సనుదెంచి భీష్ముఁడు
విదురుఁడు ధృతరాష్ట్రుఁ డచటి విహితజనంబుల్
విదితపతిశాపు లగుటన్
ముదిత! పలుకు, వీర లెవరిపుత్రులొ! యనుచున్. ౨౦౨

క. మఱి మఱి యడుగం గుంతియు
భరమగు దుఃఖమ్ము గదురఁ బల్కెను వీరల్
కురుకులసంజాతులు సుర
వరజనితు లటంచు నెల్లవారును నగఁగన్. ౨౦౩

క. పిలిచి రుషాన్వితయై యా
కలికి వెసన్ ధర్ముఁ డాదిగాఁ గల సురలన్
బలికెను విశ్వాసార్థము
పలుకుఁడు మీ రెవరి సుతులొ పలుకుఁ డటంచున్. ౨౦౪

తే. అటు సమాహూతమై దైవతాళి వచ్చి
యభ్రపథమున నిల్చి మాటాడె నపుడు,

నా సుతుఁడు వీఁడు, వీఁడును నా సుతుండు,
నాసుతుఁడు వీఁడు, వీరలు మాసుతు లని. ౨౦౫

క. దైవతవాక్యముల భీష్ముఁడు
సేవించి సమాదరించి చేతఃప్రీతిన్
గావించి కుంతిఁ బుత్రుల
రావించి సమర్థరీతి రక్షణ చేసెన్. ౨౦౬

## యుధిష్ఠిరాది వృత్తాంతము

తే. పంచపాండవపత్ని యై పరమసాధ్వి
గాంచె ద్రౌపది వరపుత్రపంచకంబుఁ;
గృష్ణుసమ్మతి భగిని హరించి కాంచెఁ
బార్థుఁ డభిమన్యు వీసు సుభద్రవలన. ౨౦౭

క. శూరుం డభిమన్యుఁడు పడఁ
బోరన్, హతు లైన ద్రుపదపుత్రికపుత్రుల్,
వైరాటి వానిపత్ని కు
మారునిఁ బ్రసవించెఁ గులము మఱి నెగు వేళన్. ౨౦౮

క. వినఁ గాఁడున్ ద్రోణజు
బాణాగ్ని విదగ్ధుఁ డగుచుఁ బ్రాణము పోకే
కానం బడి, కృష్ణునికృప
చే నాతఁడు పునరవాప్త జీవనుఁ డయ్యెన్. ౨౦౯

క. మానుగ వంశములు పరి
క్షీణము లైనెడ భవంబు చెందినకతనన్
వానికిఁ బరీక్షితుం డని
శ్రీనామం బెల్లయెడలఁ జెందెఁ బ్రసిద్ధిన్. ౨౧౦

క. మృతు లైనన్ సుతు లందఱు
ధృతరాష్ట్రుఁడు భీమవాక్య తీవ్రతరశరా

హతుఁడై గాంధారీయుతుఁ
డతిదుఃఖితుఁ డుండెఁ బాండవానసభమునన్. ౨౧౧

క. వారిద్దరపరిచర్య ది
వారాత్రము ధర్మసుతుఁడు వారనిభక్తిన్
దీరిచి, యొకింత హృదయవి
దారక సుతగతవిచారతమ మెడసేయున్. ౨౧౨

క. విదురుం డతిధర్మాత్ముఁడు
వదలక వారలను గూడి ప్రజ్ఞాచక్షుని
ప్రదుఁడై దరి వసియించెను
ముదమున, ధర్మజుననుజ్ఞ మునుకొని నియతిన్. ౨౧౩

క. వృద్ధుం డగు ధృతరాష్ట్రుఁడు
విద్ధుఁడుగా శ్రవణములను వినుచుండంగాఁ
గ్రుద్ధుండై కటువాగ్బా
ణోద్ధతిఁ బ్రకటించు భీముఁ డుద్ధతబుద్ధిన్. ౨౧౪

క. ఈచీఁకు దుష్టుఁ డెంతయు
నాచే. వీనిసుతు లెల్ల నాశము గనిరా!
నాచవిగా దుశ్శాసన
నీచునిరక్తము రణోర్వి నేఁ గ్రోలితి రా! ౨౧౫

క. అంధుఁడు చావక యీ దు
స్సంధుఁడు మాపెట్టు పిండచర్వణమున రా
ద్బంధుం డట్టులు బ్రదుకు ది
వాంధమువలె శునకమ్ములు ధ్వాంక్షములీలన్. ౨౧౬

క. ఇవ్విధ మనుదిన మూరక
ప్రువ్వఁ దెగడుచుండ వాయుపుత్రుఁ డదయుఁడై
దువ్వుచు మొత్తని పలుకుల
నవ్వృద్ధులఁ దేర్చెఁ బాండవాగ్రజుఁడు దయన్. ౨౧౭

క. పదునెనిమి దేఁడు లీగతిఁ
బొదలెడు దుఃఖమునఁ గ్రొద్దు పుచ్చుచు నెటులో
తుది వనవాసకుతూహల
ముదితముగా నంధభూపుఁ డుంకించి చనన్. ౨౧౮

సీ. శ్రుతిచోదితంబుగా సుతులకు నిర్వాప
విధి యొనర్చెడిచింత వేధ్ధసేయు,
మున్ను వృకోదరుముఖమున జరిగిన
యౌర్ధ్వదైహికకృతు లఖిల మఱచు
నకృతంబులుగఁ దోఁచు నవధరించిన బుద్ధిఁ
బూర్వవైరం బెల్లఁ బుణ్యచరిత!
యటుగాన వేఁడెద నవసరంబగు ధనం
బౌర్ధ్వదైహికవిధు లాచరింపఁ
దపము సేయంగ వనులకుఁ దరలువాఁడ
ననుచు ధర్మజు నర్థింప ననిపె విదురు;
నాతఁ డేకాంతమున ధర్మసూతిఁ గాంచి
యీవిధం బెల్లఁ జెప్పి సమొప్పింపఁజేసె. ౨౧౯

క. ఏకాంతమున యుధిష్ఠిరుఁ
డీ కందువ తన యనుజుల కెఱిఁగింపం, గో
పాకులమతియై మారుతి
చీకా కొనరించె నన్నఁ జెప్పుచు నిటులన్. ౨౨౦

క. అన్నా! దుర్యోధనసా
ఖ్యోన్నతికై ధన మొసంగ నూఁకొన్నావా?
కన్నెత్తని వృద్ధుఁడు సుఖ
మున్నాఁడిఁక నింతకన్న నొప్పమి యున్నే? ౨౨౧

క. నీ దుర్మంత్రంబున నే
గాదే ద్రౌపదినిఁ గూడి కాననములలో

ఖేదం బందితి మందఱ
మేదిని పరాక్రమము విరటు కెఱఁగితిమి తుదిన్. ౨౨౨

సీ. మాగధుఁ జంపిన మగఁడ నే నయ్యును
సూపకారుఁడ నైచు స్రుక్కవలసె,
గాండీవకణశోభి కరముల జిష్ణుండు
కంకణమ్ములు దొడిగి గరిడి గఱపె,
లాక్షాగృహంబున నిక్షిప్తమా నగ్ని
నా పురోచను నేసి యరుగవలసె,
నీచకు లందఱఁ బీచం బడంచితి
నతికష్టమున నెట్లొ యర్ధరాత్రి,
నీ ప్రసాదంబుచేత నిన్నియును గల్గె,
జ్యేష్ఠుఁడవు గాన నీ ద్యూతసిద్ధ మైన
యెన్ని యిక్కట్టులేని మే మీఁగవలసెఁ
గాక యీయన్నపాటులు దాఁకునె మము! ౨౨౩

క. గంధర్వజాతనిగడన
బంధితుఁ డగు కౌరవేంద్రు వదలించితి, విం
కం ధన మాతనిపరసుఖ
సంధానము కీయఁ జూతు, సరి, తగు నీకే! ౨౨౪

క. నినుఁబోటి మూర్ఖుఁ డున్నె
కనులారఁగఁ బార్థుకండ్లఁ గాటుక గని, ఖం
డన చేయక ధృతరాష్ట్రుని,
ధన మీ నెంచెదవు; నేను దానికి నొప్పన్. ౨౨౫

చ. పరుషముగా వచించి యిటు, వాయుసుతుం డటు పాసిపోవ, ము
న్గురుఁ బినతమ్ములం గలిసి కోరినవిత్త మొసంగఁ జేకురన్;
విరివిగ భూరిదక్షిణలు విప్రుల కిచ్చి యొసర్చె శాస్త్ర వి
స్తరవిధి నౌర్ధ్వదైహికవిధానము పుత్రుల కెల్ల నాతఁడున్. ౨౨౬

క. ధృతరాష్ట్రుఁడు గాంధారీ
యుతుఁడై వడి వనము చేర నుద్యతుఁడుగఁ ద
న్మతులై విదురుఁడు సంజయుఁ
డతని ననుగమింపఁ, గుంతి యటులనె చేసెన్. ౨౨౭

క. కుంతినిఁ బుత్రకు లందఱు
నెంతగ వద్దనిన నిల్వ కేగిన గంగా
ప్రాంతోద్యానవనికిఁ దోఁ జని
చింతన్ గరిపురికి వారు చేరిరి మరలన్. ౨౨౮

క. ధృతరాష్ట్రాదులు నటు సని
శతయూపాశ్రమము చేరి జాహ్నవితీర
స్థితులై తప మొనరించిరి
కృతపర్ణకుటీరు లగుచు దృఢయోగమునన్. ౨౨౯

## ధృతరాష్ట్రాదుల మరణము

ఉ. వారు తపఃస్థులై యరిగి వర్షము లాఱయినన్, యుధిష్ఠిరుం
డోరువ లేక మాతృవిరహోద్యతదుఃఖముఁ దమ్ము లందఱుం
జేరఁగఁ బిల్చి కన్నులను జిందెడి బాష్పకణంబు లొక్కచే
నేరుచు గద్గదస్వర వికీర్ణత నెట్టులొ పల్కె నీగతిన్. ౨౩౦

ఉ. సోదరులార! స్వప్నమునఁ జూచితిఁ గుంతి వనంబులోనఁ జెం
పేది కృశాంగ యౌట; నెరియించె మనం బటుగానఁ, జూడఁగాఁ
బోఁ దలఁ పయ్యెఁ దల్లి మఱి పూజ్యుల నా పెదతల్లిదండ్రులన్
శ్రీదుని సంజయున్ విదురుఁ, జెచ్చెర మీరును రాఁ దలంతురే!

శా. ఆమాటల్ విని తమ్ము లగ్రజవచో వ్యాకృష్ట సంతాపులై
తామున్ మాతృవిలోకనోత్సవ సముత్సాహంబుతో నేగఁగాఁ,
దామున్ వచ్చెద మంచు ద్రౌపది సుభద్రాతన్వి వైరాటియున్,
మేమున్ మే మని పెక్కునాగరికులున్ వెంటం జనం గోరినన్.

ఉ. అందఱుఁ గూడి రాఁ దరలి యా శతయూపతపోవనస్థలిం
బొంది యుధిష్ఠిరుం డచటఁ బూజ్యులఁ గుంతినిఁ బెద్దతండ్రిఁ ద
క్కుండఁ గాంచియున్, విదురు నక్కడఁ గానక యాంబికేయుఁ దా
నెం దరిగెన్ మహాత్ముఁడు, వచింపుఁ డటంచును బృచ్ఛ చేసినన్.

మ. ధృతరాష్ట్రుం డిటు పల్కె, నా విదురుఁ డెంతేనిన్ విరక్తాత్ముఁడై
గతసర్వేహుఁడు నిష్పరిగ్రహుఁడు నై కన్న్యాసి యేకాంతసం
స్థితుఁడై నిశ్చలనిష్ఠ నెల్లపుడు నా చిచ్ఛక్తి సన్మానిభా
విత జ్ఞానాకృతినిన్ సనాతనిని హృద్వేశ్మస్థితం గొల్చెడిన్. ౨౩౪

ఉ. ఆమఱునాఁడు ధర్మజుఁడు నందును నిందు వియన్నదీతట
భ్రామణ చేసి చేసి యొక రమ్య వివిక్త వనస్థలంబునన్
క్షామశరీరు సంశ్రిత నికామ తపోవ్రతు క్షత్తఁ జూచి, దా
నామము చెప్పి భక్తినిఁ బొనర్చి ప్రణామము, చెంత నిల్చినన్.

మ. అనఘుం డా విదురుండు ధర్మజునిప ల్కాలించి మాటాడ కే
యణుమాత్రంబుఁ జలింప కచ్ఛమగు స్థాణ్వాకారముం దాల్చెఁ ద
త్క్షణమే యుజ్జ్వల మద్భుతంబు నగు తేజ మ్మొక్కఁ డాపుణ్యు నా
స్యనికామోద్గతమై యుధిష్ఠిరునియాస్యంబుం జొరెం జెచ్చెరన్.

తే. విదురుఁ డిటు సన్న ధర్మజుం డెదను వగచి
దేహదాహంబు సేయ యత్నించుచుండ
"వలదు పొమ్ము, విరక్తుండు, వలదు దహన"
మనెడి యశరీరవాక్కులు వినఁబడియెను. ౨౩౬

తే. సోదరులు విని గంగావిశుద్ధవారి
స్నాతులై చెప్పి రిది సవిస్తరము గాఁగ
నంధరాజుకుఁ; బాండవు లట్టు లచట
నిలిచి రొకకొన్ని నాళ్ళు పౌరులను గూడి. ౨౩౭

క. అచ్చట ధర్మజుఁ జూడఁగ
వచ్చిరి నారదమహర్షి వ్యాసుఁడు నితరుల్

సచ్చరితులు మునిచంద్రులు
నిచ్చ నతనిఁ గూడి మాట లెసకం బెసఁగన్. ౨౩౯

క. అప్పుడు పారాశర్యునిఁ
దప్పక వీక్షించి కుంతి తా నిట్లనియెన్
జిప్పిలుచుఁ గన్నుదోయినిఁ
గప్పంగా నీరు శోకగద్గద యగుచున్. ౨౪౦

క. స్వామీ! కష్టం జూడఁగ
నామన ముద్విగ్న మయ్యె, నాఁ డెన్నఁడో యీ
భూమిం బడుతఱిఁ గాంచితి,
సామర్థ్యము కలదు, చూపి సవరింపఁగదే! ౨౪౧

క. ఈరీతి నడుగ నది, గాం
ధారియు యాచించె నిట్లు: తమ్ములతోడన్
కౌరవుని దుర్యోధనుఁ గనఁ
గోరెద; నే వారిఁ జూచుకోన లేదు ప్రభూ! ౨౪౨

క. మఱి యర్థించె సుభద్రయుఁ,
బరమతపోధన! కుమారుఁ బ్రాణప్రియునిన్
వరవీరుని నభిమన్యునిఁ
గరుణింపవె కాంచఁ, గనుల కఱవది తీఱన్. ౨౪౩

తే. ఈ విధంబునఁ బలువురు సతుఁ డితఁ డని
స్వర్గత కురుప్రవీర సంచయముఁ జూడఁ
బూన, వ్యాసుండు సంయతప్రాణుఁ డగుచు
దేవిని సనాతనిన్ నిల్పె భావవీథి. ౨౪౪

క. ఆ పయి సంధ్యాసమయము
ప్రాపింప యుధిష్ఠిరాదిపరివారితుఁడై
ద్వైపాయనుండు గంగా
ద్వీపవతీ పుణ్య వారివీచుల మునిఁగెన్. ౨౪౫

తే. స్నాతుఁడై యట్లు వ్యాసుండు స్తవ మొనర్చెఁ
బ్రకృతి నా పురుషారామ బ్రహ్మరూప
దేవదేవి మణిద్వీపదివ్యవాస
వీతగుణ యయ్యు సగుణను విశ్వజనని. ౨౭౬

ఉ. ఎప్పుడు లేదు వహ్ని, యముఁ డెప్పుడు లేఁ, డల విశ్వపుండు లేఁ
డెప్పుడు, లేదు పాశధరుఁ డెప్పుడు లేఁడో సురాధినాథుఁడే.
నెప్పుడు వేధ లేఁడో, హరుఁ డెప్పుడు లేఁడో, యుపేంద్రుఁడేని, య
ల్లప్పుడు నుండు నిన్నుఁ బరమాత్మను దేవిని నేను గొల్చెదన్.

ఉ. లేవు జలంబు వాయువును, లే దనిలం బల యంబరంబునున్,
లేవు గుణప్రపంచములు, లే దహ మేనియు నింద్రియంబు లే,
లేవు మనస్సు బుద్ధియును, లే దల చంద్రుఁడు సూర్యుఁ డెప్పుడో,
నీ వపు డుందువమ్మ, జననీ! నిను దానిని నేను గొల్చెదన్. ౨౭౮

తే. చేర్చి యీ జీవలోకమ్ముఁ జిత్తమందు,
సగుణ మగు లింగకోశమ్ముఁ దగ సమాధి
యందు, నాకల్పకాలమ్ము స్వాత్మతంత్ర
వై వెలుంగుదు వెఱుకకు నంద కీవు. ౨౭౯

క. ఈ జనము మృతులఁ గన ను
ద్వేజించుచు నన్ను వేఁడు వేదుక దీర్పన్
నేఁ జాల మృతులఁ జూపఁగ.
నో జననీ! యోపు దీవె, గమొగిఁ జూపఁగదే! ౨౮౦

తే. వ్యాసుఁ డిట్లు నుతింపఁ బ్రీతాత్మ యగుచు
నా మహామాయ భువనేశి శ్రీమహేశి
స్వర్గముననుండి పిలిపించి పార్థివులను
జూపె నెల్లర వారికిఁ జోద్య మెసఁగ. ౨౮౧

తే. కుంతి గాంధారియు సుభద్రకోడలు మఱి
పాండవులు నందుఁ గల యెల్ల బహులజనము

స్వర్గగతులైన యాతీయజనులఁ దిరిగి
రాఁ గనులఁ గాంచి తుష్టాంతరంగు లైరి. ౨౫౨

క. వ్యాసుం డంతట స్మృతిశో
న్యాసం బొనరించి యామహామాయాదే
వీ సామ్రాజ్యము, మరలఁగ
శాసించెను వారి నింద్రజాలము లీలన్. ౨౫౩

క. మును లందఱుచేఁ బాండవు
లనుమతిఁ గొని యరిగి, రరిగి రాత్మేచ్ఛ మునుల్,
మనమున వ్యాసప్రతిభా
గణసమ్మున ధర్మరాజు కరిపురి కరిగెన్. ౨౫౪

క. అంతట మూఁడవనాఁడు వ
నాంతరమున దావదగ్ధుఁడై గాంధారీ
కాంతుఁడు తనసతితోడం
గుంతీయుతుఁ డగుచు మృత్యుగోచరుఁ డయ్యెన్. ౨౫౫

క. సంజయుఁ డొక్కరుం డంతకు
ముం జనె ధృతరాష్ట్రు వీడి పుణ్యస్థలయా
త్రం జవి, నిది నారదువ
ల్లం జెవిఁ బడి, ధర్మజుఁడు కరము దుఃఖించెన్. ౨౫౬

సీ. కౌరవక్షయ మయి యాఱు ముప్పది యేండ్లు
సన, యాదవులు ప్రభాసంబునందు
విప్రశాపంబున విగతమహాత్ములై,
రామకృష్ణులు కన్నులం గనంగ
మదిరాసమాస్వాద మత్తులై యెల్లరు
మడిసి రన్యోన్యప్రమర్దనమున,
బలరాముఁడును దేహభారంబు వదలెను
హరి భగవానుఁడు నచ్యుతుండు

కృష్ణుఁడు భృగుశాపంబు పాలించునిచ్చ
వ్యాధభాణాభిహతిని జీవములు దొఱఁగె;
యాదవలయంబు కృష్ణనిర్యాణవార్త
తోడ విని వసుదేవుండు తొట్రుపడుచు, —౨౫౮

క. హార్తింపఁ జేసి దృఢముగఁ
జిత్తంబున భువనరాజ్ఞి శ్రీరూపపరా
యత్తతఁ బ్రాణములు పరా
యత్తంబులుగా శరీర మాతఁడు విడిచెన్. —౨౫౯

సీ. అతిదుఃఖితుం డయి యర్జునుండు ప్రభాస
తీర్థంబు చేరి తత్తీరమందు
వారివారికిఁ దగుతీరుగా సంస్కార
ములఁ దీర్చె నెల్లవారలకు శ్రద్ధ,
హరిదేహముం గాంచి యష్టపత్నులతోడ
దహనంబు కాష్ఠసంతతులఁ జేసె,
రాముని రేవతీరామతో దహియించి,
యంత ద్వారకఁ జేరి యందుఁ గలుగు
నెల్ల జనముల నాబాల వృద్ధముగను
పురి వెడలఁజేసి వారితో నరిగెఁ దాను;
నంతలో వాసుదేవుమహాపురంబు,
కడలి పొంగినఁ గలిసెఁ దద్గర్భమందు. —౨౬౦

క. ద్వారకఁ గల జనులం గొని
తేరంగాఁ గృష్ణుప్రియలు దివ్యధనముతోఁ
జోరాభీరవిలుంఠిత
లై, రది వారింపఁ బార్థుఁ డసమర్థుఁడు గాకె. —౨౬౧

తే. నరుఁడు నంత నింద్రప్రస్థపురముఁ జేరి
యందు ననిరుద్ధసుతు యాదవాధిపునిగ

ప్రజు నభిషిక్తుఁ జేసి, తా వ్యాసుఁ గాంచి
కథన మొనరించెఁ దనదైన్యకథ యదెల్ల. ౨౬౧

క. వ్యాసుఁడు విని యతని సమా
శ్వాస మొనర్చె నిటుల మఱి, పార్థా! హరితో
నేసమయమ్మునఁ బుట్టెద
వాసమయం బుగ్రతేజ మది పూను నిను౯. ౨౬౨

క. విని పార్థుఁడు గజపురికిం
జని క్రీడావనతుఁ డగుచు జరిగిన దెల్ల౯
వినిపింప నన్న, కాతఁడు
విని హరినిర్యాణవార్త విహ్వలమతియై. ౨౬౩

క. సానుజుఁడుగా మహాప్ర
స్థానోద్యోగంబుతోడఁ జలిమలదిక్కై
పూని ప్రయాణము, రాజ్యం
బూనిచె నభిషేకవిధుల నుత్తరకొడుకు౯. ౨౬౪

తే. ముప్పదాఱేండ్ల వయసున నొప్పు నాఁడు
హస్తిపురికిఁ బరీక్షిత్తు నధిపుఁ జేసి
ముప్పదాఱేండ్లు సామ్రాజ్యమును వహించి
ధర్మజుఁడు పోయెఁ బ్రస్థానతత్పరమతి. ౨౬౫

క. అనుజులతోఁ ద్రోవదితోఁ
జనెను యుధిష్ఠిరుఁడు తుహినశైలముపైపై
చని చని యట వా రార్వురు
తనువులు పడఁ జనిరి దివ్యతనువులతోడ౯. ౨౬౬

### పరీక్షిచ్ఛాపవృత్తాంతము

తే. అటు పరీక్షిత్తు రాజయి యఖిలపృథ్విఁ
బరమధార్మికుఁడై చేసెఁ బాలనంబు,

నితఁడు రాజర్షి యని మెచ్చ నెల్లప్రజయు;
నర్థిఁ గడచనె నిరువది హాయనములు. _౨౬౮

మ. ఒకనాఁ డాతఁడు వేట కేఁగి విపులాత్యుగ్రాటవిం దూఱి పూ
నికతోఁ గ్రూరమృగంబులం బొడుచుచున్ గ్రీడించుచుం బోవుచున్
మెక మొక్కండు శరాహతం బయినఁ గన్పింపంగ రాకున్న, దా
నికినై కానన మెల్లెడన్ వెదకి యెంతే శ్రాంతుఁ డయ్యెం దుదిన్.

ఉ. ఆతఁడు శ్రాంతుఁడై చనెడు నత్తఱి వేసవివేళ గ్రీష్మ తీ
వ్రాతపతాపముం బఱపు చల్లన నెత్తికి నెక్కనం బిపా
సాతురుఁడున్ క్షుధార్తుఁడును నై కనె నంతికభూమి ధ్యానస
న్నితమనస్కు నొక్కముని నిశ్చలయోగసమాధినిష్ఠునిన్. _౨౬౯

క. దాహాతురుఁడై భూమీ
శాహాత్తుఁడు మౌనిచంద్రుఁ బ్రార్థింపంగా
దాహ మ్మిమ్మనె, యా ముని
దేహం బెఱుఁగమిని వినఁడు తిరుగు పలుకఁడున్. _౨౭౦

క. కడు బడలి యెండఁ బడి దగ
యడరంగా క్షుధయుఁ గదురఁ నాత్మను మఱి సం
దడి సేయఁగఁ గలిపురుషుం,
డా డ తెఱుఁగని కోప మతని కుద్రేకించెన్. _౨౭౧

క. మృతసర్పం బొకఁ డా భూ
పతియు ధనుష్కోటి నెత్తి పడవేసె మెడన్,
ధృతయోగుఁ డదియు నెఱుఁగక
యుతంద్రుఁడై యుండె, రాజు నరిగె నగరికిన్. _౨౭౨

క. వనమునఁ గ్రీడించెడు త
న్మునివరు గవిజాతుఁ డనెడు పుత్రుఁ డనఘుఁడున్
విని మిత్రులవలన నెపుఁడో
తన జనకుని మెడను భామువుఁ దగిలించె ననఁగాన్. _౨౭౩

తే. ఆ మహాశక్తిసంపన్నుఁ డాగ్రహమునఁ
గరమున జలంబు గొని, పితృకంఠమందుఁ
బాపశవ మిడ్డ పాపిష్ఠుఁ బాపతేఁడు
కాఁచు నేడవ నాఁ డని పోరి శపించె. ౧౭౪

క. మునికుమారుఁ డిట్లు తన కిడ్డ శాపంబు
మహాశిష్యులవలనఁ దా నెఱింగి,
వృద్ధమంత్రివరులఁ బిలిచి పరీక్షిత్తు
పలికె నిట్లు శాపపటుత యెఱిఁగి. ౧౭౫

సీ. నాపాపమే ముని శాపరూపం బూని
యనివార్యమై వచ్చె నని తలంతు;
వేదవాదులు మృత్యుభీదంగ రా దందు
రైన, శాస్త్రము చెప్పు యత్నవిధులు;
మహామంత్ర కౌషధ మహిమం బపారంబు;
నేను వింటిని పురాఖ్యాన మొకటి,
సర్పదష్టను బ్రియ సంజీవితం జేసెఁ
దన యాయురర్థంబు దాసి కిచ్చి
ముని యనుచు; నెప్డు భవితవ్యమునను బుధుఁడు
నిశ్చయముగాఁ నయత్నుఁడై నిలువరాదు;
దైవమాత్రమై నిరుద్యముం డౌ విరక్త
జనుఁడు భిక్షార్థి యతి యయి చనును సుమ్మె! ౧౭౬

తే. ఎటులైన యోగించి నోటిలో నెవరో యిడిన
నన్న మెటు చేరు నుదర ముద్యమము లేక?
మఱియును గృహస్థున కనుద్యమంబు నింద్య,
మనుచు విని, పరీక్షితుని మంత్రు లడిగి రిట్లు. ౧౭౭

## రు రూ పా ఖ్యా న ము

క. దేవా! యెవ రా మునివరుఁ?
డేవిధమున నాయురర్థ మిచ్చి ప్రియను సం
జీవింపఁజేసె? విస్తర
మావిధ మెఱిఁగింపు మనిన నతఁ డిటు పలికెన్. [illegible]

తే. భృగునకుఁ బులోమయందు జనించెఁ జ్యవనుఁ,
డతనికిం బ్రమతి సుకన్యయందుఁ బుట్టెఁ;
బ్రమతికిఁ బ్రతాపి యన్ సాధ్వి భార్య యయ్యెఁ;
వారికి రురుండు పరమతపస్వి పుట్టె. [illegible]

తే. కలఁ డొకఁడు స్థూలకేశవిఖ్యాతమౌని;
యాతఁ డాశ్రమమునఁ దిరుగాడువాఁడు
గాంచె మేనక గంధర్వకాంతువలనఁ
గని వదలి పోయిన యనాథకన్య నొకట. [illegible]

క. ముని దానిఁ గొని ప్రమద్వర
యను నామం బుంచి పెంప, నదియుఁ ద్రిలోకీ
జనముల నిదియె ప్రమద్వర
తను వనఁగా నొప్పి పెరిగెఁ దరుణోజ్జ్వలయై. [illegible]

క. దానిం గని రురుఁ డంగజ
బాణార్దితుఁ డగుచు నింటిపజ్జ నిమనుఁడై
దీనుండై యుండెనఁ గని
దానికిఁ గారణము తెల్పఁ దండ్రి యడిగినన్. [illegible]

తే. రురుఁడు నిజముఁ దెలుపఁ ద్వరితగతిఁ బ్రమతి
స్థూలకేశుఁ జూచి సుముఖుఁ జేసి,
కొడుకుభార్య గాఁగఁ గూఁతుఁ బ్రమద్వర
నీయ వేఁడ, వాఁడు నీయఁ గొనియె. [illegible]

క. శుభలగ్నము నిశ్చితమై
యుభయులును వివాహపరికరోద్యతు లయినన్
సుభగ ప్రమద్వర త్రొక్కె నొ
క భుజగమును, నాడుచు; నది కఱచెన్ దానిన్. ౨౮౦

క. క్ష్వేలాకీలామాలా
కీలిత యై యసువు దొఱఁగి క్రిందం బడఁగాఁ,
గోలాహల ముదయించెను
వ్యాలోకాలోల మౌని వారములోనన్. ౨౮౧

ఆ. స్థూలకేశనాముఁ డొట్టి మౌనీంద్రుల
రోదనంబు వినుచు రురుఁడు వచ్చి
కాంచె నచటఁ బడిన కాంతఁ బ్రమద్వర
మేను దొఱఁగియు జిగి మెఱయుదాని. ౨౮౨

క. రురుఁ డచ్చోటు వాసి యొంటిగ
విరహాతురుఁ డగుచు శోకవిహ్వలమతియై
కరుణంబుగ రోదించెను
పరిపరివిధములను దానిబాస దడవుచున్. ౨౮౩

సీ. ప్రవహమైయుండ నైతిఁ బ్రమదావిరహితుండ నైన నాకు నీ
జీవిత మేల? నాదయితచేయి గ్రహింపను, లాజహోమదీ
క్షావిధి సంగ్రహింపను, విషంబు గ్రహింతునొ, నీటఁ జొత్తునో,
పావకునందు దూఁకెదనొ, పాశము కంఠమునందుఁ గొందునో!

మ. మరణోపాయవిమార్గమాణుఁడు నదీమార్గంబునం బోవుచున్
మఱియుం జేసె విచార మిట్లు, మరణింపన్ లాభమా! దానిచేఁ
బరలోకంబునఁ గూర్తునే ప్రియుకు భవ్యం బింతయే? నాకుఁ ద
ద్విరహవ్యాధికృతాత్మఘాతి కెటు ప్రాపించున్ బ్రియాసంగతుల్?

క. ధనసీజనకుల ననఘుల
ఘనసచింతావసథి ముంచి, కడుఁ బాపంబుం

గోన నేల, యనుచు స్నానం
బొనరించి త్రిరాచమించి యొయ్యన శుచియై. ౨౯౦

చ. జలములు గొంచుఁ బల్కె నిటు సల్ప్రతిః నేని యొకింత దైవతా
వలివరివస్య, సద్గురుల భక్తి నుపాసనచేసి యుంటినేఁ
జ్వలనుఁడు హోమతుష్టుఁ డయి వర్తిలునేని; దపోజపంబులన్
సలిపితినేని, నాదయిత చయ్యన జీవము లొందుఁ గావుతన్. ౨౯౧

ఉ. వేదము లెల్ల సాంగముగ నెల్లి యధీతము లయ్యెనేని, నా
సాదితసంస్కృతిన్ హృదయసంస్థితయై నల వేదమాత, స
మ్మోదితుఁ డయ్యెనేని రవి, పూర్వభవంబులఁ బుణ్య మింతొ సం
పాదితమేని, నాప్రియ ప్రమద్వర జీవము లొందుఁగావుతన్. ౨౯౨

క. రురుఁ డీవిధమునఁ బలుకుచుఁ
బరభక్తిన్ దైవతాళి భజియించి యుదన్
గరధృత తజ్జలములు భువిఁ
బరిపర్జన చేయ, నపుడ ప్రత్యక్షంబై. ౨౯౩

తే. పలికె దేవదూత: బ్రహ్మిష్ఠ! సాహసం
బేలనయ్య! చావఁ బోలునయ్య!
కాలమైనఁ బెళ్ళి గంధర్వకన్యక,
పరిణయమ్ము కమ్ము మఱొకకన్నె. ౨౯౪

తే. రురుఁడు పల్కె నిట్లుః వరియింపను మఱొక్క
వనితఁ, జత్తు నదియు బ్రదుకకున్న;
నట్లు పల్కు రురుని హితవాక్కు లాలించి
దేవదూత పల్కెఁ దీఁపినుడుల. ౨౯౫

క. ఒక్క యుపాయము సెప్పెద,
నక్కన్యకు నీదు నాయురర్థం బిమ్మా,
యుక్కరణిఁ జేయ దానిని
నక్కమ బ్రదికింపవచ్చు, నీ వాప్పదనేఁ ౨౯౬

క. రురుఁ డది విని, యిపుడ ప్రమ
ద్వర కిచ్చితి నాయురర్థభాగం, బదియే
మరలఁ సంజీవిత యై
కర మానందంబుఁ గూర్చుఁ గావుత మనియెన్. ౨౯౭

సీ. ఆప్రమద్వరతండ్రి యయిన విశ్వావసు
నాముండు ప్రథితగంధర్వవిభుఁడు
తెలిసి వృత్తాంతంబు దేవదూతను గూడి
చనె ధర్మరాజుపార్శ్వంబు చేర
దేవదూత పలికె దేవ! విశ్వావసు
పుత్రి ప్రమద్వర భోగిదష్ట
యై మృతిఁ గనె, రురుఁ డామె నుజ్జీవింప
నాయురర్ధం బీయ నియ్యకొనియె,

మఱియు నాతనివ్రతచర్యమహిమవలన
బ్రదుకఁగ ననుజ్ఞ యి మ్మని పలికె, ధర్ముఁ
డనుమతింపంగఁ, జేకొని, యాతఁ డామె
రురున కిచ్చెఁ, బెండిలి యయ్యె నిరువురకును. ౨౯౮

క. ఈవిధి నుపాయబలమున
జీవింపఁగఁ జేసెఁ ద్వ్యక్తజీవను రురుఁడుం,
గావున మణిమంత్రౌషధ
సేవల నాత్మాభిరక్ష సేయఁగ వలయున్. ౨౯౯

క. సచివులతో నిటు లని మఱి
రచియింపఁగఁ బంచి యొక్క ప్రాసాదంబున్
సుచిరంబు సప్తభూమిక
నచిర మది ససచివుఁ డగుచు నధిరోహించెన్. ౩౦౦

ఆ. సేవకునితప్పు మన్నన సేయవలయు
నుఱవవలె నని మాసిసి మరల మరల

వేఁడఁగా గౌరముఖునిఁ బంపించి మఱియు
నాత్మరక్షణవ్యగ్రుఁడై యాతఁ డుండె. ౩౦౧

క. మణిమంత్రధరుల విప్రులఁ
దనమందిరమందు నునిచి తగుచోటుల ర
క్షణకై చుట్టును శూరుల
ఘనగజముల మంత్రిసుతునిఁ గాపుగ నుంచెన్. ౩౦౨

క. గాలియు నటు చొర నేరని
లీలన్ శాసించి యెల్లక్రియ లాసౌధా
ట్టాలికముననే జరుపుచు
నోలిన్ లెక్కించుచుండె నొక్కొక దినమే ౩౦౩

తే. దాని విని కశ్యపుం డను ధరణిసురుఁడు
మంత్రవిదుఁడు ధనార్జనాయంత్రితుఁ డయి
యా పరీక్షితు దర్శించి యతని వేఁడి
ధనముఁ గొనునిచ్ఛ నిలు వీడి తరలె నటకు. ౩౦౪

క. నృపుశాపము విని తక్షకుఁ
డపుడ వెడలి వృద్ధవిప్రునాకారముతో
స్వపథంబున నటు సను క
శ్యపుఁ గని ప్రశ్నించె వానిచనుకర్జంబున్. ౩౦౫

వ. కశ్యపుం డిట్లనియె. ౩౦౬

తే. నేను కశ్యపుండ నిర్విషీకరణైక
సిద్ధమంత్రవిదుఁడ, సిద్ధతేజుఁ
గురునృపాలుఁ దక్షకుం డంటి కఱచిన
స్వస్థుఁ జేసి యశము వసువుఁ గొందుఁ. ౩౦౭

వ. తక్షకుం డిట్లనియె. ౩౦౮

క. నేన కురురాజుఁ గఱవఁగఁ
బూనిన తక్షకుఁడ, నేను ముట్టినవారిన్

నీ నేర్పున బ్రదికింపం
గా నోపవు, పొమ్ము తిరిగి కశ్యపదేవా! ౩౦౯

వ. నావుడుఁ గశ్యపుం డిట్లనియె, ౩౧౦

ఆ. విప్రశాపయుక్తిఁ బృథివీశుఁ దక్షకా!
నీవ కఱచునెడల నిక్కువముగ
సిద్ధమంత్రలీల జీవింపఁజేసెద,
నింద సుంత లేదు సందియమ్ము. ౩౧౧

క. అది నమ్మక తక్షకుఁ డతి
మదమున న్యగ్రోధ మొండు మాద్యద్దంష్ట్రా
విదళన మొనరిచి, కశ్యప!
బ్రదికింపుము దీని నంచు భస్మము చేసెన్. ౩౧౨

ఆ. కశ్యపుండు నిదిగో కను మంత్రబల మని
బూది యెల్ల నొక్క ప్రోవు చేసి
మంత్రజలము చల్లి మఱ్ఱి నెప్పటియట్ల
బ్రదుకఁజేసె వాఁడు బ్రమసి చూడ. ౩౧౩

క. భ్రాంతుండై తక్షకుఁ డనె,
నెంతటి ధన మీవు రాజునెడఁ గోరెదవో,
యంతటి ధన మిచ్చెదఁ జను
మింతట, నాపూన్కి దీరు నిదిగో మహాత్మా! ౩౧౪

వ. అది విని కశ్యపుండు మనమందు విచారము చేసె నిట్లు, తే
నిది గొనిన న్నాకు యశ మేగతి నబ్బుఁ, బ్రజాప్రియుం బరీ
క్షిదవనిపాలు లెస్స బ్రదికించిన పుణ్యా మ దెట్లు వచ్చు, నా
కదియును గాక లోభమున వ్యాప్తములో నయశస్తమిస్రముల్

మ. ధనభారంబు యశోవిమిశ్ర మయి శ్రీధామంబుగా నొప్పు నా
ధనమే కీర్తివిహీన మైనెడ నసాధ్యంబైన భారం బగున్,

దనసర్వస్వము సల్పఁడా రఘుఁడు మున్ దానంబు సత్కీర్తికాం
క్షను, నెన్కాఁడిరి యేమి యీయఁగ హరిశ్చంద్రుండునుం గర్ణుఁడున్ ?

తే. అట్లు చింతించి కశ్యపుం డెడఁద, సుంత
ధ్యాన మొనరించి, కాంచి గతాయువునిఁగ
ధరణినాథునిఁ, దక్షకదత్తమైన
వసువుఁ గొని యేగె నిచ్చ నివర్తితుఁ డయి. ౩౦౭

తే. కశ్యపు నివృత్తుఁ జేసి తక్షకుఁడు వేగ
హస్తినాపురిఁ జేరి యేడైనాఁడు
పురమువెలుపల నొక్క యుప్పరిగపై సు
రక్షితుం డని వినెను బరీక్షితు నృపు. ౩౦౮

క. తక్షకుఁ డట వీక్షించెఁ బ
రీక్షిత్క్షోణీంద్రు, మంత్రబుక్కుల మఱలన్
దక్షు లగు విప్రవర్యుల
నక్షణమును రక్ష సేయ నాలోకనువానిన్. ౩౦౯

క. అందుఁ గల విప్రశాపభ
యాందోళన జిహ్మగేశుఁ డాలోచించెన్
మందిర మిట్టిది యెట్లు చొ
రం దగు నీశాపదగ్ధు రాజుం గలవన్ ? ౩౧౦

క. తాపసపీడాకరుఁ డీ
పాపిష్ఠ నృపుండు మృత్యువంచనకొఱకై
యీపగిది రక్షకయి సౌ
ధోపరి నున్నాఁ డెటులింగియుం గాలగతిన్ ! ౩౧౧

క. ఎందుఁ జని యెందు డాఁగిన
నెందఱు రక్షింపఁ బూని యెదిరి పోనరుపఁగా,
నందక మృత్యువుకోఱల
కుం, దప్పఁగఁ దరమె యెట్టి కోవిదునకు నేన్ ! ౩౧౨

క. దానస్నానాదికక
ల్యాణంబుల వ్యాధి తొలఁగు, నాయువు హెచ్చున్,
దానివలన మృతి తొలఁగక
పూనిక సాధింపవచ్చుఁ బుణ్యగతులనేన్ ! ౩_౨౩

క. పాండవదాయాదుఁడు వీఁ
డుండెడి నటు పుణ్యకార్యయుక్తుఁడు గాకే,
దండన కల మృత్యువుఁ గా
నం డహహా మేడ యెక్కి నందితుఁ డగుచున్! ౩_౨౪

## పరీక్షిన్మరణము

తే. ఇట్లు చింతించి తను గొల్చి యెదుట నున్న
యురగపతులఁ దాపసవేషధరులఁ జేసి
యధిపు దర్శింప ఫలమూలహస్తులనుగ
నంపి, ఫలగతకీటమై యనుసరించె. ౩_౨౫

ఉ. వారలు శీఘ్రయానమున ద్వారముఁ జేరి నివారితాధ్వులై
ద్వారము గాచువారిఁ గని పల్కిరి తాపసవేషధారులున్,
భారతరాజదర్శన కవారితులై చనుచుండ్రు తాపసుల్,
మీ రొనరించువారణ యమేయము నశ్రుతపూర్వముం జూఁడీ !

క. ఆరోపింతుము సౌధము
నారాజుకుఁ గాన్క లిచ్చి మాకొలఁదిగ నా
శీరుక్తుల యుక్తునిఁగాఁ
జేసెంతుము, మాకుఁ బోవఁ దెరు విం డనినన్. ౩_౨౬

క. వినయంబున రక్షకు లి
ట్లనిరి నిషేధించె నిప్పు డఖిలజనులకున్
జనపతి యిందుం జొచ్చుట,
కనుఁ డగు రేపాడి మీరు కాంక్షింతురయేన్. ౩_౨౭

ఆ. అట్లు వల్క భోగు లనిరి, పోనిందు లే,
తెచ్చినాము రాజు కిచ్చు కొఱకు
జలము పండ్లు మూలములును, నాశీస్సులఁ
గొందు వీని నిచ్చిరందు పతికి. ౩౮౯

క. వా రది నృపతికిఁ జెప్పినఁ
దేరంగ ఫలాదు లనుమతించి బహునమ
స్కారములం దెలుపుఁడు; శ్రే
పే రం డని వేఁడుఁ డని నరేంద్రుఁడు పంచెన్. ౩౯౦

తే. అది నివేదింప రక్షకు లవనిదేవ
వేషభోగులు నట్లు కావించి చనిన;
వార లిచ్చిన ధన మూల ఫలము లపుడు
విభుసముంగల నుంచిరి వినతు లగుచు. ౩౯౧

క. ఫలములఁ గొని భూపాలుఁడు
పలికెను సచివులకుఁ మీరు భక్షింపుం డీ
ఫలముల నని, వారల కా
ఫలముల నన్నియును బంచి, స్వయముగ నందున్. ౩౯౨

క. ఫల మిది పరిపక్వము ద్విజ
కులదత్త మటంచు విచ్చి గొబ్బున నందున్
నలు పగు నయనంబులతో
నలఁతి పురువుఁ దామ్రతనువు నాలోకించెన్. ౩౯౩

చ. అది గని విస్మితాత్ము సచివావళి కి ట్లనె నుత్తరానుతం,
డదె రవి యస్తమించెడి, విషాప్తివిషాదము నస్తమించును
న్నది, మునిశాప మానకర్తృము కా దన కొప్పుకొందుఁ. బ
ర్వది, ననుఁ గాటువేయుత యథేచ్ఛనటంచు ధరించెఁ గుత్సుకన్.

మ. దిననాథుం డపరాద్రిఁ గ్రుంకుతఱి ధాత్రీపాలకుం డా క్రిమిన్
దనకంఠంబునఁ దాల్పఁ దక్షకుఁడు విస్తారోగ్రరూపంబు పె

ల్చినఁ బెం పొంది భయానకప్రకృతిఁ గాలప్రఖ్యుఁడై తాల్చి భూ
వుని భోగంబులఁ జుట్టి, ముట్టి కఱచెన్ ఫూత్కారఘోరంబుగా.

క. స్నేహితు లేడ్చిరి, సచివులు
మోహితులై రెదల, వగలఁ బొగిలిరి వృద్ధుల్,
హాహాకారం బెల్లెడ
వ్యాహృతమై పెంపు గాంచెఁ బరిజనములలో. 33౬

క. వేష్టితుఁడై తక్షకుచే
నష్టాఖిలపౌరుషుఁడుఁ బ్రణష్టచలనుఁ డ
స్పష్టధృతి పరీక్షిన్నృపుఁ
డిష్టులకున్ దుర్నిరీక్ష్యహీనత బ్రుంగెన్. 33౭

క. ఘోరములై యహిముఖని
స్సారిత గరళాగ్నిశిఖలు క్షణమాత్రములో
మారణదహనము సేయఁగ
నే, రాజుం గూలె దగ్ధవృక్షోపముఁడై. 33౮

క. రక్షకు లందఱుఁ గనఁ జనెఁ
దక్షకుఁ డప్పు డంతరిక్షధామముదారిన్
సాక్షేపాక్షేప జగ
ద్భక్షణకరసోత్థ సర్వభక్షునిరూపై. 33౯

సీ. విగతజీవుని భూపు వీక్షించి జను లెల్ల
విలపించి రెంతయుఁ గలఁత సెంతఁ
బుత్రుని బాలుని మునుకొని మంత్రులు
పరలోకసత్క్రియల్ జరుపఁ దొడఁగి
విషదగ్ధమై భస్మవిధి నున్న తత్తను
నగురుకాష్ఠముల జాహ్నవితటమున
దుర్మరణాగత దోష ప్రాయశ్చిత్త
విధిపూర్వముగ దాహవిధులు దీర్చి

యూర్ధ్వదైహికక్రియలు శాస్త్రానుగదిత
రీతిఁ జేసిరి, చేసి యుర్వీసురులకు
బహువిధంబుల దానముల్ పాడియావు
లన్న వస్త్ర ధరా సువర్ణాదికములు. ౨౮౦

ఉ. అంతటఁ బౌరజానపదు లందఱఁ బిల్చి తదీయవాంఛ న
త్యంత మెఱింగి మంత్రు లఖిలావనిపాలనలక్షణాళి భా
స్వంతుఁ బరీక్షిదాత్మజుని బాలకునిన్ జనమేజయాఖ్యు నా
శాంతమహీశుఁ జేసిరి శుభాహమునం దిడి సింహపీఠిపై. ౨౮౧

క. ధాత్రేయీశిక్షితుఁడై
ధాత్రీశుఁడు రాజచిహ్నధరుఁడై విలస
ద్గాత్రుండై సర్వాదర
పాత్రుండై దినదినప్రవర్ధితుఁ డయ్యెన్. ౨౮౨

తే. పదునొకండవయేఁడు సంప్రాప్తమైనఁ
గులపురోహితుఁ డతనికిఁ గులనియుక్త
విద్య నొసఁగిన, నతఁడు నా విద్యఁ గొనియె
నిజకులక్రమాగతమైన నీతి నెఱయ. ౨౮౩

క. నృపుఁడు ధనుర్వేదంబున
నిపుణతఁ బరిపూర్ణదీక్ష నిష్ఠితుఁ జేయన్
సుపరిష్కృతుఁడై వడసెను
నృపతియుఁ గుంభజునికడఁ గిరీటియుఁ బోలెన్. ౨౮౪

క. వేదంబున మఱియు ధను
ర్వేదంబున ధర్మశాస్త్రవిస్తర నృపనీ
త్యాదిక సమస్త విద్యల
వైదుష్యము కలిగి వెలిఁగెఁ బారీక్షితుఁడున్. ౨౮౫

క. బలవంతుఁడు శుభదర్శనుఁ
డలఘుపరాక్రముఁ డనింద్యుఁ డనవిక్రముఁడున్

లలితుఁడు జితేంద్రియుఁడునై
యిల ధర్మజురీతి ధర్మ మెడయక యేలెన్. ౩౮౬

తే. వానికల్యాణసుగుణసంపత్తి గాంచి
యతనికి సువర్ణవర్మాఖ్యుఁ డనఁగ వెలయు
కాశికాపతి శుభగుణరాశియైన
కన్యక వపుష్టమ నొసంగెఁ గాంతగాఁగ. ౩౮౭

ఉ. దానిని నల్లగల్వలవితం బగు గన్నులదానిఁ, దేంట్లచం
దాన నెసంగు దీర్ఘలలితంబు కచం బగుదానిఁ, గుండలం
దానకునుర్ నిధాన మగు తన్పగు చన్నులదాని, గంగతీ
రాన వెలుంగు సైకతవిరాజి నితంబముదాని నా సతిన్. ౩౮౮

వ. కూడి జనమేజయుండు వనంబుల నుపవనంబుల వివిధ విహార విలాస
కేళీవినోదంబులఁ దవిలి, కాశీరాజసుత యగు నంబికం గూడి విచిత్ర
వీర్యుండును, సుభద్రం గూడి యర్జునుండునుంబోలె, నిరంతరతదా
యత్తంబగు చిత్తంబున నితరం బెఱుంగక యుండె. ౩౮౯

### జనమేజయుండు సర్పయాగం బొనరించుట

తే. అట్టియెడఁ దీక్షుఁ డుత్తంకుఁ డనెడు వాని
తక్షకుని కీడుసేఁత సంతప్తుఁ డగుచుఁ
దదపచితికి సమర్థుని వెదకి తుదకు
నెంచి పారీక్షితునిఁ జేరె నిభపురంబు. ౩౯౦

క. జనమేజయు నుత్తంకుఁడు
గని యిట్లనెః నకట! నీవు కార్యాకార్యం
బను వెఱుఁగ, వకర్తవ్యం
బొనరుతు, కర్తవ్యకలన నూనవు బుద్ధిన్. ౩౯౧

క. ఏ మనఁ గల నిన్నయ్యో గ
తామర్షుని విస్మృతారి నకృతోద్యమునిన్

భూమీశు బాలచేష్టా
రాము నతంత్రజ్ఞు నేమి ప్రార్థింతుఁ బ్రభూ ! ౩౫౨

ఆ. బదులు పలికె నిట్లు పార్థుమ్మనుమండు
నెఱుఁగకున్న వైర మేమి నాకు
నేను ప్రతికృతంబు దేనికిఁ జేయ ని
ష్టే మొనర్ప వలయు నో మహాత్మ ! ౩౫౩

క. వానికి నుత్తంకుం డనె
నో నృప ! నీతండ్రిఁ జంపె నొక జిహ్మగ దు
ర్మానుఁడు తక్షకుఁ, డడుగు మి
దే నీమంత్రులను దండ్రి యీల్గినవిధముల్. ౩౫౪

సీ. రాజు విని యది మంత్రులఁ బ్రశ్న సేయ
వారు పల్కిరి ద్విజశాపవాక్కువలనఁ
బాము గఱచిన నీతండ్రి పడె నటంచు
నది వినుచు విస్మితుం డయి యడిగె రాజు. ౩౫౫

ఆ. మౌనిశాప మండ్రు దానికారణ మిందుఁ,
దక్షకుం డదేమి తప్పు చేసెఁ ?
దెలుపు మన్న, మౌని తెలిపెఁ, గశ్యపునకు
నను వొసంగి తిరిగి పంపిన కథ. ౩౫౬

క. మఱియుం జెప్పం దొడఁగెను,
రురుఁ డనియెడు విప్రుఁ డొక్కరుఁడు ప్రియఁ గాకో
దర మది కఱచుట మడిసినఁ
విరుగం బ్రదికించి పూనెఁ దీవ్రశపథముల్. ౩౫౭

క. ఇది మొదలుగ నేఁ జంపెద
వెదకి వెదకి యెల్లఫణుల పృథ్వీస్థలి నం,
చది మొదలటులే సేయుచు
ముదుసలి డుండుభముఁ గాంచి మోదం బోయెన్. ౩౫౮

వ. అది గని యా డుండుభంబును, నో బాడబశ్రేష్ఠా! నీ కెగ్గేమి యొ
ర్చితి? నన్నెందుల కూరక చిదుమ నేయం బూనెద? వుడుగు; మన.
వాఁడు, నేను రురుండను; మీజాతి ద్విజిహ్వం బొకండు నిరపరాధ
యగు నాప్రియురాలిం గఱచి పొట్టం బెట్టుకొనియె; నది మొదలు
తత్ప్రతీకారంబుగ నఖిలవ్యాళ మథనంబునఁ గృతప్రతిజ్ఞుఁడ నైతి;
నన డుండుభ మిట్లనియె. ౩౫౯

క. నే నట్లు కఱచుపామును
గానయ్య! సమానరూపకలితుఁడ నింతే,
ప్రాసకు చంపఁగ నను, నను
మానుషసుమనోజ్ఞవాణి మానుగ వించుకా. ౩౬౦

క. నీ వెవఁడవు డుండుభతను
వేవిధమునఁ గలిగెఁ బలుకుమీ నావుడు వాఁ
డావిధ మంతయు రురునకుఁ
దా విస్తరముగను చెప్పెఁ దత్క్షణ మిటులన్. ౩౬౧

తే. మున్ను నే బ్రాహ్మణుండనై, మూర్ఖవిధిని,
సఖుఁడు ఖగమాభిధుం డగ్నిశాల నుండ,
వాని బెదరింపఁ దృణకృతఫణిని వేయఁ,
గనలి శపియించె, డుండుభతనువుఁ బూన. ౩౬౨

తే. శాపమోచన మర్థింప శాంతుఁ డగుచుఁ
బల్కె సఖుఁ డిట్లు, లెప్పుడు ప్రమతిసుతుఁడు
రురుఁడు నినుఁ గాంచు, నప్పుడు మరలఁ బ్రకృతి
నందెద వటంచు; నా రురుం డవుదు వనఘ! ౩౬౩

తే. మఱియు. బల్కెదఁ బరమధర్మంబు వినుము,
విప్రుల కహింస విహితమై వెలయు నెందు,
యజ్ఞవిహితం బహింస, దయారసంబు
నెఱుక గల విప్రుఁ డెల్లెడఁ బఱపవలయు. ౩౬౪

క. పాపమెయిం బాసి చనెం
బాపఁడు రురుఁ డంత నదలెఁ బన్నగహింసన్;
గోపించి పారుఁ డహివధ
దీపించెను, నీవు మఱచి తెలియవు రాజా! ౩౬౫

ఉ. కూడని చావు వచ్చినదికూడను జూడుము తండ్రికిం ద్రిథా
పాడుది పాపకాటు మృతి, పాడగు చావది స్నానదానముల్
వీడిన, నంతరిక్షమున వేఁచిన చావది, కూడ దన్నిటం
గీడొనరించి దుర్గతి లగింపఁగఁ జేసెను దక్షకుం డిటుల్. ౩౬౬

క. జనకుని సముద్ధరించెడు
మన సున్నెడ, నంబపేరి మఖమిషమున నీ
క్షణమున నె సర్పసత్రం
బొనరింపఁగ దీక్ష పూను మో రాజన్యా! ౩౬౭

క. ఆమాటలు జనమేజయ
భూమీశుఁడు వినినమాత్ర పొంగఁగఁ గనులన్
భూమముగ బాష్పధారలు
తా మాటాడంగ రాక తడఁబడుచు ననెన్. ౩౬౮

క. ఛీ! యేటికి నాజన్మము?
మాయ య్యటు ఘోరసర్పమరణముఁ గొనఁగా,
నే యపచితి చేయనఁ నే,
డే యజ్ఞాగ్నిని ఫణుల దహింపఁ దివురుదున్. ౩౬౯

సీ. తత్క్షణంబున మంత్రు లందఱను బిలిచి
తక్షకుఁడు యజ్ఞపశువు, నుత్తంకహూని
హోతగాఁ, జేయు మఖమున కుచితవస్తు
వులను గూర్ప నియోగించి పలికె నిట్లు. ౩౭౦

క. పిలిపింపుఁడు సద్ద్విజులను
గొలిపింపుడు నేల గంగకూలమునందున్,

నిలిపింపుఁడు శతశాలను,
మలిపింపుఁడు యజ్ఞవేది మహనీయముగాన్. ౩౨౧

తే. మఱితు లాలించి సర్వసంపన్నముగను
యజ్ఞసంభారములు కూర్చి, యతివిశాల
వేది యమరించి, పిలిపింప వేదవిదుల,
సర్పసత్రము చేయంగ సాగె రాజు. ౩౨౨

క. ఫణిహవనము సాగెడు నెడ
వణఁకుచుఁ దక్షకుఁడు వోయి వాసవు సంర
క్షణ మడుగ, నతఁడు కరుణే
క్షణ సభయు మొసంగి నిలిపె స్వాసనమందున్. ౩౨౩

తే. తక్షకుం డింద్రశరణుఁడై త్యక్తభీతి
నుండు టెఱిఁగి యుత్తంకుఁ డుగ్రోద్యమమునఁ
దక్షకుని సేంద్రుఁగా నిమంత్రణము సేసి
రమ్మనుచుఁ బల్కె బ్రాహ్మనిర్ఘాతవాణి. ౩౨౪

క. ఆయెడఁ దక్షకుఁ డడలుచు
యాయావరకులజుఁ దలఁప నాస్తీకు మదిన్,
బోయి యతఁడు జనమేజయు
నాయాగము ఋత్విజులను నభినుతి చేసెన్. ౩౨౫

క. పండితుఁ డగు నాయర్భకు
మెండగు తేజస్సు చూచి మెచ్చి, నృపుఁడు, కో
ర్కొండు వరం బేదేనియు
నొం డనక మహాత్మ! దాని నొసఁగెద ననినన్. ౩౨౬

తే. యజ్ఞవిరమణంబ యాతండు కోరిన
సఖలమునులు నవ్వు డదియ వేఁడ
సత్యబద్ధుఁ డగుచు జనమేజయనృపుండు
సర్పసత్రహోమ శాంతి చేసె. ౩౨౭

## వ్యాస జనమేజయ సంవాదము

క. జనమేజయుఁ డంతట జయ
మును వైశంపాయనుండు మునిచంద్రుఁడు చె
ప్పిన వినియును శాంతింపఁ
మనమున నొకనాఁడు వ్యాసమౌని కిటు లనెన్. ౨౭౮

తే. దేవ! యేరీతి నాకు శాంతించు మనసు?
పార్థమనుమండు నాతండ్రి పాఁపచావు
నంతరిక్షంబునం గాంచె నవశుఁ డగుచు
నెట్లు నాతండ్రి గాంచు నిర్వృతి? వచింపు. ౨౭౯

తే. భూభుజుల కుత్తమము రణభూమిఁ దెగుట,
మధ్యమము విధిపూర్వకమరణ మింట,
దుర్మరణ మొంది చనెఁ దండ్రి దుర్గతిమెయి,
స్వర్గముం గూర్పఁ గల శాంత్యుపాయ మేది? ౨౮౦

క. ఆసరణిన్ జనమేజయు
చేసిన ప్రశ్నంబు వించుఁ జెలఁగుముదముతో
నా సభ నాలోకించుచు
వ్యాసుం డిటు లానతిచ్చె వసుధేశునకున్. ౨౮౧

క. వినవయ్యా జనమేజయ!
వినిపింతుఁ బురాణవరము వివిధకథాశో
భన మతిగుహ్యము నద్భుత
మును రమ్యము శివము శుభము పుణ్యము నరమున్. ౨౮౨

క. భాగవతాఖ్యానం బది
యోగమ సర్వార్థ సార మది విన్నంతన్,
యోగించుఁ జతుర్వర్గము,
నే గోప్యము దీని శుకున కిచ్చితి మొదలన్. ౨౮౩

వ. జనమేజయుం డి ట్లనియె. ౩౮౪

తే. దేవి! యేమి చేసి తివికి యాస్తీకుఁ డా
యాగమునకు విఘ్నమాచరించె?
నెవరు వానితండ్రి? యేటికి సమకట్టె
ఘనులఁ గావ? వివరదపరప్రమయ్య: ౩౮౫

వ. వ్యాసుం డి ట్లనియె. ౩౮౬

సీ. మును జరత్కారుఁ డను ముని శాంతుఁడు విరక్తుఁ
డయి గృహం బొల్లక యరుగ నొకటఁ
గనఁబడి యతనికి వనమున నొక గర్త
మున వ్రేలు తత్పితృగణము పిలిచి
పలికె ని ట్లని! పుత్ర: సలుపు గార్హస్థ్యంబు.
దాన సంతృప్తి నెంతయును బొంది,
నిశ్చింతమై స్వర్గనిలయుల మగుదు మ
టన్న వారల కిట్టు లనియె వాఁడు,

నా కయాచితమై మఱి నామపేరు
కలిగి, నా నేరలేని నిల్చు కన్య ప్రాప్త
మయిన సతిగా గ్రహింతు సత్యంబు నమ్ముఁ
డంచుఁ దనయిచ్చ నేగెఁ దీర్థాభికాంక్ష. ౩౮౭

తే. అప్పుడే పన్నగుల నెల్ల నగ్నిఁ బడఁగఁ
గద్రువ శపించెఁ దల్లి; యాకథను వినుము:
కశ్యపునిపత్ను లిద్దరు కద్రువ యను
వినత యను నారు విహరించు వేళ నొకట. ౩౮౮

క. వినమణిరథరథ్యంబును
గను మల్లదె యంచుఁ జూపి కద్రువ యడిగెన్,
వినతా! యూహయుపవర్ణం
బును దెల్లం గలదె నీవు ముందన నదియున్— ౩౮౯

ఆ. అరసి చూడఁ దెలని దా యశ్వరాజంబు;
నేమి గాఁగ దాని నెంచె దీవు!
పలుకు మీావు నంతఁ బందెంబు సఱతమే
యనుడు వినత కప్పు డనయె సవతి. ౩౯౦

క. ఓ వెఱ్ఱిదాన! చూడవె
యీావార్వము కృష్ణవర్ణమై యొప్పెడి, నిం
దీ వోడిన నాదాసివి
కావుట పందెంబు, నేను గావుట నీకున్. ౩౯౧

క. మఱునాఁడు వారివాదం
బిరువురుఁ గని నిశ్చయించు నిచ్చ నచేగి ర
ట్లరిగి పృదాకుప్రసు వది
యురుగుల నెల్లరను బిలిచి యొయ్యనఁ బలికెన్. ౩౯౨

క. పందెము గలిగెం జని మీా
రందఱు రవిహయ తనూరుహంబుల మఱుగౌ
పొందిక వ్రేలుఁడు నలు పగు
చందంబునఁ గానిపింప జయ మగు నాకున్. ౩౯౩

క. కొందఱు కా దన వారల
నందఱ శపియించె నగ్నియందుఁ బడంగాఁ,
గొందఱు మాతృకృతాజ్ఞా
చ్ఛందంబున వ్రేలి నలనిచాయగ హయమున్. ౩౯౪

ఆ. కానిపించునట్లుగాఁ జేయ, సవతులు
చూడఁ బోయినంత నోడె వినత;
దాసి యగుచు వినత దైన్యంబునం గొల్చె
సవతి, నట్లు పెద్ద సమయ మరిగె. ౩౯౫

క. గరుడుఁడు సువర్ణపక్షుం
డురుజవసత్త్వాఢ్యుఁ డుగ్రుఁ డుదయార్కసమ

స్ఫురణుఁ డుదితుఁ డయి వినతకుఁ
గరములు జోడించి పలికెఁ గడు వినతుండై. ౧౯౭

క. తల్లీ! యేటికి నిటు దుర
పిల్లెదు, నేఁ గలుగ దుఃఖభీతి య దేలా?
తల్లులశోకము దీర్పని
పిల్లలు వా రేల? వంత పేర్కొను, తీర్తున్. ౧౯౮

ఆ. కనుల జాఱ బాష్పకణవార మది పల్కెఁ,
దండ్రి! నేను సవతిదాసి నైతిఁ,
దన్ను మోయు మంచు నన్నాన్చి తన్నెడి
దాని మోయలేక దీన నైతి. ౧౯౯

క. గరుడుఁడు తల్లికి మాఱుగఁ
బరివహన మొసర్ప నాజ్ఞ బడసి కుటిలు లా
నురుగులఁ గద్రువ కోడ్రన్
సరిగా మోయుచును జేర్చె సాగరతటమున్. ౨౦౦

సీ. దీక్షతో మాతృదాస్యవిమోక్షకాంక్షఁ
గద్రువకు మ్రొక్కి యడిగెను గరుడుఁ డపుడు,
తల్లి! సెల విమ్ము, మాతల్లి దాస్య మెట్లు
వీఁగు? నన నది యమృతంబు వేడెఁ దేర. ౨౦౧

మ. జననీదాస్యవిమోచనార్థము సుధాసంపాదనోద్యోగియై
వినతాపుత్రుఁడు విచ్చి పక్షములు తద్విక్షేపముం జేయఁగా
వినువీధిన్ రవ మొం డపూర్వముగ నావిర్భావ మందెన్ జయం
బని వాఁడున్, త్రిదశుల్ నయంబని, భయం బంచున్ భుజంగుల్ వినన్

ఉ. పటుతరశీఘ్రయానమునఁ బాఱెఁ బతండును మింటఁ దేజము
త్కటముగ, రెండవున్ రవి యితం డన నొప్పి, సువర్గమున్ విశం
కటగతిఁ జేరి రక్షకులఁ గాఁపుల ముక్కున నొంచి, తత్సుధా
ఘటము గ్రహించి, లీలఁ దిరుగం బఱతెంచెను సిద్ధయత్నుఁడై.

తే. తెచ్చి దర్భలపై నుంచి దివ్యఘటము
కద్రువకు నప్పుఁ జెప్పి విష్కర్షఁ జేసి,
వినత దాస్యంబువలన నివృత్త యగుట
జననిఁ గొని వైనతేయుండు చనె యథేచ్ఛ. ౧౦౩

క. అమృతప్రాశన చేసెడి
తమకంబున భోగు లెల్లఁ దానములకుఁ బో,
సుమనప్పతి పదిలంబుగ
నమరావతిఁ జేర్చెఁ గొంచు నమృతఘటంబున్. ౧౦౪

క. స్నానాంతర మటు లటఁ
గానక కుంభంబు పాదుగా నుంచిన ద
ర్భానీకము దమ నాల్కల
చే నాక ద్విజిహ్వు లైరి జిహ్వాలు ప్రీలన్. ౧౦౫

తే. మాతృశాప భయార్దిత మానసు లయి
వాసుకిప్రముఖు లగు సర్పప్రభువులు
బ్రహ్మకడ కేగి జననిశాపంబు తెలిపి
శరణు వేఁడిన నతఁడు సకరుణుఁ డగుచు. ౧౦౬

తే. వడి జరత్కారుఁ డనియెడి పరమమునికి
వానికి సనామ వాసుకిభగిని నిండు;
వారి కాస్తీకుఁ డనెడి కుమారుఁ డుదయ
మై మిమ్మున్ రక్షసేయు సత్రాగ్నివలన. ౧౦౭

ఆ. అనుచుఁ జెప్ప వార లపుడ జరత్కారు
మునివనంబు చేరి ప్రణతు లగుచుఁ,
బాణిఁ బట్ట వేఁడ వాసుకి చెలియలి
నియ్యకొనియె నియమ మి ట్లొనర్చి. ౧౦౮

ఆ. అప్రియంబు నాకు నాడరా దెప్పుడు
నెప్పు డాడె నపుడ యేఁ ద్యజింతు,

ననిన వార లొప్ప నామెను బరిణయ
మై నిజాశ్రమమున కరిగె నతఁడు. ౪౦౯

క. అశనానంతర మొకనాఁ
డు శయించి యతండు నిద్రఁదూలన చేయన్,
'విశదానన! నను నిద్రా
వశు లేపకు' మంచుఁ గూర్కఁ బ్రారంభించెన్. ౪౧౦

తే. ఆదమఱచుచు సుప్తుఁడై నంతలోనఁ
గర్మసాక్షి యస్తాద్రిఁ గ్రుంకంగ నుండె,
సాంధ్యకృత్యంబులం దీర్చు సమయ మైన
ధర్మమున కోడి యాసతి తలఁచె నిట్లు. ౪౧౧

క. కోపనుఁడు విభుఁడు నిద్రన్
లేపినఁ గోపించి చనును, లేవక యున్నన్
లోపించును సంధ్యాకా
లాపృతధర్మంబు; ధర్మహానియె బలమా. ౪౧౨

క. నరులకు ధ్రువమ్ము మరణము,
నరకం బగు ధర్మహీననరులకుఁ; గానన్,
వర మగు నధర్మమునఁ బతి
బొరయించుటకంటె నల్క ముంచుట యంచున్. ౪౧౩

క. లేవయ్య సంధ్య వార్వఁగ
దేవా! యిదె సూర్యుఁ డపరదిక్కున జాఱెన్,
లేవయ్యా సువ్రత! సం
ధ్యావేళ యతిక్రమించు నవసర మయ్యెన్. ౪౧౪

తే. అట్టు లాబాల బోధింప నతఁడు లేచి
కుపితుఁడై నిద్ర చెఱచిన కుమతి నిన్ను
విడుచుచున్నాఁడ నీయన్నకడకుఁ బొ మ్మ
టంచుఁ బల్కిన నది వేపితాంగి యగుచు. ౪౧౫

క. ఉలుకుచు, వాసుకి నను నెం
దులకై నీ కొసఁగె, దానితుద గానక యి
ట్టు లనుచు టుచితమె ప్రభు ! యనఁ
బలుకుచు నతఁ 'డస్తి' యంచు వదలెన్ దానిన్. ౪౧౬

తే. అదియు నంతట వాసుకిసదనమునకుఁ
జని నివేదింప జరిగిన సర్వకథయు
సత్యవాక్కని యెఱిఁగి విశ్వస్తుఁ డగుచుఁ
జెల్లెలిని వాసుకియు రక్ష సేయుచుండె. ౪౧౭

తే. ఆమెకు జనింప బాలకుఁ, 'డస్తి' యనుచుఁ
జనుటచేఁ దండ్రి, 'యాస్తీకుఁ' డన నెసంగె;
నాతఁడే మాతృపక్షరక్షార్థి యగుచు
నిన్ను వేఁడి నీసత్రంబు నిలుపఁ బంచె. ౪౧౮

తే. ఆ మహాత్ముని యాయావరాత్మజాతుఁ
బూజ జేసి యెంతయు నైతి పుణ్యమతివి,
భారతము వింటి, విచ్చితి బహుధనమ్ము,
లర్చ జేసితి మునుల, నీ కౌను స్వస్తి. ౪౧౯

క. ఐనను విను జనమేజయ!
యీ నీ వొనరించి నట్టి యిన్ని సుకృతులన్,
గానఁడ మీపిత స్వర్గతి,
నూనద మీకులము పుణ్య ముకుమహిమమునన్. ౪౨౦

ఉ. ఓ జనమేజయా! యిపుడ యొక్క మహాయతనంబు శ్రద్ధతో
యోజితమైన భక్తిమెయి నూన్పఁగఁ బంచుము, దేవి కయ్యెడం
బూజ లొనర్పు, భాగవతపుణ్యపురాణము విన్ము, చేయుమా
భ్రాజితలీల శ్రీపదపురస్సర యాగము దక్షిణార్చలన్. ౪౨౧

క. పరదేవ్యంబా శుభమఖ
నిరతునకుం గులము పెరుగు, నివ్వాఱ తఱుఁగున్,

దిర మగు రాజ్యము సిరియును;
కర మరుదగు కోర్కె లెల్లఁ గరగతము లగున్. ౪౨౨

క. ఏవారలచిత్తంబుల
దేవీరూపంబు నిలిచి దీవ్యత్పదను
శ్రీ విన్యాసము చేయునో,
యావారలె ధన్యతములు నక్షరమహిముల్. ౪౨౩

క. ఎవ్వారు మాయాశక్తిని
నివ్వటిలన్ హృదయగతుల నిలిపి కొలువరో,
యెవ్వారలె కన నయ్యెద
రివ్వసుమతి దుఃఖగతుల నెల్లవిధములన్. ౪౨౪

మ. సంసారార్ణవతారకం బయి సుధాసారప్రసార స్ఫుర
చ్ఛంసానంత రసాలవాల మయి విస్తార ప్రజా పాప వి
ధ్వంసంబై కడుఁ బావనంబు నయి వేదంబై పురాణావళీ
హంసంబై పొలు పొందు భాగవతమున్ సద్భక్తి నాలింపుమా.

క. నే నెఱుఁగను జ్ఞాతవ్యము,
దీనిని మించెడి పురాణ తిలకము నెందున్.
నే నెఱుఁగ శిరోధార్యము
శ్రీనామక మాతృ పాద రేణువు కంటెన్. ౪౨౫

క. ఏదీప్తిని బ్రహ్మాదులు
శ్రీదం బని కొల్తు రెదల సేవ్యం బదియే
శ్రీ సంయుతమున కెఱిఁగించెనొ
శ్రీ దేవీ భాగవతము చెప్పెద వినుమా. ౪౨౬

క. ఇది యెవ రనుదినమును విని
యెదరో, వారలకుఁ గల్గు నెల్ల ఫలంబుల్;
ఇది విన్న శాంతి నీ కెద
నొదవును, మీతండ్రి పడయు నుత్తమపదమున్. ౪౨౭

విద్యున్మాలా— శ్రీదేవీ ధీ చిత్తశ్లోకా!
పాదధ్యాతృప్రాప్తశ్రీకా!
వేదాంతోద్యద్విద్యున్మాలా!
ప్రాదుర్భూత భ్రాంత్యున్మాలా! ౪౨౯

గద్యము— ఇది జగద్గురు శ్రీ కల్యాణానందభారతీ స్వామి కరకమల ప్రసాదాసాదిత శ్రీ కవిసమ్రాట్పట్టాభిషేకశ్రీక, హారితసగోత్ర పవిత్ర, ఆపస్తంబసూత్ర, శ్రీమహాలక్ష్మ్యంబా హనుమచ్ఛాస్త్రి పుత్త్ర, వేంకట లక్ష్మీ నరసింహశాస్త్రి విజ్ఞానయోగ దర్పణ ప్రతిబింబిత శ్రీదేవీభాగవతంబునందు ద్వితీయస్కంధము. ౪౩౦

శ్రీః

# శ్రీ దేవీ భాగవతము

## తృతీయ స్కంధము

శ్రీదేవీ పూజా సం
పాదిత విజ్ఞాన సాధ్య వాగ్దేవీ ప్రో
క్తాదిశ్రుతి గోప్య వివర
ణోదిత కల్యాణ సార్థ కోత్తమనామా ! ౧

వ. అవధరింపుము, జనమేజయమహీజాని, కృష్ణద్వైపాయనమునిం గని
యి ట్లనియె. ౨

### శ్రీ దేవీ స్వరూపాది ప్రశ్నము

క. స్వామీ! యంబాముఖ మది
యేమార్గము చేయు, దాని దేరూపంబో,
శ్రీమాత యెట్టి, దెటు లెట
నేమిటి కుదయించెఁ దెల్పు మిది సర్వజ్ఞా ! 3

క. తెలుపుము బ్రహ్మాండం బెటు
కలిగెఁ, విధి హరియు హరుఁడు కారణు లనుచున్
బలికెదరు సృష్టికి స్థితికి
విలయమునకు నది నిజంబొ, వే ఱొక తెఱఁగో! ౪

క. వారలు స్వతంత్రు లగుదురో
కారో, వివరింపుమయ్య ! కాలవశగులై
వార లడఁగుదురో, శోకా
పూరితులో, చిత్స్వరూప పూర్ణులో తలఁపన్ ? ౫

క. అధిభూతం బధ్యాత్మం
బధిదైవం బనఁగఁ ద్రివిధ మగు దుఃఖములన్
వ్యథ నొందెదరో, యిఁక ని
ర్వ్యథులును నానంద సచ్చిదాత్ములొ వారల్ ? ౬

క. కలుగునె హర్షము శోకం,
బలసత నిద్రయును వారి నలఁచునె, దేహం
బులు సప్తధాతునిర్మిత
ములొ, కావో, వారివేసి, బోధింపఁగదే ! ౭

ఆ. ఏమిద్రవ్యములను నేమిగుణంబుల
నెట్టి యింద్రియములఁ బుట్టినారు ?
భోగ మెట్టి, దెది విభూతి, యాయు వ దెంత,
వాసపదము నేది ? పలుకు దేవ ! ౮

వ. వ్యాసుం డి ట్లనియె. ౯

తే. నీవు చేసిన ప్రశ్నముల్ నిస్తులమ్ము,
లిట్టులే పూర్వ మొకతఱి నేనుఁగూడ
విధి హరాదుల యుత్పత్తి వేఁడి యెఱుఁగ
నారదమునీంద్రు సర్వజ్ఞుఁ జేరఁ బోతి. ౧౦

మ. విమలంబౌ సురవాహినీతటిని నా విప్రోత్తముఁ వేదవి
త్తము నేకాంతమనోజ్ఞసైకతమునన్ దర్శించి పాదప్రణా
మము సాష్టాంగముగా నొనర్చి నిలునం బార్శ్వంబునం బ్రీతి నా
సముపాసీను నొనర్చి క్షేమ మడుగన్, బ్రశ్నంబు గావించితిన్.

శా. స్వామీ! సంశయ మయ్యెఁ దెల్పఁగదె యీబ్రహ్మాండ ముత్పన్న మా
య్యా? మూలం బెది? యేకకర్తృకమొ, లేదా యెందఱేఁ జేసిరో,
యేమూలంబును గాదొ, నిత్య మగునో, యేమాత్రముం గాదొ, యే
యేమార్గంబున గార్యసంభవము నయ్యెన్ హేతుశూన్యంబుగా?

ఉ. కారణకారణుండు భవకాలవివర్జితుఁ డాశ్రితాళిసం
తారకుఁ డౌ సురేశ్వరుఁడు సదాశివుఁడే యని కొంద ఱంద్రు, వి
స్తారమహాత్ముఁ డచ్యుతుఁడె సర్వవిభుం డని కొందఱున్, జగ
త్కారణుఁ డాత్మసంభవుఁడు గాఁగఁ జతుర్ముఖుఁ గొంద ఱంద్రుగా.

మ. సాయంప్రాతము వేదవాదులు సదా సర్వాత్ముఁగా నీశుఁగా
ధ్యేయుంగా స్తవనీయుఁగా సవితృబుద్ధిన్ గొల్చి కీర్తింతు, ర
స్థే యజ్ఞేశుని యజ్ఞభోక్తను సురాధీశుం ద్రిలోకాధిప
త్యాయత్తున్ మఘవున్ శతక్రతువు నిత్యం బింద్రునిం గొల్తురన్.

ఉ. కొందఱు కొల్తు రా వరుణుఁ, గొందఱు సోమునిఁ, గొంద ఱగ్నినిం,
గొందఱు వాయుదేవు, మఱికొందఱు ధర్ముఁ, గుబేరుఁ గొందఱున్,
గొందరు సర్వకార్యములఁ గూర్చి గణేశుని నేకదంతు న
న్పొందు గజాస్యు సంస్మరణభావశివంకరు నెంతు రీశుఁగాన్. ౧౫

సీ. ప్రకృతిని బురుషానువర్తి మహాశక్తి
నాదిమాయ భవాని నఖిలధాత్రి
నాద్యంతరహిత బ్రహ్మైకతా సంపన్న
సృష్టి సంస్థితి లయ హేతుభూత
సర్వదైవతభూత జనని సర్వేశ్వరి
సర్వజంతువ్యాప్త సర్వపూర్ణ
భవతరుసంభూత ఫలరూప విద్యైక
వేదమాత రుజాపనోదనఘన

తే. మోక్షదాత్రి నిర్గుణయై ముముక్షువులకు,
సగుణయై కామదాత్రి సంసారులకును,
గుణజనస్థయై గుణాతీత, గురుజనములు
కొంద ఱా పరాపరరూపఁ గొల్చుచుంద్రు. ౧౬

క. దానినె వైష్ణవి శాంకరి
దానినె వారాహి బ్రాహ్మి దానినె యైంద్రిన్

దానినె వారుణి లక్ష్మియని
దానినె శ్రీ నారసింహిఁ దలఁతురు మదిలో. ౧౭

తే. రూప గుణ లేప రహితంబు వ్యాపకంబు
బ్రహ్మము నిరంజనం బని పలుకుచుండు,
రదియు కొందఱు మునులు, వేదాంతములను
వినఁబడు నదె తేజోమయం బనియుఁ గూడ. ౧౮

క. వేయి శిరంబులఁ గనులను
వేయి కరంబులను జెవుల వేయి పదములన్
వేయి ముఖంబులఁ బూర్ణుం
డై యంతటనుండు పురుషుఁ డందు రపరులున్. ౧౯

తే. విష్ణు పదమె యాకాశమై వెలయుఁగాన
నది విరాజంబు విరజంబు నతిపరంబు
శాంత మందురు కొందఱు, కొంతమంది
పరుఁడు పురుషోత్తముం డని పలుకుచుంద్రు. ౨౦

తే. ప్రభు వొకఁడు గాఁడు పలువురు ప్రభువు లంచు
జగ మనీశంబును స్వభావజన్య మంద్రు
పలువిధంబుల నొరులు; కాపిలులు ప్రకృతి
జడము, బ్రహ్మాండ మెల్లఁ దజ్జన్య మంద్రు. ౨౧

క. ఈవిధముగ సందియములు
వేవిధముల మనము వేచు, విస్పష్టంబుం
గావింపవె, ధర్మం బది
యేవిధమో, మఱి యధర్మ మేవిధ మగునో! ౨౨

తే. సురలు ధర్మాత్ములున్ సత్త్వశుద్ధు లయ్యుఁ
బాపు లగు రాక్షసులబాధ పడఁగ నేల?
పాండవులు ధార్మికులు సత్యపథులు నయ్యు
బహువిధంబుల దుఃఖముల్ పడి రదేల? ౨౩

ఉ. ఓ సకలార్థవేత్త, విమలోన్నతచిత్త! మదీయచిత్త మా
యాసము నొంది డోలనరయార్భటి నస్థిర మయ్యె ధర్మసం
త్రాసము వీఁగ సంసరణదారుణవార్ధి మునింగి తేలు నట్
జేసినకూర్మి నీవు దరిఁ జేర్పవె పోతుమనై యజాత్మజా! ౨౪

### శ్రీ దేవి భాగవతావతరణము

క. ఈవిధమున నారదు న
న్నీ విపు డడిగిన విధంబ యే నడిగితి నా
దేవర్షి ప్రీతిఁ గరుణా
పావన దృక్కులను జూచి పల్కెను నాతో. ౨౫

తే. వత్స! యీసంశయమ్ములే బాధ పెట్ట
ము న్నొకానొక శుభవేళ నన్నుఁ గూడ,
నంత మాతండ్రికడ కేఁగి యామహాత్ము
బ్రహ్మ నడిగితి నీమహాప్రశ్నములనె. ౨౬

క. పలుకవె యీబ్రహ్మాండము
కలిగిన దెటు, తండ్రి! దానికర్తవు నీవో,
యల హరియొ, హరుఁడో, పూజ్యుఁడు,
పలుకుమ, యుత్కృష్టతముఁడు ప్రభుఁ డెవ్వాఁడో? ౨౭

క. అన్యోపమమై దుఃఖ
స్వన మగు సంసారమందు భ్రాంతం బగుచున్
క్షణమును నొకచో నిలువని
మనమునఁ గల సందియమ్ము మాన్పవె దేవా! ౨౮

తే. ఎన్ని తీర్థములందుఁ గ్రుంకిడిన, నెన్ని
సాధనమ్ముల దైవతశతముఁ గొలువ,
నెఱుఁగకయె యున్నఁ బరతత్త్వ, మెట్లు కలుగు
స్థైర్యమును జిత్తశాంతియు జనుల కెందు? ౨౯

ఉ. ఎవ్వని సంస్మరింతు యజియించెద నెవ్వని దేవదేవుఁగా
నెవ్వని నొందఁ గోరి భజియించి నుతించి సమర్చ చేతు, నిం
దెవ్వఁ డధీశ్వరేశుఁడో, వచింపు మెఱుంగ వలంతు, స్వామి! నే
నెవ్విధి సంశయావళుల నీఁగి సుఖింతు? నుపాయ మే మగున్? 30

క. వ్యాసా! లోకపితామహు
నీసందేహములు దీర్ప నే వేఁడిన సం
తోసమున సురజ్యేష్ఠుఁ
డీ సంక్షేపోజ్జ్వలోక్తు లి ట్లని పలికెన్. 31

క. ఏ మందు నిపుడు పుత్త్రిక!
నీ మొనసిన సందియములు నిక్కము తీర్పన్
లేమయ్యె, నేనె కా దల
దామోదరుఁడైనఁ గామదమనుం డయినన్. 32

క. కాసంత యెఱుఁగఁ జాలర
యీసంసారమున రాగు లెంత తెలిసినన్
దా సర్వ మెఱుఁగు రాగ ని
రాసుఁడు నిర్మత్సరుండు ప్రగతేహుండున్. 33

ఉ. స్థావరజంగమం బయిన సర్వము నష్టము నొంది పూర్వ మే
కావధికార్ణవం బయిన యత్తఱి, నుద్భవ మొంది పంచభూ
తావళి మాత్రమే యెసఁగ, నప్పుడు నే నుదయంబు నొందితిన్,
గేవల మొక్క పద్మకమనీయ హిరణ్మయ గర్భమందునన్. 34

ఉ. కన్నులు రెండు విచ్చి యెటు గాంచిన సూర్యుఁడు గానరాఁడు, సో
మన్నయుఁ గానరాఁ డొకక్ష్మాధర మేనియు వృక్ష మేనియుం
గన్నులఁ గానరా, వపుడు కంజముకర్ణిక సుస్థిరాసనా
భ్యున్నతి నుండి శాంతముగఁ బూనితి సత్యవిచార మీఁగతిన్.

ఉ. ఈ మహనీయనీరనిధి నెందుల నే నిటు పుట్టినాఁడ? న
న్నోమినభర్త యెవ్వఁ డగునో సృజియించిన కర్త యెవ్వఁడో

కో, మఱియుఁ జగంబు లడఁగు నొందెడువేళ హరించు హర్త వాఁ
డేమిటివాఁడొ, నేఁ దెలియు టెట్లు? తలంపఁగఁ జోద్య మయ్యెడిన్.

ఉ. నీరము కానిపించెడిని, నీ రిది యెట్టులు నిల్చు భూమియా
ధారము లేక, కన్పడద ధారుణి యెందును, నన్ను నిట్లు సం
ధారణచేయు పంకజము తథ్యముగా జనియించుఁ బంకమం,
దారసి పట్టు, మూల మట నైన ధరిత్రి కనంగ రాదొకో! ౩౮

మ. అని చింతించి నిజాధివాస మగు పద్మాగ్రస్థానమున్ డిగ్గి చ
య్యన నీరంబులలో గమించి వసుమత్యన్వేషణాయత్తబు
ద్ధిని వే యేండ్లు పరిభ్రమించియు నొకే దీక్షం దదాలోచనం
బును గావించియు నేరనైతిఁ గనఁ దన్మూలంబు నేమాత్రమున్.

క. ఆయెడఁ 'దపమ్ము నొనరుపు
మూ' యను నశరీరవాణి యాకసమునఁ గ
ర్ణాయత్తమైనం జేసితి
వే యేండ్లు యబ్జపీఠి విడువక తపమున్. ౩౯

క. అంతట సృజింపు మనియెడి
వింతగు శ్రుతి పుట్టి చెవుల విననైనను నే
నంతయు విమూఢమతినై
చింతించితి, నెవరి సృష్టి సేయుదు నంచున్. ౪౦

క. ఏమియుఁ జేయం దోఁపక
నామన ముఱియాడుచుండ నాపయికి బలో
ద్దాములు దారుణరాక్షసు
లా మధుకైటభులు దుమికి యార్చిరి పెలుచన్. ౪౧

క. తమసో సన్నద్ధులని యు
ద్ధము సేయఁగఁ దఱిమి తఱిమి తద్ద యదుగ సం
భ్రమమున నాళం బాలం
బముగా నడినీట డిగ్గఁ బాఱితి నేనున్. ౪౨

ఉ. అచ్చటఁ గాననయ్యెఁ బరమాద్భుతవిగ్రహుఁ డొక్క పూరుషుం
డచ్చపు నీలమేఘమటు శ్యామశరీరమువాఁడు, నెమ్మెయిం
బచ్చని పట్టుదువ్వలువవాఁడు, మెడన్ వనమాలవాఁడు, కన్
విచ్చక శేషశయ్య శయనించిన నాల్గుబుజాలవాఁడు నై. ౯౩

మ. ఒకచే శంఖము నీరవంబయిన, నింకొక్కంటఁ జక్రంబు నా
డక నిష్పందముగాఁగ, నొండొకటఁ బ్రేలన్ బ్రీలి కౌమోదకం,
బొకచేఁ బద్మము మోడ్వఁ, ద న్నెఱుఁగకే యుండెన్ జగన్నాథుఁ డ
య్యకటా కేశవుఁ డచ్యుతుండు హరి నిద్రాయత్తచిత్తంబునన్.

ఉ. శేషునిభోగశయ్య వివశీకృతుఁడై యటు యోగనిద్రకు
న్వేషము స్పందముం దెలియ నేరమిఁ గన్గొని నే నుపాయ మ
న్వేష మొనర్చి దేవి హరినిద్రనె బుద్ధి స్మరించి పొందఁ సం
తోషము రాత్రిసూక్తతతిలో భజియించితి దాని నెంతయుః. ౯౫

ఉ. అంతఁ బ్రసన్నచిత్తయయి యచ్యుతుఁ గ్రమ్మిన యోగనిద్ర సి
ద్ధాంతత నొంది విష్ణుతనుసంగతి దివ్యవిభూషణావళీ
కాంతులు దిగ్దిగంతములఁ గ్రమ్మ నచింత్య మతర్క్య మద్భుతా
త్యంతమనోజ్ఞరూపమును దాలిచి నిల్చె నభోంగణంబునన్. ౯౬

క. అది విడువ మహావిష్ణువు
కదలి తెలిసి చూచి మధువుఁ గైటభదైత్యుం
గదనము చేసెను వారల
వదలక హరి యైదువేల వత్సరము లొగిన్. ౯౮

ఆ. వారివంక దేవి పరగింప దృక్కులు
రాగముగ్ధులైన రాక్షసులను
నురుతరం బొనర్చి యుత్సంగ దేశంబు
హరి వధించె వారి నందు నునిచి. ౧౦౦

సీ. అంతలో రుద్రుఁ డచ్చటి కరుగుదెంచె;
ముప్పురము నేము కని స్వస్థబుద్ధుల మయి

దేవిదివ్యమనోజ్ఞ దేదీప్యమాన
రూపము నుతించితిమి, భక్తి రూపు లొంద. ౪౯

క. పరశక్తి కృపాదృక్కులు
పరగించుచు నుగురవంకఁ బావనతనులన్
బొరయించుచుం గృతార్థత
బెరయుంగా నిట్లు పలికెఁ బ్రియవచనమ్ముల్. ౫౦

మ. విధి హరి రుద్రులార! రిపుభీకులు నీల్గిరి మీర లింక ని
ర్వ్యాధు లయి సృష్టి పాలనము నత్యయముం బొనరింపుఁడీ యథా
విధిఁ దగు మందిరంబులను జేర్చి వసించి సుఖంబుగాఁ జతు
ర్విధ మగు జంతుజాలముల సృష్టి యొనర్పుఁడు మీవిభూతులన్. ౫౧

క. విదితస్వరమై పేశల
గదితంబై, చెవుల వినఁగఁ గడు మధురంబై
యెదలకు సుఖదము జననీ
మృదువాక్సుధ చెవులఁ గ్రోలి మే మంటి మిటుల్. ౫౨

క. అమ్మా! యందు కళక్తుల
మమ్మా! మహి లేదు, వితత మంతట జల, మె
ట్లమ్మా! సృష్టి? గుణము లే
వమ్మా! తన్మాత్ర లింద్రియమ్ములు నేవే? ౫౩

ఉ. ఆపలు కాలకించి శివ యల్లన నవ్విన దానికాంతు లే
రూపము నొంది కన్పడిన రూపయి యంబరవీధి రత్నసం
దీపిత మచ్ఛమౌక్తికపుదామము లొప్పు సువర్ణకింకిణీ
దీపిత ఘల్లులారవము దివ్యవిమానము గానిపించె వే. ౫౪

### బ్రహ్మాదులు భువనేశ్వరిని సందర్శించుట

ఉ. దాసినిఁ జూపి యెక్కుఁ డని తల్లి వచింపఁగ మేము తత్పరా
ధీనత నోంకృతిన్ సలిపి ధీవిజితేంద్రియవృత్తు లొంది యా

సీనుల మైతి మా శుభము శ్రేష్ఠము రమ్యము దేవసద్మస
మ్మానము నై యెసంగెడి విమానవరంబున శంక దక్కఁ-చుఁ. ౫౬

మ. సుఖసంవిష్టులమైన మమ్ముఁ గని యా శుభ్రాంగి యంతఁ మన
స్సుఖరంహంబున నాత్మశక్తి గగనాశఁ దద్విమానంబు ను
న్ముఖముంగా నడిపింప నొక్క త్రుటిలో మున్నున్న మున్నిటినీ
రఖలంబుఁ దృగ్గోచరం బయిన మా కాశ్చర్య మయ్యెం గనఁ.

వ. మఱునిముసంబె చూడ బహుమానముగా ఫలభారనమ్రమవి
స్తరతరుశాఖలఁ సిలిచి శ్రావ్యకుహూశ్రుతులు లాలపింపఁగాఁ
బరభృతముల్ మనోజ్ఞవనవారముతో గిరిరాజితో మనో
హరమహి కన్పడెం బశువు లంగనలుం బురుషుల్ చెలంగఁగాఁ.

వ. మఱియును గానవయ్యె బహుమార్గ వినోద వినిస్స్వరత్సరి
ద్వరములు విభ్రమ చ్ఛటుల తాండవకేళి పరంబులైన సి
ఖ్యరములు ఫుల్ల పద్మ వనరాజి విలాసి మరాళముల్ సరో
వరములు కూపముల్ విపులవాపికలుఁ బలు పల్వలంబులుఁ.

సు. మఱియుం గానఁగ నయ్యెఁ గట్టెదుట రమ్యంబైన ప్రాకారసం
వరణంబై వరహర్మ్యరాజి యయి దివ్యద్వృక్ష శాలామనో
హరమై వస్తుసుసంభృతంబు నయి కల్యాణైకపాత్రంబునై
పుర మొక్కం, డది పూర్వదృష్ట మనుచుఁ బుద్ధిం బ్రతీతంబు నాఁ.

క. మెఱు పాకస్మికముగ నం
బరమున మెఱుపారు నట్లు మా బుద్ధులలోఁ
బుర మిది స్వర్గం బనియెడి
సరి నొక్కటఁ బ్రత్యభిజ్ఞ జాతం బయ్యెఁ. ౬౧

క. ఇది యెవ్వరు సృష్టించిన
యది యని విస్మయము నందునంతటిలో మా
యెదుటఁ మృగయాపరుఁడై
కదలెడి దేవసభరాజు కానంబడియెఁ. ౬౨

ఆ. అపుడు చూడనయ్యె నంబిక యవ్విమా
నాగ్ర్యమున నిషణ్ణ యగుచు ధృతిని,
వడి విమాన మంతఁ బవనేరితం బయి
కదలెఁ దక్షిణంబ గగనవీథి. ౬౨

ఉ. ఒక్కముహూర్తమాత్రమున నొండొక చోటికిఁ జేరఁ బోవ నా
కక్కడఁ గాననయ్యెను వనాంతము నందననామకంబు, నం
దొక్కెడఁ బారిజాతతరు వ్రాదిన నీడను విశ్రమించి పెం
పెక్కిన కామధేనువు చరింపఁ జతూరద మహా గజేంద్రముల్. ౬౩

క. మందారవాటిఁ గిన్నర
బృందము గంధర్వయక్ష విద్యాధరు లా
నందంబునఁ బాడుచుఁ గను
విందుగ నాడుచు రమించి వెలసిరి చూడన్. ౬౪

క. మేనక మొదలగు నచ్చర
చానలు భావాదు లెఱిఁగి జాణతనముతో
గానము చేయుచుఁ దాళ
స్థానీయక్రీడ నృత్యరత లైరి రతిన్. ౬౫

క. ఆలోకింపఁగ నై రటఁ
బాలోమీసహితుఁడైన పాకారియు ది
క్పాలకులు సూర్యచంద్రులు
నాలోలత్సురగణంబు లాశ్చర్యముగాన్. ౬౬

క. నే మట్లు చూచుచుండఁగ
నా మహితపురంబునుండి యాందోళిక పైఁ
గామగతిన్ మఘవానుని
శ్రీ మెఱసెడి రాజు వెడలెఁ జెలు వొప్పారన్. ౬౭

ఆ. చూచి చోద్య మందుచో మా విమానంబు
నంతలోనఁ గదలె నతిరయమున

నఖిలదేవవంద్య మగు బ్రహ్మలోకంబు
పొంది బ్రహ్మఁ గంటి మందు నొకని. ౬౮

మ. నిజరూపంబులు దాల్చి వేదములు సందీపించి సాంగంబుగా
నజునిం గొల్వఁగఁ జూడనయ్యె సభలో నట్లే సరిత్సాగర
వ్రజముం బర్వతపన్నగోరగములుం స్వస్వప్రభావంబులన్
భజియింపం గని విస్మయంపడిరి శ్రీనాథుండు శ్రీకంఠుఁడున్. ౬౯

ఉ. నాలుగు మోము లొప్పిన సనాతనుఁ డీతఁడు బ్రహ్మ యెవ్వఁడో
తేలుచు మంచు వా రడుగఁ దేరి కనుంగొని నేను పల్కితిం,
జాల నెఱుంగ సృష్టిపతి సత్ప్రభుఁ డీతఁ డెవండొ, నన్నునుం
బోలుప నేర, విభ్రమము పూనుటకుం గత మే మగుం బ్రభుల్ !

క. క్షణమాత్రమున మనోజవ
మున నటఁ గదలెను విమానమును కైలాస
మ్మును గనఁ దదుత్తరక్షణ
మునఁ జేరెను యక్షగణసముదయోజ్జ్వలమున్. ౭౧

వసంతతిలక— అందున్న కోకిలలు పంచమ మాలపింపన్,
స్యందింప గానసుధఁ గిన్నెర లాస్యరీతిన్,
మందారవాటికల నాఁగ విమానరాజం,
బందుండి యప్పుడ వినిర్గతుఁడై భవుండున్. ౭౨

మ. భగవానుండు వృషాధిరూఢుఁ డగుచున్ బంచాస్యముల్ తేజరి
ల్లఁగఁ బాంక్తేయభుజంబుగాఁ ద్రిణయనోల్లాసంబుతో, సంశుకం
బుగ వైయాఘ్రము కౌంజరంబు నజినంబున్ వెల్గఁ బ్రావారమై,
సిగలోఁ బువ్వుగ నర్ధచంద్రుఁడు ప్రకాశింపంగఁ గానంబడెన్. ౭౩

ఉ. ఆతనిపుత్రు లిద్దరు గజాస్యషడాస్యులు పార్శ్వరక్షుల
త్యాతతతేజులై కొలువ నంకము చేరఁగ మాతృకల్ గణ
వ్రాతము నందిముఖ్యులు శివప్రభుపృష్ఠగులై లయస్వనో
ద్గాతలుగాఁ జరింపఁ గని కన్నుల, సంశయ మయ్యె, నారదా ! ౭౪

క. ఏమా యని యబ్బురపడు
నామాత్రనె వాతవేగమై కైలాసా
గ్రామలభువి దాఁటుచు నా
పై మా యానంబు చేరె వైకుంఠంబున్. ౭౫

ఉ. పుత్రక! యందుఁ జూచిన విభూతు లమేయము లయ్య, చెప్ప నా
మాత్రము లే! రమారమణమందిరముం గని శ్యామలోజ్జ్వల
ద్గాత్రుఁడు విస్మయంపడెదు తక్షణమే సరసీరుహోల్లస
న్నేత్రుఁ డొకండు తత్సదననిర్గతుఁడై కనిపించెఁ జిత్రమై. ౭౬

ఉ. శ్రీహరి పీతవాసుఁ డతసీకుసుమాభశరీరుఁడుం జతు
ర్బాహుఁడు పక్షివాహనముపై సిరి చెంగట వీవఁ జామర
గ్రాహిణియై కనంబడినఁ గన్నుల నమ్మఁగ లేక కేశవుం
డా హరుఁ డేను నొండొరులయాననముల్ తిలకించుచుండఁగా. ౭౭

క. ముగ్ధులమై పలుకక సం
దిగ్ధమనస్కు లగు మమ్ముఁ దీవ్రరయమునన్
స్నిగ్ధప్రభము విమానము
దుగ్ధాబ్ధికిఁ జేర్చెఁ బవనధూతం బగుచున్. ౭౮

క. కంటిమి పాలసముద్రము
మింటికిఁ బొంగఁగ మహోర్మిమిషదాశంబై
జుంటినురుపు మిలమిలలకు
సంటెడి యాదోవిసర సమాకీర్ణంబున్. ౭౯

ఉ. అంతటిలో సుగంధ మొకఁ డద్భుతమై పరతెంచి నాసికా
సంతతులందుఁ జొచ్చె హరిచందన కల్హక పారిజాత భా
స్వంతము కేతకీ వకుళ చంపక వారిజ జాతి కుంద వా
సంతిక మల్లికా సురభి సంగతమై పవనావధూతమై. ౮౦

ఉ. అంతటిలో వినంగనయి స్వాగతశబ్ద ముఖానునాద ప
ర్యంతముగాఁ గుహూధ్వనిసమంచిత పంచమరాగపూరితా

శాంతము కోకిలస్వరము హార్దము శీతల మార్ద్రి మెంతయున్
శాంతము కర్ణయుగ్మకరసాయనమై కరగించె మాయెదల్. ౮౧

ఉ. అంతటిలోనఁ జూడ్కికిఁ గనన్వె మిఱుమి ట్లొసఁగించె మాకు ద్వీ
పాంత మొకండు స్వీయ మణిభాస్వర కాంతి ధగద్ధగాయిత
ప్రాంత మనేకరత్న నికర ప్రతిభాంత మచింత్యవైభవా
క్రాంతము దివ్యమౌక్తిక వికల్పిత దామ విభూషితాంతమై. ౮౨

క. నానాస్తరణోత్తరమై
నానాచిత్రాభిచిత్రణ మనోజ్ఞంబై
నానాపుష్పద్రుమమై
నానామంజులరవంబు నగరము మెఱసెన్. ౮౩

తే. ఆమణిద్వీపమందు శివాకృతిన్ వె
లుంగు పర్యంక మొండు గానంగ నయ్యె,
నదియు బహురత్నఖచితం బనంతరత్న
రాజితంబు రమ్యాకృతిభ్రాజితంబు. ౮౪

తే. అదియు నానాస్తరణ విస్తరాంతరము మ
హేంద్రచాపాభిరామ భూయిష్ఠకలము,
దూరమున మావిమానమందుననె యుండి
కంటి మం దుపవిష్టయౌ కలికిమిన్న. ౮౫

ఉ. రక్తసుగంధ లేపనము రాజిలఁ, దాలిచి రక్తదామముల్.
రక్తదుకూలధారిణిగ రక్త విశాల విలోచనాఢ్యయై,
రక్తరదచ్ఛదంబులను రంజిలి రక్తపదాంబుజాతయై
రక్తరుచిప్రభా పటల రంజిత సర్వదిశావకాశయై. ౮౬

శా. విద్యుత్కోటి తళత్తళప్రభ లోకే పేరాశి యైనట్లుగా
నుద్యత్సూర్య సహస్రకాంతు లొకచో నుద్ద్యోత మైనట్లుగాఁ
బ్రద్యోతించుచుఁ గోటిలక్ష్మలరుచిన్ బ్రాలేయరుఙ్మండలీ
పద్యస్రావి సుధాసమాన కరుణా సంపూర్ణ శోభాఢ్యయై. ౮౭

క. మున్నెన్నఁడుఁ గని యెఱుఁగని
సన్నుతరూపము ధరించి సస్మితరుచిసం
పన్నత శ్రీభువనేశ్వరి
పన్ని యభీష్టాభయములు పాశాంకుశముల్. ౭౮

క. కరుణాతరంగితారుణ
లసదక్షి నవయావనాఢ్య తరళోజ్జ్వలరూ
పరిపూర్ణమూర్తి మెఱయఁగఁ
గర మరుదగు స్ఫూర్తితోడఁ గననయ్యె సుతా! ౭౯

వ. లలితమృదుస్మితద్యుతుల రాజిలి, చెక్కులఁ బర్వుచున్న క
మ్మల కమనీయకాంతులను మంజులమై, సిగలోని పువ్వుగా
వెలిఁగెడు నర్ధచంద్రునునువెన్నెలజాలులఁ జల్లనై సము
జ్జ్వల మగు శ్రీముఖాంబుజము వర్ణనసేయుట యెట్లు నారదా? ౮౦

ఉ. మఱి యాతల్లికుచద్వయంబు వివరింపన్ సాధ్యమే నాకు, వి
స్తృతమై రోదసి పూర్ణకుంభములతో సాదృశ్యముం బూని, యా
పరమామ్నాయపవిత్రదుగ్ధములు విశ్వం బెల్ల పూరించుచున్
బరువై నిబ్బరమై సువర్తులము నై వక్షంబు నయ్యెం గడున్. ౮౧

క. శిరమున రత్నకిరీటము
పురులుం గనకాంగదములు భుజములపై భా
సుర నానామణి సముదయ
పరికీర్ణవిభూషణాళి వరలఁగ నొప్పెన్. ౮౨

క. అచ్చటి లీలాశుకములె
యుచ్చారణ సేయ హ్రీంకృతోచ్చైస్స్తుతులన్
నెచ్చెలు లేక హృల్లేఖన్
సచ్చిన్మయ భువనరాజ్ఞి జపము సలుపరా! ౮౩

క. శ్రీమంత్రరాజపటో
గ్రాయత నాధ్యస్త యగుచు నయ్యెయెడలం

బాయక యనంగకుసుమా
ద్యాయతనాంబికలు కొలువ నగపడెను సుతా! ౯౪

క. చూచుచునే ముగ్గురమును
నీ చాన యి దెవ్వ రొకో, యేమిటి పేరో,
నేచాయఁ దెలియు టంచును
నాచోఁ గదలక విచార మావేశింపన్. ౯౫

క. ఇది యచ్చర యగునా, కా;
దిది మఱి గంధర్వి యగుట యెట్టు, లదియుం గా;
దిది యిఁక నేదే దైవత
ముదిత యగునో, కా దటంచు ముగురము దలఁపన్. ౯౬

క. ఆలోచించుచునుండెడి
యాలోననె చూడఁజూడ నద్భుతరుచియై
వే లగు ముఖములఁ గన్నుల
వేల కరంబుల శిరముల వెలసెను బుత్త్రీ! ౯౭

తే. చారుహాసిని యామహాసాధ్వివంక
నల్ల భగవానుఁ డా విష్ణు వట్టు గాంచి
యాత్మవిజ్ఞానమున నామె నంబగాఁగఁ
దెలిసి మది నిశ్చయించి తాఁ బలికె నిట్లు. ౯౮

క. ఇది భగవతి, మనయందఱ
మొదటి మహాకారణంబు మూలాంబిక, యి
య్యదియె మహావిద్యయు నా
నిదియె మహామాయ యనఁగ నిదె పూర్ణ యగున్. ౯౯

మ. ఇది దుర్జ్ఞేయము స్వల్పబుద్ధులకుఁ గానీ యోగిగమ్యం బిదా
ను, దురారాధ్యము హీనభాగ్యులకు నెందుంగాని, పుణ్యాత్ముల కి
య్యది యిచ్ఛాపరశక్తిగా మఱియు నిత్యానిత్యసంరూపగా
నిదె విశ్వేశ్వరి వేదగర్భ శివ సర్వేశేశిగాఁ గొల్తురా! ౧౦౦

క. తుది యగుఁ గాలం బౌనెడ
నిదె విశ్వాలయం బొనర్చి యెదఁ గ్రీడించున్,
పొదలంగఁ దనదేహంబునఁ
బదిలంబుగ సర్వజీవభాగ్లింగములున్. ౧౦౧

తే. సర్వబీజమయాత్మయై సాంప్రతంబ
వెలుఁగుచున్నది యిది, దీని బలసి కొలుచు
నల్లదే విభూతుల కోటు లర్బుదములు
దివ్యభూషాను లేపనో ద్దీప్తములుగ. ౧౦౨

తే. ఓ విధి కపర్దులార! ధన్యులము మనము
భగవతీదర్శనమ్ము సంప్రాప్త మయ్యె,
స్వచ్ఛముగాఁ గృతకృత్యుల మయితి మెంత
తప మొనర్చిన పుణ్యానేకలమొ మనము! ౧౦౩

ఉ. ఎంతటి భాగ్య మున్న భువనేశ్వరి దేవి శివం గనంగఁ బ్రా
పింతుము, దీనిఁ జూచుట లభింపదు రాగిజనాళి కెన్నఁడే,
సంతటి కాదియా ప్రకృతియై యదియే పురుషప్రసక్తయై
యంతయు సృష్టి సేసి పరమాత్మకుఁ జూపును విశ్వదృశ్యమున్.

క. దీనికిఁ బోలిచికొనఁగా
నే నెక్కడ, నెచట మీర, లెల్ల దివిజులున్!
దీనికి లక్షాంశతులం
గానం జాలరు రమాదికత్రిదశసతుల్. ౧౦౫

చ. తొలి నొక మఱ్ఱియాకుచిఱుదొన్నె నమర్చిన వింతతొట్టిలో
బుడుతఁడనై పదాంబుజపు బొట్టనవ్రేలిని జేతఁ బట్టి పె
న్నలవున నోటఁ బెట్టుకొని యాడుచుఁ గేరుచు నెన్నియేని యా
టలఁ బడి పాలు గాఱు నునుడాలగుమేన నెసంగుతత్తటిన్. ౧౦౬

శా. న న్నీతల్లియె యా సుధార్ణవతరంగశ్రేణియుయ్యాలలోఁ
బన్నుండన్ మృదుపాణి సిట్టటుల నూఁపం బ్రేమతో వేడుకల్

గన్నాఁడ౯, మధురార్ద్రకంఠమున జోలం బాడి లాలింపఁగా
విన్నాఁడ౯, మదిఁ బ్రత్యభిజ్ఞ వెలసె౯ విద్యోతమానంబుగా. ౧౦౭

క. మనజనని యిదియె, దీనికిఁ
బునఃపునర్నతుల భక్తిఁ బొనరింతము, డా
యను జని నిర్భయముగఁ బద
మును గొని నుతియింత, మిచ్చు భూరివరంబుల్. ౧౦౮

క. ద్వారంబునఁ గల యాపరి
చారకు లొకవేళ మనలఁ జననీకుండ౯
వారించిన నటనుండియె
పూరింతము దేవినుతులు పూనినభక్తి౯. ౧౦౯

తే. ఇట్లు హరి పల్కు, మేము ప్రహృష్టుల మయి
యోంకృతి యొనర్చి, యేగ నుద్యుక్తుల మయి,
యావిమానంబు డిగి, ద్వారమందుఁ జేరి,
ముద్వారము నిల్చితిమి కొంకు పోనఁగఁ గొంత. ౧౧౦

క. ద్వారగతం బగు తన పరి
వారముఁ గని దేవి యల్ల పరప స్మితంబు౯,
వా రెల్ల రొక్క త్రుటిలో
స్త్రీరూపంబులు ధరించి చెలఁగి రవేళ౯. ౧౧౧

క. నేనును హరియును శివుఁడుం
జానలమై భూషణాఢ్య చారు తనులమై
కానంబడిన౯ విస్మయ
మూనఁగఁ జేరితిమి దేవియొద్దకు భక్తి౯. ౧౧౨

క. అవలోకించుచు నొండొరు
యువతీరూపములు మేము నూర్జితమతితో
నవనతుల మైన, మ మ్మది
యవలోకించెను గృపార్ద్ర మగు చూపులతో. ౧౧౩

క. నానామణిగణఖచితము
భానుసహస్రప్రకాశ భాసుర మవు దే
వీ నిర్మలపదపీఠము
ధ్యానించుచుఁ గంచు మువ్వుర మందున్ నిలువన్. ౧౧౪

ఉ. అందుఁ జరింపఁ గంటిమి పరాంబికకుం బరిచర్య సేయుచుం
గొందఱు రక్తవస్త్రములు కొందఱు పచ్చని పట్టువస్త్రముల్
కొందఱు నీలవస్త్రములు కొంద ఱనేక విచిత్ర వస్త్రముల్
సుందరరీతిఁ దాల్చి బహుశోభనరూపము లొంది కొల్వఁగా. ౧౧౫

ఉ. వారలు దివ్యభూషణ విభా విభవంబున నొప్పి నాట్యసం
చార మొనర్చుచుం బరవశంబునఁ బాడుచు వీణ లొత్తుచున్
మారుతవాద్యసంతతు లమందతఁ బూరణ సేయుచున్ శుభా
కారతఁ దల్లిఁ గొల్వఁ గనఁ గన్నులపండువ యయ్యె, నారదా!

క. మఱియుం జెప్పెద వినుమా
పరమాద్భుత మంబపాదపద్మముమధ్యన్
స్ఫురిత నఖర ముకురంబునఁ
బరికించిన చిత్ర దృశ్య పరిణాహంబున్. ౧౧౬

ఉ. స్థావరజంగమం బయిన సర్వము శోడ సజాండ మెల్ల నా
తావునఁ జూడ నయ్యె, నను స్థాణుని విష్ణువుఁ గంటి మం దిఁకన్
దేవపతిన్ యమున్ వరుణు దిక్పకుబేర సమీర పావకా
శావిభు లెల్ల సూర్యుఁడు నిశాపతియుం గనవచ్చి రందులో. ౧౧౭

క. గిరి కాననములు నదు ల
బ్ధిరాజి గంధర్వ యక్ష విద్యాధర కి
న్నర పన్నగ రాక్షసు ల
చ్చరలున్ సిద్ధులును మునులు సర్వామరులున్. ౧౧౮

తే. చిత్రకేతు విశ్వావసు శ్వేతముఖ్య
దివ్య గంధర్వవిభు లందు దీప్తులైరి,

సిద్ధ సాధ్యులు వసువు లశ్వినులుఁ దోఁచి
రంద, మఱియుం బితృగణంబు నరయ నయ్యె. ౧_౨౦

క. పలికింప మహతి నారదుఁ
డలఘుఁడు తుంబురుఁడు రాగ మాలాపింపన్
గులికెడి హాహాహూహూ
సలలిత నాట్యంబు చూడఁ జాలితి మచ్చో. ౧_౨౧

శా. వైకుంఠంబును బ్రహ్మలోకమును దివ్యంబైన కైలాసమున్
వీఁకం గానఁగనయ్యెఁ దత్పదనఖావిష్టంబులై, నేను నం
దే కానంబడితిన్ జతుర్ముఖములన్ నీరేజమందున్ మఱిన్
లోకేశుం డల శేషశాయియు మధుండుం గైటభుండుం దగన్.

క. ఈవిధ మద్భుతముం గని
యే విస్మయ మంది వారి నీక్షింపంగా
నావలెనే హరిహరులును
నావేశితవిభ్రమముల నగపడిరి సుతా! ౧_౨౩

క. మే మెల్లరముం దానిని
మహామాతగ మఱియు విశ్వమాతగఁ గని చే
తోమోదమున శతాబ్దం
బా మేర తదేక దృష్టి నం దుంటిమయా! ౧_౨౪

మ. అమృతాంభోనిధియంతరీపమున మధ్యంబందునం దత్సఖీ
సముదాయంబును గూడి మేమును నిజేచ్ఛన్ వేడ్క లొప్పన్ విహా
రము గావించుచు దేవిఁ గొల్చుచును దద్రహస్యాకృతిసౌప్రహా
ర్షములోఁ బొంగుచు నంతకాలము ముహూర్తంబట్లు వెళ్ళింపఁగా.

## విష్ణు కృత భువనేశ్వరీ స్తుతి

క. ఒకనాఁడు మహావిష్ణువు
వికసించినతరుణిరూపు వెలయఁగ దా నొ

ద్దికళోనా భువనేశ్వరి
నికటమున నుతించె నిట్లు నిస్తులభక్తిన్. ౧౨౬

క. మ్రొక్కెద దేవికిఁ బ్రకృతికి
మ్రొక్కెద విధాత్రి కిదియె మ్రొక్కెద సిద్ధిన్
మ్రొక్కెద సంసారారణి
మ్రొక్కెదఁ గల్యాణి వరద మ్రొక్కెద వృద్ధిన్. ౧౨౭

తే. సచ్చిదానందమయి, నమస్కారమమ్మ!
పంచకృత్యపరాయణా, వందనమ్మ!
నిఖిలసంసారమూలకారణీ, నమస్సు!
జనని, భువనేశ్వరీ, యిదే వినతి గొనుము! ౧౨౮

తే. ఏయధిష్ఠానమున సృష్టి యెల్లఁ బొదలు,
నాయధిష్ఠాన కూటస్థమై వెలింగి,
యర్థమాత్రార్థ భూతవౌ నంబ! నీకు
మ్రొక్కు లిడెద హృల్లేఖకు మ్రొక్కు లివియ. ౧౨౯

మ. ఎఱుఁగుదు నంబ! మున్న యిది యెల్లయు నీయెడ సన్నివిష్టమై
మెఱయు నటంచు విన్న శ్రుతిమిన్కులఁ, గంటికిఁ దేటతెల్లమై
యెఱుఁగఁగ వచ్చె సంభవలయేశ్వరి నీ వని సర్వలోకవి
స్తరమహనీయ నీవ యని సర్వసమర్థ వటంచు, నేఁ డిదే. ౧౩౦

ఉ. ఈ సదసద్వికార మగు నెల్ల జగత్తును విస్తరించి ఖే
లాసదృశంబుగా నవికలంబుగ నిర్వదిమూఁడు తత్త్వముల్
భాసిలఁ జూపి పూరుషునిభావము రంజిలఁ జేసి, తల్లి! క్రీ
డాసమయాన వెల్గెదు విడంబిత లోకమహేంద్రజాలనై. ౧౩౧

మ. జననీ! నామము రూప మీవ యగుటన్ సర్వంబు నీవే వినా
కన భావింప నసాధ్య, మీ వఖిలలోకంబందు వ్యాపించి నిం
డిన సర్వాత్మవు సర్వశక్తివి, నినుం డిందింప నాపూరుషుం
డు నశక్తుండట, బుద్ధిమంతులకుఁ జెల్లున్ నిన్న సేవింపఁగా. ౧౩౨

ఉ. ఈవిధి విశ్వమెల్ల వెలయించి ప్రభావవశంబుచేత లో
కావళి మోదముం బొరయు టంతయు నీమహిమంబె, తల్లి! క
ల్పావధివేళ సర్వము లయం బొనరించెదు నీవె, యంబ! మా
కేవిధి నీమహత్త్వము నిజేచ్ఛల సత్త్వ మెఱుంగ సాధ్యమా! ౧౩౩

క. అల మధుకైటభదైత్యుల
వలనను రక్షించి మమ్ము బహులోకములన్
దిలకింపఁజేసి భాగ్యము
కలిగించితి నిన్ను నిందుఁ గన్నులఁ గాంచన్. ౧౩౪

ఉ. చూపితి మాకు స్వర్గమును జూపితి బ్రహ్మపదంబు నాపయిం
జూపితి రాజతాచలము చూపితి వంత వికుంఠధామముం
జూపకయున్న నీరచనఁ జోద్యము లింకను నెన్నియున్నవో
యోప మెఱుంగ నేను విధి యుగ్రుఁడు, నోపుదు రెవ్వ రాపయిన్!

ఉ. నీ నఖదర్పణాన జననీ! కనిపించె మఱొక్క విష్ణుఁ డీ
శానుఁడు పద్మయోనియు మహాత్ములు నింకను నెంద ఱెట్టిచం
దాన మఱెన్నిలోకములఁ దారు వెలింగెద రూహ సేయఁగా
నేనియు నేరఁ దల్లి! యెవ రెన్నఁగలారు భవత్ప్రభావముల్! ౧౩౬

శా. అమ్మా! నీపదపీఠిఁ జాఁగిలి యిదే యాచింతు, నశ్రాంత మే
నిమ్మాడ్కిన్ భవదుజ్జ్వలాకృతి యెద న్వీక్షింపనేఁగాత, నా
ట్యమ్ముం జేయుత నీశుభాహ్వయము జిహ్వాగ్రంబునందున్, నివా
సమ్మున్ నిత్యముఁ జేయుఁగాతఁ గృప శీర్షంబందు నీపాదముల్.

క. సతతము భృత్యుఁడు నీ కగు
నితఁడు, స్వామినివి నీవు నితనికి నెపుడున్;
సుతుఁ డీతఁడు, తల్లివి నీ
వితనికి; మన కిట్టి వ్యాప్తి యెసఁగుత ధ్రువమై. ౧౩౮

క. సర్వం బెఱుఁగుట నీవే
సర్వజ్ఞవు, పరిసమాప్తిసమవధి నగుటన్

సర్వేశ్వరి! భవదిచ్ఛా
పర్వముకన్నన్ మఱొక్క వర మేఁ గోరన్. ౧౩౯

తే. సృష్టి నొనరించు స్రష్ట, రక్షింతు నేను,
శివుఁడు హరియించు, ననెడి ప్రసిద్ధి కలుగు;
నిది నిజం బౌను, మేము నీయిచ్ఛవలన
శక్తియుక్తుల మై క్రియాదక్షముల మగుట. ౧౪౦

తే. జగము ధరియించునది ధరాశక్తి గాదు,
సర్వధాత్రి, త్వదాధార శక్తి గాని;
భాస్కరుండు భాసించు నీప్రభన, తల్లి!
విరజవై సర్వమును నీవ వెలుఁగఁ జేయ. ౧౪౧

క. జని గల నను నజ భవులను
ననఁ జెల్లదు నిత్యు లనుచు, నట్టి యెడ సురేం
ద్రుని నితరుల ననఁ జెల్లునె
చను సత్య యనం బురాణి జననిని నిన్నే. ౧౪౨

క. కరుణేక్షణములఁ బరపినఁ
బురాణపురుషునిఁగ నాత్మఁ బొడఁగాంచెద, న
ట్లరయని యెడలఁ దమోహం
కరణంబున విభుఁడ నంచు గర్వింతును నేన్. ౧౪౩

తే. బుద్ధిమంతుల విద్య నాఁ బొల్చె దీవ,
శక్తిమంతులలోఁ దల్లి! శక్తి వీవ,
కాంతి కీర్తియుఁ దుష్టియుఁ గమల వీవ,
ముక్తి జనులకుఁ గూర్చు విరక్తి వీవ! ౧౪౪

క. గాయత్రియు వేదాది క
లాయితవును నర్ధమాత్ర వగుదు, స్వధయు స్వా
హా యన, నీవె సురావన
కై యాగము నిగమరాశి నలరింతు వహో! ౧౪౫

ఉ. ఈ యఖిలప్రపంచము రచింతువు మోక్షము గూర్చు పేర్మి, నిం
కీయెడ జీవభావ మది యెట్లు పొసంగును సృష్టియందు? నె
ట్లా యుదధిం దరంగలయ, మట్లు, యనాది యమర్త్య మైన త
చ్ఛ్రేయము నంశమాత్ర మయి చెల్లు సమస్తము, తల్లి! చూడఁగన్.

మ. ఇది సర్వంబు భవత్కృతంబ యని యెప్డీక్షించు జీవుండు నె
మ్మది, సర్వంబుఁ ద్వదంతరంగమున నే మాయన్ లయంబుం బొన
ర్చెదు; నాట్యాంతమునన్ నటుం డెటులు దా స్వీయాకృతిం దాల్చు, న
ట్లు, దయాబ్ధీ! విరమింతు వీవును గృతార్థత్వంబు చేకూర్చుచున్.

ఉ. మోహమహోర్మియా భవసముద్రము నిస్తరణం బొనర్పఁగా
వాహమ వీవ గాఁ గొరునుపాయము లేక సమాశ్రయింతు, స
స్నేహవిలోకనంబు కరుణించి మహార్తికరాంతకాలమం
దో హృతసర్వలోక! నను నొద్దికఁ గావు నమస్కరించెదన్. ౧౪౮

క. మ్రొక్కెద నీపదయుగళము
దిక్కనిభక్తిం బరేశ్వరి! మహావిద్యా!
యెక్కాలము జ్ఞానకలా
భాక్కునుగాఁ జేయు, సర్వవరదాత్రి! ననున్. ౧౪౯

### శివకృత భువనేశ్వరీ స్తుతి

తే. దేవదేవుఁడు హరి గోవిందుఁ డచ్యుతుం
డిట్లు మఱిమఱి నుతియించినంత,
నెదుటఁ జేరి తల్లి కెఱఁగి పదంబుల,
శర్వుఁ డిట్లు పల్కె శంకరుండు. ౧౫౦

చ. జననివి నీవు విష్ణునకు స్రష్ట కిఁకన్ మఱి నాకుఁ గావ కో,
జనని వశేషసృష్టికిని, సంస్థితి కీవ సమర్థ వౌదు, నిం
కను నగు దీవ పృథ్వి యుదకంబు నభం బనలానిలంబులున్
గుణములు నింద్రియంబులును గూడిన బుద్ధి మన స్సహంతయున్.

క. ఎఱుఁగనివారే యందురు
హరి హర విధికృత మటంచు నఖిలజగత్తుల్,
పరికల్పించితి వీ ము
వ్వుర నీవే, తల్లి! వీరు పుట్టించు టెటుల్? ౧౫౨

క. భూతము లెనసి విషయగుణ
జాతముతో, జాత మగును జగ మని పలుకన్,
మాతర! నీకళ లే కది
జాతంబై స్ఫుటముగాఁగ సాధ్యం బగునే? ౧౫౩

చ. వివిధవిలాసవేషములు వేసి రమించుకుతూహలంబు సం
భవ మగు నెప్పు నీయెడఁద, మాత! చరాచరభూతరాశిగా
నవు దపుడే, త్రిమూర్తికృతభావము నూనెద వప్పుడే; తదు
త్సవము రుచింప దెప్పు, డది సర్వమునున్ విరమింతు వాత్మలో.

ఉ. నీ పదపాంసురేణుకణ నీత మహోదయు లొంది నేను ల
క్ష్మీపతి పద్మసూతియు సృజింతుము విశ్వము తత్క్షణంబుతో,
నో పరమార్థచిత్త! మము నుద్ధరణం బొనరింపవేని నీ
వే, పడయుంగనే ముగుర కెట్టులు సత్త్వ రజస్తమంబులున్!

క. జనపతి సచివుఁడు భృత్యుఁడు
ధనికుఁడు నిర్ధనుఁ డటంచు ధరణి సమస్తం
బును గడు విషమం బగు నీ
మనమును నటు విషమ మగును, మాంగల్యఖనీ! ౧౫౬

క. ప్రకటింప నిలుప లోఁగొన
సకలమ్ము గుణత్రయమ్ము చాలుం జుమ్మా,
యిఁక మఱి ద్రుహిణుని హరి ననుఁ
బ్రకటింతు జగత్త్రయమ్ము పరికల్పింపన్. ౧౫౭

ఉ. నన్ను హరిన్ విరించిని సనాతని! నీవు విమానమందు నుం
డ న్నియమించి దారి భువనావళు లెంతయు నద్భుతంబు లే

మెన్నఁ దెలియంగనట్టివి యనేకము చూపితి, చేసినావె మే
మన్నియు; నీగుణత్రయమ యందుకుఁ జాలు, భవాని! కాదొకో?

క. నీలీలల మే మెఱుఁగం
జాలము, నీకళను జేసి సర్వజగత్తుల్
పాలించి సంహరింతువు,
ఖేలనగాఁ బురుషుఁ గూడి క్రీడింతు వుమా! ౧౫౯

శా. నీపాదాంబుజసేవ యున్న జననీ! నిత్యంబు నిస్త్రీ సతీ
రూపంబే వర మౌను దద్విరహదుర్మోహంబె ప్రాపించు నో
నాపాపిష్టపుఁ బౌరుషత్వ మది యేలా, యేల త్రైలోక్యపా
లీపూజ్యత్వ పతిత్వముల్ మహిమముల్ కీర్తుల్ మహైశ్వర్యముల్ !

క. స్త్రీభావ మూని నీపద
సౌభాగ్యావాప్తి నొంది సంసృతి నీఁగం
గా భవుఁ డోపె నటంచును
నీభువనమునందుఁ గీర్తి యెలయును గాతల్. ౧౬౧

క. నీసాన్నిధ్యము సేవయుఁ
బాసిన సామ్రాజ్య మెవఁడు వాంఛించును, నీ
భాసురపదదూరుల మగు
చో, సత్యము, త్రుటియు యుగముచొ ప్పనఁ దోఁచున్. ౧౬౨

క. మును లెవ్వరు నీపదసే
వను వర్జించి, యొరు దీక్ష వర్తించెదరో,
జననీ! వారలు విధివం
చన వైభవపరిభవంబు సలిపినవారల్. ౧౬౩

ఆ. తపము కాదు, కాదు దమము సమాధియుఁ,
గ్రతుశతంబు లేనిఁ గావు, నీదు
పదపరాగసేవ భవసాగరమునుండి
ముక్తి నీ సమర్థము, జగదంబ! ౧౬౪

మ. కృప నాపైఁ గలదేని దల్లి? యొకటే కేల్మోడ్చి ప్రార్థింతు, నా
కుపదేశింపు నవార్ణమంత్ర, మది నాయూహం బరిభ్రష్టమై
జపసంభావ్యత వెల్గకున్నది, స్మృతిన్ సందీప్తముం జేసి మో
హపువారాశిఁ దరింపఁజేయఁగదవే, యంబా! భవోత్తారిణీ! ౧౬౫

శా. ఆరీతిన్ భువనేశ్వరిన్ శివుఁడు తా నర్థింపఁగా, నంబ యు
చ్చారించెన్ స్ఫుటమై నవాక్షరము, నీశానుండు దానిన్ శుభో
చ్చారం బొప్ప గ్రహించి, దేవిచరణాబ్జం బంటుచున్ మ్రొక్కి, దీ
క్షారమ్యంబుగఁ గామమోక్షకరబీజంబుల్ జపించెన్ ధృతిన్. ౧౬౬

తే. శంకరుండు లోకావళీశంకరుండు
నటు నవార్ణజపాధీనుఁ డైనఁ గాంచి
యా మహామాయశుభచరణాంతికమున,
నే వినమ్రుఁడనై నిల్చి యిట్టు లంటి. ౧౬౭

సీ. సకలజనధాత్రి వని నిన్ను సంస్తుతించు
వేదములు నిన్నెఱుంగఁ గోవిదము లగుట,
నఖిలమఖహోమములను స్వాహాస్వరూప
మున వెలుంగవె, సర్వజ్ఞమూర్తి! జనని! ౧౬౮

శా. అమ్మా! కర్తను నేనె యన్నిటికి, బ్రహ్మాండంపుభాండంబు స
ర్వమ్మున్నే సృజియింతు నద్భుతముగా, వర్ణింప నాతో సముం
డిమ్ముల్లోకములందు లేఁడు, ధ్రువ, మేనే ధన్యుఁడో బ్రహ్మనం
చిమ్మాడ్కిన్ దురహంకృతిం జొనుపఁ బోకే, నన్ను మోహాబ్ధిలో.

ఉ. తల్లి! నిజంబుగా నిపుడు ధన్యుఁడ, నీపదపద్మరేణుసం
పల్లవలబ్ధిచే; విను, భవం బెడలించి విముక్తి గూర్చు నీ
యెల్లకు నీశ్వరిం బర వరింతు; మహార్తి మహార్గళంబు సం
ధిల్లఁగఁ జేయు మోహము విదీర్ణముగాఁ గృప సేయవే నను్.

క. నీచే నావిస్మృతిఁ గని
నీ చెప్పెడి పనుపు సేయు నీకింకరుఁడన్,

నాచేతు లొగ్గి మ్రొక్కుచు
యాచింతును నన్నుఁ గావు మజ్ఞుఁడఁ దల్లీ ! ౧౭౧

క. నీవె వినోదవిహారిణి
వై విశ్వం బీక్షవలన నలరించెదు; న
న్నీ విశ్వవిధాత యనెడి
యావా రేమియు నెఱుఁగని యజ్ఞులె తల్లీ ! ౧౭౨

సీ. నీప్రభావ మెఱుంగ నేరమినే తల్లి !
స్వర్గకాము లయి యజ్ఞములు సేత,
నీనామమును జపింప నేరమినే శ్రమ
నష్టాంగయోగసమాధిఁ గొనుట,
నీపదవరివస్య నేరమినే తత్త్వ
సంఖ్యావిధానవిస్తారు లగుట,
నీస్వరూపము చూడ నేరమినే బహు
భవముల మూఢులై పతితు లగుట,

యొక్క నిమిషార్ధ మాత్రంబు నోపరొక్క,
నీపవిత్రచరిత్రంబు నిలుప నెదల,
నంబికా యని, యీశ్వరీ యనుచు, శక్తి
యంచు, శివ యని, నీనామ మనరె లేరొ ! ౧౭౩

చ. సరసిజమందు నాకు మును జన్మము గూర్చిన దేవి యంబికా !
హరి మధుకైటభుల్ పొడువ, నాతని బాలన చేసి తీవెగా !
హరుని హరించి నాముఖమునం దుదయింపఁగఁ జేసినావుగా !
హరి హరు లేను నీకృప సమర్థుల మౌదుము నీదుశక్తినే ! ౧౭౪

క. నీజని యెవఁడుం జూడం,
డేజనుఁడున్ వినఁడు, స్థాన మిది యనఁ డెవఁడే
నీ, జగదాదివి, యేకవు,
నో జననివి శక్తి వీవ యను శ్రుతి దాసన్. ౧౭౫

తే. నీవితీర్ణవినోదంబు కేవలము మ
హాద్భుతావహం బగుటచే నాదిదేవుఁ
డగుణుఁడు నిరీహుఁడు నకర్త యయ్యుఁ బ్రీతి
నరయు నని పల్కుదు రభిజ్ఞులైన బుధులు. ౧౭౬

క. అయినం దల్లి! యొకసం
దియంబు వేధించు నెడఁదఁ, దీర్పుము దానిన్,
సయిదోడు నీకుఁ బురుషుం
డయి పరుఁడు వెలుంగు, మీరనాదు లిరువురున్. ౧౭౭

తే. వేదవాక్యంబు మిథ్య గాఁబోదు గాని,
యిది విరుద్ధంబుగాఁ దోఁచి యెడఁద వేఁచు;
బ్రహ్మవిదు లద్వితీయంబు బ్రహ్మ మేక
మే యటందురు, మీద్విత్వమే మనందు! ౧౭౮

శా. నాపుణ్యాతిశయమ్ముచే నిపుడు పొందం జాలితిన్ భవ్యమౌ
నీపాదాంబుజసేవ, సందియ మమ్మా! నీవెటనే తీర్పు, నీ
రూపం బేది, నిజంబు పూరుషుఁడవో, స్త్రీరూపాత్మవో, తెల్పి, సం
దీపింపంగదవే స్వరూపము, భవాబ్ధిన్ దాఁట ముక్తుండఁ గాన్.

క. వినయావనతాంగుఁడనై
తను నే నిటు ప్రశ్న సేయ, దయతో నాకి
ట్లనె నాదిశక్తి భగవతి
ననుఁ గాంచి కటాక్షలలితనయనాబ్జములన్. ౧౮౦

## బ్రహ్మాదులకు శ్రీదేవి నిజస్వరూపము నుపదేశించుట

క. నాకును నాతనికి సదా
యేకత్వమె కాని భేద మేమియు లే, దే
నే కాదె యతం, డాతం
డే కద నే, భేదమెల్ల యెదఁ గల భ్రమనే. ౧౮౧

క. కారణ కార్య విభేదా
కారత సూక్ష్మాంతరంబు గల మము నెఱుఁగన్
నేరుచు నెవఁ, డతఁ డీ సం
సారంబు తరించు బుద్ధిశాలి నిజముగా. ౧౮౨

ఉ. ఏకము నద్వితీయమును నే యగు బ్రహ్మ మనాది నిత్యస
త్తాకము నైనఁగాని, యది ద్వైతము నొందును సృష్టివేళ, నే
నేక నుపాధియోగమున నే అగు రెం డయి దీప మొండె, ఛా
యాకృతు లద్దమం దెటులో, యట్టులె మా ప్రతిబింబరూపముల్.

ఆ. సర్గసంక్షయంపుసమయానఁ, బురుషుండు
గాను, స్త్రీయుఁ గ్లీబమేనిఁ గాను,
సర్గవేళ బుద్ధిసామర్థ్యకల్పిత
మెల్ల భేద మనుచు నెఱుఁగ వలయు. ౧౮౩

క. నేనే బుద్ధిని శ్రీయున్
నేనే ధృతి, కీర్తి నేన, నేనే స్మృతియున్,
నేనే శ్రద్ధను, మేధన్
నేనే, దయ లజ్జ నేన, నేనే క్షుధయున్. ౧౮౪

క. నేనే తృష్ణను క్షమయున్,
నేనే కాంతియును శాంతి, నేన పిపాసన్,
నేనే నిద్రను తంద్రను,
నేన జరాజరలు, విద్య నేన యవిద్యన్. ౧౮౫

క. నేనే స్పృహయును వాంఛయు,
నేనే శక్తియు, నశక్తియేనియు నేనే,
నేనే త్మ జ్ఞాజ్ఞా వస,
తేనే నాడీసమస్త, మేనే వృష్టిన్. ౧౮౬

క. నేనే సమస్త మగువా,
క్కేనే, బుతమేనె, యసృత మేనె, పరావా

క్కే, నే, మధ్యమ పశ్యం
తీ నామును వైఖరి యన నేనే సుమ్మీ! ౧౮౮

క. నేనే యీసర్వము, నేఁ
గానిది సంసారమందుఁ గలయ వెదకినం
గానీ గానంబడ దను
జ్ఞానము సుదృఢం బొనర్పు జలజజ! మదిలో. ౧౮౯

మ. బహునామంబులు దాల్చి శక్తి నయి గీర్వాణాకృతిం బొంది లో
కహితార్థంబు పరాక్రమించెదను నేఁ గౌబేరినై వజ్రభృ
ద్వ్యూహానై వైష్ణవి బ్రాహ్మి గౌరి శివనై వారాహినై వారుణీ
విహితాకారను నారసింహి నయి తద్వేళానుకూలంబుగా. ౧౯౦

చ. జలమున నేనె శైత్యము, కృశానునియౌష్ణ్యము నేన, భానులో
పల వెలుఁగేన, యౌదును; క్షపాపతిలో హిమ మౌదు; జీవకో
టులు నను వీడెనేని నొకటుల్ లవమేనిఁ జలింపలేవు, దై
త్యుల సమయింప శక్తుఁ డగునో శివుఁడేనియు నేఁ దొలంగు నో!

తే. స్ఖలితుఁ బతితుని భీతుని భ్రాంతు శత్రు
జితు సరాధము దుర్బలమతిని జనులు
శక్తిహీనుఁ డితఁడు, హీఁ డశక్తుఁ డింద్రు
గాని, రుద్రహీనుఁడు విష్ణుహీనుఁ డనరు. ౧౯౨

క. కావున శక్తియె హేతువు
గావుట యెఱుఁగంగవలయుఁ, గంజజ! శక్తిన్
నీవుం గూడిన సృష్టిం
గావింపఁ గలాడ వగుదు, కడుఁ బెద్దవునై. ౧౯౩

మ. హరియున్ శంభుఁడు నింద్రుఁడున్ హిమకరుం డాదిత్యుఁడుం ద్వష్టయున్
వరుణుండుం బవనుండు శక్తియుతులై భాసింతు, రాశక్తిచే
ధరియింపంగ సమర్థ మౌ ధర, తదాధారంబె లేకున్న నీ
ధరియున్ శేషుఁడుఁ గూర్మ మొక్క యణుమాత్రం బూనఁగా నేర్తురే?

క. నా కిచ్చె కలిగె నేనిఁక
లోకంబుల జలము పీల్చి లోఁగొందుఁ ద్రుటిన్,
బోకార్చు నా విభావసు,
పీఁకన్ స్తంభింతుఁ బవను వివిధచరములన్. ౧౯౫

వ. మఱియుఁ జతుర్ముఖా! తత్త్వంబు లసత్తులై యుద్భవించుచుండు నని శంకింప వలవదు. ఘట కపాలాదులకుఁ బ్రాగభావ ప్రధ్వంసాభావంబులుం బోలె విద్యమానంబు లగు తత్త్వంబులకు నావిర్భావ తిరోభావంబులె కాని యుత్పత్తి ప్రలయంబులు ఘటిల్ల నేరవు. ప్రకృతంబున నీయెడఁ బృథివి కానంబడ కున్నను, నయ్యది పరమాణువులుగ నయ్యె నని యెఱుంగ నగు. ౧౯౬

తే. ఇదిగొ కొనుము మహత్తత్త్వ మేదు తెఱఁగు,
లదియు శాశ్వతము క్షణిక మదియె శూన్య
మగును, నిత్యం బనిత్యంబు, నది సకర్తృ
కం బహంకారజనకంబు, కమలభవుఁడ! ౧౯౭

తే. ఇట్లహంకార మాదిగా నేదు తెఱఁగు
లగు మహత్తత్త్వము గ్రహించి యఖిలభూత
చయము రచియింపు మబ్జజా! చనుఁడు మీరు
స్వస్వవిధులఁ దీర్పఁడు దైవభావితు లయి. ౧౯౮

చ. ఇదె భవదీయశక్తిఁ గొనుమీ చతురానన! చారురూప స
స్మిద దరహాసినిన్ విమల మాల్యవిభూషణ భూషితన్ శుభా
స్పద సమధిష్ఠితాసన సువాసిని దివ్యమహాసరస్వతిన్
ముదిత రజోగుణాన్వితఁ; నినున్ సహచారిణియై భజించెడున్.

చ. ఇదె నినుఁ గూడి వీడక చరించు వరాంగన నావిభూతి సు
మ్మిది, యవమాన్య గాదు, హృదయేశ్వరిగాఁ బ్రియగాఁ గొఁ బూజనా
స్పదగ నెఱింగి దీనిఁ గొని సత్యనివాసము చేరఁబొమ్ము, త
త్పదవి మహత్త్వబీజ సముపాత్త చతుర్విధ సృష్టి సేయుమా.

తే. కాలకర్మ స్వభావముల్ కారణములు
జగతి కంతయు నన్న సూక్ష్మం బెఱింగి
లింగకోశమునుండి వేర్పఱసి సకల
జీవులఁ జరాచరంబుల సృష్టి సలుపు. —౨౦౧

వ. సరసిజగర్భ! నీకు హరి జాప్యుఁడు, సత్త్వగుణప్రధానుఁడై
పరగుటఁ బూజనీయుఁ డగువాఁ, డెపు డెప్డు విపత్తు గల్గు, నా
తరుణములన్ ధరించి యవతారములన్ బహుభంగి దైత్యసం
హరణ మొనర్చు; శంభుఁడు జనార్దనుతోడయి యుండు సర్వదా.

క. సురలను సృష్టింపుము; త
ద్భరణము త్రైవర్ణ్యవిహిత బహుమఖములన్
జరిపింపుము; మన్నామ
స్మరణం బమరులకుఁ దుష్టి సలుపుం గాతన్. —౨౦౩

క. శర్వుఁడు తమోగుణాఢ్యుఁడు
సర్వముఖంబుల సతండు సంపూజ్యుండౌ
గీర్వాణుల నాశక్తులు
పర్వి దిగంతరములందుఁ బాయక కాచున్. —౨౦౪

ఉ. ఈవిధి నాన తిచ్చి భువనేశ్వరి, నాకు నవార్ణమంత్రదీ
క్షావిధి తీర్చి, ధ్యానపరిచర్యలు తెల్పి, వచించె నిట్లు: మం
త్రావళి నుత్తమం బిది, హృదంతరవీథి సదా ధరించి, త
ద్భావన సర్వకార్యముల వర్తిలు, శ్రేయము దానఁ జేకురున్.

తే. అట్లు కరుణించి నన్ను ననంతరమున
నాజగన్మాత భువనేశి యాదిశక్తి,
హరి కొసఁగుచున్ మహాలక్ష్మి, ననియె నిట్లు,
చెలఁగ శోభన రుచిర శుచిస్మితంబు. —౨౦౬

శా. దీనిం గ్రీడకు నీ కొసంగితిని బ్రీతిన్ శ్రీమహాలక్ష్మి, ల
క్ష్మీనారాయణయోగ మిప్పు డిటులన్ సిద్ధించె, నీదానురః

స్థానంబందు ధరింపు దీని నెపుడున్, సర్వార్థముల్ చేకురున్,
శ్రీనారాయణ! దీని నేమరక పూజింపం దగున్ సర్వదా. ౨౦౭

ఆ. నీవు విధియు శివుఁడు నిజము మద్గుణజాతు
లగుట సర్వమాన్యు లగుదు రెపుడు,
ముగుర భేద మెన్ను మూఢచేతస్కులు
నిరయగాము లగుట నిక్కువమ్ము. ౨౦౮

క. హరియే సాక్షాత్తు శివుం
డరయంగా శివుఁడె తాను హరియను వాఁడున్
మఱియుం ద్రుహిణుం డట్లే
మెఱయున్ భేదంబు లేక మీరాయిద్దరకున్. ౨౦౯

తే. వరలు పరమాత్మచింతనాపాది సత్వ,
మది ప్రధానగుణంబు నీకంబుజాక్ష!
తక్కు రెండు గౌణములు; పెంపెక్కు మఱి
లక్ష్మితోడి రజోగుణోల్లసితుఁడ వయి. ౨౧౦

ఉ. మాధవ! నీకొసంగెద సుమంగళమంత్రము, వాగ్భవంబు శా
మాధిగతంబు మాయ తుదిమై విలసిల్లెడు దాని, దాన ను
ద్గీథముఁ గూర్చి సంతతముఁ గీర్తనసేయు, జపింపు భక్తి స
ద్విధి ధరించి; కామనలు తీర్చు నిదే మఱి మోక్షదంబు నౌ. ౨౧౧

క. వైకుంఠమున రమింపు య
థాకామ మనాది గాఁగఁ దలఁచుచు నన్నున్,
మీకుండదు మృత్యుభయము
నాకడుపున నెల్ల లయ మొనర్చెదు వఱకున్. ౨౧౨

తే. శ్రీమహాకాళి నిచ్చుచు శివున కవలఁ
బలికె సమృతంపుసోనలౌ పలుకు లిట్లు,
త్రిగుణరూపిణి యయి ప్రకృతిస్వరూప,
నిర్గుణాత్మిక యయి పరానిష్కలాఖ్య. ౨౧౩

క. హర ! దీనిని గౌరి మనో
హరిని మహాకాళిఁ గొను విహారము సేయం
గ, రచింపుము కైలాసం
బు, రుచిఁ జెదునట్టిరీతిఁ బొందుము సుఖముల్. ౨౧౮

తే. తమము ముఖ్యంబు నీకు, సత్త్వము రజమ్ము
గౌణగుణములు, రాక్షసాక్రమణవేళఁ
దమము రజమును గొనుము, సత్త్వంబుఁ బూను
తప మొనర్పఁగఁ బరమాత్మఁ దలఁచువేళ. ౨౧౯

సీ. త్రిగుణులే మీ రెల్లఁ ద్రిగుణాత్మకముగాని
వస్తు వీసంసృతిఁ బడయ లేము;
దృశ్యంబు నిర్గుణం బెటు లౌను? బరమాత్మ
నిర్గుణుం డతఁడు కంటి కగపడఁడు;
సమయానువర్తినై సగుణ నిర్గుణ నేను
కార్యం బెప్పుడుఁ గాను, కారణమునే;
సర్వకారణ నౌట సగుణ నౌదును, బుకు
షాంతికంబున నిర్గుణాత్మ నౌదు;

సత్త్వవలన నహంకారజన్మ మగును,
త్రిగుణము లహంకృతిని సంప్రతిష్ఠితములు,
దానిచేత మహత్తత్త్వ మూను జన్మ,
మదియె బుద్ధి యనంగ విఖ్యాత మగును. ౨౨౦

తే. దానఁ దన్మాత్ర లుదయించు, దానివలన
నేను భూతంబు లేను కర్మేంద్రియములు
నైదు జ్ఞానేంద్రియంబులు నవల మనసు
కలిసి పదియాఱు కారణకార్యగణము. ౨౨౧

క. చనుఁడీ ముగురు విమానం
బున నిలయంబులకుఁ, జేయఁ బూనుఁడు విధులన్,

నను స్మరియించినమాత్రం
బున దర్శన మొసఁగి విషమములు హరియింతుర్. ౨౧౭

క. స్మరియింపుఁడు నన్ను సదా,
స్మరింపుఁడు సనాతనుఁ డనఁ జను పరమాత్మన్,
నిరతము మా యిరువుర సం
స్మరణంబునఁ గార్యసిద్ధి సాధ్యముసుండీ. ౨౧౮

ఉ. సెల వటు పొంది, శక్తులను జేకొని, శ్రీభువనేశ్వరీ మహో
జ్జ్వలభువనంబు రూపము ప్రభావము నద్భుత దర్శనోక్తులుం
దలఁచుచునే విమానమును దాసి కనుంగొనుసంత ద్వీపమే
గల పొడ గానరాదు, శివఁ గానము, కన్పడ దా సుధాబ్ధియున్.

క. పరికింపఁ ద్రిమూర్తులముం
బురుషాకృతు లొంది మరలఁ బొడకట్టితి, మా
ర్వార మొక్క విమానం బది
హరి మధుకైటభులఁ ద్రుంచినటఁ జేర్చెఁ ద్రుటిన్. ౨౨౦

తే. నారదా! నేను విష్ణుండు గౌరివిభుఁడు
నట్టి దేవీప్రభావంబు నరసినార
మంచు వివరింపఁ బ్రీతుఁడై యుతనిసుతుఁడు
నారదమహర్షి ప్రశ్నించె నలువ నిట్లు. ౨౨౧

తే. ఆదిపురుషుండు నిర్గుణుం డచ్యుతుండు
కనుల కగపడెనో మఱి, కన్నశక్తి
త్రిగుణమయో, నిర్గుణాత్మయో, తెలుపు తండ్రి!
వానిరూపంబు తెలుపుము దానిరూపు. ౨౨౩

క. శ్వేతద్వీపమునందు మ
హాతపమున్ మఱియు మఱియు నతితీవ్రగతిన్
దాతా! చేసి, మహాత్ములఁ
బూతుల సిద్ధులను, గంటిఁ బొందన్ దానిన్. ౨౨౪

వ. ఇవ్విధంబున నిజతనూద్యుతివిజిత పారదుం డగు నారదుం డడిగినఁ బ్రియాసదనుం డగు చతుర్వదనుండు దరహాస వికసిత ముఖ కల్హారుం డయి సంశయ నివారణ నిపుణంబులగు సత్యవచస్స్ఫురణంబుల నిట్లని నుడువం దొడంగె. ౨౨౫

క. రూపము లేనిది నిర్గుణ,
మేపగిదిం దానిఁ గనుల నీక్షింప నగున్?
రూపము గల దెల్లయు నిల
రూపింపుము నశ్వరస్వరూపము గాఁగన్. ౨౨౬

తే. నిర్గుణం బగు నల శక్తి దుర్గమంబు,
నిర్గుణుం డగు పురుషుండున్ దుర్గముండు,
భావనామాత్ర సాధ్యులు కేవలమ్ము,
జ్ఞానగమ్యులు మునులకు ధ్యానపదులు. ౨౨౭

క. ప్రకృతియుఁ బురుషుఁ డనాదు ల
వికృతు లనంతులు నచింత్యవిగ్రహు, లరుదౌ
నొక నమ్మిక వారలచే
రిక సాధ్యం, బదియె లేక లేదు తెలియఁగన్. ౨౨౮

వ. మఱియు సర్వభూతాత్మకం బయిన పరమచైతన్యము సర్వగతం బయి, తేజోరూపంబున నెల్లజీవుల ననపాయం బై యుండుఁ; గావునఁ బ్రకృతి పురుషు లిరువురును సర్వగతులు సర్వవ్యాపకులు నని యెఱుంగుము. చరాచరాత్మకం బగు సంసారంబునఁ దద్విరహితం బగునది రవంతయుఁ గానంబడదు. సర్వదేహంబులయందు మిశ్రీభూతులై వెలుంగు ప్రకృతి పురుషు లిరువురు నిరంతరైకావస్థానగతు లవ్వటం జేసి చిన్మయులు నిర్గుణులు నిర్మలులు నగు నవ్వారల నేకరూపులుగ నుపాసింపవలయు. దానం జేసియ, బ్రహ్మవేత్తలు మాయావిశిష్టం బయిన బ్రహ్మమే శ్రీదేవీపదవాచ్య మని యుపదేశింతురు. ౨౨౯

తే. అల్ల శక్తి యెదో, పరమాత్మ వాఁడె;
పురుషుఁ డెవ్వఁడో, యల శక్తి పరమ యదియె;
సూక్ష్మ మగు నంతరం బేనిఁ జూడఁ బోరు
వేదవేదాంగవిదు లగు విమలమతులు. ౨౩౦

క. నారద! యీవిశ్వ మహం
కారమునఁ జరాచరాత్మకం బయ్యె, నహం
కారజగుణావృతచిత్తం
బేరీతిని నిర్గుణంబు నెఱుఁగం జాలున్? ౨౩౧

క. గుణవిచ్ఛేదము కానిది
కనఁగా నల నిర్గుణం బగమ్యం బది; యే
జనున కహంకారము చనెఁ,
గను నాతఁడు చిత్తమం దకల్మషవృత్తిన్. ౨౩౨

క. అది విని నారదుఁ డడిగెను,
విదితంబుగ సాత్త్వికాది వివిధగుణము లె
ట్లుదితం బయ్యె? స్వరూపం
బెది వానిది? ముక్తి దేనియెఱుక లభించున్? ౨౩౩

వ. అని యడిగిన నారదునకు బ్రహ్మ యి ట్లనియె. ౨౩౪

క. త్రివిధాహంకారసము
ద్భవ మగు శక్తిత్రయంబు వరుసన్ జ్ఞానం
బవు సాత్త్వికిని, క్రియాత్మిక
మవు రాజసి, ద్రవ్యశక్తి యగుఁ దామసిచే. ౨౩౫

సీ. వానికార్యంబులన్ వాక్రుత్తు విను యథా
తత్త్వంబుగా నారదా! మహర్షి.
యందుఁ దామసాహంకారజాతమా
ద్రవ్యశక్తిని సముద్భవము లగును.

శబ్దంబు మఱియు స్పర్శము రూప రస గంధ
వాచ్యమౌ తన్మాత్ర పంచకంబు;
శబ్దగుణక మాకసము, స్పర్శగుణకము
వాయువు, వహ్ని రూపగుణకమ్ము,
వరుస రస గంధ గుణములు వారి పృథ్వు
లెఱుఁగుమివి సూక్ష్మములుగ, నీయెల్ల పదియు
మిళితమై ద్రవ్యశక్తి సన్మోళి మొంది
తదనువృత్తిక సర్గమౌఁ దామసమున. ౧౩౬

సీ. రాజస్యహంకార బీజక్రియాశక్తి
జాతమౌ వస్తుపంచకము వినుము,
శ్రోత్రంబు త్వక్కు చక్షు ఘ్రాణ జిహ్వలు
నన నొప్పు జ్ఞానేంద్రియంబు లైదు,
వాక్పాణి పాదముల్ పాయువు గుహ్యంబు
ననఁ బరఁగు కర్మేంద్రియంబు లైదు,
ప్రాణం బపానంబు వ్యానం బుదాన స
మానముల్ వాయువు లేను గూడి
యైదు పదియును రాజసాఖ్యాన సర్గ
మగుఁ గ్రియాశక్తిమయ సాధనాళిమాత్ర
మని యెఱుఁగు మి వెల్ల; సమస్తమునకుఁ
జిదనువృత్తి యుపాదానపదము సుమ్ము. ౧౩౭

సీ. సాత్త్వికాహంకార జాతమౌ జ్ఞానశ
క్తిని బుట్టు నల వస్తుగణము వినుము,
జ్ఞానేంద్రియంబుల కేనింటికిని దిశల్
వాయువు సూర్యుండు వరుణుఁ డశ్వి
నులు నధిష్ఠానరూపులు దేవతాపంచ
కము, నట్ల చంద్రుండు కంజజుండు

రుద్రుండు క్షేత్రజ్ఞరూపుండు నను నల్వు
రంతఃకరణరూపమైన బుద్ధి
లోనయిన దానికని నధిష్ఠానమైన
దైవతము లివి మనసు [illegible] చేయఁ
బడెయు నై దగు; నీరీతిఁ బరఁగవిల్లు
సాత్త్వికాఖ్యాక సాత్త్వక సర్గవిధము.

క. స్థూలం బన సూక్ష్మం బనఁ
గ్రాలుం బరమాత్మరూపకద్వయము, మల జ్ఞా
నాలోకం బగు రూపం
బోలి నిదానంబు సగ్గుణోదంచితముగ.

క. ధ్యానాదిస సంఘకునకుఁ
బూనం దగు స్థూలరూపబుద్ధియె; యదియే
కానఁగఁ బురుషుని సూక్ష్మం
బైన స్వరూపం బటందు రాత్మాభిజ్ఞుల్.

తే. నాశరీరము సూత్రసంజ్ఞను వహించుఁ,
బలికెదను స్థూలమౌ పరబ్రహ్మతనువు
విస్తరంబుగ నింక, నోపినవిధాన
వినుము, నారద! ముక్తుఁడౌ వినినవాఁడు.

తే. భూతసూక్ష్మంబు లని నేను మున్ను పల్కి-
నట్టి తన్మాత్ర లే యగు నైదుభూత
ములుగఁ బంచీకరణకార్యమూలముపను,
వినుము పంచీకరణ మార్గ వినవణంబు.

క. ముందుగ రసతన్మాత్రను
బొందెంచి మనంబునందు, భూతాంశగణం
బిందుల వేర్వేరుగఁ జే
ర్పం, దగ నుదకంబు పుట్టు రసమయ మగుచున్.

సీ. ముందు మనస్సులోఁ బొందించి యల రస
తన్మాత్ర, రెండుగా దానిఁ జేసి,
యందులో నొకభాగ మట్లుంచి, రెండవ
భాగంబు నాల్గుగాఁ బంచి, యట్ల
తక్క భూతంబుల తన్మాత్రలను గూడ
రెండుగా నొకటి నాల్గిటిగఁ జీల్చి,
నాల్గు రసము సాంశాలునఁ దక్కటి
భూతాళి యష్టాంశములను జేర్ప,

నుదక ముదయించు, రసముఁ బోఁడి చీల్చి
నట్టి నాలుగుభాగమ్ము లన్ని మరల
నితరభూతతన్మాత్రల నెసఁగి కలియ
భూతతన్మాత్ర లవి మాఱు భూతములుగ. ౨౭౭

వ. ఇట్లు వేర్వేఱుగఁ బంచభూతసంభవమై, యవ్వానియందు నధిష్ఠాన
ముగాఁ జైతన్యము ప్రవేశించినంతన, యహ ముదయించు. ౨౭౮

క. ఆ యహ మను నభిమానం
బాయత్తంబైన నవియె యాద్యం బగు నా
నాయుతుఁ డనియు ననంబడుఁ,
బాయక వైశ్వానరాఖ్యఁ బ్రథితుఁ డతండౌ. ౨౭౯

సీ. భూతముల్ పూర్వోక్త రీతి ఘనీభూత
రూపత విస్పష్టరూపము లయి,
యొక్కొక్క భూతంబు కొక్కొక్క గుణము ప్ర
ధానంబుగ గుణవృద్ధముల యగును;
నాకాశమున గుణంబగు శబ్ద మొక్కటె;
స్పర్శమ్ము శబ్దమ్ము వాయువునకు;
శబ్దంబు రూపంబు స్పర్శంబు నా మూఁడు
గుణము లౌ నగ్నికి గుణము లగుచు;

జలమునకు నాల్గు గుణములో శబ్ద మనఁగ
స్పర్శమును రూపగుణము రసం బనంగఁ;
బృథివి కైదు గుణంబులై వెలయు గంధ
శబ్దరూపముల్ రసము స్పర్శం బనంగ.

తే. అట్లు మిళితమై పుట్టు బ్రహ్మాండ మెల్ల
సర్వజీవాళి మేళనజాత మగుచు
సకలము నజాండ మిది; జీవజాతు లెల్ల
నెనుబదియు నాల్గు లక్షలై యెసఁగు నయ్య!

## సత్త్వాదుల స్వరూపము

క. వివరించితి సర్గం, బిఁక
వివరింతు గుణస్వరూప విధముల్ వినుమా,
భువి సత్త్వము ప్రీత్యాత్మక
మవు, నా ప్రీత్యుద్భవంబు నగును సుఖమునన్.

ఉ. శాంతియు శౌచ మార్జవము సత్యము లజ్జ దయాస్వభావమున్
సంతసమున్ దయా ధృతులు సంతతతుష్టియు శ్వేతవర్ణమం
దెంతయుఁ బ్రీతి ధర్మమున నిష్ఠము సత్త్వన సింధుశ్రద్ధ యు
త్యంత మసత్త్వనన్ విముఖతాప్తియు సాత్త్వికలక్షణంబు నౌ.

క. తత్త్వం బెఱిఁగిన మౌనులు
సాత్త్విక మన మఱియు రాజసము తామసమున్
త్రిత్వాకారప్రత్యే
కత్వమున వచింత్రు శ్రద్ధ గ్రాలు నటంచున్.

ఉ. రక్తముచాయ రాజసము రాజిలు, నప్రియకారి యాతనే
ప్రోక్తము దుఃఖయోగము తదుద్భవకారణ మంచు, దానినా
ద్రిక్తత మానగర్వములు ద్వేషము ద్రోహము స్తంభమున్ బ్రవృ
త్త్యుక్తియు నిద్ర కల్గు; నివి యొప్పును రాజసలక్షణంబులై.

క. వెలయుం దమంబు రంగున
నలు పగుచు, విషాద మోహన ప్రద మది యె
ట్టుల గుర్తింపంగాఁ దగుఁ
దెలిపెదఁ, దల్లక్షణంబు దెలియుము వత్సా! ౨౫౩

సీ. ఆలస్య మెం దుండు, నజ్ఞాన మెం దూడు,
నతినిద్ర యెందు, దైన్యం బ దెందుఁ,
గార్పణ్య మెం దుండుఁ గౌటిల్య మెం దుండు,
భయ మోఁదు నుండు, విషాద మెందు,
రోష మెందుల నుండు, నైషమ్య మెం దుండు,
నెం దుండుఁ బరదోష మెన్నుచుంట,
వేదశాస్త్రోక్త విధులందు నాస్తిక
బుద్ధి యెం దుండు వివృద్ధ మగుచు,
నందుఁ దామస మగు శ్రద్ధ యావరించె
ననుచు నీ లక్షణంబుల నరయఁ దగును
బుద్ధిమంతుఁడు; లెస్స నీబుద్ధిఁ గనుము,
పరగు నిది పరతాపోపపాదక ము. ౨౫౪

క. కేవలము సత్త్వగుణమును
గేవలము రజోగుణంబుఁ గేవలతమముం
లే వెం, దన్యోన్యాశ్రయ
భావంబున నవి విమిశ్రవర్తనఁ బొదలుం. ౨౫౫

క. శ్రేయస్కాముఁడు సత్త్వ
స్థాయుస్ఫూర్తిం వెలుంగఁ బవరించి, రజ
స్సాయమన మొనర్చుచు, నె
ట్లో యుడుపంగఁ గడఁగుఁ దమఃప్రదేకంబుం. ౨౫౬

క. ఒక్కటి పెం పొందిన మఱి
యొక్కటి రెండును విరుద్ధధర్మ లగుటచే

ను క్కటి శమియించును, విను
వక్కాణించెదను వత్స! వాసవివరమున్. ౨౫౮

క. వినినంతమాత్ర నెవ్వాఁడుఁ
గనినంతనునేని జ్ఞాని గాఁ డచలంబై
యనువుగ ఫలజనకం బగు
ననుభవ మది లేక, నిక్కమయ్య తనూజా! ౨౫౯

ఉ. ఒక్కఁడు పుణ్యతీర్థమహిమోక్తి వినం గని శ్రద్ధ మీఱఁ దా
నక్కడి కేఁగి క్రుంకు లిడి యర్థవిధంబున దానధర్మముల్
పెక్కులు రాజసమ్ము లొనరించి గృహాగతుఁ డయ్యె; వానికే
నక్కట! కామమాదియగు నారిపుషట్క మడంగ దింతయున్.

తే. పాపదేహవికారరూపంబు లైన
కామరాగాదికం బడంగనిది తనువు
పాపభూయిష్ఠమేకద, వానితీర్థ
సేవయును నిక్క వృథ యయ్యెఁ గేవలమ్ము. ౨౬౦

ఉ. కర్షకుఁ డొక్కరుండు తనుకష్టము నోర్చి నల్లనేల సం
కర్షణముం బొనర్చి సరిగాఁ దటి విత్తులు చల్లి వారిసం
తర్షమొనర్చి రేఁ బవలు దానినిఁ బాయక కాచియుం దుదిన్
హర్షముతో హిమాత్యయమునన్ నిదురించెను బంటవేళలో. ౨౬౧

క. అకటా! వనమున వ్యాఘ్రా
దికములు శలభములుఁ బైరు దినివేసె, సము
త్సుకత మెఱయఁగా నా క
ర్షకుఁ డాసించిన ఫలంబు సర్వం బడఁగెన్. ౨౬౨

క. ఒక్కనితీర్థశ్రమ, మిం
కొక్కనికృషి, యిట్లు నిరుపయోగము లగుఁ, జెం
పెక్కను శాస్త్రవిలోకన
నెక్కడ సత్త్వము విరాగ మెసఁగు ఫలంబై. ౨౬౩

తే. సత్త్వ మెక్కువయై రజస్తమము లడఁచుఁ,
దమము సత్త్వమ్మును రజోభ్యుదయ మడంచుఁ,
దమము పెరిగి యడంచు సత్త్వంబు రజము;
నపు డగు విరాగ లోభ మోహములు వరుస. ౨౬౪

ఉ. సత్త్వము వృద్ధి గన్న, స్థిరసంస్థిత మౌ మతి, ధర్మమందు లో
లత్వము సత్త్వభోగవిమలత్వము యాజ్ఞికకర్మలందు నా
స్థత్వము వృద్ధి గాంచు, నిరతంబు సుఖగ్రహణం బొనర్చెడిన్
సాత్త్వికవిత్త మెక్కుడై, రజమ్మును నొంచి తమస్సు నోర్చెడిన్.

ఉ. రాజసమైన శ్రద్ధ ప్రబలం బయిసంత, సనాతనంబులై
భ్రాజిలు ధర్మముల్ వదలు వాంఛ జనించుఁ, గ్రమప్రవృద్ధమౌ
రాజసవిత్తవర్ధనము రాజసభోగసుఖేచ్ఛ, దాసితో
సాజము నిర్గతం బగుట సత్త్వముఁ దామసముల్ గ్రమంబుగా.

మ. ఎపుడు తమం బెసంగు నపుడే శ్రుతియందుఁ బ్రమాణబుద్ధియుల్
వ్యపగత మౌఁ, బొనర్చును ధనాత్యయ మెల్లెడ, ద్రోహియౌ, విలా
సపరుఁడునై శఠుం డగు, నశాంతుఁ డగున్, స్వ్రశయించు, రాజసం
బుపశమ మంద సత్త్వమును నొక్కట, దుష్కృతి క్రోధనుండు నౌ.

సీ. సత్త్వ మేనిఁ దమస్సు రజస్సునేని
నొంటిగా నుండ, నన్యోన్య మంటియుండు;
నం దొకటి తక్కు రెంటి రూపొందఁ జేయు,
మిథునధర్మంబు లవి యని కథితము లగు. ౨౬౮

తే. మృత్తుచేఁ గుండ, కుండచే మృత్తు నెట్లొ,
యజ్ఞదత్తుండు దేవదత్తాహ్వయుండు
నొక్కపని యెట్లు సేతురో, యుగ్మభావ
మవియుఁ బూనును స్త్రీపురుషాప్తియువలె. ౨౬౯

సీ. అట్లు పలుకు బ్రహ్మ నడిగితి, సంతృప్తి
నొందకుంటిని మధురోక్తులు విని,

మఱియుఁ దెలుపు గుణసమ్యగ్రూపంబును,
బుద్ధి పరమశాంతిఁ బొందునట్లు. ౨౭౦

### గుణ స్వరూప నిరూపణము

తే. అట్టు లడుగు నారదుపల్కు లాలకించి
యా రజోగుణసంభూతుఁ డగు విరించి,
యాదరం బొప్ప నీక్షించి యాత్మజాతు
వంక, వివరించె నీరీతి నంక, వినుము. ౨౭౧

క. గుణముల నిండగు రూపం
బనువర్ణింపంగ సాధ్య మగునే నా, కై
నను నది నానేర్చినవ
ట్టును దృష్టాంతముల స్ఫుటపఱుతున్, విను దానిన్. ౨౭౨

చ. పొలఁతి యశేషభూషణవిభూషితయై లలితాంగియై స్మితో
జ్జ్వల యయి హావభావవిలసద్వపువై పతికిం బ్రియంబు మి
క్కిలి పచరించు, బంధుతతికిం బ్రమదం బొనఁగూర్చుఁ దల్లిదం
డ్రులకు, నదే సపత్నికిఁ గడుం గలిగింపదె శోకమోహముల్! ౨౭౩

మ. మదదంతావళబృంహితం బగుచు భ్రామ్యద్వాజిహేషారవా
స్పదమై స్యందననేమిఘోష మయి యాస్ఫాల్యత్పదాతిప్రథా
పదమౌ వాహిని చోరలుంఠితభయభ్రాంత్యాపనోదక్షమం
బదియే దస్యుజనాళికిన్ భయవిమోహాపాదియై యొప్పదే! ౨౭౪

చ. ఘనతిమిరావగుంఠితము గర్జనఘోరతటిద్భ్రమంబు దు
ర్దిన మది విత్తుకెతు నలరించి, యనావృతగేహవాసులౌ
జనుల నలంతవెట్టి యనిశంబును బ్రోషితభర్తృకాజనం
బున కెడలేని యార్తియు విమోహభరంబుఁ గరంబు గూర్పదే!

క. గుణ మేదియు నొంటిగ నెం
దును నుండంబోదు సుమ్ము, తోడై యుండుం;

గనుక, సుఖంబును దుఃఖం
బును మోహమునట్ల యవియు మూఁడుం గూర్చున్. ౨౬౬

ఉ. సత్త్వగుణంబు నిర్మలము స్వచ్ఛము నై విశదప్రకాశశో
భాత్వముతోడ నొప్పు; నది వర్తిలుచున్న లఘుత్వ మొందు, లో
లత్వము మానె నేఁడిన్, విషయలంపటవృత్తి తొలంగు, సత్కథా
విస్త్వము వృద్ధియౌ, కొనవు వెన్కటివృత్తుల నింద్రియావళుల్.

క. చంచలచిత్తము జృంభా
ప్రాంచితదేహంబు స్తంభపరవశమనముం
గాంచకగ నగు జనంబుల
ఖించు నెడ రజోగుణంబు మేదుర మగుచున్. ౨౬౮

క. కలి నన్వేషించుచుఁ జా
పలమున మది శాంతి లేక భ్రమియింపంగాఁ
గలిగెడి కోర్కుల బరునై
తెలఁగొను నింద్రియగణంబు తమ మేపొందన్. ౨౬౯

తే. ఇట్లు గుణవిస్తరంబు వచింప స్రష్ట,
నారదుఁడు ప్రశ్న చేసె; గుణత్రయంబు
భిన్నలక్షణంబు విరుద్ధవృత్తి, యొకట
మిశ్రితమై యెట్లు కార్యముల్ సలుపు ననుచు. ౨౭౦

వ. అని యడిగిన నారదునకు బ్రహ్మ యి ట్లనియె. ౨౭౧

ఉ. తైలము వర్తి యగ్నియు నితాంతము వైరులు భిన్నధర్మసం
శాలులు నయ్యు నొండొకట సంగతమై వెలుఁగొంది దీపమై
చాలవె పాఱద్రోల ఘనసంతమసంబు దిగంతభూమి, కా
లీల గుణత్రయంబుఁ బొనరింపఁగఁ జాలును గార్యజాలముల్.

వ. అని పితామహుండు నాకుఁ దెలిపె నని నారదుండు, వ్యాసునితో
మఱియు ని ట్లనియె. ౨౭3

క. వ్యాసమునీంద్రా! సత్యవ
తీసుత! విను కారణములు త్రిగుణములే సు
మ్మీ సృష్టి కెల్ల, నేఁ గమ
లాసనుచే మున్ను విన్న దదియే వత్సా! ౨౮౮

తే. ఇట్లు మున్ను నారద సంయమీశ్వరుండు
విస్తరించె గుణంబుల వివరమెల్ల
గాన, జనమేజయా! నీవు దీని నెఱిఁగి
నిష్ఠ మీఱఁ బరాశక్తి నిలుపు మెడఁద. ౨౮౯

శా. ఆరాధింపుము దాని నాపరమ దివ్యాకార, నెద్దానిచే
నీ గా పొందిన సర్వముల్ వితతమై యీరీతి భాసించునో,
సారం బేదియొ సర్వనామములకుల్, సంసాధ్యకార్యాళిభే
దారంభంబుగ నేది నిర్గుణయునై సాకారయై పొల్చునో! ౨౯౦

క. పురుషుఁడు పూర్ణుఁడు పరముఁడు
నిరీహుఁ డవ్యయుఁ డకర్త నిర్గుణుఁ డేక నీ
పరమమహామాయయె దా
విరచించును సదసదాత్మవిశ్వం బెల్లల్. ౨౯౧

క. హరి హరు లజుఁ డిన చంద్రులు
పురుహూతుం డగ్ని వాయువులు వరుణాదుల్
సుర లెల్ల శక్తియుతులై
కరము సమర్థు లటు గాక కదలం గలరే! ౨౯౨

ఉ. ఆ పరమేశియే జగతి కంతకుఁ గారణమయ్యె! భూప! దే
వీపదభక్తిఁ జిత్తము ద్రవింప ముఖం బొనరింపఁ బూను, మం
బాపరిచర్యచేత సులభం బఖిలేప్సితసిద్ధిదంబు సం
తాపహరం, బసంతకరుణామయ యీశ్వరి సత్త్వమూర్తి యౌ.

ఉ. దానినె మున్ను బ్రహ్మయు సదాశివుఁడుల్ హరి పూజచేసి, స
ద్దాని జితాత్ములౌ మునులు ధ్యాన మొనర్తురు మోక్షకాంక్షులై

దానిపవిత్రనామము విధాపఠనముగాఁ బ్రసంగమా
త్రాన వచించినంతనె వరంబు లసాధ్యములైన నీయదే! ౨౯౦

## సత్యవ్రతచరిత్రము

తే. వినుము సత్యవ్రతుం డను విప్రుఁ డొకఁడు
బెదురుపోతంబుగా భయవిహ్వలుఁ డయి
పలుక 'ఐ ఐ' యటంచు నాపరమమూర్ఖుఁ
జపిసెఁ గవిరాజు దేవి ప్రసన్న యగుచు. ౨౯౧

క. దేవీనామమహత్త్వము
భావితముగ మాకు నెపుడుఁ బ్రత్యక్షమును
మ్మా విమలకథాముఖమున,
నా, వేదవ్యాసుఁ గాంచి నయ మెసలారన్. ౨౯౨

వ. జనమేజయుం డా సత్యవ్రతునికథ వినవలతు నానతి మ్మని వేఁడిన
వ్యాసుం డిట్లనియె. ౨౯౩

క. వినిపింతుఁ గౌరవేశ్వర!
మునులసమాజమున నేను మును విన్నది పా
వనము మనోహర మతిశో
భన మద్భుత మగు పురాణవరకథ, వినుమా. ౨౯౪

క. కురురాజ! మున్నొకానొక
తఱి నే దీర్థాభినిరతిఁ దరలి మునినిరం
తరసేవ్యము నైమిశవని
కరిగి మునీంద్రులకు నెఱఁగి యచట నిలిచితిన్. ౨౯౫

క. అందుండి రపుడు సనకస
నందను లాదిగల బ్రహ్మనందనులు చిదా
నందులు జీవన్ముక్తు ల
మందతపోవ్రతు లనేక మౌనిజనములున్. ౨౯౬

క. వేదవిదుల్ వేదవ్రత
వేదులు వేదాంతవిదులు వివిధాధ్వరసం
పాదితపుణ్యులు శౌచా
మోదులు మును లా సమాజమునఁ గల రనఘా! ౨౯౭

క. ఆ పుణ్యసమితిలో బహు
ధా పుణ్యకథాప్రసంగతతి నడువంగా
నా పరిషత్తును వినయా
లాపుఁడు జమదగ్ని యిట్టులం బ్రశ్నించెన్. ౨౯౮

క. ఇందఱు మహానుభావులు
నిం దొక్కటఁ గూడియుంట నెంతయు మదికిన్
విం దయ్యె నాకుఁ గల్గిన
సందేహము దీర్పరయ్య సదయహృదయులై. ౨౯౯

క. చేరఁగ సుఖసేవ్యుండై
కోరిక లెల్లయును వేగఁ గూర్చెడు విభుఁడై
యారాధనీయతముఁ డగు
శ్రీరమ్యుఁడు వేలు పెవఁడో సెల విచ్చెదరో! ౩౦౦

క. అట్టిఁడు బ్రహ్మయొ, విష్ణువొ,
గట్టులదొరకూఁతుమగఁడొ, కా కింద్రుఁడొ, య
గ్రాట్టో, సమీరణుఁడొ, ధన
రాట్టో, కుమారుఁడొ, యినుండో, రజనీపతియో! ౩౦౧

మ. మునిగోష్ఠిన్ జమదగ్ని యీవిధిని మోదుప్పొంగెలుఁగో సందియం
బును దీర్పుం డని వేఁడుకొన్న వచనంబుల్ లెస్సగా లోమశుం
డను మౌనీశ్వరుఁ డాలకించి సభలో నత్యాదరం బొప్ప నా
తని సంబోధన చేసి పల్కెను సమాధానంబు నీరీతిగా. ౩౦౨

సీ. శుభ మిచ్ఛయించెడి శుద్ధు లెల్లరకును
సంసేవ్యతమ పరాశక్తి యొకతె,

యదియే ప్రకృతి యాద్య యదియె సర్వగ శివ
యదియె బ్రహ్మాదిమహాత్మజనని,
సంసారపాదప సంతతి కదె మూల,
మదె సమస్తము దాల్చు నఖిలధాత్రి,
స్మరణంబుచే సముచ్చారణ వరదాత్రి
యద్దియే కరుణారసార్ద్రమూర్తి,
యాపరేశి మహత్త్వబోధాతిభూమి
యయిన యితిహాసమును మునులార! వినుఁడు.
ద్విజుఁ డొకం డెట్లు శుభము ప్రాపించెఁ దేవ
లాక్షరోచ్చారణముమాత్ర; నద వచింతు. ౩౦౩

దేవదత్తుం డనంగ భూదేవుఁ డొకఁడు
పుత్త్రహీనుండు కోసలభూమిఁ గలఁడు;
పుత్త్రకామనతో విధిపూర్వకముగ
వాఁడు కావింప నిష్టి యుపక్రమించె. ౩౦౪

తమసాతీరంబున ను
త్తమమండప మొండొనర్చి దానికి ద్విజస
త్తములను సత్క్రియవి
త్తములను బహువేదవిద్వదాన్యులఁ బిలిచెన్. ౩౦౫

వేది నిర్మించి, యట యథావిధిఁ బ్రతిష్ఠ
సలిపి యగ్నిని, బుత్త్రేష్టిఁ దొడఁగెఁ జేయ,
బ్రహ్మగ సుహోత్రమౌని, యధ్వర్యుఁడుగను
యాజ్ఞవల్క్యుఁడు, హోత బృహస్పతిగను. ౩౦౬

పైలముని యయ్యెఁ బ్రస్తోతృపదవి నుంచి,
గోభిలాఖ్యు నుద్గాతగాఁ గూర్చె, మఱియు
మౌనిసింహుల సభ్యులఁగా నొనర్చె,
వసు వొసఁగ నెల్లరకు విధివత్తుగాఁగ. ౩౦౭

తే. అప్పు డుద్గాత సామగాయనవరిష్ఠుఁ
డందు సప్తస్వరముల సమన్వితము ర
థంతరమ్ము గానము స్వరితమ్ము గూర్చి
సలుపుచుండె మనోజ్ఞసుశ్రావ్యఫణితి. ౩౦౮

క. ఆసమయంబున బహుళ
శ్వాసంబులఁ జేసి సుంత స్వరభంగము గాఁ
గా, సహియింపక గోభిలు
నీసున నని దేవదత్తుఁ డిట్లు కుపితుఁడై. ౩౦౯

తే. మూర్ఖు వైతేమయా మునిముఖ్య నీవ!
యయ్యయో కామ్యకర్మగదయ్య యిదియుఁ?
బుత్త్రిఁ గామించి యజనంబు పొనరుప నిటు
లిందు స్వరభంగ మొనరించి తేమనందు? ౩౧౦

తే. గోభిలుఁడు పల్కె నిటు బిట్టు కుపితుఁ డగుచు.
మూర్ఖుఁడు శఠుండు శబ్దవిమూఢుఁ డయిన
పుత్త్రుఁ డుదయించు నీకు, దుర్బుద్ధి వగుచు
నిట్లు నిందించి యుంట నిర్హేతుకముగ. ౩౧౧

క. శ్వాసోచ్ఛ్వాసంబుల య
భ్యాసము సాజము శరీరభాజనులకు, నే
దోసంబును దద్గ్రహణా
యాస స్వరభంగగతుల నంటదు జనులన్. ౩౧౨

తే. ఆమహాత్ముండు గోభిలుం డటు శపింప,
దేవదత్తుండు తచ్ఛాపతీవ్రవాక్య
భీతుఁడై, యార్తమూర్తి వినీతుఁ డగుచు
వేఁడె నిట్లని గోభిలు వివిధగతుల. ౩౧౩

క. అయ్యో మహాత్మా! యే మన
నయ్యా! నినుఁబోటి మహాను లక్రోధను లై

యెయ్యెడలన్ సౌఖ్యప్రదు
లయ్యెదరే, దీని కింత యలుక వలసెనే? ౩౧౮

తే. సుతునిఁ బడయఁ గేను సుమహచ్ఛుగావేశ
తపనఁ బొగిలినాఁడ దద్దయు మును,
పిట్లు కరుణ మాలి హింసించెదో మఱి
శాపవాక్కులం బ్రశస్తహృదయ! ౩౧౯

వ. వినవోకో వేదవేత్తలగు విప్రులు సెప్పఁగ మూర్ఖుఁడైన పు
త్త్రునిఁ గనుకంటె మే లగు సుతున్ బడయం గనకుంట నాఁగ, నం
దును బహునింద్యకర్ముఁ డబుధుం డగు బ్రాహ్మణుఁ, డట్టివారిఁ జె
ల్చన నిజ పూరయం బశువులన్ గణుతింపఁగవచ్చు, భూసురా!

శా. భూదేవుం డిల మూర్ఖుఁ డైనయెడలన్ బూజార్హతల్ లేవు, నై
చ్ఛోదానార్హత లేదు; కర్మవిధులన్ దూరుం డగున్ శూద్రుఁ డ
ట్లో దా నట్టుల; నింద్యు నాతనిఁ బవిత్రుల్ చేర రానీక యెం
తే దూరంబున నుంతు రాసనవిధిన్ దేవర్షి కార్యంబులన్. ౩౨౦

ఉ. వేదవివర్జితుండయిన విప్రుఁ డగున్ గరదుండు రాజు; కెం
తే దయ నట్టివాని క్షుధ దీర్చెడి యన్నము మించి వేఱుగా
నేమియు దాన మీయఁ దగ, దిచ్చిన నారకి యౌను; మూర్ఖునిన్
సాదర మొప్పఁ గర్షకజనంబునఁ గూర్చి మెలంగ మే లగున్.

తే. శ్రాద్ధమున మూర్ఖవిప్రునర్చనముకంటెఁ,
గుశచటంబునఁ జేయుటే కొంత మేలు;
మూర్ఖుఁ డెయ్యెడ దానాదిపూజ లందు,
నాయెడ బుధుండు వసియింపనైనఁ జనదు. ౩౨౧

ఉ. వేఁప ఫలింపఁ దత్ఫలము విందులు కాకులు మెక్కనేకదా!
యూపగిదిన్ దురాత్ములసుఖార్థమె దుష్టువిభూతి చొప్పడున్;
ఏపురుషుండు వేదవిదు సిం తలకెంచు భుజింపఁ బెట్టి, మె
చ్చి పులకింత్రు స్వర్గమున నాతనిపూర్వులు పూర్ణతుష్టులై.

క. కావున గోభిల! నన్నుం
గావుము, మఱలింపు శాపకఠినత, నే లోఁ
జా వట్టి సుతునికంటెం,
దావకపదయుగళి వ్రాలినాఁడఁ దేవా! ౩-౨౧

ఉ. గోభిలుపాదపద్మములకుం బ్రణతుం డయి వాఁడు గాఢసం
క్షోభము నొంది యశ్రువులు గూరినకన్నుల నిట్లు వేడు న
ప్టాభునిఁ గాంచి గోభిలునియాత్మ కరంగె; క్షణార్ద్రకోపనుల్
శోభనులౌ మహామతు; లశుద్ధులు దుష్టులు కల్పకోపనుల్. ౩-౨౨

చ. జలము స్వభావశీతలము చయ్యన వేఁడిమి యెక్కు నెండచే,
జ్వలనునితోడియోగమున; వానివియోగము నొంది వెంటనే
చలువ యగున్; మహాత్ములకు శాంతము పూను మనస్సు లట్లు; గో
భిలుఁడుఁ గృపాతరంగిత పవిత్ర వచస్సులఁ బల్కె నిట్టులన్. ౩-౨౩

తే. నావచనకారణంబుగా దేవదత్త!
మూర్ఖుఁడై నీకుఁ బుత్త్రుండు పుట్టుఁగాని,
వాఁడు పిమ్మట మఱియు విద్వాంసుఁడు నగు
నుడుగుము కలంక నీమది విడువు వగపు. ౩-౨౪

తే. ప్రయతుఁడై దేవదత్తుఁ డా వరము నంది,
యిష్టిని సమాప్తి చేసి యుద్దేష్ట దక్షి
ణల నొసంగి ఋత్విజుల హృష్టుల నొనర్చి
పంపి, యెదురు సూచుచు నుండెఁ బడఁచుచు సుతుని. ౩-౨౫

ఉ. రోహిణికిన్ సమాన యగు రూపసి యాతని ధర్మపత్నియున్
రోహిణినామ దాని కతఁడున్ శుభలగ్నమునందు గర్భస
ర్వ్యాహా మొనర్చి పుంసవనవర్త్మనఁ దీర్చి యలంకరించి యు
త్సాహము మీఱ వేదవిహితంబుగఁ జేసె సమస్తసద్విధుల్. ౩-౨౬

తే. పది నెలలు నిండ రోహిణీవనిత యంత
శుభదినంబున రోహిణీశుద్ధతార

శుభముహూర్తానఁ బ్రసవించె శుభకుమారు,
జనకుఁ డతనికిఁ దీరిచె జాతకర్మ. ౩౨౭

క. సుతు దర్శించినపిమ్మట
సుతథ్యుఁ డని నామకరణ మొనరిచి విధిస
మ్మతిముగ గర్భాష్టమమున
నతని కుపనయన మొనర్చె నానందమునన్. ౩౨౮

క. శుభలగ్నంబున సుతునకు
నభిమానము మీఱ వేద మధ్యాపనఁ జే
యు భరితహర్షుఁడు బ్రహ్మ
ప్రభువుం డా మౌనివరుఁడు ప్రారంభించెన్. ౩౨౯

క. గురుఁ డటు పాఠము సెప్పిన
మఱలం బాఠం బనండు, మాటాడఁడు వా
తెఱువఁ డొకించుక, పెదవుల
నని విప్పఁడు, నాల్క యింత యాడింపఁడు రో! ౩౩౦

క. చెప్పినపాఠము చెవులన్
జొప్పడెనో లేదో తెలియఁ జొప్పడదు మదిం
దెప్పర మగు మఱపుం దెర
గప్పినవడి మూఢుఁడట్లు కనఁబడు నెపుడున్. ౩౩౧

క. బ్రతిమాలు నొకప్పుడు పిత
కతిపయసమయముల విసివి కసరుం దిట్టున్
స్తుతియించు బుజ్జగించును
మతిఁ దూలినఁ గొట్టు నొక్కమాఱు కుపితుఁడై. ౩౩౨

క. ఎన్ని విధంబులఁ జెప్పిన
సున్నయ్యెఁ బ్రజ్ఞత్వ మెల్ల, సుంత యుతథ్యుం
డన్నిగమంబులఁ బలుకం
బన్నింపఁడు జిహ్వ; వచ్చెఁ బంద్రెం డేండ్లున్. ౩౩౩

క. విధిపూర్వకముగ సంధ్యా
విధి నిర్వర్తింప జాతవేదుసమర్చా
విధి సేయఁగ నేరం డను
కథ విప్రుల ఋషుల జగతిఁ గలయం బ్రాఁకెన్. 334

క. ఎం దెం దరిగె నుతథ్యుం
డం డెల్లరు నవ్వ సాగి రాతనిఁ గంచున్
నిందింతురు తలిదండ్రులు
బందుగు లందఱు నిజేచ్ఛఁ బదరుచు రతనిన్. 335

ఉ. ఇంత శఠుండు పుత్రుఁడు జనించుటకంటెను మేలు పంగు వ
స్త్యంతము నంధుఁడైన సుతుఁ డంచు వచింపఁగఁ దల్లిదండ్రులే
యెంతయు నావచస్సు లెరియింపఁగ వాఁడు విరక్తబుద్ధి వి
శ్రాంత సురాపగాతట సుశాంత తపోవనిఁ జొచ్చె నిష్ఠమై. 336

క. ఉటజం బొక్కటి గంగా
తటమునఁ గల్పించి దివ్యతరముగఁ దా న
చ్చట వనవృత్తిని నివసిం
చుటకున్ నిశ్చయ మొనర్చి చొప్పడె దీక్షన్. 337

తే. బ్రహ్మచర్యంబు పరమగు వ్రతము నాకు
సత్యమే పల్కువాఁడ, నసత్య మింత
పలుక కుండెద, బలితంపుఁ బ్రతిన లంచు
స్థిరమనీష సంకల్పంబు చేసె నతఁడు. 338

సీ. వేదాధ్యయన మన్న విధి యెఱుంగఁ డొకింత,
జపవిధానము నేర్వఁ జాలఁ డింత,
దైవతధ్యానంపు దారి యగమ్యంబు,
రాదు వానికిఁ దదారాధనంబు,
నాసనవిధ మన్న నాదియుఁ గానరాఁ,
డింత ప్రాణాయామ మెఱుఁగ లేఁడు,

వినఁడు ప్రత్యాహార మనుపేరు కలదైన,
భూతశుద్ధి యొనర్చు పోలు పెఱుఁగఁడు,
మంత్ర మెఱుఁగఁడు, కీలకమహిమ నెఱి,
మొదలు గాయత్రి పలుకు టేమో యెఱుంగఁ,
డాచమన మన్న స్నానంబు శౌచ మన్న
నేమొ యెఱుఁగఁడు, మఱి చేయు నేమి తపము! ౩౭౯

క. ప్రాణాగ్నిహోత్రమును బలి
దానము సంధ్యార్చనంబు తదుపరి సమిధా
ధానము హోమము నతిథిస
మానచసనము నతని కింత యాడవు మదిలో. ౩౮౦

మ. ప్రాతర్వేళల మేలు కాంచి యెటులో పద్దోమి మంత్రక్రియా
వీతస్నాన మొనర్చి గాంగధునిలో విస్వాదిమధ్యాన ఖ
ద్యోతుం డెక్కుడువేళ నాఁకటిసొదన్ దూలంగ సర్వాంగముల్
చేతం జిక్కిన పండ్లు వన్యములు భక్షించున్ గతాతంకుఁడై. ౩౮౧

క. సత్యం బెప్పుడుఁ బల్కు, న
సత్యం బాకవేళ నాల్క సడలదు; దానన్
సత్యతపుం డని జనములు
ప్రత్యేకము పేరు పెట్టి పలికిరి వానిన్. ౩౮౨

క. ఒక్కని కహితమొనర్పం,
డొక్కనికిన్ హితము సేయ నూకొనఁ డెన్నం,
డొక్కట సుఖనిద్రం గొను,
నొక్కఁడ చింతించు నిర్భయుం డయి యిటులన్. ౩౮౩

ఉ. ఎన్నఁడు నన్ను మృత్యువు వరించుఁ, దరింతును దుఃఖవార్ధిఁ? బ్ర
సన్నశతాత్మజీవనముకన్న నిసీ! మరణంబు మేలు, హా
ఖ్యోన్నతి కెల్ల దైవముదురూహమె కారణ, మేమి సేతు? నా
యున్నతవిప్రజన్మము వృథోద్యత మయ్యెను విద్య యంటమిన్.

క. పాలం బిదుకని ధేనువు
లీలం, బుష్పించియున్ ఫలింపనితరువుం
బోలెన్, వంధ్యాతరుణీ
శ్రీలుం బలెనే, వృథా కులీనతఁ గంటెన్. ౩౮౫

ఉ. నే నిటు లేల దైవమును నింద యొనర్చుట? పూర్వజన్మలో
దానము సేయ విప్రుఁడు వదాన్యుఁడు కోరెనపుస్తక, మ్మనూ
చానులఁ జేయ ఛాత్రుల, సుసాధుధరాసురసేవ సేయ, సుం
తేనిఁ దపస్సు తీర్థముల నెన్నఁడుఁ జేయ, శఠుండ నైతిఁ గా. ౩౮౬

తే. వేదశాస్త్రార్థపారగుల్ విప్రపుత్రు
లెంద ఱున్నార, లోకఁ డేన మందమతిని,
దైవయోగంబు నే నందుఁ దపము సేయు
టేమొ యెఱుఁగను సాధనం బేమి నాకు? ౩౮౭

క. దైవమె తప్పం దలఁచిన
చో, వృథ పురుషశ్రమంబు క్షోణీస్థలిలోఁ,
గావునఁ బరంబు ధ్రువముగ
దైవమె, ఛీ! పౌరుషప్రదర్శనము వృథా. ౩౮౮

తే. హరి హరు లజుండు శక్రాదు లఖిలసురులు
కాలవశగులు, కాలమ్ము గడవరాదు;
పవలు రే యిట్లు బహుభంగి వాఁడు పోగులు
జాహ్నవీతీరపావనాశ్రమమునీడ. ౩౮౯

మ. నలిఁ బదునాలు గేండ్లు విజనం బగు తద్వనభూమి సుంతేయుఁ
సలుపక యే తపంబు యజనంబు జపం బటు కాలయాపనం
జలుప, నబద్ధ మాడఁ డను సద్యశ మొందు జనాళి [illegible]
వెలసెను సత్యనే వ్రతము వీని కటంచు వచింప నం[illegible]. ౩౯౦

తే. అట్టివో నొక్కనాఁడు వేఁటాడువాఁడు
శరశరాసనధారి నిషాదుఁ డొకఁడు

సమయతుల్యుఁడు హననవిశారదుఁడు
క్రూరరూపుఁ డా వనభూమిఁ జేర వచ్చె. ౩౬౨

క. కోలం బొక్కటి మేనం
గీలింపంబడి కిరాతు కెడపిన వాలుం
గోలం బిట్టార్చుచు భయ
లోలితమై మౌనికడకు ద్రుతగతిఁ బాఱెన్. ౩౬౩

క. వడవడ వడఁకుచు నెత్తుటఁ
దడిసిన దేహంబుతోడ దైన్యాకులమై
తడఁబడు నడుగుల వెఱఁ బ
ర్విడెడు వరాహంబు దృష్టివీథిం బడఁగా. ౩౬౪

ఉ. ఆ ముని మానసంబున దయారస మొక్కటఁ బుట్టి యుద్భృతా
యామతఁ బొంగి వెల్లువయి యాఁగక పాఱ వికంపమానుఁడై
మై మయి లేక పల్కుతనమాట యెఱుంగక యుచ్చరించె ధీ
ధామము వాగ్భవాభిధసుధాకరబీజము మంత్రరాజమున్. ౩౬౫

క. ఆ సారస్వత శుభ బీ
జాసాదన మశ్రుతంబు నజ్ఞానం బా
భూసురునకైన సద్యో
భాసురమై నోట దైవవశమున వెడలెన్. ౩౬౬

ఆ. అట్లు వెడలిన బీజమహత్త్వ మింత
యెఱుఁగఁ, డామౌని వగ నొందు నెడఁదఁ గరుణ;
దారి గానక కోలంబు తత్తరమున
సం దొకం డొక పొదమాటు కరిగి డాఁగె. ౩౬౭

ఉ. అంతఁ బరక్షణంబుననె యచ్చటికిం బరతెంచె నాశ్రమో
పాంతము దాసికై వెదకువాఁడు నిషాదవిభుండు విల్లు క
ర్ణాంతము లాఁగి పట్టిన శరంబున నొప్పి కరాళగాత్రుఁడై
యంతకుమూర్తిఁ దాల్చి మెఱుపారెడుకన్నుల సంజ పర్వఁగా.

క. ఒక్కెండ కుశాసనమున
నక్కడ సత్యవ్రతాఖ్యుఁ డాసీనుండై
యొక్కెడఁ గానంబడినన్
మ్రొక్కి నిషాదుండు పలికె మునిపుత్త్రునితోన్. ౩౫౮

క. నా యేటు తినినకిటి యది
యే యెడఁ జనెనయ్య! చెప్పు, మెఱుఁగుదును నిజం
బే యాడెడి వ్రతి వని, య
య్యా! యాఁకట నాకుటుంబ మటమటలాడున్. ౩౫౯

క. విధియే యిది నావృత్తిగ
విధియించె, నిజంబె నేను విను పల్కెద, నె
వ్విధమున నైన శుభాశుభ
విధానములఁ బోష్యరక్ష విహితము కాదే! ౩౬౦

తే. నీవు సత్యవ్రతుండవు, నిజము పలుకు
శరహతంబు వరాహ మే చాయఁ బాఱె?
నాకుటుంబ మాఁకటిమంట నవయుచున్న,
దార్త్తి నడఁగెద, వడిఁ బల్కు మవనిదేవ! ౩౬౧

చ. మఱిమఱి యిట్లు తన్ను బ్రతిమాలఁ గిరాతుఁడు, విప్రుఁ [డాత్మలోఁ]
జిరతరచింత చేసె, నెటు చెప్పుదుఁ, జెప్పనిచోఁ వ్రతంబు గూ
పఱుఁ, గలచొప్పు చెప్పిన క్షుధార్త్తుఁ డితండు శరవ్యథార్త్త సూ
కరము వధించు, నిప్పు డెది కర్జము, పల్కుటొ, పల్కకుండుటో!

క. సత్యము హింసాయుతమేన్
సత్యము కా, దనృతమైన సంగతిదయమై
సత్యంబ, జనహితంబే
సత్యం బటు గాక హత్య సత్యం బగునే? ౩౬౩

క. ఒకరికి హిత మిం దది యిం
కొకరికి నహితము విరుద్ధయోగముచే, నే

నిఁక నిపుడే మనువాఁడన్
వికలము గాకుండ ధర్మవిధియున్ వ్రతమున్? ౩౧౩

ఉ. ఆఋషిచంద్రుఁ డట్టుల నిజాత్మ విచార మొనర్చుచున్, మని
శ్ధారణ చేయఁజాల కిది ధర్మ మటంచు నిరుత్తరుండుగాఁ
బాఋుఁడు, బాణవిద్ధకిటిపాటు కనుంగొని యప్రయత్నము
చ్చారణచేసె నే శుభవచస్సు కృపాకలితార్ద్రచిత్తుఁడై. ౩౧౪

ఉ. దాన నిజాద్యబీజ సముదాహరణమ్మునఁ జేసి దేవి ప్ర
ధానికవిద్య ప్రీత యయి తత్క్షణమే దయచేసె విద్య, స
న్మానిదురాప మేది యది మానసవీథిఁ బరిస్ఫురించె, ఛం
దోనిధి నాకుజాతునకుఁ దోఁచినటుల్, కవి యయ్యె నామకుండు.

సీ. ఎదుర ధృతచాపుఁడై యున్న యెఱుకుఁ గాంచి
నొక్క గీతంబు వ్రాకుచ్చె నుత్తరముగ
సత్యకామాఖ్యుఁ డా ద్విజసత్తముండు
పరమధర్మాత్ముఁ డతిదయాపరత నిట్లు. ౩౧౭

ఆ. "ఏది చూచునో యది పల్కలేదు సుంత!
యేది పలుకునో యది చూడలేదు నిక్క;
మయ్యయో వ్యాధుఁడా! స్వకార్యార్థి వగుచు
నేల మఱిమఱి ప్రశ్నింతు విట్లు వ్యర్థముగ?" ౩౧౮

కం. అది విని వ్యాధుఁడు సూకర
పదముం గన్గొనెడియాశ వదలె; ముని జగ
ద్విదితుం డయ్యెఁ గవీశ్వర
పదభాజనుఁ డితఁ డపరవాల్మీకి యనన్. ౩౧౯

కం. వెండియు సారస్వతము స
ఖండవిధిన్ జపము దీర్ఘకాల మొనర్చెన్
బండితకవి యని యతఁ డు
ద్దండఖ్యాతిన్ రహించె దశదిక్కులలో. ౩౨౦

క. ప్రతిపర్వంబును బ్రాహ్మణు
లితనియశోవిశదగీతు లెసఁగింతురు సం
స్తుతియింత్రు మాను లాతని
నతి విస్మృతిఁ బాడి యీశుభాఖ్యానకముల్. ౩౨౦

తే. మున్ను తథ్యాని నెవ్వరు మూఢుఁ డనుచుఁ
బదరి వదలిరో కలినుతై, వారె యిపుడు
గారవం బొప్ప నిలు సేర్చి గౌరవించి;
రట్లు గావున సేవింపు మంబ నధిప! ౩౨౧

శా. దేవీయజ్ఞము శాస్త్రచోదితవిధిం దీపింపు మాశక్తియే
యీవిశ్వంబున కాదికారణ మదే యిచ్చున్ మనోభీష్టముల్,
భావింపన్ స్మరియింప మ్రొక్క నెడఁగన్ వర్ణింప ధ్యానింపఁగా
సేవింపన్ భజియింప భక్తిమెయి నర్చింపంగఁ గీర్తింపఁగా. ౩౨౨

ఉ. దీనుల నార్తులన్ వికలదేహులఁ గాంచి, క్షుధావ్యథారుజా
ధీనులఁ గాంచి, క్షుద్రుల నతృపులఁ గాంచి, యశక్తులన్, దరి
ద్రాణుల నాధిపీడితులఁ ద్రస్తుల మూర్ఖులఁ గాంచి, పుష్టిధీ
హీనులఁ గాంచి కాంచి యజితేంద్రియవృత్తులఁ దుష్టచిత్తులన్.

ఉ. సంతతవేదవాదులను సంపదుదాత్తులఁ జూచి, శౌర్యదు
ర్దాంతులఁ బుత్రపౌత్రపరిరాజితసౌఖ్యులఁ జూచి, దీర్ఘవి
శ్రాంతయశస్కులన్ గని, సులక్షణలక్షితులన్ వశీకృతా
శాంతుల రాజ్యశోభనవసంతుల శాంతులఁ జూచి వాంఛలన్.

క. ఎఁగలు మును శ్రీఁ గొలువని
వారలు, మఱి కొలిచియున్న వా రని పేరల్
వేఱుగ వ్యతిరేకాన్వయ
పూరణ ననుమానరచన బుధుఁ డెఱిఁగికొనున్. ౩౨౫

తే. పుణ్యములగోష్ఠి లోమశమునిముఖమున
విన్న దేవీమహాత్త్వపవిత్రచరిత

చెప్పితి నృపేంద్ర! యిది సల్పి చిత్తవీథి
నీవు నర్చింపు శ్రీదేవి నియతి సతము. ౩౭౭

## దేవీయజ్ఞవిధానము

వ. జనమేజయుం డిట్లనియె. ౩౭౮

శా. స్వామీ! పల్కుము దానియజ్ఞవిధి నిర్వర్తింతు సచ్ఛ్రద్ధతో
నేమంత్రంబొ, సపర్య యేవిధమొ, యేయేద్రవ్యసంజాతముల్
హోమార్థంబు సమీకరింపవలె? విప్రౌఘంబు సంఖ్యాక్రమం
బేమార్గం బగు? నెట్టిదక్షిణల నర్పింపదగుం దెల్పవే! ౩౭౯

వ. వ్యాసుం డిట్లనియె. ౩౮౦

క. దేవీయజ్ఞవిధాన మి
దే వర్ణింతు విను మందు నెఱుఁగం బోలున్,
త్రైవిధ్యము సత్త్వరజో
భావంబులఁ దనుముచేతఁ బ్రప్రథమమునన్. ౩౮౧

క. మునులకు సాత్త్వికయజ్ఞము,
జనపతికులములకు రాజసంబున్, రక్షో
గణమునకుఁ దామసంబును
గుణరహితము జ్ఞానమయము మగు విముక్తులకున్. ౩౮౨

తే. పుణ్యకాలంబునఁ బవిత్రభూమి న్యాయ
మార్గచిత విత్తమున వేదమంత్రవిధుల
శ్రోత్రియబ్రాహ్మణులు చిత్తశుద్ధి కలిగి
శ్రద్ధమైఁ జేయుయాగంబు సాత్త్వికంబు. ౩౮౩

తే. వలయు మంత్ర క్రియా ద్రవ్యములను శుద్ధి
యూఁట; నటుగాని కల్గదు పూర్ణఫలము;
సుకృతమేని నన్యాయవిత్తకృతమైన
రాదు యశ మిందుఁ, బరమందు రాదు సుఖము. ౩౮౪

మ. అమరం బాండవరాజసూయ మిలఁ బ్రత్యక్షప్రమాణం బను
త్తమయజ్ఞం బది, భూరిదక్షిణ సమాప్తం బయ్యె, సాక్షాత్త్రివి
క్రముఁ డా కృష్ణుఁడు దానినేత, క్రతుకర్మప్రాభవుల్ మానిస
త్తము లాసాదితసర్వవిద్యులు భరద్వాజాదు లే ఋత్విజుల్. ౩౦౫

శా. కానీ యజ్ఞసమాప్తియైన నెలయుం గాకుండనే వారికిం
బోనే పోయెను రాజ్యలక్ష్మి, సభ నీష్పుం బొందెఁ దత్పత్ని; బల్
కానం జేడ్పడ నయ్యె; మాత్స్యకడ డాఁగన్ వచ్చెఁ; బాం[illegible]
త్రినారీమణి యందుఁ గీచకుచేఁ బ్రె[illegible] వచ్చెన్ [illegible]ంచియున్.

క. ఎం దేగె ద్విజాశీశ్శుభ,
మెం దేగెను యజ్ఞసుకృత, మెం దేగెను గో
విందునియెడ భక్తియు, సభ
యందున జడ పట్టి యీడ్చునపు డాసాధ్విన్. ౩౦౭

ఆ. వలయుఁ దలఁప ధర్మవైగుణ్య మిందులోఁ
గర్త ధర్మసుతుఁడె గాక, నేత
హరియె యానుగాక, యయినను భవితవ్య
మట్టు లయ్యె నంచు ననఁగఁ దగదు. ౩౦౮

క. భవితవ్య మయిన దంచున్
బ్రవచింపఁ బ్రమాణపాళి వ్యర్థం బగు వే
దవిధుల్ సాధనములు ధ
ర్మవచనము లుపాయములును మాయును విశేషుః. ౩౦౯

తే. దైవము నుపాయమును రెండుఁ దలఁప నగును
కర్మ విపరీతఫలసిద్ధికలది యయినఁ,
గర్మలో లోప మెద్దియో కల దటంచుఁ
బ్రాజ్ఞు లగువార లూహింపవలయు మొదల. ౩౧౦

తే. కర్మయున్ బహువిధ మండ్రు కర్మవిదులు;
కలుగు భేదంబు క్రియఁ, జేయుకర్తయందు,

నుండు భేదంబు మంత్రప్రయోగమందు,
ద్రవ్యమున సాధనముల భేదంబు కద్దు. ౩౯౧

ఉ. ఎఱుఁగవె మున్ను జిష్ణుఁడు వరింపఁగ బ్రహ్మగ విశ్వరూపు, వాఁ
డరుదుగ మాతృపక్షకుశలార్థము తత్క్రియఁ జేయుచున్ సురా
సురులకు స్వస్తి యన్న, దనుపూతులవృద్ధిని గాంచి, క్రుద్ధుఁడై
హరి నఱుకండె వజ్రమున నాతనిఁ; గర్మకలోప మీయెడన్.

క. అటు గాక సేయ రోషో
ద్భటుఁడై ద్రుపదుండు మఖము భారద్వాజున్
బటిమ వధించుసుతుం గన
ఘటియింపదె వేది నొక్కకన్యామణియున్! ౩౯౩

తే. మున్ను దశరథుండు పుత్రేష్టి నొకపుత్రు
నొదవఁ జేయ నల్వు రుదితులైరి;
విహితరీతిఁ జేయు విధి సిద్ధతర మాను
విపరిణామకరు లవిధికృతములు. ౩౯౪

తే. ధర్మపుత్రుండు ఋతవాది, ద్రౌపది సతి,
భ్రాతలు శుభాంగు లైన దుర్ద్రవ్యయోగ
దోషమునఁ జేసి చేడ్పాటు తొడరె, వారి
రాజసూయంబు విపరీతభాజనముగ. ౩౯౫

ఉ. కావునఁగ వత్స! సాత్త్వికమఖం బది దుర్లభ మెందు, దానికై
భావనమానినసత్త్వములె కా కొరు సేయ నశక్తులయ్యు, యె
వ్వానికి న్యాయసంచితము వస్త్రము ఋష్యము సంస్కృతంబునౌ
భోనమొ, వాఁడె సేయు విధిపూర్వకరీతి వియూపవైఖరిన్. ౩౯౬

తే. రాజసములు సయూపముల్ ద్రవ్యబహుళ
సంస్కృతమ్ములు నభిమానసంయుతములు
క్షత్రవైశ్యుల కగుఁ; దామసంబు లింక
సుందకములు క్రోధనసుసునుపాదుల కగు. ౩౯౭

ఉ. మానసయజ్ఞ మెన్న నసమానము దానిసి మోక్షకాంక్షులౌ
మానులె సర్వసాధనసమగ్రముగా నవరింప నేర్తు, రే
దేనియుఁ దక్కుయజ్ఞముల నించుక న్యూనత యావహించు ద్ర
వ్యానో శ్రద్ధలోనో క్రియయందునో ఋత్విజసంపదాప్తినో! ౩౯౧

క. ముందు మనశ్శోధన చే
యం దగు; వీతేంద్రియార్థ మగు నెడ నది యె
న్నం దర పసు శుచి యని; దా
నం దేహముఁ బూత, మట్టి నరుఁ డధికృతుఁడౌ. ౩౯౨

సీ. వాఁ డంతఁ గల్పించు బహుయోజనాయామ
మండపరాజంబు మనసునంద,
స్తంభముల్ యజ్ఞీయ తరుదారు కృతములై
మెఱుఁగార విస్తారమేఖల లయి,
యందు వేది నమర్చి యగ్నులు మనసుచే
సుషుగా నచటఁ బ్రతిష్ఠ సేసి,
ఋత్విగ్వరణ మంత సిచ్చలోఁ గావించి
భావించి వేదవిద్బ్రాహ్మణులను,

బ్రహ్మ నధ్వర్యు హోతను గ్రమముగఁ బ్ర
శాత నుద్గాతఁ బ్రతిహర్తఁ దక్కు గల్గు
ఋత్విజుల సభ్యులన్ శాస్త్రరీతిఁ బిల్చి
వారిఁ బూజింపవలె మనెఁ బరమ భక్తి. ౩౯౩

సీ. ప్రాణపంచక మందుఁ బంచాగ్నులై యొప్పు,
వానిఁ బ్రతిష్ఠింపవలయు వేసెఁ,
బ్రాణాగ్ని యే గార్హపత్యాగ్ని యగు, నం ద
పాన మాహవనీయవహ్ని యగును,
వ్యానంబు దక్షిణవహ్నియౌ, నవసథ్య
శాగ్ని యాచు సమాన మమరు నందు,

సభ్యు లెల్ల రుదాన సంజ్ఞిక వహ్నిగా
వెలయ నుత్కటదీప్తి వెలుఁగు నవియు,
భావ్యమంతట మనసుచేఁ బరమశుభము
నిర్గుణం బగు ద్రవ్యంబు నిస్తులముగ,
మనసె యగు హోతయును యజమానుఁ డందు,
యజ్ఞపతి నిర్గుణబ్రహ్మ మై వెలుంగు. ౯౦౦

తే. ఆ పరబ్రహ్మరూపిణి, యాదిశక్తి,
నిర్గుణాకార, నిర్వేదనిధివిధాత్రి,
యెల్లకును నేది యాధార, మేది యెల్ల
యెడల వ్యాపించి పూర్ణయై యెసఁగు తల్లి. ౯౦౧

ఉ. దానిని బ్రహ్మవిద్య నెడఁదం బదిలం బొనరించి, యాంతర
ధ్యానసమాప్తపూర్వ మగు ద్రవ్యసమస్తము దాని ప్రీతికై
ప్రాణకృశానుకీలలఁ జిరంబుగ హోమ మొనర్పఁగావలెన్,
మానసదివ్యరంగము సమగ్రవిభా ప్రవిభాస్వరంబుగా. ౯౦౨

ఉ. ఆయెడ వాఁడు చిత్తము నిరాశ్రయముం బచరించి, రాజ! ప్రా
ణాయమనంబు సేసి, వెలయుంగఁ దదగ్నులఁ గుండలీముఖ
స్థాయితవీథి వెంట వసుసం బ్రవిలాప మొనర్చి, కూడఁగాఁ
జేయును వేల్చి బ్రహ్మపదసిద్ధ మహేశ్వరి శాశ్వతం బరన్. ౯౦౩

కం. తాను స్వయం బీశ్వరి యను
స్వానుభవం బతని కప్పుడు సాక్షాత్కృతమా
నా నై యాపరమేశ్వరి
జ్ఞానంగా నగును వాని కన్నుల కరుదై. ౯౦౪

శా. అతఁ డవ్వేళ నిరాకులం బయిన చిత్తాబ్జంబునందున్ సమా
హితుండై నిజయోగనిష్ఠ నొయి స్ఫూర్తిం గాంచు ధ్యానంబునన్
వితతుండై తను నెల్లభూతములలో వీక్షించుచున్, సర్వభూ
తతతిం దాఁ దనయందుఁ గాంచు; నిటు లందం జాలు భూతాత్మతన్.

సభ్యు లెల్ల ఋదాన సంజ్ఞక వహ్నిగా
వెలయు నుత్కటదీప్తి వెలుఁగు నవియు,
హవ్యమంతట మనసుచేఁ బరమశుభము
నిర్గుణం బగు ద్రవ్యంబు నిస్తులముగ,
మనసె యగు హోతయును యజమానుఁ డందు,
యజ్ఞపతి నిర్గుణబ్రహ్మ మై వెలుంగు. ౪౦౧

తే. ఆ పరబ్రహ్మరూపిణి, యాదిశక్తి,
నిర్గుణాకార, నిర్వేదనిధివిధాత్రి,
యెల్లకును నేది యాధార, మేది యెల్ల
యెడల వ్యాపించి పూర్ణయై యెసఁగు తల్లి. ౪౦౨

ఉ. దానిని బ్రహ్మవిద్య నెడఁదం బదిలం బొనరించి, యాంతర
ధ్యానసమాప్తపూర్వ మగు ద్రవ్యసమస్తము దానిప్రీతికై
ప్రాణకృశానుకీలలఁ దిరంబుగ హోమ మొనర్పఁగావలెన్,
మానసదివ్యరంగము సమగ్రవిభాప్రవిభాస్వరంబుగా. ౪౦౩

చ. ఆయెడ వాఁడు చిత్తము నిరాశ్రయముం బచరించి, రాజ! ప్రా
ణాయమనంబు సేసి, వెలయంగఁ దదగ్నులఁ గుండలీముఖ
స్థాయితవీధి వెంట నరుసం బ్రవిలాప మొనర్చి, కూడఁగాఁ
జీయును వ్రేల్చి బ్రహ్మపదసిద్ధ మహేశ్వరి శాశ్వతం బరన్. ౪౦౪

క. తాను స్వయం బీశ్వరి యను
స్వానుభవం బతని కప్పుడు సాక్షాత్కృతమౌ
తానై యాపరమేశ్వరి
కానంగా నగును వాసికన్నుల కరుదై. ౪౦౫

మ. అతఁ డవ్వేళ నిరాకులం బయిన చిత్తాబ్జంబునందున్ సమం
చితుండై నిజయోగనిష్ఠ మెయి స్ఫూర్తిం గాంచు ధ్యానంబునన్
వితతుండై తను నెల్లభూతములలో వీక్షించుచున్, సర్వభూ
తతతిం దాఁ దనయందుఁ గాంచు; నిటు లందం జాలు భూతాత్మునిన్.

దేవీయజ్ఞ మొనర్పఁ బూను మిఁక విస్తీర్ణ క్రియావైఖరిన్
శ్రీవిష్ణుం డెది చేసె మున్ను విధియై సృష్ట్యాది, రాజోత్తమా !

చ. కలరు ద్విజోత్తముల్ శుభమఖక్రియఁ దక్షులు వేదవిత్తముల్
కలితతదర్థబీజజపకర్మవిశారదు, లట్టివారలన్
బిలువఁగ నంపి కర్త వయి వేగమ తీర్పు మఖంబు, దాని నీ
స్సులఫల మిచ్చి నీజనకు దుర్గతినుండి సముద్ధరింపుమా ! ౨౦౨

సీ. ప్రావమూన ప్రవృత్త పాపము వీఁగఁ
గడు దుష్కటము నరకప్రదంబు,
శాపజం బగు దోషసంప్రాప్తియును దానిఁ
గూడె నీతండ్రికిఁ దోడుపడుచు,
నందుపై సర్పదంశాయాత దుర్మర
ణావాప్తియును నయ్యె నతని కంక,
యదియునుంగాక వాఁ డంతరాళపుఁ జావు
చచ్చెను నింద్యం బశస్తతరము,

కాదు కుశసంస్తరంబులు కలుగుభూమి,
గాదు సంగరక్షోణిని, గగనమందు
సౌధతలిఁ దండ్రి కంతంబు జాత మయ్యె,
లేదు దానంబు, స్నానంబు లేదు గంగ ! ౨౦౩

క. ఇవి యన్నియు నొక్కొక్కటి
పవణంబులు నరకగహ్వరంబునఁ ద్రోయన్,
ధువము, కపురాణము లన్నియుఁ
గవిసెన్ నీతండ్రిమరణకాలమున నృపా ! ౨౦౪

క. కాలము తలఁచియుట యెఱిఁగిన
వేళన్ దాఁ బ్రాణి యెందు వెలసినఁ బొందం
గా లేకయు సాధనములు
పోలుచు వివశార్తిదుఃఖదోషం డగుచున్. ౨౦౫

క. "ఈ దేహము కేవలభూ
తోదిత, మది యెటులు సన్న నులు కేల? పడం
గాఁ దలచినఁ బడుఁగావుత,
వా దేటికి నవ్యయుండ బ్రహ్మను నాకున్! ౪౧౦

తే. "నేను ముక్తుండ, సంసారిఁ గాను, సర్వ
థా సనాతనుఁడ, శరీరధారణంబు
కర్మచేఁ బ్రాప్త మయ్యె; భుక్తంబు లయ్యె
నవియును సుఖదుఃఖఫలానుభవమువలన. ౪౧౧

క. "ఘోరము భయదము నగుసం
సారం బను సంకటమ్ము సమసెడు, నిట్టుపైఁ
గారింపలేదు న;" న్నను
భూరిధృతిం దనువు విడిచి పోయిన నేనిన్. ౪౧౨

తే. అట్టిమృతి స్నానదానశూన్యంబె యయిన
ముక్తుఁ డగు వాఁడు జన్మసంసక్తివలన;
నాపరాకాష్ఠ యోగులకైన నరిది;
యయ్యొ! మీతండ్రి చన్నది యట్లు గాదు. ౪౧౩

క. విన్నంతనె ద్విజశాపం
బన్నా! తన దేహమందు నత్యంత మమ
తోన్నతి నభిమానంబుం
బన్నె, న్నిర్వేద మింత పడయఁడు మదిలో. ౪౧౪

ఉ. నాతను వుజ్జ్వలం బిది యనామయమై వెలుఁగొందు, రాజ్యము
న్నాతసమస్తకంటకము నై విలసిల్లెడి, నింతలోనె శో
భాతత మీ శరీరము నిపాతమహార్తికి నిచ్చగింతునే?
హా! తలపోయఁ దక్షకవిషాగ్నిచికిత్స యసాధ్య మానరా! ౪౧౫

క. జాంగలికులఁ బిలిచి, పనిచి
మంగళ మణి యంత్ర తంత్ర మంత్రజ్ఞుల స

ర్వాంగము పరిరక్షింపం,
ప్రాంగణభువి నిల్పుఁడీ మహాసైన్యంబుల్. ౪_౨౪

క. ఇట్టుల నాజ్ఞాపించుచు
నెట్టన నురుసౌధ మొండు నిర్మించి, తదీ
యాట్టాలికోపరిస్థితి
నెట్టులనే నాత్మరక్ష నెంచెం జేయన్. ౪_౨౫

క. ఆ నరనాథుం డిట్టుల
స్నానము దానమ్ము దేవిస్మరణము దైవ
ధ్యానంబు భూమిశయనము
గానీ లేకుండ మోహకంధిపతితుఁడై. ౪_౨౬

క. కలియోగంబున హాని
చ్ఛలనం బొనరించి యతఁడు సర్పవిషజ్వా
లల గ్రుగ్గె సౌధతలిఁ; ద
త్ఫలితముగ నవశ్యనరకవాసం బబ్బెన్. ౪_౨౭

గీ. ఓయి జనమేజయా! తండ్రి నుద్ధరింపఁ
బూనుకొనవోయి; పాపకపూయ నరక
వార్ధిలోనుండి శ్రీదేవిపాదపద్మ
సేవ యను తెప్ప గూర్చి ప్రసిద్ధఫణితి. ౪_౨౮

గీ. అమితతేజస్వి వ్యాసమహర్షి పల్కు
లాలకించుచు జనమేజయాధిపుండు
బాష్పముల్ జడి వార నవారితముగఁ
గనుల, నిటు పల్కె గద్గదకంఠుఁ డగుచు. ౪_౨౯

క. ఛీ! నా యీ బ్రదు కేటికి,
మా నాయన నరకకూపమగ్నుం డైనన్!
నే నేమి చేయ నాతఁడు
పూనన్ మఱి స్వర్గసుఖము, పోల్చి తెలుపవే. ౪౩౦

ఉ. వెండియుఁ బల్కె నావు ప్రభవిష్ణుఁడు సర్వలోకనా
థుం డొనరించె యజ్ఞ మని, శోధ కు యూతని కేద్విజేంద్రు లం
దుండిరి? వేదతత్త్వవిదు లొప్పిరి ఋత్విజు లౌచు. నెవ్వ? రీ
వొం డన కెల్ల దెల్పు మది నూఁదఁగఁ దద్విధ మెల్ల సాంగము.

తే. హరి యొనర్చిన యంబికాయజ్ఞవిధము
నీవు వివరింప విని సమాహితుఁడ నగుచు
నేను గావింతు విధివిధానాన దాని,
ననుచు జనమేజయుఁడు వేఁడ వ్యాసుఁ డనియె. ౧౧౮

క. నరవర! వివరించెద విను,
పురుషోత్తమకృత మహాధ్వ పుణ్యాధ్వర వి
స్తరకథ శ్రద్ధాళుఁడవై;
పరమాద్భుత మది తలంప భగవత్పరముఁ. ౧౧౯

క. దేవి యనుజ్ఞం గొని యా
మూవురు మూర్తులును శక్తిపూర్వులుగాఁ బూ
భావం బూని విమానము
పై వార్ధిఁ మరల దరిచు వచ్చిరి ప్రీతిఁ. ౧౨౦

క. ఘోరం బగు వారాన్నిధి
వారిజనాభుండు భవుఁడు వారిజభవుఁడుఁ
జేరి సృజించిరి ధర నే
ర్పౌఱుగఁ దమస్థానములును విడిదలకొఱకై. ౧౨౧

తే. అందు నాధారశక్తి యనంత మచల
మైనయది పరదేవి స్వయమ్ముగా వి
మోక్షణ మొనర్చె; ధర దానఁ బుట్టి వెలసె
లెస్సగ మధుకైటభులమేదస్సుతోడ. ౧౨౨

తే. అట్లగుట భూమి మేదిని యనఁ బరంగె,
ధారణమ్మున మఱి దాని ధర యటంద్రు,

విపుల విస్తారయోగతఁ బృథివి యండ్రు,
మహి యనంగ మహీయస్త్వమహిమఁ బరగె. ౪౩౭

వ. మఱియు నవ్వసుంధర, యపారంబు నగాధంబు నగు నకూపారనీరంబున మ్రుంగిపోక నిలువ, సహస్రఫణుం డగు నాదిశేషునిచేఁ దలం దాల్పఁ బడియె. ౪౩౮

క. ధరణిన్ ధరియించుటకై
గిరివిస్తర మొనరె, లోహకీలము కట్టెన్
ధరియించురీతిని; మహీ
ధరసంజ్ఞ యెసంగె శైలతతికిన్ దానన్. ౪౩౯

క. అందున్ మేరువు కన్నుల
విందై బహుయోజనాతి విస్తరమై వె
ల్గొందున్, స్వర్ణమయము, మి
న్నంటెడి, మహాశృంగ శశ్వ దభిరామంబై. ౪౪౦

వ. విశ్వస్రష్ట యగు బ్రహ్మకు, మరీచి, నారదుఁడు, అత్రి, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, దక్షుఁడు, వసిష్ఠుఁడు, నన బ్రథితు లగు పుత్రు లుదయించిరి. ౪౪౧

సీ. అందులో మరీచికిని గశ్యపుఁడు పుట్టె;
నతఁడు పదుమూవురన్ దక్షసుతలఁ గొనిన,
వారు బహుధా సురాసురావళిని గాంచి;
రిట్లు వితతమై కాశ్యపసృష్టి వెలసె. ౪౪౨

తే. సర్ప పశు పక్షి మానుష జాతిజాత
విస్తరం బయి యాసృష్టి వితత మయ్యె;
దాని సామాన్యమానవుల్ మానసముల
భావనముసేయు టొకయింత వశము గాదు. ౪౪౩

క. లవపటితనువున బ్రహ్మకుఁ
గలిగెన్ స్వాయంభువుండు ఘనుఁడు మనువు, దా

పలదేహార్ధంబందుఁ
సలలిత శతరూప యనఁగ సాధ్వి జనించెఁ. ౨౨౬

తే. దానికిఁ బ్రియవ్రతుండు నుత్తానపాదుఁ
డనఁగ నిర్వురు సుతులుఁ, గన్యకలు ముగ్గు
రద్భుతాకార లుదయించి; రట్లు సృష్టి
బ్రహ్మదేవుండు సాగించి ప్రమద మలర. ౨౨౭

సీ. మేరుశృంగముపైనిఁ జారుప్రకారమ్ము
గాఁ గూర్చె బ్రహ్మలోకంబుఁ దనకు,
సర్వలోకోపరిస్థంబు వైకుంఠంబు
శ్రీనాథు లీలాస్థాన మయ్యె,
భూతసంఘాత సంస్థిత కైలాసంబు
సాంబసదాశివస్థాన మయ్యె,
బహురత్న రాజిత స్వర్గంబు మేరువు
పై సురాధిపతి కావాస మయ్యెఁ,
పాలకడలిఁ ద్రచ్చిననాఁడు పడసె నతఁడు
పారిజాత మైరావత భద్రగజము,
కామధేను వుచ్చైశ్శ్రవోనామ హయము,
నచ్చరలను, ధన్వంతరి, నమృతకరుని. ౨౨౮

క. ఈవిధముగఁ ద్రివిధంబై
దేవతలు మనుష్యు లనఁగఁ దిర్యక్కులుగా
భావిత మగు సృష్టికథా
శ్రీవిభవము వెలసె వివిధరీతుల నరుదై. ౨౨౯

సీ. జీవజాతంబు కర్మాళిఁ జేరి యొసఁగు
నండజ స్వేదజో ద్భిజ్జ మనఁగ మఱి జ
రాయుజంబు లనఁగ నాల్గుచాయ లగుచు,
నిట్లు సర్గంబు మహిమ రహించుచుండె. ౨౩౦

## విష్ణుకృత దేవీయజ్ఞము

ఉ. భాసిలుచుండ సర్గము ప్రవర్తితమై యిటులన్ విభుండు శ్రీ
వాసుఁ డధోక్షజుండు భగవంతుఁడు క్రీడ లొనర్చుచున్ నిజా
వాసమునన్ రమారమణి పజ్జ వెలుఁగుచు నుండ, నొక్క శ్రీ
వాసరవేళ నెమ్మదిని బాఱి, స్మరించెను ద్వీపరత్నమున్. ౧౧౬

ఉ. అల్లన జ్ఞప్తి వచ్చెను సుధార్ణవడోలికలందుఁ దేలు ర
త్నోల్లసితాంతరీపమున నుజ్జ్వలరూపముతోడ వెల్గు నా
తల్లియుఁ, దత్స్వరూపమును దాను ధరించినచొప్పు, దానిచేఁ
దొల్లి సమాప్తమైన శుభధూర్వహ తంత్రము శాక్తమంత్రమున్.

మ. అంబాయజ్ఞము సేయువేడ్క మదిలో నావిర్భవింపంగ ల
క్ష్మ్యంబాకాంతుఁడు లేచి వైళము, సమాహ్వానం బొనర్చెన్ మహే
శుం బద్మాసను శక్రుఁ బావకు ధనేశున్ దక్షిణేశున్ జలే
శుం బూతాత్ము వసిష్ఠుఁ గశ్యపుని దక్షున్ వామదేవున్ గురున్.

సీ. యజ్ఞసంభారంబు లతివిస్తరంబుగఁ
గల్పించె బహుసాత్త్వికములు, విపుల
విభవాభిరామమై వెలయంగ శిల్పుల
వితతమండపముఁ గావింపఁ బంచె,
సప్తవింశతి విప్రసత్తములను భక్తి
వరియించె నార్త్విజ్యభార మూనఁ,
జిత్రరీతిని మహాచితిఁ గూర్చి వేదులు
వేయించె రమ్యసువిస్తరముగ,
నుర్వీసురులు దేవీబీజయుక్త మంత్ర
రాజ జపపరాయణులైరి, శ్రద్ధతోడ
విహితరీతిఁ గల్పించి హవిస్సు, దాని
వితతముగ హోమ మొనరించి రతులనిష్ఠ. ౧౧౭

క. హోమము తీరిన నిముసం
బే మాధవుఁ గూర్చి పుట్టె నెంతయు మధుర

శ్రీ మహితాక్షర సుస్వర
ధామం బశరీరవాణి తా నిట్లనియెన్. ౨౬౩

మ. అమరానీకమునన్ సమగ్రుఁడవు మార్తాండవుం గమ్ము, శ్రీ
రమణా! బ్రహ్మయు వాసవాదిక సురవ్రాతంబు నిన్నర్చలన్
సముపాసింపఁగ మానవావళికిఁ బూజాపాత్రమై సర్వకా
లములం దెందు వరప్రదుండ వయి పారమ్యంబుతో నొప్పుమా!

మ. హరి! నీవే సకలాధ్వరక్రియల ముఖ్యప్రఖ్యాతం దాల్చి, శ్రీ
పరమేశుం డని యజ్ఞమూర్తి యని సేవల్ సేయఁగా యాజ్ఞికుల్,
ధరణీభారకు లైన దానవుల విధ్వంసంబు గావించి నిన్
శరణంచున్ సురసంఘముల్ గొలువ రక్షం జేయు మీశుండవై.

క. ఏయేవేళల ధర్మం
బీయిల, హరి! గ్లాని నొందుఁ నీవు మదంశన్,
ఆయాయెడ రూపుం గొని
చేయవలెన్ ధర్మరక్ష స్థిరమహిమమునన్. ౨౬౪

శా. నానాయోనుల ధర్మరక్షణకుఁ బూనంబోవు నీరూపముల్
ధ్యానార్హంబులు మాననీయములు విఖ్యాతంబులై యొప్పి, లో
కానీకంబుల నీ కఖండయశ మవ్యాజంబుగాఁ గూర్చు ల
క్ష్మీనాథా! సహధర్మచారిణిగ వాసించున్ భవచ్ఛక్తియున్. ౨౬౫

శా. వైకుంఠా! యది నారసింహి యనఁగా, వారాహియున్ నా, నా
కాకారంబుల భీషణాయుధమహాస్త్రత్వంబుతో నొప్పుచున్
నీ కెవ్వేళలఁ గార్యసాధనముసం దీపించు నాయంశచే
మాకాంతా! యవి నీ కథకకరణసీమల్ గావు సమ్మాన్యముల్.

శా. ఆ నాశక్తులు నీవు నీభరతపుణ్యక్షేత్రమం దెల్లెడన్
నానాభంగిఁ బ్రతీకజాలముల నానాపూజలం గొంచు భ
క్తానీకంబు కభీష్టసిద్ధి దయచేయం జాలుచున్ సద్యశః
స్థానీయంబులరై వెలింగి త్రిజగత్సంభావ్యతం గాంచుఁడీ! ౨౬౭

క. నిన్నుఁ గొనాశక్తుల భ
క్త్యున్నతి వేదోక్తమంత్రయుక్తిని సేవా
భ్యున్నతి నామజపార్చా
సన్నుతులం జేసి నరుఁడు సౌఖ్యము లొందున్. ౨౬౦

తే. ఈవిధివరంబు లొసఁగి యాదేవవాణి
యుల్ల విరమింప జిష్ణుఁడు హర్షవశత
యజ్ఞసంపూర్తిఁ జేసి యథార్హరీతి
బందజం బంపి తాఁ జేరె నాత్మపురము. ౨౬౧

మ. పరమంబై విశదంబునై శ్రవణపర్వంబై శుభావాసమై
వరదానాక్షరమై వినంబడిన భవ్యశ్రీశ్రుతిన్ బల్మఱుం
బరివర్ణించుచు మెచ్చుచుం దలఁచుచుం బ్రార్థించుచున్ మ్రొక్కుచున్
సరివస్యారతు లైరి శక్తికి సురవ్రాతంబు మౌనీంద్రులున్. ౨౬౨

వ. అని విని జనమేజయుం డి ట్లనియె. ౨౬౩

క. హరి సేసిన మఖము సువి
స్తరముగఁ బల్కితివి మఱియుఁ దల్లిచరిత్రం
బరుదుగ వినిపింపుము నీ
కరుణం బావనుఁడఁగా మఖం బొనరింతున్. ౨౬౪

వ. వ్యాసుం డి ట్లనియె. ౨౬౫

క. నడువఁగ వినఁ జవియై యె
[illegible] నిలిపెడు నొక్కకథను కీర్తించెద, నా
నుడి విను మవధానుఁడవై
కడుఁ బుణ్యపురాణ మంబికాకథ, రాజా! ౨౬౬

## సుదర్శన చరిత్రము

ఉ. కోసలదేశమందు సవికుంఠితశౌర్యధనుండు ధర్మదీ
క్షాసముదీర్ణమూర్తి ధ్రువసంధి యనంగ నినాన్వయుండు తాఁ

చేసెను రాజ్యపాలన శుచివ్రతుఁడై ఘనముల్ కులాశ్రమా
శాసనముల్ ధ్రువమ్ములుగ సర్వసమృద్ధి నెసంగ సంపదల్. ౪౬౭

క. ఆతఁడు రాజ్య మొనర్పఁగ
నీతిం జను లింత తప్ప నేరరు, చోరుల్
కాతరులు ధూర్తజనులుఁ ద
దాతతవిషయమునఁ గాన నరుదు వెదకినన్.

తే. వాని కుండిరి రూపసంపన్నపత్ను
లిరువు; రందు మనోరమ జ్యేష్ఠపత్ని;
యపరపత్ని లీలావతి యనఁ బరంగు;
నిద్దరును గామభోగదాయినులు పతికి.

చ. సవతులతోడఁ గూడి ధ్రువసంధి వనంబులఁ గాంతదీర్ఘికా
సవిధములందుఁ జంద్రమణిశాలలలో గిరికందరావళిన్
వివిధ మనోజ్ఞ కామభవ విశ్రుతలీలల సంచరించె నా
నవపరిలుబ్ధ బంభరముచందము దోఁప విలాసవైఖరిన్.

తే. ధర్మపత్ని మనోరమామాతన్వి యొక్క
శుభముహూర్తమ్మునం గాంచె సుతుని సర్వ
రాజ్యలక్షణాసంపన్ను రాజవదను,
వానికి సుదర్శనాభిఖ్య ప్రథిత మయ్యె.

ఆ. అంతనొక్కమాస మగుడు లీలావతి
కనియెఁ బుత్రు రమ్యగాత్రు శుద్ధ
పక్షమందు దివ్యఋక్షయోగంబునన్
శత్రుజిత్తు నాఁ బ్రశస్తి వెలుఁగ.

క. ఇరువురుసుతులకు జనకుఁడు
కర మానందమున జాతకర్మము చూడా
కరణం బిత్యాదిగ సం
స్కరణము లొనరించెఁ బ్రేమసంపద పొదలన్.

చ. మొగముల వ్రాలు ముంగురులమూఁకల మాటికి నంగుళాళిఁ బై
కెగయఁగఁ ద్రోయుచున్, రిపుల నిట్టె యొనర్చెద రంచుఁ బల్కు బం
దుగులు, ప్రియం బొనర్చుచు ననూనముగా ధ్రువసంధికిన్ సమా
నగరిమ నాటలాడుచు మనంబు హరించిరి పుత్రు లిద్దఱున్. ౪౭౪

ఉ. అందును శత్రుజిత్తు పలు కాఁడినముద్దులు మూటకట్టుచున్
జిందు సుధారసం; బటులఁ జేసి విశేష మతండు తండ్రి కా
నందము చేయు. మంత్రులు జనంబుల కెక్కుడు గూర్చు; నట్లు కాఁ
డందఱకున్ సుదర్శనుఁ డొకించుక మందుఁడు మందభాగ్యుఁడున్.

వ. అటు లుండన్ ధ్రువసంధి తన్ను విధి వెంటాడఁగ వేఁటాడునై
నటవీవీథికి నొక్కనాఁడు చని, పంచాస్యంబులఁ జోపుచున్,
గిటిసంఘంబులఁ గూల్చుచున్, గజములం ద్రేడించుచున్, ఖడ్గకం
కటముల్ సించుచు,, వన్యసత్త్వములకుం గాలుండు నా నొప్పుచున్.

క. మృగయాపరుఁడై క్రీడిం
పఁగ వనమధ్యమునఁ బొదలమాటున డాఁగన్
మృగరాజుఁ గాంచి ధనువును
బిగలాఁగి శరంబు విడిచె వెన్నునఁ గ్రువ్వన్. ౪౭౫

ఉ. గ్రుచ్చిన బాణపాతమున ఘూర్ణిలి హుమ్మని బొబ్బ పెట్టి పై
యుచ్చరవీథికి న్నెగసి యా మృగరాజ ముదీర్ణవేగమై,
చిచ్చఱపిడ్గునా బయలఁ జిందులు ద్రొక్కుచుఁ దోఁక యెత్తుచున్
వచ్చె నరేంద్రుపై కెదురు వాఁడి నఖల్ ఝళిపించి భీమమై. ౪౭౬

మ. నృపసింహుండును దానితాఁకు గని యున్మేషాక్షుఁడై పాదముల్
విపులాంకస్థలి మోపి నిశ్చలమతిన్ వీఁకం గృపాణంబు పా
ణిపటుత్వంబున నూని డాఁపలిచెయిం జెన్నొందఁ జర్మంబు ని
శ్చపలుండై యెదు రొడ్డెఁ దా నపరపంచాస్యంబు నా నొప్పుచున్.

క. అచ్చటి సేవకజనములు
నుచ్చలితనిజాయుధముల నుద్దవిడి హరిన్

విచ్చలవిడి నొప్పించుచుఁ
బ్రగుచ్చిరి హాహాస్వనంబు రోదసి నిండన్. ౪౮౦

క. ఆపంచాస్యంబు సటా
క్షేపంబున వాని నెల్లఁ గెడపుచు గర్జా
టోపతఁ బైపై కెగయుచుఁ
గోపోగ్రత రాజుపైకిఁ గ్రూరత దుమికెన్. ౪౮౧

క. తనపైఁ బడు దాని నురం
బున నిజఖడ్గమున నృపతి పొడిచెను, ధ్రువసం
ధిని హార్యక్షము నిజశా
తనఖంబులఁ జీల్చి యొడిసి దంష్ట్రలఁ బట్టెన్. ౪౮౨

క. అత్తెఱఁగు గాంచి సైనికు
లుత్తలపడి కురిసిరి నిశితోగ్రశరంబుల్
తత్తరమున హరిపై, నవి
రిత్త సనెం, గెడసెఁ బతియు మృగములపతియున్. ౪౮౩

ఆ. పేరెలుంగుతోడ విలపించుచును భటుల్
పరుగువాఱి నగరి కరిగి యంత
భర్తృ ఘోర మరణ వార్త నివేదించి
రాప్తమంత్రివరుల కందఱకును. ౪౮౪

సీ. సచివు లాలించి యది కడు సంచలించి
కానకు వసిష్ఠు రావించి గతవిభునకు
నుత్తరక్రియ లొనరింప నూన్ప, వానిఁ
దీర్చెఁ బరలోకసుఖకారిధీ నతండు. ౪౮౫

వ. అంత సమాత్యులుం బ్రకృతు లందఱుం గూడి వసిష్ఠమహామునితో
మంతన మాడి తేల్చిరి, సమంబుగఁ బోల్చి, సుదర్శనుండే యు
త్యంతసులక్షణుండు, జనశాసనయోగ్యుఁడు, బాలుఁ డయ్యును ధీ
మంతుఁడు, ధర్మపత్నికిఁ గుమారుఁడు వీఁడు జ్యేష్ఠుఁ డౌటచే.

తే. వృద్ధమంత్రు లిట్లంగి మంత్రించుచుండు
నంతలోనె లీలావతియయ్య యెఱిఁగి
యుజ్జయినినుండి కూర్చి మహోగ్రసేన
దరిసె దౌహిత్రుకొఱకు యుధాజితుండు. ౪౮౭

క. ఆరీతిన చనుదెంచె మ
నోరమజనకుఁడు సుదర్శనునిపక్షంబై
పోరంగ వీరసేనుఁడు
చేరిచి కాళింగసీమ సేనాబలముల్. ౪౮౮

క. అన్యోన్యము వివదించుచు
సైన్యంబులు వీట నిల్చి సరభసమున రా
జన్యులు చేరిరి చూడఁగ
మాన్యులఁ గులవృద్ధమంత్రిముఖులం జెలుచన్. ౪౮౯

తే. ఇరువురును మంత్రిముఖ్యుల నెనసి, వీఁడు
వీఁడ రాజ్యార్హుఁ డం చేఱువేఱఁ బలుక,
నడిగెను యుధాజితుఁడు, వీరలందు నెవఁడు
జ్యేష్ఠుఁ డాతఁడె రాజ్యార్హుఁ డెందుఁ గాదె! ౪౯౦

తే. అది వినుచు వీరసేనుఁ డిట్లనియె నపుడు,
నయనుశోకంబని యేమి పన్నెదవు? ధర్మ
నిధులు పల్కరె ధర్మపత్నీసుతుండె
రాజ్యభాజనుఁ డని, వృథా రట్టు లేల? ౪౯౧

వ. నావుడు నాగ్రహమున యుధాజితుం డిట్లనియె. ౪౯౨

క. చూడుఁడు నాదౌహిత్రుని,
వీఁడె గుణజ్యేష్ఠుఁ డితఁడె విస్ఫురితాస్యం,
డీ డగునె యెన్న వీనికి
వాఁడు? జడుఁడు రాజ్యభారభాజనుఁ డగునే? ౪౯౩

తే. శత్రుజిత్తు నీవిధంబున సంస్తుతించి,
తెగడఁగ సుదర్శనుని, విని తీవ్రరోష
ఘూర్ణమానాక్షుఁడై తీక్ష్ణ కుటిలవాణి
శత్రుజిత్తు వీరసేనుండు చదరఁ దిట్టె. ౪౬౦

తే. ఆసభాస్థానమందు మర్యాద లెల్ల
పీటఁబుచ్చి యాయిర్వురు వృద్ధనృపులు
వాదు లాడ, సచివు లెటుఁ బల్కలేక
యుండఁ, బల్కె యుధాజితుం డుగ్రత మఱి. ౪౬౧

మ. హో హో యోయి కుమంత్రులార! తెలిసెంబో మీ దురాలోచనా
వ్యాపారక్రమ మెల్ల, నీజడమతిన్ బాలుం గనిష్ఠున్ వృథా
భూపాలుం డని నిల్పి మీరె విభుతం బొల్పొంది కోశార్థముల్
మీ పూర్ణేచ్ఛల దోచఁ జూచెదరు లెండీ, యింత యూహింపరో!

క. మీయింగితం బెఱుఁగని య
మాయకుండె యుధాజితుండు? మాయ లుడుఁగుఁడీ!
మీయాట లిచట సాగ, వ
మేయము నాబలము తీర్చు మిగిలినపనులన్. ౪౬౩

క. కోసలసింహాసనమున
నాసుతసుతు శత్రుజిత్తు నయమున నిడుఁ, డీ
బా సాలింపుఁడు, లేదే
నాసేనయుఁ దీక్ష్ణఖడ్గ మది తీర్చుఁజుఁడీ! ౪౬౪

తే. వీరసేనుండు నానుడుల్ విని మహోగ్ర
కోపుఁడై మాఱు పల్కె, నోకొంకఁడవు నీవ
వీరమానివిగా రజ్జు ప్రేలెదేల?
పోరఁ గాంచెదు నాలావు బీర మిపుడ. ౪౬౫

ఆ. యుద్ధమున నెగాని యొండుపాయంబునఁ
గుదుర దీ వివాద మేది గతి యని,

ఋషులు ప్రజలు ధర్మవృద్ధులు మంత్రులు
వ్యగ్రచిత్తులై మహర్షిం గనిరి. ౨౦౦

ఉ. అంతటిలోన దేశమున నంతట నీ రణవార్త ప్రాఁకఁ సా
మంతులు పెల్లు రేఁగి నిజమండలసైన్యము లెల్లఁ గూర్చి దు
ర్దాంతత రాజధానికి మదంబున నెత్తిరి విగ్రహాగ్ని ని
ట్లింతయు నట్టు లంత యెదు రెక్కఁగఁ ద్రోయుకుతూహలంబునన్.

కం. కలవా రోడకుఁ జెప్పం
గలవారును జలము బలము గలవారును ధీ
గలవారుం గలఁపంబడి
కలహింపఁగ నెల్లప్రజయుఁ గళవళపడియెన్. ౨౦౧

చ. చనె ధ్రువసంధి, మామ లిరుచక్కని జేరిరి యుద్ధకాంక్షఁ, బె
ల్చన చనె దండనీతి, యఖిలం బగు కోశము దోఁచుకొని దే
యను నసి శృంగిబేరపురమందు నిషాదులు పొంగి సర్వసా
ధనయుతులై యయోధ్యపయి దాడి యొనర్చి రుదగ్రవైఖరిన్.

కం. మఱియును మఱి దేశదేశాం
తరములఁ గల దస్యుజనము తద్రాజ్యమునం
బొరలంబడి చాల రేఁగిరి
తఱచై, తఱిఁ గని యథేచ్ఛ ధనము హరింపన్. ౨౦౨

మ. నగరోపాంతవిశాలదేశమున సేనల్ దీర్చి యాలోపలం
బగ సాధింపఁగ వీరసేనుఁ డిట నీవైపున్ యుధాజిత్తు వే
ఱుగ నొక్కటై వయి నిల్చి లోభమొయిన్ రోషాంధులై ఘోరసం
యుగ సంరంభ విసారితాస్త్రు లయి రొండొండన్ విజృంభించుచున్.

మ. ఇరువాగుల్ రథనిస్వనంబు శ్రుతి, మత్తేభేంద్రఘీంకారముల్
మురజ ధ్వానము, లశ్వహేషలు లయల్ పూరించుతాళంబులున్,
శరముల్ దుష్వేడి సారిమోఁతలు లసత్సంగీతమై యొప్పుగా
సరిగాఁ సద్భటపాణిపాదకలనం బప్పె న్సమిన్నాట్యమున్. ౨౦౩

క. అన్యోన్యాయుధఘట్టన
జన్య మహోల్కా ప్రదీప్త సకలదిశం బై
సైన్యంబులు తలపడఁగా
జన్యము ఘోరావతారచరితం బయ్యెన్. ౫౦౭

క. తుములం బై సాగ విమ
ర్దము, బాహాబలయుతుఁడు యుధాజితుఁడు శతాం
గము నెక్కి మేరుగిరిసా
రము విల్లు గొని ప్రతిభటులశరంబుల నొంచెన్. ౫౦౮

మ. తనభటు లెల్లఁ బాఱఁగ, రథంబులు నుగ్గుగ, నశ్వరాజముల్
తునియ, గజావళుల్ బెదరఁ, ద్రోయుయుధాజితుఁ గాంచి వే యెదు
రొక్కెనెఁ బటుసింహనాదముఖరుం డయి పెన్విలు పూని బాణమో
చనఘనలాఘవంబు, రణచండిమఁ జూపుచు వీరసేనుఁడున్. ౫౦౯

క. ఓరి యుధాజిత! మాటలఁ
బోరా దిటఁ జక్క నిలిచి పోరాడక, నా
నారాచంబు లజిహ్మగ
సారంబులు శత్రురక్త సంతర్పణముల్. ౫౧౦

తే. ఇ ట్లనుచు వీరసేనుఁ డహీనముష్టి
దృఢముగాఁ గూర్చి కురిసి మహేషువృష్టి
ప్రావృషేణ్యపయోదంబు పర్వతేంద్ర
శిఖరమునుబోలె నయ్యుధాజితుని ముంచె. ౫౧౧

చ. పలుకులఁ దీర్పరాదు రణపాండితి, చాపధరుండ నైన నా
బలు పొకయింత చూపుతఱి వచ్చుటఁ బండువ యయ్యె నేఁడు, చ
శ్చలమతి వీరసేన! నిలు చక్కటిఁ బాఱక, తెప్పపాటులో
పల జముప్రోలి కేగ నినుఁ బంచెద బాణపుసారె త్రోవఁగా. ౫౧౨

ఆ. అనుచు బిరుసుబిరుదు లాడి, యుధాజిత్తు
వీరసేనుధనువు విఱుగ నేసి,

పఱపై వానితనువుపై నరదంబుపై
శరము, లతఁడుఁ గొనియె మఱొకవిల్లు. ౫౧౩

క. తలపడి యివ్విధి నిద్దఱు
నిలాపతులు పోరఁ జూచి యెల్లబలంబుల్
చెలరేగి పెనఁగె నెదురై
జలనిధు లెనసినఁ గలంగు చందము దోఁపన్. ౫౧౪

ఉ. వాజిని వాజి, వారణము వారణమున్, రథమున్ రథంబు, బం
టాజను బంటుఁ, దాఁకు నెదు రొడ్డినఁ గాంచి వియచ్చరవ్రజం
బాజివిధంబు మెచ్చెఁ బిశితాశనలుబ్ధములై నభోంగణ
భ్రాజితమై చరించె నెడఁబాయక వాయసకంకగృధ్రముల్. ౫౧౫

మ. హరిమాతంగభటవ్రజం బొడళులం దన్యోన్యఘాతంబునం
దఱచై కాఱినరక్తసింధు వది ప్రత్యక్షంబుగాఁ దోఁచె భీ
కరమై, పాపులు దండపాణిపురి కేగన్ దారి రోధించు వై
తరణీవాహిని భూమికిం దిగినచందం బొప్పఁగా నభ్రమై. ౫౧౬

క. పరసిన నెత్తురువాగుల
విఱిగిన సైకతములందు విరిసినజడలన్
నరశిరము లుండెఁ గ్రీడా
పరులు యమున నిడిన తుంబిఫలములు వోలెన్. ౫౧౭

చ. వీరుఁ డొకండు ప్రాణములు వీడి రథంబుననుండి భూమికిన్
జాఱినఁ దత్పలాశ గగనంబున గృధ్ర మొకండు చుట్టి సం
చార మొనర్చె, జీవుఁడు నిజస్ఫురదున్నతరమ్యమూర్తిఁ గ
న్నారఁగఁ గాంచి మై మఱచి యందు మఱిం జొరఁ బూనెనోయనన్.

ఉ. అల్లదె నాశరీర మబలా! కనుమా కమనీయరూపమై
యుల్లము నించుఁ ద్రెళ్ళియు శరోత్కరజర్ఝరితాత్మసంధిబం
ధోల్లసితం బటంచు నొక యోధుఁడు చూపి విమానయానుఁడై
సల్లపనం బొనర్చెఁ దనసందిటఁ జేరిన స్వర్వధూటితోన్. ౫౧౯

ఉ. ఒక్కఁడు మై దొలంగి రిపునుగ్రశరాహతి, మింట వేలుపుం
జక్కెరబొమ్మతో మెఱయ సమ్మదలీల విమానయానమం
దెక్కటి వాసపత్ని త్యజియించి శరీరము నగ్నిలోనఁ దా
నక్కడఁ జేరి యాత్మవిభు హస్తమునం గొని లాగె బల్మిమై. ౧౨౦

తే. సద్భటద్వయ మన్యోన్యశస్త్రనిహతిఁ
బోరుచుం గూలి దివిఁ జేరి వార లొక్క
యప్సరఃకామినినె పొంది, యందు దాని
కై పెనంగిరి మరల దివ్యాస్త్రవితతి. ౧౨౧

చ. యువకుఁ డొకండు రూపసుగుణోన్నతిచేఁ దన కెక్కుడైన స్వ
ర్యువతినిఁ జేరి, దానిఁ దన కున్ముఖిఁ జేయు నిజానుభావముల్
ప్రవితతముల్ పొనర్చి మరలన్ మరలన్ గణుతించి చెప్పుచో,
నవి నిజమై తనుం బొరయునట్లు చరించెను యోగయుక్తుఁడై.

తే. బ్రహ్మచారి యొకఁడు స్వర్భామినిన్ భక్తి
కలితఁ బడసి దానిఁ గవయఁ డయ్యె
వనిత వేఁడుకొన్న వ్రతభంగభీతుఁడై
వృథయు గాఁగ దాని వేడ్క యెల్ల. ౧౨౩

చ. మొదల విమర్దసంజనితభూరజ మంబర మంటి భాస్కరుం
బొదివి దివంబు రాత్రి యను బుద్ధి పొసంగఁగఁ జేసె నంతలో
నదియె రణప్రయుక్తరుధిరాంబుధివీచుల మున్గఁ బూషుఁడుం
డుదితవిభాభిరాముఁ డయి యొప్పెసలారె విస్పష్టకాంతితోన్. ౧౨౪

చ. సమరము ఘోరభంగి నిటు సాగెడువేళ యుధాజిదుండు దీ
ర్ఘము దృఢమైన వింటఁ బదిలంబుగఁ బూన్చి శితార్ధచంద్రబా
ణ మొకటి లక్ష్యశుద్ధిఁ గఠినంబుగ నేసిన వీరసేనుమ
స్తము దెగనేసె నద్ది నిజసైన్యము లార్వ జయస్వనంబులన్. ౧౨౫

క. తల తునిసి విభుఁడు పడఁ గుం
డలమణిరుచులు మకుటంబుడంబు పడంగన్

నలుదెసలం బలపలనై
బలగంబులు విచ్చి పాఱె భయభీతములై. ౫౪

సీ. జనకుండు రణభూమి సమసినవార్తము
నోరమ యాలించి కూరి భీతి,
యేమి సేయుదు దోఁప కిట్లు వితర్కించె
నెం దేగఁ గల నిప్పు డెవ్వఁడు గతి ?
పసిపాప నాపట్టిఁ బాలించు టెటు యుధా
జితుఁడు లోభవశత హాతు నొనర్చె,
లోభి చేయని దేమి లోకంబులో నుండుఁ ?
దల్లిని దండ్రి భ్రాతలను గురుల
గీ. సఖుల బంధులఁ జంప సంశయపడండు,
శంక పొందఁ డభక్ష్యభక్షణ మొనర్ప
నాన మే, దగమ్యాగమనంబె సేయు,
నవ్వరీపురి నన్ను రక్షించువారు ! ౫౫

క. శరణంబంచు సపత్ని
చరణంబుల వ్రాలి వేడ సత్ఫల మున్నే !
కరుణించునె లీలావతి
పరికింపక సవతి సహజవైరం బెందున్ ! ౫౬

సీ. సవతితల్లికిఁ గుక్షిసంస్థుఁడౌ శిశుపిండ
మేడేడు సేయఁడే యింద్రుఁడు మును,
గర్భసంస్థార్థమై గరళ మీయ సపత్ని
సగరుండు పుట్టఁడే సగరుఁ డగుచుఁ,
గైకేయి దశరథుఁ గాంక్షింపదే జ్యేష్ఠుఁ
బ్రవ్రాజన మొనర్ప రామభద్రు,
మును సుదర్శను రాజుగను గోరుసన్మంత్రు
లనశు లిప్డు యుధాజిదనుగమనులు,

పురములో నాసవతితండ్రి పోరకమున్న
తలఁగి చనవలె నెటులేనిఁ దనయుఁ గాచి
బాలుఁ గాంచినఁ జెఱవెట్టు వాఁడు నిజము,
పతి చనియెఁ, దండ్రి హతుఁ డయ్యె, భ్రాత లేఁడ! ౫౨౯

క. దైవమె నా కీయాపద
గావించె, సముద్యమింపఁ గార్యార్థముగా
దైవం బనుకూలించుం,
గావున యోజింతుఁ బుత్రుఁ గాచెడివెరవుల్. ౫౩౦

క. బాలామణి యిటు దీర్ఘం
బాలోచించుచుఁ దలంచి యధికనిపుణు స
చ్ఛీలు విదల్లుని విశ్వా
సాలంబుని మంత్రివర్యు నర్థిం బంచున్. ౫౩౧

క. రావించి వాని నేకాం
తావాసంబునకు బాలుహస్తముఁ గొంచున్
వేవిధముల నార్తిం బరి
దేవన మొనరుచుచుఁ దొలఁగు తెరు వర్థించెన్. ౫౩౨

ఆ. ఆతఁ డామెపల్కు లాలించి యోజించి
నుడివె, సత్య, యిందుఁ దడయఁ జనదు,
వారణాసి కరుగవలయు, నా మాతులుం
డుండు, వాఁడు కూర్చు దండరక్ష. ౫౩౩

క. మనము యుధాజిద్దర్శన
మునకు సముత్కంఠమతులపోలె వెడలి స్యం
దనమునఁ దొలంగి పురి య
ల్లన వనమార్గములఁ జనుట లగ్గగుఁ దల్లీ! ౫౩౪

ఉ. ఆవనితాలలామ యటు లాడు విదల్లునోడుల్ [illegible]
లావతిఁ జూడఁ బోయి కడు లాలనఁ బల్కుచుఁ, దం[illegible]

బోవలె నంచు స్యందనము పూన్చి విదల్లునితోడ నిష్టకాం
తావృతుఁగా సుదర్శను నొనర్చి పడిం బురి నిర్గమించెఁ దాన్. ౫౩౫

క. పురి వెలిఁ గాఁపున్న భటా
వరణంబు తలంగి పోవ వశమే కా కా
తరుణీమణి కంపించుచుఁ
బరపుచు నలుదెసల బెదరు వాఱెడి చూపుల్. ౫౩౬

గీ. ఆర్తి స్త్రీమూర్తి దాల్చినయట్లు తోఁప
నతికృపణరూప శోకసమాకులాత్మ
యై యుథాజిత్తు దర్శించి యనుమతిఁ గొనె
జనకుతనువు యథావిధి సంస్కరింప. ౫౩౭

క. పితృసంస్కారకలాపం
బతిరయమున నిర్వహించి యాతురయై యా
సతి యదను చూచి నేర్పున
సుతుతోడన్ వారణాసి చొప్పునఁ దొలఁగెన్. ౫౩౮

క. రెండు దినంబులు చనఁ గను
పండువుగాఁ గానవచ్చె భాగీరథి; యం
దుండి మనోరమ యూర్చుచు
గుండియదడ కొంత యార్చుకొనుచుండె నటన్! ౫౩౯

క. ఆరమణీమణి బాలక
సైరంధ్రీ సంవిదల్ల సహచర యగుచున్
పేరెలుఁగున నేడ్చుచు భా
గీరథి శరణంబు చొచ్చెఁ గేల్మోడ్చి మొగిన్. ౫౪౦

క. ఎదురన్ జలజల మని చిఱు
సొద చేయుచు జహ్నుతనయ రోచిస్స్మితయై
కదలఁగ ముదంబు గూర్చుచు
నొదవించెఁ బ్రశాంతి యావనోర్విసుదతికిన్. ౫౪౧

ఉ. ఆసమయంబునందు వినవయ్యె నదూరమునందు భూతవి
త్రాసకమౌ మహాకలకలం బొకఁ డందు, ననేకపాదవి
న్యాసభయంకరంబు బహుళాయుధఘర్షణముం బరస్పరా
క్రోశనఘోరముల్ సమద ఘోణ సమూహ రవానుకారముల్.

క. కను మూసి తెఱచునాలో
ననె వారలఁ జుట్టుముట్టి నానావిధత
ర్జనము లొనర్చి నిషాదుల
గణ మొక్కటి దోఁచుకొనెడి కాంక్ష చెలంగన్. ౫౦౭

సీ. ఒకఁడు మనోరమయొడలిపై నగ లెల్ల
నూడ్చెఁ, గోసియుఁ ద్రెంపి యొలుచుకొనె సెఁగు,
నొకఁడు సుదర్శనునుజ్జ్వలాంబరములు
రత్నభూషాదులు లాఁగికొనియె;
నొకఁడు సైరంధ్రి తా నొడిలోన దాఁచిన
వసువు వజ్రంబులు వదల గుంజె,
నొకఁడు విదల్లుకరోల్లాసినిశితాసి
లాఁగి పై జళిపించి రేఁగి యార్చె,

నొకఁడు నొగ లెక్కి యుగ్యంబు లూన నుఱికెను,
నొకఁడు రథ మెక్కి రథికుఁడై యుబ్బి మీఱె,
నొకఁడు వారల నో కెత్తుకుండుఁ డనియె,
బ్రదికిపోయితి రనె నొక్కఁ డదయుఁ డగుచు. ౫౦౮

క. ఆదస్యు లట్లు వారల
పైఁ దాల్చిన యూడ్పు లింత వదలి సమస్తం
బేది దయ దోఁచి తోఁచిన
యాదారిం జని రుద్రగహ్వరోద్ధతులై. ౫౦౯

క. ఒదిగి యొదిగి సుతుఁ గరములఁ
బదిలంబుగఁ బొదివి [illegible] దవంగా

బెదర రదరఁగ సైరంధ్రిం
గదిసి కరం బూఁత గొంచుఁ గదలి మెలమెలన్. ౨౮౬

క. తడఁబడుచు నామనోరమ
యుడుపం బొకఁ డెక్కి త్రిపథగోత్తారణముం
గడువడి నొనర్చి చని కా
ల్నడఁ బ్రాపించెం ద్రికూటనగపుణ్యోర్వీన్. ౨౮౭

క. భైరవతతి వెన్నాడం
బాఱెడి కాననకురంగివడువున వెనుకం
దేఱి కనంగా వెఱచుచు
భారద్వాజాశ్రమంపువనముం జేరెన్. ౨౮౮

క. ఆపాదమస్తకంబు భ
యోపహతిన్ వడఁకుచున్ సముత్కటగరిమం,
దాపసులఁ గాంచి యెదుర స
మీపభువిం గొంత దేఱె మెల్లన నెటులో. ౨౮౯

తే. అట్లు తనుఁ జేరి భయవిహ్వలాంగి యగుచు
నెగయు నూరుపుడిగి తన కెఱఁగుటకును
దెలియకున్న దీనాంగన తెఱఁగు గాంచి
పలికెఁ గృపఁ బూని యిటు భరద్వాజమౌని. ౨౯౦

ఉ. ఎవ్వతె వీవు రూపవతి? యెవ్వఁడు నీపతి? యేమి కష్టముల్
నివ్వటిలంగ భీకరవనిం జొరఁబాఱుట సంభవించె? నిం
కెవ్విధిఁ జేరఁగాఁ గలిగె? నెంతయుఁ జోద్యము బాలపుత్ర నో
జవ్వని! సంశయింపక నిజంబు వచింపు మెఱుంగఁ గోరెదన్. ౨౯౧

క. మొదల నరయ నీవు మానుష
సుదతివొ కాదో వచింపు, చూడం జూడన్
మదిఁ దోఁచు రాజ్య మెడలన్
జెదరిన శుద్ధాంతకాంతచిన్నెలు నీలో. ౨౯౨

చ. పరమమునీంద్రుఁ డిట్లు తనుఁ బ్రశ్న మొనర్ప లతాంగి పైపయిం
దెర లయి పొంగువాఁకె చనుదెంచి కలంచెడి యశ్రువారి ని
ర్ఝరు లరికట్ట లే కెలుఁగు రాపడ మాటలు రాక వానిది
క్కరసిన సౌవిదల్లుఁ డది యారసి మౌనికిఁ జెప్పె వాఁ డిటుల్.

సీ. సూర్యవంశ్యుఁడు మహాశూరుం డయోధ్యాధి
పతి ధ్రువసంధి నాఁ బరఁగునృపుఁడు
పొలిసె సింగముచేతఁ, జెలి యీమె తద్ధర్మ
పత్ని మనోరమ పరమసాధ్వి,
యారాజు తనయుఁడీ యర్భకుండు సుదర్శ
నాఖ్యుండు, ధర్మాత్ముఁ డామెతండ్రి,
దౌహిత్రుకొఱకు యుధాజిత్తుతోఁ బోరి
యసువులు దొఱఁగె రణాజిరమున,

నంత విత్రస్తయై స్వపుత్త్రావనార్థ
మీ విజనకాననంబు ప్రాపించె నిందు
నడరి దస్యులు హరియించి రఖిలధనము,
నీమహాదేవి కిప్పుడు దిక్కెవరు లేరు. ౨౨౧

తే. మౌనిసత్తమ! యిది పసికూనతల్లి,
రాచవారింటిసుత, మహారాజపత్ని.
నిన్ను శరణంబు చొచ్చె, నాపన్న నీని
నో మహాభాగ! రక్షింపవో మహాత్మ! ౨౨౨

క. ఆర్తత్రాతల కిష్టా
పూర్తాధికపుణ్యఫలము పొందుపడుఁగదే!
కీర్తింపఁ దరమె విత్ర
స్తార్తుల రక్షింపఁ బడయునతులోదయముల్! ౨౨౩

ఉ. సానునయంబుగాఁ బలికె నాఋషి, స్వస్థమతిన్ వసింపు క
ల్యాణి! మదీయసన్నిధి, నరాతిభయం బొకయింత చేరఁగా

నీను, సుతుం డితండు వసుధేశుఁ డగున్ వ్రతనిష్ఠ నూనుచున్
పీసని నోముకొ, మ్మనుభవింపక తీఱునొకో విపద్గతుల్! ౫౫౮

క. మునిమాటల మది పదిలం
బొనరిచికొని రాజ్ఞి యాశ్రమోటజమందుం
దనసుతు సాఁకుచు నివసిం
చెను సైరంధ్రీసౌవిదల్లసేవిత యగుచున్. ౫౫౯

చ. అచట యుధాజితుండు విజయార్భటిమై పురిఁ జొచ్చి శీఘ్రమే
యుచితము వైరివహ్ని శమ మొంద సుదర్శనుఁ జంపు టంచు నెం
చుచుఁ జని రాణివాసమును జొచ్చి మనోరమఁ గాన కందులో,
నెచటికిఁ బోయె నేమయిన దేమని యందఱ నడ్గెఁ బల్మఱున్.

క. సేవకుల మనోరమ గల
తా వెఱుఁగం గలయఁ బంచి, తనదౌహిత్రున్
రావించి శుభదినంబునఁ
గావించెన్ భద్రపీఠికాసంస్థితునిన్. ౫౬౦

క. ఆథర్వణశుభమంత్రో
ద్గీథంబు వసిష్ఠమౌని కీర్తింపఁగఁ బా
థోధిజల పూర్ణ కుంభక
రాధారులు చేసి రప్పు డభిషేచనముల్. ౫౬౧

క. భేరీ శంఖ నినాదము
చారుతరానేక తూర్య సంరావంబుల్
బూరటిలెన్ దశదిక్కులు
భోరుకలఁగ నుత్సవమునఁ బుర మెల్లెడలన్. ౫౬౨

క. వేదము పఠింప సుస్వర
నాదంబుల విప్రజనులు వందులు స్తోత్రో
న్నాద మొనర్చిరి జయజయ
నాదంబుల చేసి రచట నానాజనముల్. ౫౬౩

క. ఆసమయంబునఁ జూడం
గా సాకేతము నవోఢకరణిం బొలిచెన్
భాసుర నూతన నాథుని
తో సమ్మద పుష్ట హృష్ట తుందిల జనమై. ౧౬౪

మ. ఎవఁడో యేడనొ సాధుపూరుషుఁ డొకండే యేమొ కానోపుఁ గూ
రె వగన్ బుద్ధి సుదర్శనుం దలఁచి, యేడీవాఁడు సాధ్వీమత
ల్లి వనాంతంబులఁ దల్లి నెట్టియిడుమల్ వెంటాడెనో పాపముం
చు విచారించెను వానిబోంటు లరుదోచున్ మాట లేకుండిపో!

తే. అట్టియోగ్యులు సమబుద్ధు లడఁగియుండ
శత్రుజితుని సింహాసనసంస్థుఁ జేసి
మంత్రివశ మొనరిచి రాజ్యతంత్ర మెల్ల
మరలెను యుధాజితుఁడు నిజపురికిఁ బోవ. ౧౬౫

ఉ. వారనిభీతిఁ బాఱి మునిపల్లెలలోఁ దల దాఁచి డాఁగియు
న్నారు సుదర్శనాదు లని నాట జనశ్రుతి శ్రోత్రవీథి, ని
ష్ఠైర మొనర్పఁ బూని తెగనైచుకుతూహల ముల్లసిల్లఁగాఁ
జేరె యుధాజితుండు బలుసేనలు గూరిచి చిత్రకూటమున్. ౧౬౬

తే. వానికి సహాయుఁడై ముందు బలసి నడచె
నతిబలుఁడు బలుఁ డను నిషాదాధిపుండు
వారివెంటనె వడి శృంగిబేరవిభుఁడు
వెడలె దుర్దర్శనాముఁడు వీతదయుఁడు. ౧౬౭

ఉ. వా రటు వచ్చుచున్న విని వారక కన్నుల బాష్పపూరముల్
కాఱ శరీర మెల్ల వడఁకన్ సుడిగాలికి వల్లిమాడ్కి, నై
జాతెడిస్వేదవారిఁ గొనగోటను మీటుచుఁ బుత్రు సందిటం
జేరిచి పైట చాటొనరఁ జేసి మనోరమ యార్తమూర్తియై. ౧౬౮

క. తడఁబడు నడుగుల వడిఁ బ
ర్విడుచు భరద్వాజునుటజ మెదురం జని తాఁ

గడు భక్తి మ్రొక్కి యాతని
యడుగులఁ బడనైచి పుత్రు, డనె మునికి నిట్టుల్. ౫౭౦

ఉ. ఏమి యొనర్తు? నెక్కడికి నేగుదు? నెవ్వరు దిక్కు నాకు? దు
ర్ధామబలంబు తోడుగ యుధాజితుఁ డల్లదె వచ్చె, బాలు నీ
డేమొయిఁ బొట్టఁ బెట్టుకొనఁడే? పాలియింపఁడె నాదుతండ్రి? మా
భూమి హరింపఁడే? బలిమిఁ బూన్పఁడె మన్మని రాజపీఠిపై? ౫౭౧

క. విందుము పురాణకథ మన
ముందర పాండవులు ద్రుపదపుత్రియు మునివా
టిం దాము వసించెడు తఱి
నందఱు పాండవులు వేట కరిగి రొకయెడన్. ౫౭౨

సీ. ద్రౌపదితో నుండె ధౌమ్యుండు మఱి యందుఁ
గల రత్రి పైలుండు గాలవుండు
నాత్రేయుఁ డైన యా చ్యవనుండు జాబాలి
కణ్వ జతుక్రతు గౌతములును
భృగువు సుమంతుండు వీతిహోత్రుఁడు యజ్ఞ
దత్తుండు యజ్ఞకృత్క్రతు యవులును
నాశ్వాసన యవక్రు లల వత్సల కహోడ
ముఖ్యులు సన్మునిముఖ్యు లలఘు

లో భరద్వాజ! నీవు నం దుండవొక్కొ!
వేదవేదాంగవిదులు శుభోదయాత్మ
లుజ్జ్వలులు వారియందుఁ దా నుండెఁ బ్రీతి
యాజ్ఞసేనియు దాసీసహాయ యగుచు. ౫౭౩

తే. అంతలోఁ బాండవులు మృగయాభినిరతి
వన మొకటి దాఁటి యింకొకవనము చేరు
చుం గడుఁ దవ్వు వోయిరి శూరధర్మ
మనుసరించి ధనుర్బాణహస్తు లగుచు. ౫౭౪

శా. శ్రీమంతుం డగు సింధురాజపుడు దారిం బోవుచున్ మంజులా
ర్థామోదంబుగ వీనులన్ మునులవేదాధ్యాపనల్ సోఁకఁ, ద
చ్ఛ్రీముగ్ధుం డయి యాశ్రమాంతరము దర్శింపంగఁ గాంక్షించుచున్
ధీ మీఱన్ వడిఁ దేరు డిగ్గి వెడలెన్ భృత్యద్వయోపేతుఁడై.

తే. నిగమవాదం బొనర్చు మౌనితతిఁ గాంచి,
యంజలి ఘటించి భక్తి, జయద్రథుండు
త న్నెఱింగించుకొని పేరు తడవి మ్రొక్కి
యనుమతుం డయి యాసీనుఁ డయ్యె నొకట. ౫౭౬

చ. నరపతిరాక చెచ్చెర వనంబునఁ బ్రాఁకిన మౌనిపత్నులె
వ్వరో, యతఁ డెట్టివాఁడో, కని వత్తము గాక యని వేడ్క బుద్ధులం
దొరలఁగ, వచ్చుచుండఁగని, తోఁ జనుదెంచెను యాజ్ఞసేనియున్
వరకుచభారనమ్రగమనంబున మాఱటశ్రీ యనంగనై. ౫౭౭

ఉ. దానిని వాలుఁగన్నుఁగవదానిని, వేలుపుబొమ్మ కుద్దియౌ
దానినిఁ, దమ్మినెమ్మొగముదానిని, గాంచి జయద్రథుండు, స
న్మానికులేంద్ర! శ్యామ సుకుమానిత యెవ్వరిపత్ని తెల్పు మీ
చాన, తలంప రాణ్మహిషిచాయఁ గనంబడు నంచు వేఁడినన్. ౫౭౮

తే. ధౌమ్యుఁ డెఱిఁగించె నిట్టు, లీతరుణి కృష్ణ,
పాండవులధర్మపత్ని, శుభస్వరూప;
వార లిందు వసించుచున్నారు, నేఁడు
వేట చని రిప్డు వచ్చెడివేళయు నగు. ౫౭౯

ఆ. సైంధవుండు వాని సద్వాక్య మాలించి
కృష్ణఁ జేరి మ్రొక్కి ప్రియము మీఱఁ
గుశల మడిగి వగచె ఘోరాటవిఁ బడునో
కేడు లెట్లు గడుపఁ గూడె ననుచు. ౫౮౦

ఉ. ద్రోవది వానిసౌమ్యమృదుధోరణి రంజిలి పల్కె స్వస్తియౌఁ
గావుత నీకు భూవర! సుఖంబుగ నిందుఁ బథశ్రమంబు పోఁ

గా వసియింపు మిచ్చె, క్షణకాలములోఁ జనుదెంత్రు నాపతుల్,
నీ విటు రాక యాపృథుమనీషుల కెంతయుఁ బ్రీతి గూర్చెడిన్.

క. ఆలలన యిట్లు పలికెడుఁ
నాలోనన వాఁడు లోభహతుఁడై దానిం
జే లాగి బలిమిఁ గొని చనె
నాలింపక మానివరులహాహారవముల్. ౫౮౨

ఆ. విశ్వసించి బుధుఁడు వెఱవు వీడం బోల,
దట్లొనర్చె యిడుమ లందు, ధ్రువము;
సత్యసంగరుండు సాధుసమ్మతబుద్ధి
నమ్మి మోసపోఁడె నాఁ డటు బలి! ౫౮౩

తే. ఆడి బొంకు టెఱుఁగఁ డాతండు ప్రహ్లాదు
మనుమఁ డమితధర్మమహితబుద్ధి,
పూర్ణదక్షిణాకములుగఁ దొంబదితొమ్మి
దధ్వరములు సలిపినట్టి దాత. ౫౮౪

ఉ. యోగుల కీశ్వరేశ్వరుఁ డనుత్తముఁ డవ్యయసత్యమూర్తి శ్రీ
భాగవతాగ్ర్యపూజ్యభగవంతుఁడు విష్ణుఁడు దేవకార్య దీ
క్షాగరిమంబునన్ వడుగుగాఁ బ్రభవించి ఛలంబునన్ గొనం
దే గురురాజ్యముం, జెఱుపఁడే యతిఁ డూనినయజ్ఞకార్యముల్.

క. అట్టి మహాభాగుఁడు హరి
యిట్టుల కపటమున బలిని హరియించిన, నిం
కెట్టిది చేయుం డితరుం;
డిట్టు లగుట నమ్మ వలవ దెన్నఁడు లోభిన్. ౫౮౫

సీ. లోభహతుఁడు చేయ లోఁగు పాపము లేదు,
పరలోకభీతిఁ బన్నడఁ డొకింత,
పరవిత్తహరణంబు వాంఛించియే నరుల్
దేవతలం గొల్వఁ దివురు టెల్ల,

గ్రహణవేళల మహామహిమ పొందెడుకోర్కెఁ
బలుదానములు చేయుఁ బార్థివుండు,
వస్త్రాదు లమ్మఁగా వణిజుండు గొని లాభ
మర్థించి సల్పు దేవార్చనంబు,

నొకఁడు భయమువలన నొక్కఁడు భక్తిచే
నొకఁడు చౌర్యవృత్తి నొకఁడు బలిమిఁ
బరధనము హరింపఁ బ్రాణు లెల్లఁ దలంతు
రెట్లు విశ్వసింప నెసఁగు జనుల? ౫౮౭

క. వృథ యగుఁ దీర్థము, దానము
వృథ యగు, నధ్యయన మెల్ల వృథ యగు, నెవనిన్
వ్యథపెట్టు లోభమోహము,
లధముఁ డతనిసుకృతమేని నకృతంబ యగున్. ౫౮౮

క. నీయండ నొదిగి మునిదే
వా! యీయెడ నే వసింతు నాత్మజుతో, ము
న్నా యవనిజనోలెనె యె
ట్లో యింటికి ననుపఁ జాలనో యుధాజితునిన్! ౫౮౯

ఆ. అట్లు పల్కు రాణియార్తవాక్కాలించి
కరుణ మాని యుచటు కదలి వేగ
ఘన తపఃప్రభావఘని భరద్వాజర్షి
పల్కె రాజుతోడ వచన మిట్లు. ౫౯౦

క. "రాజా! మును వచ్చిన తెరు
వోజం గొని యేగు, మింద యుండెడు దుఃఖో
ద్వేజిత యీసతి బాలత
నూజునితో మాదునండ నూలోకన శుభముల్. ౫౯౧

వ. అన విని యుధాజి త్తిట్లనియె. ౫౯౨

ఆ. "మొండితన మ దేల? మునిముఖ్య! కొనిపోదుఁ
గొడుకుఁగోడ దీని విడువుమయ్య!
విడువవేని రోస మడర మనోరమ
బలిమిఁ గొంచుఁ బోవవలసి వచ్చు." ౫౯౩

క. గంభీరసాగరాంతర
కుంభితబడబాగ్ని పొరలుకొనియున్ శాంత
స్తంభితరేఖం దేజ
స్సంభృతుఁ డయి మౌని పల్కెఁ క్ష్మాకాంతునితోన్. ౫౯౪

క. మున్ను వసిష్ఠుని మొదవుం
గొన్న కుశికతనయుఁబోలెఁ గొని చను మీవున్,
న న్నాశ్రయించి మనియెడి
యున్నాతిన్ బలిమిఁ గొనఁగనే బల మున్నన్. ౫౯౫

తే. మౌనివాక్యంబు లాలించి మానవపతి
వృద్ధమంత్రిని గర్తవ్య మిట్టు లడిగె
బలిమిమై దీని సుతునితోఁ జలము మీఱఁ
గొంట నా మత మేమి వాక్రుత్తు వీవు? ౫౯౬

క. కొంచెంబయ్యైన శత్రువు
నంచితశుభ మిచ్చగించు నాతఁ డుపేక్షం
గించిత్తు చేయుఁ జన దిఁక
మించినయెడ రాజయక్ష్మమితి మిత్తి యగున్. ౫౯౭

క. లే దిందు సేన, యోధుఁడు
గా దన నను లేఁ డొకండుఁ, గావున బలిమిన్
నాదౌహిత్రస్పర్థిన్
భేదించి యకంటకముగఁ జేయుదుఁ బ్రభుతన్. ౫౯౮

వ. ప్రధానుం డిట్లనియె. ౫౯౯

క. ఓహో! వలదటు, ప్రభు! ముని
యూహం దలపోయు, మేల యుపమానముగా
నాహోమధేనువుం గొను
సాహసకౌశికునిగాథ స్మరియించెనొకో! ౬౦౦

క. పూర్వము విశ్వామిత్రుం
డుర్విం జరించుచు యథేచ్ఛ నొకనాం డర్థి
గుర్వాశ్రమమున కేగెను
సర్వపరీవారయుతుండు సబలుం డగుచున్. ౬౦౧

క. నృపుం డేతేర వసిష్ఠుం
డుపవిష్టుం జేసి విష్టరోపరి తగున
ట్లుపచారనిమంత్రణముల
సపరీవారం బతిథిగ క్షణియించె నొగిన్. ౬౦౨

క. గాధేయభోజనాదులు
సాధింపంగ సామిధేని సన్ముని మది నా
రాధించిన నదియు సమా
రాధన మొనరించె మెచ్చ రా నెల్లరకున్. ౬౦౩

క. నందినిమాహాత్మ్యంబును
నందంబు ప్రతాపగరిమ యంభారవ మా
నందంబు గూర్ప గురుపద
వందన మొనరించి భూమిపతి యి ట్లనియెన్. ౬౦౪

క. కుండోధ్నులైన దోగ్ధ్రీ
తండంబు సహస్రమిత్తు దానికిం బ్రతిగా,
నిండీ నందిని నా, కిదె
దండం బొనరింతు మీకు ధర్మాత్మ! గురూ! ౬౦౫

వ. వసిష్ఠుం డి ట్లనియె. ౬౦౬

క. ఇది హోమధేనువయ్యా!
యెది యిచ్చిననేని యీయ నెట్లును దీనిన్,
మొదవులు వేయును నీయవి
కదలక నీయెడనె యుండుఁ గావుత రాజా! ౬౦౭

వ. విశ్వామిత్రుం డి ట్లనియె. ౬౦౮

క. పదివేల నాల నిచ్చెద,
నది గాదే లక్ష యిత్తు, నడిగిన విత్తున్,
మొదవును దీనిం బుచ్చుము,
తుది వదలను దీని బల్మిఁ గో నేఁ గొందున్. ౬౦౯

వ. వసిష్ఠుం డి ట్లనియె. ౬౧౦

క. నాయావు బలిమిఁ గొనఁగా
నే యిష్టంబైనఁ జేయుమీ యని రాజా!
నాయిచ్చ దీని నీఁజను
వే యిచ్చిన నిచ్చితేని విత్తము నిన్నేన్. ౬౧౧

క. సాకల్యంబుగ మునివా
క్యాకర్ణించుచును గినిసి యాజ్ఞాపింపన్
వీఁకం గౌశికు ననుచరు
లాకర్షించిరి హఠాద్రయంబున మొదవున్. ౬౧౨

క. బలదర్పిత మగు కౌశికు
బలమునఁ గల బలియు రెల్ల బలసి తఱుముచున్
బలిమిన్ నందిని నూపిరి
సలుపంగానీక కట్ట సాగిరి పెలుచన్. ౬౧౩

క. వడఁకంగఁ దనువు, దొఱఁగం
జడిగా బాష్పములు, సురభి జాలి గొలుపఁగా
నడిగె వసిష్ఠుని నేటికి
విడిచితి విటు దివియ నన్ను వీర లటంచున్. ౬౧౪

క. ముని పల్కెఁ, దల్లి! నిన్నే
మనసా విడువంగ లేదు మఱి యీనృపుఁడే
నిను బల్మిఁ గొనెడి, నేనే
మొనరింపఁ గలాఁడ నతిథియోజితు నితనిన్. ౬౧౫

తే. మునివాక్యంబు లాలించి ధేను వపుడు
పొంగి రోషంబుతో దూఁకి చెంగు మనుచుఁ
గలఁగి పాఱఁగ మూఁగిన బలము లెల్లఁ
గ్రూరభంగి నొనర్చె హంభారవంబు. ౬౧౬

శా. ఆ హంభాపటుదారుణధ్వని దశాశాంతంబులన్ మ్రోయఁగా
నాహూతాగతులైనటుల్ మొదవుసర్వాంగాళి నొక్కుమ్మడిన్
సాహంకారులు ఘోరరాక్షసులు వర్మాస్త్రాయుధోదగ్రులై
యోహో యేఁగుఁ డటంచుఁ బుట్టిరి వడిన్ హుంకారగర్జోగ్రులై.

క. అందలు పుట్టిన సేనా
సందోహము కవిసి రాజుసర్వబలంబున్
మ్రందించి నిరవశేషం
బందించి విముక్తఁ జేసె నా నందినినిన్. ౬౧౮

క. తనసేనపాటు గని కూ
రినవగ నేకాకి యగుచు నృపుఁడు కదలి నె
మ్మనమున క్షాత్రబలము ఛీ
యని తెగడుచు బ్రహ్మబలము నారాధించెన్. ౬౧౯

క. బహుకాలము ఘోరతపము
గహనంబునఁ జేసి వదలి క్షాత్రబలము దు
ర్గ్రహవిధి విశ్వామిత్రుఁడు
మహర్షి యయ్యెఁ దుది, దాని మాట యెఱుఁగవో! ౬౨౦

మ. ప్రభు! నీ విట్టివృథావిరోధము త్యజింపం బోలుఁ గాలాగ్నిస
న్నిభమై బ్రాహ్మణునల్క చేయుఁ గులమున్ నిశ్శేషముం గావునన్

శుభమహా నీ విపు డేగి మౌనివరునంఘ్రుల్ పట్టి ప్రార్థించి నీ
కభియుక్తం బొనరించి కొన్న, మది నూహల్ మాని బాలుం గొనన్.

క. దైవాధీనము జగ మని
భావించుచుఁ గరుణతోడ వర్తింపఁగ నౌ;
దైవమునఁ దృణము పవియౌఁ
జా వగును బులికిఁ గరికిని శశమశకములన్. ౬౧౨

క. బాలుఁ డనాథుఁడు నిర్ధనుఁ
డాలమునకు దుర్బలుండు నగు నర్భకుపై
నేల పగ, జాలి గొను మది,
నాలింపుము నాదుపల్కు; నతని విడువుమా! ౬౧౩

తే. వృద్ధమంత్రివాక్యంబులు విని వినీతుఁ
డై యుధాజితుఁ డాశ్రమంబందుఁ జొచ్చి
మౌనిపదపీఠి శిరసా సమస్కరించి
మరలి శాంతుఁడై నిజపురి కరిగె నిచ్చ. ౬౧౪

క. మన మంతటఁ గుదుటంబడి
మనోరమ కుమారు నాశ్రమంబున సాఁకన్,
మునిబాలురతో నాడుచు
ననుదినపరివర్ధమానుఁ డయ్యె నతండున్. ౬౧౫

క. ఒకనాఁ డటు లాడెడు బా
లకు దరికి విదల్లుఁ డరిగి లాలింపఁగ, మౌ
నికొడుకు విదల్లుఁ దనయం
తికమునకున్ 'క్లీబ' యంచుఁ దిన్నఁగఁ బిలిచెన్. ౬౧౬

తే. అది సుదర్శనుఁ డాలించి యల్ల క్లీబ
శబ్దమునఁ గల్గు మొదటి యక్షరముతోడ
బిందువుం గూర్చి శ్రీకృపాప్రేరితుఁ డయి
యాత్మ ధరియించి మఱిమఱి యనఁ దొడంగె. ౬౧౭

క. రాఁగల యోగమున యదృ
చ్ఛాగతమై కామరాజ మతనికి దొరకం
గాఁ గడు బాల్యంబున శ్ర
ద్ధాగౌరవముల నతండు దానిం గొనె నెదన్. ౬౨౮

క. వాఁ డైదేఁడులు నిండని
యీడున మంత్రంబు నేర్చె, ఋషివర్యుం డే
వాఁడో, ఛందము న్యాసము
గో డేదో, ధ్యాన మేదొ గుఱుతు తెలియకే. ౬౨౯

క. నడచుచు నుడుగుచు నుడువుచుఁ
గుడుచుచుఁ గూర్చుండి నిదురఁ గూర్కుచుఁ గ్రీడం
గడపుచు నిత్యము మనమున
విడువక జపియించుఁ గామబీజము నతఁడున్. ౬౩౦

తే. పదునొకండవ యేఁట నృపప్రసూతు
నియతపథమున ముని యుపనీతుఁ జేసి
వేదమును సాంగముగ ధనుర్వేదయుతము
గను బఠింపించి దండనీతిని నొసంగె. ౬౩౧

క. ఎదలో నతనికి వదలక
పదిలంబై యున్న మంత్రబలమున వీఁకం
జదు వెల్ల నొదవె, దేవీ
పదభక్తుల కందరాని పదముం గలదే! ౬౩౨

ఉ. దేవి సమస్తభూషణసుదీపితయై, విహగేంద్రవాహన
శ్రీ విలసిల్లఁగా మెయి ధరించిన యెఱ్ఱని పట్టుపుట్టపుం
గావి స్వకీయరక్తతనుకాంతులఁ బెంపఁ బ్రసన్నరూప శో
ఖావిభవాభిరామ యయి కన్నుల గట్టను వాని కొక్కెడన్.

మ. తనకుం దర్శన మిచ్చి నిల్చిన జగత్కల్యాణి నారాయణిన్
బ్రణతిం జేసి సుదర్శనుండు ప్రణుతింపం గామరాజాత్మగా

త్రుని శ్రీ గాంచి, శరాసనంబు శరముల్ తూణీరముం గంకటం
బును దివ్యంబు లొసంగి పెల్చనఁ జనెన్ మోదంబు పెంపొందఁగా.

### శశికలా స్వయంవరము

క. కాశీరాజసుపుత్రిక
సౌశీల్యసులక్షణాఢ్య శశికల నా క
న్యాశీర్షమణి ప్రాభవ
పేశల రమణీయగాత్ర విలసిల్లు నిలన్. ౬౩౫

క. బందీజనములు దానికి
నందిచ్చిరి వార్త వవమునందు వసించుం
గందర్పమూర్తి శౌర్యపు
నందనుఁడు సుదర్శనాఖ్య రాట్సుతుఁ డంచున్. ౬౩౬

చ. శ్రవణముచే సుదర్శను విశాలవిలోచన యాత్మనాథుఁగా
ధ్రువమతియై వరించి పరితోషము మీఱఁ దదీయదర్శనం
బవు నెపు డంచు నుండ జగదంబిక యొక్క నిశావసానమం
దవిరళలీల స్వప్నగతయై కృప నొక్కెడ చూడ్కిఁ గన్పడెన్. ౬౩౭

క. ఆతల్లి యపుడు పల్కెన్,
నాతీ! యఖిలార్థశోభనం బగు నీకున్
బ్రీతి వరింపు సుదర్శను,
నాతఁడు మద్భక్తుఁ, డొప్పు నన్నిట నీకున్. ౬౩౮

శా. అంబామంగళదివ్యభవ్యమహనీయాకారముం గాంచి వా
క్యం బాలించి సుధాతరంగితము, స్వప్నాంతమ్మునన్ లేచి, హ
ర్షం బాకారము పొందినట్లు యయి వారంవారమున్ వాని స్వాం
తంబందున్ స్మరియించుచున్ మురిసి వింతం బొంగె నబ్బాలయున్.

క. దానియపూర్వామోదం
బానాఁ డూహింప కమ్మ యడిగె మఱిమఱిన్

దీనికిఁ గారణ మేమని
కాని త్రపాభరమునఁ బలుకద రవంతేన్. ౬౮౦

వ. శశికలయు సుదర్శనాయత్తచిత్తయై యేకాంతంబున నిట్లు తలపోసె.

సీ. అరుణభూషామాలికాంబరంబుల నంబ
చిత్రితం బయ్యె నాచిత్తభిత్తిఁ,
బూర్ణేందుకౌముదీ పూర్ణహాసప్రభ
వెలుఁగొందు నామనోనిలయ మెల్ల,
నుద్యదాదిత్య సముల్లాసితనుకాంతి
వికసించె హృదయాబ్జవీథి మిగుల,
బాణాసనోజ్జ్వల పంచసాయక రేఖ
హత్తియున్నది మదీయాంతరంగ,

మమృతపుంజల్లు వోని పరాంబపలుకు
శ్రవణపుటముల జలజల జాలువాఱు,
బలిమి నాకృష్టమై పరవశత నొంది
యాత్మ విలసిల్లెడి సుదర్శనార్పిత మయి. ౬౮౧

క. కలలోఁ గాంచిన దేవిం
దలపోయున్, మరల, నా సుదర్శనుఁ దలఁచున్,
బులకించును మురిపెంబునఁ,
దిలకించును మొగము నిండఁ దీయనినగవుల్. ౬౮౨

క. ఒకచెలికిమాత్ర నుడివెను
సకలంబగు స్వప్నకథయు శశికల తమిమై;
నొకనాఁడు వార లిద్దరు
వికసిత చంపకవనాంత విహరణ పరలై. ౬౮౩

క. ఉపవనమునఁ గుసుమంబుల
నపచయ మొనరించువేళ నా బాలిక లం

నుపలక్షించిరి చంపక
విపులాజమునీడఁ జనెడి విప్రోత్తమునిన్. ౬౪౫

క. అక్కజపడి శశికల కని
మ్రొక్కి యడిగె వాని మధురముగ్ధంబుగ, నీ
వెక్కడి వాఁడవు? సద్ద్విజ!
యెక్కడి కేగెదవు వేగ మిట్టు? లటంచున్. ౬౪౬

తే. ఆమహాత్ముండు పల్కెఁ దన్వంగి కిట్టు,
లల భరద్వాజునాశ్రమంబందునుండి
వచ్చుచున్నాఁడఁ గార్యార్థవశుఁడ నగుచు,
నేమి వినఁగోరెదో తెల్పు మిందువదన! ౬౪౭

క. అది విని శశికల యడిగెను
ముదితమతిం దెలుపు మిందుఁ బుడమి నపూర్వం
బెది కలదు వర్ణనీయము
సుదర్శనీయము విశేష శోభాన్వితమున్. ౬౪౮

తే. చిఱునగవు నాట్యమాడ భూసురుఁడు పలికె,
నందు వసియించుఁ జుమి ధ్రువసంధిపుత్రుఁ
డగు సుదర్శనబాలుఁ డన్వర్థనాముఁ,
డతఁడు పురుషోత్తముండు రూపాన్వితుండు. ౬౪౯

శా. ఏలా వాసమనోహరాకృతివిధం బీక్షింపకున్నం గనుల్?
బాలా! ధాత గుణంబు లెల్ల నొకచో భాసిల్ల సృష్టించె నాఁ
బోలున్ వానిని, వాఁడె నీకుఁ దగు నౌ నౌ భర్తగా నుండఁగా,
నేలై సన్మణికాంచనాప్తియునలేన్ మీయోగ మొప్పారెడున్.

క. అటు పల్కి యా మహీసురుఁ
డట నేనిం జనియెఁ గార్య మెక్కడఁ గలదో,
యిట శశికలకున్ మరు లు
త్కటమై విలసిల్లె నాసుదర్శనుమీఁదన్. ౬౫౦

చ. మదనుఁడు ధూర్తుఁడై యతివమానసముం గిలకొట్ట బేలయై
వదనము వాడ నుస్సు రని వాల్చుచు మాటికిఁ బ్రాణపుంజెలిన్
గదియఁగ జేరి యేకతమ కన్నులఁ గూరఁగ నశ్రువారి గ
ద్గదిక యెసంగ శ్రావ్యతర కంఠమునన్ విలపించె నీ గతిన్. ౬౨౧

మ. చెలియా! నాగతి యేమి? నామది చలించెన్, దేహతాపంపుట
గ్గలికన్ వేఁచెడిఁ జందనంబు విషసంస్కారంబుగాఁ, బూలదం
డలు వ్యాళంబులు గాఁగఁ, గౌముదులబ్బృందం బగ్నికీలోపమం
బులుగా, రేలుఁ బవళ్ళు శాంతియు సుఖంబున్ శూన్యమయ్యెం గదే!

ఉ. సౌధతలంబునందు సుఖసంస్థితి గానక కేలిదీర్ఘికా
రోధముఁ జేరఁబోవుదు, మఱుక్షణ మచ్చటఁ దోఁపకుంటమిన్
భూధర మాశ్రయింతు, నటఁ బోవమిఁ బ్రొద్దు, విహారవాంఛమై
సౌధవనంబు సేరుదును, స్వాస్థ్యము గల్గ దొకింత యెందునన్.

క. గీతావాదనములు శ
య్యా తాంబూల ప్రముఖ సమగ్ర సుఖంబుల్
నాతాపము తీర్పవు ప్రే
మాతురనై స్వప్నపురుషు నాత్మ మలఁచెదన్. ౬౨౨

తే. ఆభరద్వాజు నాశ్రమం బాశ్రయింప
నుత్సహింతును, కులలజ్జ యొప్పకుండు,
జనకుఁడు స్వయంవరమె నాకుఁ జాటెనేని
యాత్మఁ గావించెద సుదర్శనార్పణంబు. ౬౨౩

ఉ. ఎందరు లేరు క్షత్రియు లహీనపరాక్రము లిద్ధతేజు ల
స్పందయశోవిభూషణులు భావజసుందరులైనఁ గాని నా
డెందము కానలో నలమటించుచు రాజ్యపదప్రణష్టుఁడై
డిందు సుదర్శనున్ విడువలేదు క్షణంబు బలావకృష్టమై. ౬౨౪

క. ఏకాకియు నిర్ధనుఁడు న
నీకసహాయవిరహితుఁడు నిరతవిపినభూ

న్యేకాంతవాసి మూలఫ
లైకాహారుఁడు సుదర్శనాఖ్యుఁడె సచ్చేన్. ౬౫౮

క. నిండారిన వాగ్బీజా
ఖండజపమ్మున శశికల కనఁ దద్వాశ, మా
తం డర్న్ మఱువక విడువక
యుండె నహర్నిశము తజ్జపోద్యతుఁ డగుచున్. ౬౫౯

మ. అతఁ డశ్రాంతము ధ్యానతత్పరత దేవ్యాకారసంగూఢచి
త్తత నుండం గనఁ జాలు స్వప్నమునఁ బ్రత్యక్షంబుగా దేవి వి
శ్వతతాకారిత విష్ణుమాయ సకలైశ్వర్యప్రదన్ (శ్రీ) నఖం
డిత నవ్యక్తను విశ్వమూర్తి నపరన్ దీప్తప్రభావిగ్రహన్. ౬౬౦

ఉ. ఆతఁడు రాజపుత్రుఁ డగు టాత్మ నెఱింగి యుపాయనంబుగాఁ
బ్రీతి నిషాదనాథుఁడు నివేదనచేసె రథోత్తమం బొకం
డాతతయుద్ధసాధనసమన్వితమున్ ధ్వజరత్నశోభితం
బై తనరారి నాలుగు హయంబులు పూన్చినదాని జైత్రమున్.

తే. దానిని సుదర్శనుండు మిత్రత్వబుద్ధి
స్వీకరించి పూజించెను శృంగిబేర
పురవరాధిపు శంబరుఁ గరముఁ బ్రీతి
వన్య మూల ఫలాది సంపత్తి నిగుడ. ౬౬౧

సీ. అతిథిసత్కృతిఁ బొంది యటు నిషాదవిభుండు
    సనినంతఁ బల్కిరి మునులు దరిసి,
రాజపుత్ర! ధ్రువంబు రాజ్యంబు ప్రాపింతు
    వచిరంబ నీప్రతాపాశ్రయమున,
విశ్వమోహిని యంబ వీక్షించు నినుఁ గటా
    క్షేక్షణంబుల భవత్పక్ష మూని
వరదాత్రియై యుండు, సరిలేని సాహాయ్య
    సంపత్తి యబ్బె, విచారపడకు,

మనుచు మఱి సంశ్రితవ్రతు లైన మౌని
వర్యు లనిరి మనోరమావనితఁ గాంచి,
శుచిసితస్మిత! నీబిడ్డ సువ్రతుం డి
దే ధరాధీశుఁ డగు శీఘ్రమే యటంచు. ౬౬౩

చ. అది విని పల్కె నాసతి, తథాస్తు మదీయకుమారకుండు మీ
పదవరివస్య నేమఱఁడు, భావితమంత్రులు మీరు, వీని కే
యదియు బలంబు కోశము సహాయులు ప్రెగ్గడ లేని లేర, బొం
కొదవని మీదువాక్కుల శుభోదయ మీతనిఁ జెందు టబ్రమే!

క. ఆ తే రెక్కి సుదర్శనుఁ
డేఁతేరం జూడఁ జోద్య మెన్నఁగ నొక్కం
డాతం డక్షౌహిణికో
పేతుం డయినట్లు తోఁచు విస్ఫుటకాంతిన్. ౬౬౪

మ. అది యాతండు జపించుమంత్రబలమే యౌఁగాక, కా దన్యథా
మదిఁ జింతింపు నరేంద్ర! సద్గురుఁడు నేమం బొప్ప దీక్షింపఁగా
నది లబ్ధంబయి నిష్ఠ నెల్లప్పుడు శౌచాత్ముండు శాంతుండు నై
హృది భావించెడు భాగ్యశాలి కిలపై నేముండు నప్రాప్యముల్ ?

క. ఎవ్వారికిఁ జిత్తంబుల
నివ్వటిలదొ యంబపూజ నిష్ఠ ధ్రువంబై
యవ్వారే దౌర్భాగ్యులు
నివ్వసుధన్ మందమతులు నీతివ్యథితుల్. ౬౬౫

ఉ. ఆదిమమాతగా నెది యుగాదిఁ బ్రకీర్తిత యయ్యె, సర్వదే
వాదిగ నాపరాంబఁ గనులారఁ గనందగు జీవకోటి, శ్ర
ద్ధోదయ మెందు, లక్ష్మి యెటనో, స్మృతియెయ్యెడఁ, గీర్తియెందు, నే
మేదరి మేధ, శక్తి ధృతు లేకడ, సన్మతి యేడఁ గాననా! ౬౬౬

శా. మాయామోహితుఁడై కుతర్కజనితోన్మాదంబునం గాక మే
ధాయుక్తుం డెవఁ డాపరాంబిక జగత్సర్గావనోన్నాశశక్తి

న్నామెం గొల్వఁడు, కొల్తురే దిగధిపుల్ మా వా గుమేశిత్వ సు
శ్రీయుక్తుల్ వసు రుద్రు లశ్వినులు విశ్వేదేవు లాదిత్యులున్!

క. విద్యావిద్యాద్వైవి
ధ్యోద్యత బ్రహ్మస్వరూప యోగిహృదంభో
జాధ్యాసితయై యది జ్ఞా
నద్యుతి దీపింపకున్న జ్ఞానం బున్నే! ౬౨౦

తే. అట్టి పరదేవి త్రివిధాత్మ మఖిలసృష్టి
చేసి విశ్వాత్మ నలరింపఁ జేయుఁ జూపి,
యట్టి దేవి సుదర్శనుం డాత్మఁ బొంది
వనమునన్ రాజ్యరమ మించు ప్రమద మొందె. ౬౨౧

క. అనవరత మచట శశికల
యనంగబాణప్రపీడితాకారంబుం
గని పిత యోగ్యవరాన్వే
షణపరత స్వయంవరంబు చాటం బంచెన్. ౬౨౨

సీ. రాజలోకైకధర్మంబు స్వయంవరం,
బది త్రివిధం బయి యలరుచుండు,
నిచ్ఛాస్వయంవరం బెన్న పణాభిధా
నమ్మన శౌర్యశుల్కమ్మనాఁగ,
స్వేచ్ఛాస్వయంవరంబే తేఁడు ప్రకటించి
శిల్పుల నేమించి చిత్రరీతి
మంచంబు మాంగల్యమహితంబు నిర్మించి
సభ్యమంటపములు చాల సేయఁ

జూచి శశికల స్వవివాహశోభనములు,
జడి గొనఁగ బాష్పముల్, తనసకియఁ బిల్చి
యనియె, నడిఁ జని తెల్పు మాయమ్మ యెఱుఁగ
నే సుదర్శనేతరుని వరింప ననుచు. ౬౨౩

ఉ. ఆసఖి సంభ్రమాతురరయాన్విత యౌచు విదర్భపుత్రియా
వాసముఁ జేరి యేకతమ భామినిఁ గాంచి మనోజ్ఞమంజువా
చాసుభగంబుగాఁ దెలియఁ జాటెఁ దదీయకుమారికాహృద
ధ్యాసితమూర్తి నాథుఁడు సుదర్శనుఁ డంచు సుదర్శనంబుగా.

శా. ఓకల్యాణి! త్వదీయపుత్రి బహుమాన్యల్ సెప్పఁగా వాని ది
వ్యాకారాఢ్యగుణప్రశస్తి విని తద్భావాత్మయై యుండ శ్రీ
ప్రాకట్యం బగు నాదిదేవి కలలోఁ బ్రత్యక్షమై పల్కె వాఁ
డే కాంతుం డగు నీకు, భద్ర మగుఁ దల్లీ! దాన నంచుం గృపన్.

క. ఏమని చెప్పుదుఁ దల్లీ!
నీముద్దులతల్లి స్వప్ననిహితసమాధిన్
శ్రీమాతఁ గాంచి, పలికిన
శ్రీమాటలు విన్నదాది చెన్నిది యంచున్. ౬౭౬

మ. కలలోఁ గాంచిన దేవిరూప మెదుటం గంచుం బ్రమోదించుఁ బ్రాం
దలఁపుల్ నించు, సుదర్శనాకృతి మఱిన్ ధ్యానించు యోగిక్రియన్,
గలహీనామృదువాణి వాణి చెవులం గల్యాణమై నిండఁగం
బలుకుం బల్కు సుదర్శనాభిధమహామంత్రంబు నిస్తంద్రయై. ౬౭౭

తే. అల భరద్వాజునాశ్రమం బాశ్రయించి
వాఁడు ధ్రువసంధిపుత్రుఁ డున్నాఁడు నేఁడు,
నీకుమారికప్రాణముల్ నిలుపఁ దలఁచి
తేని, దొరకొను కూర్పఁగా వాని దాని. ౬౭౮

క. చెలినోటఁ గూఁతుపలికిన
పలుకు యథాతథమ తల్లి వైదర్భి వడిం
దెలియం జెప్పె సుబాహున
కలనోకన్ రాణివాస మాతఁడు చేరన్. ౬౭౯

ఉ. ఆనుడు లాలకించి నృపుఁ డచ్చెరు వందుచు నెమ్మనంబునన్,
లేనగ వొప్పు మోముపయినిన్, నిజభామినిఁ గాంచి యిట్లనెన్,

మానిని! నీ వెఱుంగవా, కుమారుఁ డతండు స్వరాజ్యలక్ష్మి దూ
రానఁ ద్యజింప, నుండెడి నరణ్యమునం దనతల్లితోడుగా. ౬౮౦

చ. అతనినిమిత్తమే కద మహాబలసాధనయుక్తుఁడై యుధా
జితుఁ డని వీరసేను హతుఁ జేసె, దరిద్రుఁడు వాఁడు, నాకుమా
రితకు వరుండు కాఁదగునె? యంచుక విప్రియమైన నచ్చఁ జె
ప్పు తనయ కెక్కనట్టి నృపపుత్రులరాక స్వయంవరంబునన్. ౬౮౧

క. వైదర్భాంగనయు విశే
షాదరమునఁ గూఁతుఁ జేరి యంకము చేరం
గాఁ దీసి పుడికి చిబుకము
వైదర్భివాణి నిట్లు వచియించెఁ దమిన్. ౬౮౨

సీ. మాతల్లి! యేటికే మీతండ్రి నెఱియించు
పట్టు వట్టెదు? నాకుఁ గిట్టదమ్మ!
వినవా సుదర్శనుం డన నెవ్వ రనుకొంటి?
త్యక్తరాజ్యశ్రీకుఁ డపగతాప్తుఁ
డాశ్రయహీనుఁ డత్యంతదరిద్రుండు
వనవాసియు ఫలాశి బహుకృశుండు
నబల తజ్జనయిత్రి యతనికో, డట్టేఁడు
కాఁడు యోగ్యుఁడు భవత్కరముఁ గొనఁగ

రాజ్యలక్షణాలక్షితుల్ రాజపుత్రు
లెందఱే రూపగుణులు సమిద్ధతేజు
లనుగు దెంతురు వరణార్థు, లల్ల కోస
లాధినేత తదనుజన్ముఁ డతఁడుఁ గలఁడు. ౬౮౩

చ. మఱియును నొక్కమాట, బలుమానిసి తాత యుధాజితుండు సం
గరమున వీరసేను బలగర్వు వధించి తనంత మన్మనిన్
ధరకు నధీశుఁ జేసి తనదారిన పోక చలంబు మీఱ వెం
దఱిమె సుదర్శనుండు తల దాఁచిన యాశ్రమభూమిమేరకున్.

క. నాఁడ సుదర్శనుఁ జంపెడు
వాఁడ భరద్వాజునాన భయమున వాఁ డా
నాఁ డెట్లొట్లో విడిచి చని
నాఁ డతఁ డెట్టులును విడుచునతఁడే చలముల్? ౬౮౫

శా. ఆవాక్యంబులఁ గోడుగా జనని నేత్రాబ్జంబులం బొంగి జా
లై వాఁకంబడి కాఱునశ్రువుల సర్వాంగాభిషేకంబు గాఁ
గా వారించుచుఁ దల్లి చేల మతి నిష్కంపంబుగాఁ బల్కె ధై
ర్యావాసంబగు పల్కు పుత్రి యిటు లార్యప్రోక్తధర్మస్థితిన్. ౬౮౬

క. ఒక టేటి చెప్పెదఁ దల్లీ!
ప్రకటముగ సుదర్శనుండు వనవాసియు శ్రీ
వికలుం డగుఁగాక, యతం
డ కడు మదిష్టుఁడు వరింప నన్యు నెనననేన్. ౬౮౭

సీ. శర్యాతివాక్యకై చ్యవను వరించి శు
శ్రూష సేయదె సాధ్వి యాసుకన్య,
భర్తృశుశ్రూషయే వనితలకుఁ బరమ
భద్రంబు స్వర్గాపవర్గదంబు,
నది కైతవము లేక యాచరించెదునాతి
కేమి కొఱంత? నీ కెఱుక లేదొ,
భగవతి వాని నా వరుసఁగాఁ జూపించె,
నొరు నెట్లు వరియింతునో వచింపు,

మంబ! మచ్చిత్తభిత్తిపై నచ్చుగ్రుద్ది
నిలిపె జగదంబ యామూర్తి నిశ్చలముగ,
నిట్లు వృతుఁడా సుదర్శనుండే మదీయ
విభుఁడు, వరియింప నొరు నెట్టివిభుని గాని. ౬౮౮

తే. అట్లు విడువక ధర్మోక్తు లాడు పుత్రి
పలుకులాలించి వైదర్భి బహువిధముల

బహునిదర్శన పూర్వక వాదములను
జెప్పి, వృథగా సమస్తంబుఁ, జెప్పెఁ బతికి. ౬౮౯

ఉ. రేప న్స్వయంవరం బన భరింపక యోర్మి నరేంద్రపుత్రి సం
తాపము రేఁప సద్గుణవదాన్యుని భూసురు నొక్కనిన్ రహో
దీపితవైఖరిం బిలిచి, తేరఁగఁ బంచి యతండు రా నన
న్యోపమభక్తి మ్రొక్కి దృఢయుక్తి వచించె సుధామయోక్తులన్.

క. తండ్రీ! నీవే యీయెడఁ
దండ్రివి నా, కిపుడ కదలి దయ మీఱఁగ నా
తండ్రి యెఱుంగని భంగిం
దీండ్రపుగతి నాదువరునిఁ దేరం జనుమా! ౬౯౧

క. ఎఱుకగద భరద్వాజుని
సురుచిరపుణ్యాశ్రమంబు సూటిగఁ జని చె
చ్చెరఁ గాంచి సుదర్శను మ
ద్వరు నిటు నాపల్కుగాఁగఁ బలుకు మతనితో. ౬౯౨

తే. ఆర్య! మాతండ్రి నాకై స్వయంవరంబు
చాటఁ బంచె నాశావకాశముల నృపులు
పలువు రేతెంతు రందు, సంపన్నసైన్యు
లస్త్ర శస్త్ర ప్రశస్త చిహ్నముల రేప. ౬౯౩

శా. దేవా! నిన్ను మదీయహృత్కమలమధ్యేపీఠమం దుంచి సం
సేవింతున్ నిజనాథుఁగా మఱియు నా శ్రీదేవి స్వప్నంబులో
నావిర్భానము నొంది నాతలఁపు శ్లాఘ్యం బంచు మన్నించి సం
భావించెన్ మఱివం దదాదిగఁ బరాంబాచంచదాదేశమున్. ౬౯౪

మ. నిను ధ్యానింతు మనస్సుచే నెపుడు, వర్ణింతుం ద్వదాకారస
ద్గుణపుంజంబు వచస్సులన్ నిరతమున్, దుర్వారదోర్గర్వుఁడై
యనయంబున్ గుఱి సేయు నంగజుఁడు సర్వాంగంబు నీకై, యశో
ధన! నే నన్యు వరింపఁ దండ్రిపను పాత్మం బూన నొక్కింతయున్.

ఉ. అన్యు వరించుకంటె విష మగ్ని, గొనం జను, నీవు వచ్చినన్
ధన్యత నీకు నా కొదవుఁ, దథ్యము శ్రీజగదంబ ప్రేరణం
బన్యము కాఁ బొసంగునె? చరాచరభూతసహస్రకోటి స
మ్మాన్యము కాదె తత్పదము మానిహృదబ్జసుధాపదంబునన్. ౧౯౭

చ. పరమదయాకరా! పురుషవర్య! సుదర్శన! యెల్లకార్యపుం
భర మిడి దైవమంద, పరవాణి దృఢంబుగ నమ్మి, నాస్వయం
వరమును రమ్ము, దానివశవర్తులు శంకరుఁ డాదిగా సురే
శ్వరులె, తదిచ్ఛచే నఖిలభద్రములున్ మన కొందు టబ్బనే!

క. భూదేవా! యిటులున్ నీ
లోఁ దోఁచినభంగిఁ జెప్పి లోఁగొని వానిన్
వేదె మ్మని వాఁడు తనియఁ
గా దక్షిణ యొసఁగి పంపెఁ గానవభువికిన్. ౧౯౮

ఆ. ఆసుదర్శనుండు నాలించి ప్రీతి వి
ప్రేంద్రుఁ దెచ్చినట్టి యిష్టవార్త,
గమననిశ్చయంబు గావించె ముని భర
ద్వాజుఁ డనుమతింపఁ దద్ద మెచ్చి. ౧౯౯

ఆ. సుతుతలంపు పెటుంగి సుదతి మనోరమ
మై వడంక వెఱపుమై నెలుంగు
వడఁకఁ గనుల నశ్రువారి గూరఁగ నార్తిఁ
బలికెఁ బుత్రునిఁ దనపజ్జఁ దివిచి. ౨౦౦

తే. తండ్రి! చన నేల యొంటి, యుధాజితుండు
పొంచియుండెడి నీకుఁగాఁ, బొలిసె మున్ను
వానిచేతుల మాతండ్రి, వదలఁబోకు,
మేకపుత్ర నిరాశ్రయ నిదె కను నను. ౨౦౧

ఉ. తల్లి యధైర్య మేదఁగ సుదర్శనుఁ డీగతిఁ బల్కె, ని ట్లనం
జెల్లునె క్షత్రియాంగనకుఁ, జేయుదువే భవితవ్య మొండుగా,

నుల్లము శంకఁ దక్క మీఁక నోర్మి, స్వయంవరయాత్ర సేఁత యా
తల్లియనుజ్ఞసుమ్ము, వెఱ దాఁకదు దాఁకొను దీన భద్రముల్.

ఉత్సాహ—తల్లి నూఱడించి యిట్లు తగినమాట లాడుచున్,
బల్లవింపఁగా బ్రయాణవశకుతూహలం బెదన్,
వెళ్ళి తేరు పూంచి మఱువు వేసి పూని యంబులున్
విల్లు నెదుట నిల్చి తనకు వినయయుక్తి మ్రొక్కినన్.

తే. చైత్రయాత్రోత్సుకుం డయి చనుమరుండె
యిట్లు తనపుత్రరూపుఁడై యెదుట నిల్చె
నా యని స్వయంవరోత్సుకుఁడైన పుత్రు
నా మనోరమ దీవించె నాదరమున. ౨౦౪

సీ. అగ్రభాగంబున నంబిక రక్షించుఁ
గాతఁ, బార్వతి కాచుఁగాక వెన్ను,
వారాహి విషమాధ్వచారంబులం బ్రోచు,
దుర్గంబులం దెల్ల దుర్గ యోము,
గాలికాపరమేశి కలహంబులం బ్రోచు,
మాతంగి కాపాడు మండలముల,
సౌమ్య స్వయంవరసభఁ గాచు నిను, భవ
మోచని ప్రోచు భూభుజులనడుమ,
గిరిజ గిరిదుర్గభూముల నరయుఁగాత,
చత్వరములఁ జాముండిక సాఁకుఁగాతఁ
గాననంబులఁ గామగ కాచుఁ, బ్రోచు
వైష్ణవి సనాతనీశక్తి వాదములను. ౨౦౫

తే. చరణములఁ బ్రోచు భైరవి, సంగరముల
నన్నివేళ లెల్లెడల ని న్నాదిదేవి
సచ్చిదానందరూపిణి సర్వధాత్రి
శ్రీమహామాయ భువనేశి యోముఁగాత. ౨౦౬

తే. సిద్ధవాక్కు-ల నిట్టు లాశీర్వదించి
యోర్వఁ జాలక పుత్రవియోగ మామె
యాత్మజుఁ డనుమతింపఁ ద న్ననుగమింపఁ
దరలె ధాత్రేయితో స్వయంవరముఁ జూడ. ౨౦౭

క. కూరిన కౌతుకభరమునఁ
దే రెక్కె సుదర్శనుండు దీవించిరి శ్రీ
ప్రారంభసత్యవాక్తతి
భారద్వాజాది విప్రవర్యులు ప్రీతిన్. ౨౦౮

క. వారికి మ్రొక్కి ముదం బ
వ్వారిగ వెడలి శుభశకునవారం బెచ్చో
దారిం గంచుం జేరిరి
వారాణసి సకల దురిత పటల వినాశిన్. ౨౦౯

ఆ. తల్లియుం దదీయధాత్రేయి యోగాని
పరిజనంబు లేక యరద మెక్కి
వాఁడు రా నెఱింగి, వచ్చి సుబాహుండు
నాచరించెఁ బ్రీతి నర్హణములు. ౨౧౦

స్వాగతము—తుంగపీఠి శుభతూర్యరవంబుల్
పొంగ వాని నిడి పూనిరి చూడన్,
మంగళద్యుతి సుమంగళులౌ పు
ణ్యాంగనల్ పలికి స్వాగతగీతుల్. ౨౧౧

క. వారల కుచితాతిథి స
త్కారము గావించి సేవకవ్రజయుక్తా
గారము సుజలాహారో
దారము నివసింప నిచ్చెఁ దద్ద నృపుండున్. ౨౧౨

సీ. పలువురు వచ్చిరి వైభవంబుగ నృపుల్,
దౌహిత్రుఁ గూడి యుధాజితుండు,

కడు శూరుఁడు కరూషకాంతుండు కరులతోఁ,
సైంధవశ్రేణితో సింధువిభుఁడు,
మాహిష్మతీపతి మహితరథాళితో,
మద్రేశుఁడు పదాతిమహిమతోడఁ,
పాంచాలభూపతి బహుళసైన్యములతోఁ,
పార్వతీయుఁడు భిల్లబలముతోడఁ,
గామరూప చోళ కర్ణాట వైదర్భ
విభులు దిశలు నిండ బ్రభలఁ బ్రబలి
యిరువదియును మూఁడు నక్షౌహిణులసంఖ్య
బలము లందుఁ బోరలఁ బడియెఁ గూడి. ౨౦౩

మ. బలవంతుల్ ప్రథితప్రభావు లురుశోభాభాస్వరుల్ స్ఫూర్జదు
జ్జ్వలసౌందర్యసువిగ్రహుల్ లలితభూషావేషభాగ్యోదయుల్
కలభాషుల్ కవితావిలాస నటనా గాంధర్వ కల్యాణ లీ
లల నత్యంతవిదగ్ధు లందు జనపాల గ్రామణుల్ ధీధనుల్. ౨౦౪

ఉ. కూడినరాచవారిసుఖగోష్ఠిఁ బ్రసంగమునన్ సుదర్శనుం
డాడకు వచ్చు టొక్క పరిహాసపుమాటయి చెల్లె, నొక్కఁడే
వీఁ డుదెంచెఁ దేరిపయి వే అనుమానము దక్కి, తన్వి దా
వేఁడుక రాజు లిందఱను వీడి వరింపదె వీని నొక్కనిన్! ౨౦౫

క. ఇతఁ డడివియుంగాక మహా
యతమతి తథ్యంబు పెండ్లికై తన వెంటన్
గతనాథఁ దల్లిఁ దెచ్చెన్
బృతనాభారం బదెల్ల వృథ యను తెలివిన్. ౨౦౬

తే. అట్లు పల్కఁగ వాని యూసైన సుంత
మతి సహింపక యా యుధాజితుఁడు రాజ
లోక మెల్ల వినం బల్కె వీఁక వీని
సంహరింతుఁ గన్యార్థ మసంశయ మని. ౨౦౭

మ. ఎకసక్కెంబులు దక్కి వేడి చుఱుక్కై యిట్లాడు వాక్కుల్ సహిం
పక దాఁ గేరళనాథుఁ డిట్లు తగ సంభాషించె, నీసాహస
ప్రకటోక్తుల్ తగునయ్య! బల్మిఁ గొన శుల్కం బొడ్డెనే బుద్ధిపూ
ర్వక మా కన్య వరించు నేవిభుని, నవ్వార్యుండె తన్నాథుఁడౌ. ౨౧౮

ఉ. ఇందఱు రాజు లుండ నయ మింతయు లే కిటు లాడఁ జెల్లునే?
ముందర వేళ వాఁడు పసిపాపగ నుండ హరించి రాజ్యమున్
వెం దఱుమంగ మన్మనికి వీటికిఁ బట్టముఁ గట్టఁ జెల్లె, నిం
కం దరనే వధింపఁగ నకారణ మాతని మేము చూడఁగన్. ౨౧౯

క. కాకుత్స్థుఁ డితఁడు కోసల
భూకాంతుని జ్యేష్ఠసుతుఁడు మోహనరుచిర
మ్యాకారుం డీతని నిపు
డేకారణమున వధింప నెంచెదు చెపుమా! ౨౨౦

క. పాపం బొనరించినఁ ద
త్పాపఫలము కుడువకుండఁ దప్పదు, విడుమా
పాపపుఁజింతన్, శాసకుఁ
డై పరమేశ్వరుఁడు కలఁ డనంతజగతికిన్. ౨౨౧

తే. ధర్మమె జయించు నెపుడు, సత్యంబు గెలుచు,
ననృతమున ధర్మము జయించు టరయ మిథ్య;
యంత తొందరపా టేలనయ్య ! రాఁడె
శత్రుజిత్తు త్వదీయదౌహిత్రుఁ డిటకు ! ౨౨౨

తే. వాఁడు శ్రీమంతుఁడున్ రూపవంతుఁడుగద,
యెవఁ డెఱుఁగు వానినె వరించునేమొ కన్య !
మఱియు లే రెందఱు బలవత్తరులు రాజ
పుత్రు లీసభలో నృపపుత్రి కోర ? ౨౨౩

క. చేరిననృపపుత్రుల మదిఁ
గోరిన యొక్కరునిఁ గన్య కోరికొనంగా

వా రని యే రని మనలో
నీరీతి వివాద మేల యెఱుక గలిగినన్. ౭౨౪

క. నీతివిశారదుఁ డతఁ డీ
రీతిం బలుకంగ వాని లెక్కం గొనకే
శాస్త్రోక్తులన్ యుధాజితుఁ
డీతీరున మాఱుపల్కె నెల్లరు వినఁగా. ౭౨౫

క. మతిమంతుఁడ ఋతవాక్కును
జితేంద్రియుఁడ నేనె యంచుఁ జెప్పెద వేవో
కత, లిందఱు యోగ్యాయో
గ్యత లెన్నక పొందఁ దగునొ కన్య నెవండేన్. ౭౨౬

క. ఏమీ, సింహాముభాగము
గోమాయువు ముట్టనగునె, కోరిననేఁ గ
న్యామణిఁ గృపణు సుదర్శను
నీమేటులు చూచుచున్ సహించెదువారే! ౭౨౭

చ. వినవొ, బలంబు విప్రులకు వేదము, భూభుజజాతికిన్ ధను
ర్ధనమె బలంబు, తద్ధనమె రాజులపెండ్లికి శుల్కయోగ్యమౌఁ,
బణ మిడుఁగాక యియ్యెడ సుబాహుఁడు కన్యక నిందులో భుజా
ఘనుఁడ లభించుఁగా, కటులఁ గానియెడం గలహంబు నిక్కమౌ.

క. కలహించుచుండ నృపు లిటు
పిలిపించి సుబాహు సభకు వేడిరి వానిం
దెలుపుము సుత నెవ్వారి కీఁ
దలఁచితొ యిపు డేమి చేయఁ దలఁచెదొ యంచున్. ౭౨౯

ఉ. వారికిఁ జెప్ప జంకుచు సుబాహుఁడు మత్సుత లో సుదర్శనుం
గోరిన, దెంత వల్దనినఁ గోరిక మానద, యేమి సేయఁగాఁ
నేరన నే, సుదర్శనుఁడు నిర్భయుఁడై యిట నొంటిఁ గూడఁగాఁ
జేరెను, మీరలే తెలియఁ జెప్పుఁడు, నే నిపు డేమి సేయ నో?

క. అంత దయాపరు లగు భూ
కాంతులు కొందఱు దలంచి కర్తవ్యం బే
కాంతమున సుదర్శనుతో
మంతన మొనరించి రిట్లు మహిమోన్నతులై. ౨౩౧

ఉ. బాలక! నిన్నిటం బిలువఁ బంపిన దెవ్వ, ర దేల నొంటి నీ
లీలల వచ్చినాఁడవు, కడిందిసమాజముఁ జొచ్చి కూడుటల్
పోలునె నీకు, లేర తలపోయ బలంబు ధనంబు బందుగుల్,
బేలవు కాదులే పలుకు వే భవదీయమనోగతేచ్ఛలన్. ౨౩౨

ఉ. చూడవొ యల్లదే కడిఁదిశూరులు రాజులు యుద్ధకాంక్షులై
కూడిరి కన్యకై, మిగులఁ గ్రూరులు, శత్రుజితుండు వచ్చియు
న్నాఁ డదె చండసేనలు సహాయముగా నినుఁ జంపుకోర్కె తో
ల్కాడ, యుధాజితుం డతనియుండగ నిల్చె మహాబలంబుతోన్.

క. ఉన్నది యున్నట్టుల మే
మన్నారము మేలు గోరి యర్భకుఁడవు నీ
వన్నా! చింతింపుము నీ
వున్నను మరలినను మాకు నొక్కటె సుమ్మా! ౨౩౪

తే. రాచపెద్దలు మిగుల గారాబు మీఱ
నాప్తవచనంబు లిటు లాడ నాలకించి
బలికెను వినీత గంభీర భావభంగి
ధైర్యనిశ్చలవాణి సుదర్శనుండు. ౨౩౫

చ. స్తుతమతులార! మీ రనినచొప్పున నిక్కము నాకుఁ దోడుగా
వితతబలంబు లే, దఱువు విత్తము లేదు, సహాయసంపదు
న్నతియును లేదు, దుర్గకలనం బది లేదు, సురక్షసేయు భూ
పతియును లేఁడు తోడు, విని వచ్చితిఁ జూడ స్వయంవరం బనన్.

ఉ. ఆపరమేశి స్వప్నగతయై మఱియు న్నిట నన్నుఁ బోవఁ బ్రే
రేపఁగ వచ్చినాఁడ, నెదురే, జగదీశ్వరియాజ్ఞ మీఱఁగా

నోపుదునే, సమస్తముఁ దదుక్తికి నర్పణ చేసి వచ్చినా,
నాపయి నేమి యైన నది యంతయు నాపని గాదు నమ్ముఁడీ

శా. నాకుం జూడఁగ విశ్వ మెల్లెడ జగన్మాతృస్వరూపంబె నా
నాకారంబుల దివ్యదీధితుల ధ్యేయంబై పొడంగట్టు, మి
మ్మాకాంక్షించెద శత్రు వెవ్వరని యిం దాత్మన్ విచారింతు, ము
ల్లోకంబుల్ సరిదిద్దునీశ్వరియె శత్రుప్రోద్ధతుల్ మాన్పదే? ౨౩౮

ఉ. దేవతలన్ మనుష్యుల నధిష్ఠితయై వెలుఁగొంది సర్వదా
పావని యా భవాని చిఱుపల్కున నొక్కని భూపతామహా
త్త్వవహుఁ జేసి వేఱొకని నంత దరిద్రునిఁ జేయు, నాసమ
స్తావనశక్తి కేను శరణాగతుఁడం దదధీనుఁడన్ సదా. ౨౩౯

శా. దేవారాధ్యులు భక్తపావనులు శ్రీధీహ్రీంపతుల్ తన్మహా
దేవీశక్తి నొకింత చాటయిన స్పందింపంగనే నేర రా
శ్రీవిద్యాపదకింకరుండ నయి తత్ప్రీత్యర్థినై వచ్చినా
నీ వైవాహికకృత్స్వయంవరము నే నెంతున్ సమీక్షింపఁగన్.

క. జయ మైన నాకు నిందప
జయ మైనను లజ్జ నొంద, సర్వాత్మత నే
నియతంబుగఁ దదధీనుఁడ
నయి యుండెద, లజ్జ దాని కగు బుధులారా! ౨౪౧

తే. వానివచనంబు లాలించి పార్థివేంద్రు
లాకరిమొగ మొక్క రటు చూచి యొక్కతడవు
కూడ నాడి సుదర్శనుతోడ ననిరి
‘సత్యమె వచించితివి నీవు సాధుబుద్ధి! ౨౪౨

తే. ‘కల్ల యొక్కింత లే దందుఁ గాని నిన్నుఁ
జంపఁ జూచుటయు నిజ ముజ్జయినివిభుఁడు,
దూర మెంచి చేయుము నీకుఁ దోఁచినట్లు,
చెప్పితిమి నీపయిన్ దయఁ జేసి హితము.’ ౨౪౩

వ. అన విని సుదర్శనుం డిట్లు పల్కె. ౨౪౪

క. పరమాప్తులార! కరుణా
పరులై మీ రన్న దెల్ల భావ్యము సత్యం
బొరుమాట లాడ నోడుదుఁ
బరికింపుఁడు చావు నరులవశమై యున్నే ! ౨౪౫

ఉ. స్థావరజంగమం బయిన సర్వజగంబును నస్వతంత్రమై
దైవముఁ ద్రిప్పు లొందుఁ, ద్రివిధంబగు కర్మముఁ గాల నైజముల్
జీవులఁ జంపుచుండు, నవి చేరని చోట మనుష్యమాత్రులన్
దేవుఁడుఁ జంప నేరఁడు, వధించెడువాఁడు నిమిత్తమాత్రుఁడే ! ౨౪౬

క. కాలుఁడె కూడుచు హరియయి
కూలిచె మాతండ్రి, నట్ల కూల్చె యుధాజి
ల్లీలన్ మాతామహు నని,
గాలము గా కదియు నతఁడుఁ గలరే చంపన్? ౨౪౭

క. రక్షలు వేయు నొనర్చిన
భక్షింపక కాలుఁ డెప్పుడు వదలఁడు, వాఁ డ
ట్లీక్షింపకున్న జీవుఁ డ
రక్షితుఁడే వేయునేండ్లు బ్రదుకు నచలుఁడై. ౨౪౮

క. పూర్వార్జితనిజకర్మలె
సర్వశుభాశుభము లగును, జనుఁడు కలంగున్
దుర్వైర మూని యూప
న్నిర్వాహనిమిత్తమాత్రు నిజరిపుఁ డంచున్. ౨౪౯

క. దైవమె పర మను నిశ్చిత
ధీ వచ్చితి నిటకు, నాదిదేవికృపన్ నా
లో వైరము భయశంకలు
లేవు, యుధాజితుని కేల లేనిభయంబుల్? ౨౫౦

క. స్మరియింతు నిరత మంబా
చరణం, బా విశ్వజనని సర్వశుభంబుల్
పరికల్పింపదె, నే నిం
దరుదెంచుట యెల్ల జండికాజ్ఞనె వినుఁడా! ౭౫౧

ఆ. వానిమాటలు విని బహువిధంబుల వారు
భళి యటంచుఁ బాప, పాప మంచు,
శాస్తి యగు నటంచుఁ, జనిరి యథేచ్ఛమై
విడుదులకు, నతండు విడిదిఁ జేరె. ౭౫౨

వ. మఱునాఁడు దైవజ్ఞనిర్ణీతం బగు శుభముహూర్తంబున స్వలంకృతం బగు స్వయంవరమండపంబున సుబాహుండు మహేంద్రవైభవంబున భద్రాసనాసీనుండై నానాదేశాగతపృథివీశుల కెల్ల వేర్వేఱ దివ్యాస్తరణసంచితంబు లగు సద్భృతమంచంబులు రచింపం బంచి రాజుల నెల్ల యథార్హగౌరవవిధానంబున నిమంత్రణంబు సేసిన, వారును—

చ. అమరులు డిగ్గి వచ్చిరి స్వయంవరణార్థ మనంగ దివ్యవే
షము లలరార భూషణవిసారిమనోహరకాంతులై గభీ
రముగ వికస్వరాస్యముల రాజిలి వైభవ ముల్లసిల్ల మం
చముల నలంకరించిరి విమానములన్ సురలట్లు పొల్చుచున్.

చ. ఎపుడు కురంగశాబచకితేక్షణ మత్తగజేంద్రయానయై
విపులసభాంతరానఁ గనిపించును గన్నులవిందు గాఁగ, నే
నృపసుతు నాత్మనాథుఁగ వరించి గళంబు నలంకరించుఁ బు
ష్పపుశుభమాలచే, ననుచు వారు కుతూహలపూర్ణులై మఱిన్.

క. ఇం దున్న రాజలోకము
నం దెవ్వఁడు భాగ్యశాలి యగు, నటు గాకే
సందియ ముడిగి వరించునొ
దందన నేకాకి నా సుదర్శనుఁ బతిగా? ౭౫౬

తే. అది నిజంబుగ నట్లు మహార్హమూల
ఘనుల నిందఱ వదలి తత్కంఠసీమ
నే యలంకరించిన నీ క్షితీశులందుఁ
గ్రందుకయ్యంబు వెంటనే కలుగు ధ్రువము. ౭౫౭

క. తమతమ మంచంబుల నిటు
తమకంబున రాజసుతులు తలపోయంగాఁ
గమనీయతూర్యనాదము
సముదిత మయ్యెన్ సుబాహుచక్రటి నరుదై. ౭౫౮

శా. పన్నీటన్ జలకంబు లార్చి శుభధూపం బిచ్చి చీనాంశుకా
చ్ఛన్నం జేసి యలంకరించి మణిభూషావాళిఁ గల్యాణపుం
జిన్నెల్ మోమున దిద్ది తండ్రియెదుటం జేరం జెలుల్ నిల్పి రా
కన్నెన్, జేత మధూకమాలఁ గొని సాక్షాల్లక్ష్మి నా వెల్గఁగన్.

క. సంకోషవేళ శశికల
చింతాపర యగుట లోనఁ జింతింపక వాఁ
డెంతయుఁ బొంగుచు నీగతి
వింతనగపు మొగమునందు వెలయం బలికెన్. ౭౬౦

ఉ. లెమ్ము మధూకమాలిక ధరించి కరమ్ములఁ జూడు రాజలో
క మ్మదిగో కుమారి! నవకమ్మగు చూడ్కి నిగుడ్చుచుం ద్వదా
త్త మ్మగు చింతఁ జూచెద రుదాత్తు లుదారులు శత్రుభీకరుల్
సు మ్మిట నున్న యందఱును సుందరు లుజ్జ్వలభావనాంచితుల్.

క. ఈ మండపంబునం గల
యా మంచావళులమధ్య కరిగి యరయు మా
నీమన సెక్కె నెవం డా
భూమీపాలుని వరింపు పుత్రీ! ప్రీతిన్. ౭౬౨

వ. అట్లు తన్ను స్వయంవరకరణంబున కుద్యోగింప నుద్బోధించు పితృ
వాక్యంబు లాలించి, జనకుపనుపు ధర్మేతరం బని ధృతమతి యై సేయ
నొల్లక, శుభవచనంబుల లలితంబుగా శశికల యిట్లనియె. ౭౬౩

క. కాముకులై కాంచెడి యీ
భూమీశులమధ్య నెట్లు పొమ్మందువు న
న్నో మాన్యచరిత! తలఁచెదె
సామాన్యఁగఁ బూన నీ యసహ్యపుఁబనికిన్. ౨౬౪

ఉ. నారికి నాథుఁ డొక్కఁడ యనన్ విని యుందును బెద్దలొద్ద, నీ
తీరిన రాజలోకమున దృష్టి నిగుడ్చి గుణాగుణాదిని
ర్ధారణ పూని యిం పయిన రాజకుమారు వరింపు మందువా,
వారవధూజనుల్ విపణివాటి విటగ్రహణంబుతీరునై! ౨౬౫

క. నేను సుదర్శనుఁ బతిగాఁ
బూనితిఁ బత్నీవ్రతంబు బొం కొనరింపన్,
వానికి నను విధిఁ గన్యా
దానం బొనరింపు శుభము తలఁచెద వేనిన్. ౨౬౬

తే. పుత్రియుక్తోక్తు లాలించి భూవిభుండు
తలఁచె, లెస్స వచించె నా తనయ, యైన
బలపరిగ్రహులై యిందు బలసి యున్న
దుర్మదనృపాళి శాంతించు త్రోవ యెద్ది! ౨౬౭

ఉ. కయ్యము గల్గు నెప్పు డని కాళులు గ్రువ్వెడు వీరితోడ నే
నియ్యెడఁ బుత్రి యొల్ల దన, నిప్పుడ కూల్తురు నన్ను, నిందఱన్
నెయ్యిఁ డొకండు లేఁ డెదురు నిల్వఁగ, దుర్గబలంబు లేని లే
వయ్యె, సుదర్శనుం డొకఁడు, నర్భకుఁ, డీ యెడ నెట్లు వీఁగుటో!

మ. అని చింతించి సుబాహుఁ డాసభకు నెయ్యం బారఁ గేల్మోడ్చి యి
ట్లను, నాపుత్రిక, యేమి సేయుదును, సిగ్గాఁ జెప్పితో, రాను రా
నని మారా మొనరించుచున్న, దకటా! యాలింపదే యెంత చె
ప్పినఁ దన్మాతయు నేనుఁ, బుత్రి యని భావింపం దగున్ మీరలున్.

ఉ. మ్రొక్కెద మీపదంబులకు, మోడ్చెదఁ గేలిదె, పూజ లింత కే
నెక్కువ సేతు, కింక విడుఁడీ, దయసేయుఁడు వీటిపట్లకున్,

మిక్కిలి పుణ్యశీలురు నమేయకృపామతు లీర లెల్ల, రి
ట్లక్కట ! యెందుఁ దండ్రి కెదురాడెడి మూర్ఖకుమారిఁ గంటిరే !

తే. ఆ సుబాహువినీతవాక్యములు వించు
నివ్వెఱఁగు చెంది కొందఱు నృపులు పల్కి
రైరి, కొందఱు వగఁ బాప మనిరి, కాని
యల యుధాజిత్తు పల్కె రూక్షాక్షర మిటు. ౭౭౧

చ. ఎఱుఁగనె నీకుతంత్రములు నింగితముల్, మము శాంతిమై నొడం
బఱచి సుదర్శనాధమున కాత్మజ నీయఁ దలంతు, వీ స్వయం
వరము రచించు టేల యిటు వచ్చిన మమ్మపమానవాక్కులన్
దరలుఁ డటంచుఁ జెప్పు టది ధర్మమె, ప్రాజ్ఞులు మెచ్చుమాటలే !

చ. ఇదె నిను నాఖరాసి కెఱ యిచ్చెద, మున్ను మునీంద్రునానతిన్
వదలిన యీ సుదర్శను నవారణ నంత వధింతుఁ, జిక్కె నా
కదను, త్వదీయపుత్రిక కరాబ్జముఁ బూన్చెద శత్రుజిత్తుచే,
మదిఁ దలపోసి నాయనుఁగుమన్మని కిమ్ము సుతన్ స్వయమ్ముగా.

క. నే లిచ్చగించునటునకుఁ
బోలు సముచ్చాశ్రయంబు భూనాథ! సుహృ
ల్లీలన్ నే నాడెడిపలు
కాలింపుము, ధర్మనీతు లమరెడు దానన్. ౭౭౨

క. కాక, సుతం బ్రాణాధిక
నేకాకి సుదర్శనునక యిచ్చెదవే, నిం
దీ కూడిన యుత్తమ నృప
లోకం బోర్చునె వృథా విరోధము తగునే! ౭౭౩

చ. అది విని యా సుబాహుఁడు హృదంతరదంతురితార్తికీలలం
బదిలము సేయుచున్ నెగయుశ్వాస, నిజాంగనఁ జేరి పల్కె, నా
మది వికలత్వ మందెడిఁ, గుమారిక మోహము చిత్తవృత్తిపై
బ్రబదు కిపు డున్న, దె ట్లయినఁ బల్కి సమస్తము చక్కఁ బెట్టవే !

చ. తడఁబడుచుం దనూజఁ గని తల్లి నయోక్తులఁ బల్కెఁ జూడుమా
కడిఁదివిచార మూని కలఁకం బడుఁ దండ్రి, దురాత్ములై నృపుల్
కడఁగెద రల్లదే, విడువు కాసియభీష్టము, బాల్యచాపలం
బుడుగు, సుదర్శనాన్యతము నొక్కనిఁ గోరు స్వయంవరంబునన్.

మ. అటుగా కాతనినే వరించు నెడఁ దథ్యం బీనృపుల్ కూడి రయో
త్కట మీతండ్రి సుదర్శనున్ నిహతులం గావింతు, రంచుండ, న
చ్చటి కాత్రమ్ముమెయిన్ సుబాహుఁడును బజ్జం జేరి ప్రీతిన్ భయో
త్కటమార్గంబునఁ జెప్పి చూచె సుతయంతర్బుద్ధి మాన్పింపఁగన్.

చ. గురు లటు వేడఁ, గన్నుఁగవఁ గూరెడి బాష్పజలంబు నాఁగుచున్
స్థిరమతియై వచించె నది చెప్పితి నావ్రత, మేను వానిఁ ద
క్కొరు వరియింప, మీపలుకు లూఁకొనకుంట మఱొండు గాదు, కా
తర మది యేల? యీయెడను తప్పనుపాయము నాలకింపుఁడీ!

క. నన్నిచ్చి సుదర్శనునకు
నన్నా! పురి వెడల నడపుఁ డాత్మేశ్వరుఁడో,
నన్నాతఁడు రథమునఁ గొని
చన్నం, గాఁగలది యగు, విచారం బేలా? ౭౮౦

ఉ. నా విని కాశిరాజు కరుణంబుగ నిట్లనుఁ, దల్లి! యెట్లు ని
న్నే విడువంగ నేర్తు, నిటు లేటికి సాహసవృత్తి, వీడు, కా
దే నెరవౌం డౌనన్ను, మిథిలేశ్వరుఁ డట్లొనరించె సీత, కే
నావిధి నీ కొనర్తుఁ బణ, మంతట సర్వము భద్రమౌఁ జుమీ!

క. కూడిన యీనృపు లపు డెదు
రాడఁగ నోడుదురు, పణ మనాయాసమునన్
జూడఁగ నందఱ గెలుచుచుఁ
గ్రీడ సుదర్శనుఁడు నీదు కేలు గ్రహించున్. ౭౮౧

తే. కాని తండ్రియుపాయంబు కాదటంచు
మెచ్చక వచించె శశికళ మిగుల నిట్లు,

లేల యీ వెడపల్కు, తండ్రీ! ధరిత్రి
సంశయాస్పదకృతి మూర్ఖజతనముకద! ౭౮౩

తే. చిత్త మెప్పుడో సుదర్శనాయత్త మయ్యెఁ,
బుణ్యపాపంబులనిదానభూమి తలఁప
మనసు, కావున నతని నా మది వరించి,
వదలి, యిఁక నిప్డు మఱి యొరు వలచు టెట్లు? ౭౮౪

ఉ. నాకు మనోధినాథువరణం బొనరింపఁ బణంబు వెట్టుచో
నీ కల పార్థివేశ్వరుల కెల్లర కే వశ నౌదుఁ గాదొకో,
కా కొకఁడే జయించు ననఁగా నెటు, లిద్దరుఁ బల్వురైన నె
ట్లోకద, సంశయాస్పదదుహూహాల కొప్పను దండ్రి! చూడుమా!

ఉ. చింతిలకయ్య! నిల్కడ భజింపని చిత్తముఁ జిక్కఁబట్టు, వి
శ్రాంతుఁడవై పరాంబకుఁ బరం బగు వృత్తి యథోక్తరీతి ని
శ్చింత వివాహమంగళముఁ జేయుము నాకు, శుభంబు నీ కగుఁ,
వంతలు చండికాస్మరణ నామసుకీర్తనఁ బాయుటబ్రమే! ౭౮౬

ఉ. వైళమ పొమ్ము భూపులసభం దిలకించి వినీతవైఖరిఁ
హాళిగ నెల్లి చెల్లెడి స్వయంవర మంచు వచించి పట్లకుం
ద్రోలుము వారి, రాత్రి విధిపూర్వహణంబున మద్వివాహము
శ్రీ లొనరింపు, మల్లునికిఁ జేయుము తోఁచిన పారిబర్హముఁ.

క. వదలుము మ మ్మెటు, నా కేల్
గదియించి సుదర్శనుండు కదలి చనంగా
నెదిరిన నృపసంఘముతో,
గదనం బగు మమ్ము దేవి కాపాడు దయఁ. ౭౮౮

క. దైవం బనుకూలింపని
చో, వానినె యనుగమింతు శూరపదవికిఁ,
నీ వుండుము సుఖవై సై
న్యావళితో నింట, నొంటి నరిగెదఁ బతితో. ౭౮౯

తే. స్వస్తి కావుత నీ కని సాహసమునఁ
బల్కు పుత్రిక ధర్మనిర్ణయ శుభోక్తు
లాలకించి సుబాహుండు నట్లు చేయ
సమ్మతిం బూనె విశ్వాసనహితుఁ డగుచు. ౭౯౦

### సుదర్శనుఁడు శశికలను బెండ్లియగుట

సీ. కాశీవిభుం డంతఁ గల రాజకముఁ జేరి
విన నెల్లరి ట్లని వేఁడుకొనియె,
శిబిరంబులకుఁ బ్రీతిఁ జేరుఁడు నేఁటికి,
రేపు మీకోర్కెఁ జెల్లింతు నిజము,
నంపితిఁ జేయముల్ భక్ష్యంబు లవి సుప్ర
సన్నులై గ్రహియింపుఁ డన్నలార!
రాను రా నను నేఁడు రాపట్టె, తెల్లవా
ఱఁగ బుజ్జగించిన రాకపోవ,
దిచ్ఛయో పణంబో నిశ్చయింతు నెల్లి,
యందఱకు మీకు సమ్మతం బది యొనర్తు,
నల్గకుం, డాశ్రితుఁడ మదీయాత్మజాత
మీకుమారిక, రేపట మీరు రండు! ౭౯౧

క. అది విని భూభుజు లప్పటి
కెదు రాడక నిలయములకు నేగిరి, కానీ
పొదివి పురిం దమసేనల
ముదమునఁ జేయంగఁ జనిరి మాధ్యాహ్నికముల్. ౭౯౨

ఉ. అంతిపురంబులో నిట రహస్యముగా సుతపెండ్లి సేయఁగా
నంత సుబాహుఁడుం బిలువ నంపెఁ బురోహితులన్ వదాన్యులన్
సంతతవేదవాదులను స్మార్తవిధానవధానదక్షులన్,
బంతుగ వారు దానికి నుపక్రమణం బొనరించి రయ్యెడన్. ౭౯౩

సీ. శ్రీలతాగురుగంధితైల మంట నొకర్తు,
పన్నీట జలక మేర్పరచె నొకతె;
పాదాలఁ బారాణి పసుపు పూయ నొకర్తు,
కజ్జలం బద్దె బుగ్గకు నొకర్తె;
కమ్మకస్తురిబొట్టు కొమ్మ యొక్కతె దిద్దఁ,
గాటుక దీరిచెఁ గనుల నొకతె;
సరి లేని ముత్యాల సరులు కూర్ప నొకర్తు,
చీనాంశుకములఁ గైసేసె నొకతె;
శశికలా సుదర్శనుల సంసారమందు
నిల్లిసఁగు నానుకూల్య మం చిరువురకును
సమముగ వివాహ విమల వేషములు దీర్చి
రంగనలు కంకణోంకృతు లాననంగ. ౭౯-౪

ఉ. వేదిపయిన్ సుదర్శనునిఁ బిల్చి సుబాహుఁడు ప్రీతి, వాని కం
దాది సువిష్టరోపరి సుఖాసన మాచమనంబు నర్ఘ్య పా
ద్యాదిక సద్విధుల్ సలిపి, యంబరయుగ్మము నావు నిచ్చి, స
మ్మోద మెలర్పఁ గుండలవిభూషలఁ బూజ లొనర్చె వేడ్కమై.

క. ఆశాంతంబుల వేదవి
దాశీర్వాదంబు నిండ, నపుడు శశికలన్
గాశీరాజు సుదర్శను
పేశలకరయుగళి ధార వేయుచు వదలెన్. ౭౯-౫

క. ధ్రువసంధికొడుకు శశికల
నవకపుఁ గే ల్గొనఁగఁ జూచి, నాటిన చింతా
ధ్రువశల్యంబు మనోరమ
యవఘాతముఁ జేసి ధన్య నైతి ననుకొనెన్. ౭౯-౬

క. వారాణసివిభుఁ డిచ్చిన
శ్రీరమ్య విభూషణేడ్య చీరోజ్జ్వలుఁడై

పేరిచె సుదర్శనుఁడు కొం
బేరికన్యావరుండు వీఁడన నీడై. ౪౯౮

తే. సచివు లంతట గతభయసంభ్రమము లయి,
మండపంబుఁ జతుర్వేదమండితంబుఁ
దీర్చ, వధువును గైసేసి తీర్చి సతులు,
శిబికపైఁ దెచ్చి వరుపజ్జఁ జేర్చి రందు. ౪౯౯

ఉ. అందుఁ బురోహితప్రవరుఁ డగ్నిఁ బ్రతిష్ఠ యొనర్చి వేల్చి, ప్రే
మం దయివారు కౌతుకసుమంగళదృష్టుల నావధూవరుల్
ముందర నొండొరుల్ వెలుఁగు పూతహుతాశనమూర్తిఁ జూడ, ము
న్నుండుగ వారలన్ సలుపఁ బూన్చెను లాజలతోడ హోమమున్.

లే. వార లంతట నత్యంత భక్తి జాత
వేదుసునకుఁ బ్రదక్షిణ మాది సకల
విధులఁ దీర్చిరి కులగోత్ర విహితరీతి
శ్రుతిఁ బఠింప విప్రులును బురోహితుఁడును. ౫౦౧

క. ఉత్తమహయములఁ బూన్చి య
నుత్తమ శరమండితంబు లూర్జస్వలభూ
షోత్తాలధ్వజపర్వము
లుత్తుంగ శతాంగశతము లొక రెండు మఱిన్. ౫౦౨

క. గిరిశృంగతుల్య వపువులఁ
బరివిగళన్మదపరీతపార్శ్వస్థలులన్
వర రత్న హేమ భూషిత
కరుల సపాదశతకంబుఁ గర మనురక్తిన్. ౫౦౩

తే. పారిబర్హంబుగా నిచ్చెఁ బార్థివుండు,
చెలఁగి యల్లున కపుడు, దాసీశతంబు,
కనక సుపరిష్కృత కరేణుకాశతంబు,
రత్నభూషాళి, వాహనరాజములను. ౫౦౪

వ. మఱియుం గాశిరాజు, సర్వాయుధ సంభృతం బగు దాససహస్రం
బును, బహురత్న సంచయంబును, జిత్రచిత్రితావికాది దివ్యవాసస్సం
తతియు, రమ్యదీర్ఘికా విరాజితంబు లగు వాసకేళీగృహంబులును,
రమ్యాజానేయసైంధవ సహస్ర ద్వితయంబును, బహుదివ్య సంభార
భారంబు లగు మూఁడు నూఱుల యుష్ట్రంబులును, సంభృతానేక
ధాన్యరసంబు లగు నుత్తమశకట శతద్వితయంబును, ననంతంబు లగు
భూషణాంబరాదులును, నాదరంబున నొసంగి, యల్లునిఁ బూజించి,
మనోరమకుం బ్రణమిల్లి, కృతాంజలియై యి ట్లనియె. ౨౦౫

క. దాసుఁడఁ దల్లీ! యిం దేఁ
జేసిన లోపం బెదేనిఁ జెప్పుము, శీఘ్రం
బే సరి సేయుదు, నీమది
నేసందేహంబు లేక యెఱుఁగఁ బలుకవే! ౨౦౬

చ. అనవుడుఁ బల్కె నామె యిటు: స్వస్తి, భవత్కులవృద్ధి కావుతన్,
దనయునకున్ భవత్తనయ దాన మొనర్చితి, వద్ది నాకుఁ జా
లును, బది వేలు నీ స్వజనరూపను, నే, నెటు వందిమాగధుల్
ప్రణుతి యొనర్చినట్లు నిను వర్ణన సేయుదుఁ బోల్చి చెప్పుమా!

ఉ. చిత్ర మహో! పవిత్రము ప్రసిద్ధచరిత్రము నీది, యీలతా
గాత్రి సుపుత్రి, నిందఱును క్షత్రియు లుండఁగ, వారి వీడి, నా
పుత్రున కర్థహీనునకు మూలఫలాశికి భ్రష్టరాజ్యస
న్మిత్రున కొంటి కిచ్చితి, వమేయము నీ గుణరాశి ధైర్యమున్.

ఆ. ఆ మనోరమోక్తు లాలంచి ప్రీతుఁడై
కాశిరాజు పలికె దోసి లొగ్గి:
స్వీకరింతు నేను సేనాపతిత్వమ్ము
కొనుము రాజ్య, మేలుకొనుము దీని. ౨౦౭

క. కాకున్న సగము రాజ్యము
చేకొని, భుజియింపు రాచసిరి పుత్రునితో,

నీ కాశీపురవిరహము
నాకు భరింపంగ రాదు న్యాయము వినుమా! ౮౧౦

ఉ. అల్లదె రాజు లెల్లరు మహాగ్రహవృత్తి భజించి యుండు, రే
నల్లన వారిఁ జేరి వినయంబున సాంత్వవచస్సు లాడి, వా
రొల్లనిచోఁ, బరంబులు ప్రయోగ మొనర్తు నుపాయముల్, పయిం
జెల్లు రణంబు ధర్మగతిఁ, జేకురదో జయ మాత్మపక్షమై! ౮౧౧

వ. అట్లు నీతిధర్మధీరంబు లగు సుబాహు గంభీరభాషణంబు లాలించి
ప్రమోదమేదురంబుగా మనోరమ యీరీతి మాఱు పలికె. ౮౧౨

క. శివ మగుఁ గావుత నృవరా!
భవాసదయ రాజ్య మేలు భయహీనుఁడవై,
భవదీయ కుమారులకో,
శివ నమ్మినవారిశ్రీలు చెడవు ధరిత్రిన్. ౮౧౩

క. పరమాంబావరివస్యా
పరుఁ డితఁడు సుదర్శనుం, డవశ్య మయోధ్యా
పురముం బ్రాపించుట య
చ్చెరువే! శీఘ్రంబ పంపు సెల విచ్చి మమున్. ౮౧౪

ఆ. అమృతతుల్యమైన యన్యోన్యభాషల
క్షణమువోలె రాత్రి గడచె వారి
కచట; వేగ రాజు లది యెల్ల నెఱిఁగి యి
ట్లాడుకొనిరి నగరియవల నలుక. ౮౧౫

చ. ఇపు డిదె యెత్తివోయి వధియింతము భూపకళంకభూతుఁ గా
శిపతి, సుదర్శనుండు కడుఁ జిన్న యయోగ్యుఁడు పెండ్లి, కాతనిన్
నిపుణతమై వధింత, మవనీపతిలక్ష్మిఁ దదీయపుత్రితో
నపహరణం బొనర్త, మటు లాఱడి వెట్టమి సిగ్గు గాదుకో! ౮౧౬

చ. వినుఁ డదె తూర్యనిస్వనము, విం డదె మ్రోసెడి శంఖనాదముల్,
వినుఁడు మృదంగశబ్ద మదె, విం డదె కౌతుకమంగళధ్వనుల్,

వినుఁడు మహీసురోచ్చరితవేదనినాదము మిన్ను ముట్టు, నిం
కను ననుమాన మేల? కను గప్పి వివాహము దీర్చి పుచ్చెడిన్.

తే. ఇపుడు మన కెల్ల కర్తవ్య మేమి? యనుచు,
రాజు లట మంతనములు పరస్పరంబు
సలుపుచుండ, సుబాహుండు సచివవరులఁ
గలిసి వారల విందుకుఁ బిలువ వచ్చె. ౮౧౮

క. వచ్చెడు కాశీపతిఁ గని
హెచ్చినకోపమున నృపతు లేమి పలుకకే,
యెచ్చటివా రచ్చట నై
రిచ్చవడినయట్టు లుండ రేఁడు వినతుఁడై. ౮౧౯

క. ప్రణతుండుఁ గృతాంజలియై
యను, నో రాజేంద్రులార! యందఱు మీరల్
చనుదెండు, మాగృహము పా
వన మొనరింపుండు, కుడువవలె మావిందుల్. ౮౨౦

క. అది పిల్ల, యశుభము శుభ మే
యది యెఱుఁగదు, హానిఁ గోరె నాత్మ, నెది సే
యుదు! మీరు మహామతులున్
సదయులు, మది నుంచుకొనక శాంతింపవలెన్. ౮౨౧

ఆ. ఆ ప్రగల్భ వినయ హార్ద సల్లాపముల్
విని, యడంచి పొంగుఁగినుక, ననిరి:
పుణ్యు మాయెఁ, దృప్తి భుజియించినారము,
పొమ్ము తక్కుపనులు పూర్తి చేయ. ౮౨౨

క. ఇచ్చటఁ గూడిన నరపతు
లిచ్చల మోదములు పొదల నీసేనలతో
వచ్చినదారిం బోయెద
రచ్చుపడఁగ నిండ్లఁ జేరి హాయిగ నుండన్. ౮౨౩

ద్రుతవిలంబితము—పతులభాష సుబాహుఁడు వించు శం
కితమతిం జనెఁ గిన్క చెలంగ నీ
క్షితిపు లేగతిఁ గీడొనరింపఁగా
మతుల నెంతురొ మా కని యింటికిన్. ౮–౨౪

క. కనుచాళ్లె యతఁ డరిగిన
క్షణము నృపుల్ చేసికొనిరి సమయం బిట్టుల్,
మనము పొదివి యీ పురి బ
ల్మినిఁ గొందము కన్యఁ, జంపి ప్రేల్మిడి వరునిన్. ౮–౨౫

క. మన కేల కినుక, యతఁ డే
మొనరించిన నతనిక యది యుండునా గా, కిం
కను గౌతుకముం గని వడిఁ
జనెద మనిరి కొంతమంది సరసు లగు నృపుల్. ౮–౨౬

క. పురమార్గంబులు రాజులు
పరిరోధ మొనర్చి మొనల బారులు గొనఁగా,
నరిగి సుబాహుఁడు తదనం
తరవిధు లన్నియును దీర్చె ధైర్యాచలుఁడై. ౮–౨౭

క. గౌరవసౌహార్దంబుల
నాఱు దినము లిష్టభోజనాదుల నల్లున్
శ్రీరమ్యార్చల నలరిచి
పూరించె వివాహవిధులు బుధమోదముగాన్. ౮–౨౮

మ. పురమార్గంబులు సర్వముం గలయ భూపుల్ స్వీయసైన్యంబులం
బరరోధించు టెఱింగి వార్తికులు చెప్పంగా సుబాహుండు దు
ర్భరచింతావికలాత్ముఁడై, సచివులన్ రావించి మంత్రింప, నా
దర మొప్పార సుదర్శనుండు శ్వశురుం దర్శించి తా నిట్లనున్.

క. ఇంక సెల విమ్ము మా కే
జంకున్ మదిఁ బెట్టుకొనక సత్వర, మే నే

శంకయు లేకయు మునిపద
పంకజముల కెఱఁగి నిజనివాసముఁ గొందున్. ౨౩౦

ఉ. మూఁగిన యీ మహీపతులమూఁకలఁ గాంచి త్వదంతరంగమం
దేగతి భీతి నొందకు, మహేశ్వరి భద్ర భవాని సర్వది
గ్భాగములన్ సమీపవశవర్తినియై యెపుడుం జరించు, నే
నేగతి నేగితేని ఘటియింపదె రక్ష, ప్రసన్నమూర్తియై! ౨౩౧

క. జామాతృమత మెఱిఁగి, కా
శీమహినాథుండు నిచ్చెఁ జెచ్చెర ధనముల్
ప్రేమమునఁ గట్టఁబెట్టి, య
థామతి నతనిన్ వధువును దరలం బంపెన్. ౨౩౨

తే. అట్లు లంపి సుబాహుండు నాత్మబలము
లెల్లఁ గూరిచి రక్షగా నల్ల నల్ల
బలసి కొలువ సుదర్శనవరకుమారుఁ
బంపి, తాను సన్నద్ధుఁడై బయలువెడలె. ౨౩౩

ఉ. జంకును గొంకు లేక ధ్రువసంధికుమారుఁడు తన్ రథాళి న
ల్వంకలఁ జుట్టి రాఁ గదలెఁ బైఁడిరథంబుపయిన్ నవోఢయౌ
పంకరుహాయతాక్షి తనపైఁ బరపించు కటాక్షపాళికిన్
గింకరమైన కన్నుఁగవ క్రేవలఁ గాంచుచు మేల మాడుచున్.

మ. చనువాఁ డాతఁడు గాంచె నెట్టయెదుటన్ సైన్యమ్ము నాత్మీయమా
ర్గనిరోధ మ్మొనరించుదాని గజఘీంకారార్థాతిఘోరమ్ము న
శ్వనికాయోద్భటమున్ శతాంగభగమున్ బాదాతసంఘాతభీ
షణమున్ శంఖమృదంగకాహళరవాశాచుంబిసన్నాహమున్.

క. ఈక్షించి నిర్భయుం డయి,
యాక్షణమ స్మరించి శివపదాబ్జంబుఁ, దదే
కాక్షరమను వాతం డే
విక్షేపము లేని భక్తివృత్తి జపించెన్. ౨౩౬

క. కామదుఘామోఘం బగు
కామేశ్వరిజప మతండు కావింపంగా
నేమమున శశికలయుఁ ద
న్నామస్మరణ మ్మొనర్చె నాథునితోడై. ౧౩౭

క. కోలాహలపరులై మహీ
పాలకు లందఱును నొక్కపాటున బహుళులై
న్యాలోలముగాఁ బైఁ బడి
రాలోచించుచు హరింప నప్పుడ శశికలన్. ౧౩౮

తే. కాశిరాజు ప్రయత్నంబుఁ గాంచి క్రోధ
తామ్రలోచనుఁడై యుద్ధు తగిలి నిల్చె.
మేరుసార శరాసన ఘోరవృత్తి
నృపుల వ్రేల్మిడి నిపుడ వధింతు ననుచు. ౧౩౯

క. సారించి దృష్టి రఘుకుల
వీరుం డానైపు శ్వశురువిస్రంభంబున్
వారించి జిగీషు వగుచు
ధీరత నాసీరభూమిదిక్కున నిలిచెన్. ౧౪౦

క. ఇరువాగుఁ గలసి బెరసిన
మొరసెన్ దుందుభులు శంఖముల్ పటహంబుల్
మురజంబులు కాహళఝ
ర్ఝరములు క్ష్వేడప్రదీప్తసంరావములై. ౧౪౧

క. సన్నద్ధుండై నిలిచిన
యన్న కెదిరి శత్రుజిత్తుఁ డాహవభూమిన్
బన్నిన యాతనిపిఱుఁదం
దన్ని యుధాజిత్తు నిలిచెఁ దతసైన్యముతోన్. ౧౪౨

క. మన కేల రిత్తకయ్యము
తనపుత్రిక నిచ్చె మెచ్చుధరణీశున కీ

నని కొందఱు సేనలతో
ననికిఁ దొలఁగి పతులు కాంచి రాయోధనముల్. ౨౪౩

తే. శత్రుజిత్తు సుదర్శను, శత్రుజితుని
మఱి సుదర్శనుఁడుల్, శితశరశతములఁ
గ్రోధమూర్ఛితులై యొండొరుల్ వధింపఁ
గొంకు లేక యిత ప్రహరించుకొనిరి పోర. ౨౪౪

తే. అట యుధాజితుఁ డండ గా, నిట సుబాహుఁ
డండ యయి నిల్చె, సేనాసహస్రకోటి,
వీరు లొండొండఁ బోరఁగా దారుణమ్ము
రోమహర్షణ మయ్యె సంగ్రామభూమి. ౨౪౫

క. కామేశబీజశరములఁ
గామేశ్వరశక్తిరూప కార్ముకధరుఁడై
కామేశ్వరాస్త్రకీలనుఁ
డై మించి సుదర్శనేశుఁ డాజిఁ జరించెన్. ౨౪౬

శా. శ్రీకామేశి హఠాత్ప్రభూత యయి తోఁచెన్ సింహవాహంబుతో
భీ కల్పించుచు సంభృతాస్త్రవరదీప్తిన్ దుష్టభూపాళికిన్
ధీ కావించుచు మ్రొక్కు భక్తతతికిన్ దివ్యాంబరాకల్పక
స్వీకారాకృతిఁ గంఠహారములుగాఁ జెల్వొంద మందారముల్.

క. అది గాంచి యెల్ల నృపులే
మది యేమది యెవ్వ రెవ్వ రీ కేసరిపై
నధిరోహించి కనంబడు
ముదిత యనిరి విస్మయాతిముగ్ధాకృతులై. ౨౪౭

ఉత్సాహ— కాని యా సుదర్శనుండు కాంచి పోల్చి చూపుచున్
దాని నా సుబాహునకును దర్శనం బొసంగె శ
ర్వాణి నన్నుఁ బ్రోవఁ గృపను భయము దక్కె రాజచం
ద్రా! నమస్కరింపు మెఱఁగి తల్లిపాదపద్మముల్. ౨౪౮

క. అంచు నతండును సుబాహుండు
వంచి శిరంబులు భవానిపదపద్మములం
దుంచి వినమ్రత మ్రొక్కిరి
మించినభక్తిఁ బ్రహర్షమిళితపులకులై. ౧౫౦

క. దేవీవాహనకేసరి
మై వెంచి సటల్ విదల్చి మానుగ గర్జా-
రావము చేసినమాత్రన
మై వడఁకఁ గరీంద్రఘటలు మద మఱి తూలెన్. ౧౫౧

క. వైరిధ్వజినికి నెదురై
దారుణవాతంబు వీచెఁ, దమములతోడన్-
ఘోరములై దిశ లొప్పెన్,
దారి తెలియ కెల్ల బలము తడఁబడియె నృపా ! ౧౫౨

సీ. అది గాంచి ముదితుండై యను సుదర్శనుఁ డిట్లు,
నిజసైన్యపతితోడ నిశ్చయించి;
తలఁగక సూటిగా దారి తీయుము నేఁటి
భూభుజు లెం దున్నఁ బొమ్మచటికి,
యీదుష్టనరపతు లేమి చేయఁగలార
లెంత కోపించిన నేమి యన్న;
శరణార్థి ననుఁ బ్రోవఁ జండిక చనుదెంచె,
దానిరక్షణ గల్గ దలఁక నేల ?

యేగవలె నడ్డులేక యథేచ్ఛ; ననిన,
నడపె వాహిని నటుల సేనాని; దానిఁ
జూచియు యుధాజితుం డటు చూడలేక
క్రుద్ధుఁడై పల్కెఁ దోడివీరులకు నిట్లు. ౧౫౩

ఉ. ఏల నృపాలురార ! మతిహీనులరై బలవంతు లయ్యు, నీ
బేల సుదర్శనుం డులుకు వీడి చనం గొని కన్యఁ జూచుచుం

గాలు కదల్ప ? రమ్యో ! యొక కామిని సింహముపైని నెక్కి రాఁ,
బోలునె బీరముల్ విడువఁ ! బూనుఁడు కొట్టుఁడు పట్టుఁ డుద్ధతిన్.

క. మీ రందఱు లజ్జ విడిచి
పోరక యున్నను, నొకండ పోరెదఁ, గొందుం
జారువిభూషణఁ గన్య న
వారణ, హరిసొమ్ముఁ గొనునె వంచక మెందున్ ? ౨౫౭

మ. అనుచున్ సైన్యము లెల్లఁ గూర్చి మనుమం డండన్ విజృంభింపఁగా
ధనువుం బూని గుణంబునం దొడిగి రత్న స్వర్ణ పుంఖ ప్రభా
కన దాభీల శిలీముఖవ్రజము నాకర్ణాంతముల్ లాఁగి వే
సెను వాఁ డల్కమెయిన్ సుదర్శనుతనుచ్ఛేదంబు గావింపఁగాన్.

క. కర్మారకపరిమార్జిత
మర్మచ్ఛేదక నిశాత మార్గణతతి దు
ష్కర్మం జేయ సుదర్శనుఁ
డోర్మిన్ ఛేదించె వాని నొక్కటఁ బెలుచన్. ౨౫౮

క. అక్షీణప్రౌఢి ననే
కాక్షౌహిణు లొక్కపెట్ట నాతని ముట్టన్
వీక్షించి, దుర్గ, యాశ్రిత
రక్షణ, శిక్షింపఁ గడఁగె రయమున వారిన్. ౨౫౯

శా. బాణాసారము లా యుధాజితునిపై వర్షింప, నాబాణముల్
నానాశస్త్ర సముద్యతోగ్ర పటు నానా భీక రాకారముల్
శోనం దాలిచి యా యపారభటసందోహంబుఁ దూలించె న
శ్వానీకంబు శతాంగపూర్వముగ నాహరించె పీఁకం ద్రుటిన్.

క. కను మూసి తెఱచులోనన
మనుమండు యుధాజిత్తుండు మడసి రథమునం
గనపైన నొక్కపెట్టున
మిను ముట్టెన్ జయరవం బమేయోత్సవమై. ౨౬౦

తే. తొలఁగిన నృపాలు రది గాంచి పలుకు లేక,
విస్మయంబున నిశ్చేష్టవృత్తు లైరి;
అంత దుర్గార్తినాశిని యైన దుర్గఁ
బ్రణతుఁడై నుతియించె సుబాహుఁ డిట్లు. ౮౬౧

క. మ్రొక్కెద జగదంబ! శివా!
మ్రొక్కెద భగవతి! భవాని! మ్రొక్కెద దుర్గా!
మ్రొక్కెదఁ ద్రిజగద్ధాత్రీ!
మ్రొక్కెద దేవీ! మహేశి! మ్రొక్కెదఁ జండీ! ౮౬౨

క. మ్రొక్కెద శాంతికి విద్యకు
మ్రొక్కెడెదన్ విశ్వతతకు మ్రొక్కెద శ్రీకిన్
మ్రొక్కెదను మోక్షదాత్రికి
మ్రొక్కెద వరదాత్రి కేను మ్రొక్కెద హ్రీంకిన్. ౮౬౩

తే. సగుణఁగా నిన్ను నిర్గుణన్ సంస్తుతింతు,
నల్పబుద్ధిని, నీరూప మరయఁ గలనె?
పొగడు టెటు విశ్వమాతఁ బ్రభూతకీర్తిఁ
బరమశక్తిని భక్తార్తిహారణ నిన్ను! ౮౬౪

క. నీవే వాగ్దేవత వవు,
నీవే సర్వగతబుద్ధి, నీవే మతి వౌ,
నీవే విద్యవు, జీవుల
కీవ గతి, మనోనియంత్రి నెటులం బొగడన్? ౮౬౫

క. హరి హర విధి సురవరు లన
వరతము నీగుణము లెన్ని పారము గనిరే?
చరితము నీయది పొగడం
దరమే, గుణబద్ధభిన్నధర్ముఁడ నాకున్? ౮౬౬

తే. సాధుసంగతి జను లేల సలుప రయ్యో!
చిత్తశుద్ధి ప్రాసంగికసిద్ధము కదె?

అమరదే నాకు నల్లుసమాగమమున
నద్భుతం బీ భవద్దర్శనాప్తిలక్ష్మి ! ౧౬౭

ఉ. ఏయది కోరు నాత్మభవుఁ, డేయది యెప్డు హరుండు వేడునో,
యేయది కేశవుండు సుర లింద్రుఁడు హానులుఁ గాంక్షసేతురో,
యాయది, ధన్యుఁడన్, శమదమాదిసమాధులు నేవి లేక, నా
కీయెడ నబ్బె దుర్లభ మిదే భవదీయసుదర్శనం బహో ! ౧౬౮

క. నే నేడ మందమతిని, భ
వానీ ! నీ వేడ నమ్మ ! భవభేషజహా
దానవు, ని న్నెఱుఁగంగా
నూనితి భక్తానుకంపనోద్యత వగుటన్. ౧౬౯

వసంతతిలక — ఏమంచు నిన్ను నుతియింతు సుదర్శనున్ నేఁ
డీమాడ్కిఁ గాంచితి, హరించితి కష్ట మంబా !
యీ మేటి శత్రుల వధించితి వీఁకఁ, బుణ్యా
శ్రీ మించు నీచరిత, శిష్టజనానుకంపా ! ౧౭౦

క. భావించి చూడఁ, దల్లీ !
స్థావరజంగమధరిత్రి సాఁకవె నీవే,
యేవింత యీ సుదర్శన
దేవుని రక్షించి రిపు వధించుట దయతో ? ౧౭౧

తే. జనని ! నీపాదభక్తియశస్సు దిశలఁ
జాటఁ గల్పించినా వీ ప్రశస్తకథను;
గాక, యీపుణ్యుఁ డెట్లు మత్కన్య వలచి
గెలుచు రణకౌశలం బెట్లు లలవడఁ గను ? ౧౭౨

తే. జన్మ మరణాది భయ మెడసలుపు నీకు
నిష్టుకోరికి దీర్చు ట దేమి వింత ?
భక్తులు నుతింత్రు నినుఁ బుణ్యపాపముల క
తీతవున్ సగుణవు గుణాతీత వనుచు. ౧౭౩

క. ఎఱుఁగను బీజము భజనము
దరిసెన మొసఁగితివి నేఁడు, ధన్యుఁడ, భువనే
శ్వరి ! నీ మహిమాతిశయం
బెఱుఁగఁ, బ్రకటించి తిట్టు లింతే తల్లీ ! ౩-౭౪

తే. అట్లు వాఁడు నుతింపఁ బ్రీతాత్మ యగుచు,
శివ, ప్రసన్నముఖాబ్జ సుస్నిగ్ధమూ ర్తి,
వేడికోమ్ము వర మ్మన, నాఁడు భ క్తి
నమ్రుఁడై వేఁడె నాజగన్మాత నిటుల. ౩-౭౫

శా. స్వారాజ్యంబు నఖండభూవిభవముం బ్రాపించుటే నొక్కటం
నేరంబోలు నె నీదుదర్శనమహానిశ్శ్రేయసప్రాప్తితో,
నీరమ్యాద్భుతమూ ర్తి ముజ్జగమునన్ నిస్సీమ, మారూపు నేఁ
డారాధించిన, దేఁగృతార్థుఁడ, మఱే మర్థింతు ని న్నోశివా! ౩-౭౬

క. యాచింతు నొకటి దేవీ !
నీచరణాబ్జముల భ క్తి నిశ్చలకలనం
బై చి త్తంబున వెలయుచు
మోచన మొనరించుఁగాక మోహము నాకున్. ౩-౭౭

క. మఱియుం దల్లీ ! కాశీ
పురమున దుర్గాఖ్య పూని పురసంరక్షా
కరశ క్తివై సుదర్శనుఁ
బరిరక్షించినవిధానఁ బాలింపు సదా. ౩-౭౮

క. ఏవఱకు సుస్థితం బయి
యీ వారాణసి వెలుఁగు నిమ్మహిలో, నీ
వా వఱకు సుప్రతిష్ఠిత
వై వెలయఁగఁ గావవలయు దీని భవానీ ! ౩-౭౯

క. భద్రస్వరూప! సకలా
భద్రంబులు లోకమునకుఁ బాయఁగ విద్యా

ట్ఛిద్రం బొనఁగూర్చుచు ని
ర్ఛిద్రముగా నాకు నిమ్ము నిఖిలశుభములన్. ౨౨౦

తే. ఎదుర నిటు పల్కి మ్రొక్కి నరేంద్రుఁ గాంచి
పలికె దుర్గతినాశిని పరమదుర్గ,
ధర వెలయుదాఁక నీము క్తిపురి వదలక
యఖిలలోకరక్షార్థ మిం దధివసింపు. ౨౨౧

ఉ. అంత సుదర్శనుండు ప్రమదాన్వితుఁడై దరిఁ జేరి దేవి క
త్యంతవినమ్రుఁడై యెఱఁగి యంబకు ని ట్లను, నీక చెల్లెఁబో
సుంతయు భక్తి లేని ననుఁ జూచి కృపామతిఁ బ్రోచు టెన్న, నే
కాంతుల భక్తితత్పరులఁ గావఁగ నెందఱు లేరు దేవతల్! ౨౨౨

శా. నీవే లోకము రక్షసేతువు కృపన్ నిర్మించి లోఁగొందు, వో
దేవీ! నోముటయున్ విచిత్రమె ననున్, దీనుండ నర్థింతు నీ
సేవాసక్తుఁడ; నాజ్ఞ యేమి? యెది నేఁ జేయంగ నౌ? నెందు నన్
గావంగోరెదొ? యింద నిల్చెదనొ? సమ్యగ్ధిుండ శాసింపుమా!

ఉ. నావుడుఁ బ్రీతి నించు నయనంబులఁ దప్పక చూచి యిట్లనున్
దేవి, సుదర్శనా! కదలి నీ విపు డేగి యయోధ్యకున్ సమ
స్తావని యేలుకొమ్ము స్వకులాగత మాదినృపాలనైఖరిన్
నావరివస్య యేమఱ కొనర్పుము నిత్యము మూఁడుప్రొద్దులన్.

తే. ననుఁ బ్రతిష్ఠించి సాకేతనగరవాటి
నర్చసేయుము ప్రజతో నహర్నిశమ్ము,
చేయఁగావలె బలితో విశేషపూజ
యష్టమిఁ జతుర్దశిన్ నవమ్యాఖ్యతిథిని. ౨౨౫

క. శరదాగమమునఁ బరమా
దరమున నవరాత్రదీక్షఁ దాలిచి శ్రద్ధా
పరత మహాపూజ సలుపు,
మరుదుగ నీరాజ్యమున శుభావళిఁ గూర్తున్. ౨౨౬

తే. చైత్రమున నాశ్వినమున నాషాఢమాఘ
వేళలన్ నవరాత్రార్చ విహిత మనఘ!
కృష్ణపక్ష చతుర్దశి ప్రియయు నాఁడు
నష్టమినిఁ జేయవలె విశేషార్చనమ్ము. ౮౮౭

క. పలుకుచు నిట్లు దయారస
మొలికెడి నుడు లెదుర మ్రొక్కి యున్న రఘుఁడు మై
పులకించి యుండ నందఱుఁ
దిలకింప నదృశ్య మయ్యె దేవి యచటనే. ౮౮౮

తే. అంత మ్రొక్కిరి నృపులెల్ల రానతు లయి
యాసుదర్శను, మఘవాను నమరులట్లు;
వానిని సుబాహుఁడును మ్రొక్కెఁ బ్రమతుఁ డగుచు,
నఖిలనృపు లిట్టు లని రయోధ్యాధిపతికి. ౮౮౯

క. మా కెల్లరకుం బ్రభుఁడవు,
నీకింకరులము, యథేచ్ఛ నిలిచి యయోధ్యన్
వీఁకన్ శాసింపుము మము,
నీకరుణం జూడఁ గలిగె నిఖిలేశి శివన్. ౮౯౦

క. నీవే ధన్యుఁడవు ప్రభూ!
యా విశ్వేశ్వరి భవాని యాదిజనని శ్రీ
దేవి సనాతని నీకై
యావిర్భావంబు నొందె ననఘచరిత్రా! ౮౯౧

క. మాయామోహితులము ధన
జాయారతమతుల మేము సంసారసము
ద్రాయాసితులము కామా
ద్యాయత్తుల మెట్లు తెలియఁ నగుఁ దన్మహిమల్? ౮౯౨

చ. అడిగెదమయ్య! చెప్పు మొక యర్థము, నీ కెఱుఁగంగరాని దే
యెడలను లేదు, ప్రీతి మము నెల్లర సంస్కృతివార్ధినావవై

గడపుము, దేవిరూప మెది, కాంచుట యెట్లు, ప్రభావ మెట్టి, దే
యెడ జనియించు, నెట్టు? లది యెల్లయుఁ దెల్లము సేసి ప్రోవవే !

తే. అట్టు లర్థింప వారిప ల్కాలకించి,
యలరి ధ్రువసంధిసుతుఁడు మార్పలికె నిట్లు:
దేవి నెదలోన ధ్యానించి, భావభిత్తిఁ
జిత్రిత మొనర్చి తన్మూర్తిఁ జేరి మ్రొక్కి. ౮౯౪

సీ. బ్రహ్మాదు లెఱుఁగని పరమార్థ మేమని
తచ్చరిత్రము చెప్పవచ్చు నాకు?
జగము పాలించెడి సాత్త్వికశక్తి మ
హాలక్ష్మి యద్దియే యాదిశక్తి,
రాజసియై సృష్టి యోజించుఁ, దామస
రేఖఁ దాలిచి సంహరించును దుది,
నీమూఁడుశక్తుల కామూలకారణ
శక్తి నిర్గుణ పరాశక్తి యదియ,
యదియ సర్వేప్సితప్రద, యైన దాని
యోగులే గాక తెలియలే రొండ్లు సుంత,
సుఖసమారాధ్య సగుణయే సుండు, దాని
బుధులు భావించి సేవించి పొందుచుంద్రు. ౮౯౫

వ. అది విని సుదర్శనునకు రాజు లి ట్లనిరి. ౮౯౬

క. బాలుఁడ వేగితి వడవికి,
నేలాగునఁ దెలియఁ జాలి తీపరశివ? నీ
వేలీల నుపాసించితి?
పాలించి ప్రసన్న యగుచు వచ్చిన దెట్టుల్? ౮౯౭

ఉ. నావుడు వాఁడు పల్కెఁ జిననాఁటనె నాకెను, గామబీజసం
భావన భావవీథి, ఋషివర్యులు సెప్పఁగ దాని నాపరా
దేవిగ నిశ్చయించితి మదిన్, స్మరియింతు నహర్నిశం బదే,
సేవ యొనర్తు దానికె, రచించెద నంజలి భక్తి దానికే! ౮౯౮

తే. వాని నాలించి నృపు లెల్ల దానిఁ బరమ
శక్తిగ నెఱింగి తత్పరాభక్తియుక్తు
లయి సెలవు పొంది చని రిండ్ల, కంతఁ జనిరి
కాశికిఁ మామ, యల్లుఁడు కోసలమునకు. ౨౯౯

క. ఆకర్ణించి సమస్తము
రాకొమరుఁడు జయముఁ గొంచు రాఁ గాంచి యనే
కాకారోపాయనముల
సాకేతనివాసు లెల్ల సలిపిరి పూజల్. ౩౦౦

క. ఇదుగో నమ్మ! సుదర్శనుఁ
డిదుగో ధ్రువసంధిసూనుఁ, డిదుగో మనరా,
జిదుగో దేవీపరుఁ డని,
జడిగా లాజలును బూలుఁ జల్లిరి ముదితల్. ౩౦౧

క. మంత్రులుఁ బ్రకృతులుఁ బురి కా
మంత్రింపఁగఁ, బొగడ వందిమాగధులు, యజు
ర్మంత్రములు సెప్పవిప్రని
యంత్రితుఁడై నగరు సొచ్చె నాతఁడు ప్రీతిన్. ౩౦౨

తే. అట్లయోధ్యను బ్రాపించి యందు ముందు
మిత్రపరివృతుఁడై పోయి, శత్రుజిత్తు
మాత దర్శించి, పుత్రశోకార్తిదీన,
జనవిభుఁడు మ్రొక్కి యిట్లను వినతుఁ డగుచు. ౩౦౩

ఉ. తల్లి! త్వదీయపుత్త్రుఁడు యుధాజితుఁడున్ బడి రాజిఁ, గాని నా
వల్లనుగాదుసూ, శివమె వారలఁ గూల్చె, నవశ్యభావి పోఁ
జెల్లునె యేమి చేసినను, జీవుఁడు కర్మకు వశ్యుఁ డౌచు సం
ధిల్లిన సౌఖ్యదుఃఖములఁ దేఱడు కుడ్వక, చింత నొందకే! ౩౦౪

క. మాతల్లి మనోరమ యెటు,
లాతీరున నిన్నుఁ గాంతు, నణుమాత్రమ్మున్

మాతా! చేయను భేదము,
చేతుఁ దాసుఁడను సేవ, చేకొనవె కృపన్. ౯౦౫

క. దైవాధీనము సర్వం
బావంతయు మనము మార్చునట్టిది గలదే!
కావున శోకం బగునెడ
జీవుఁడు శోషింపరాదు చింతావశుఁడై. ౯౦౬

క. దారుమయం బగు యోషా
కారం బెటు సూత్రధారుకరవశమై పోం
గారుచు నాడుచుఁ బడు, నా
తీరున దేహియు స్వకర్మ్రతిప్పుల నాడున్. ౯౦౭

చ. వనటఁ గృశింపలేదు వనవాసము చేసెడుచోఁ, బురాకృతం
బనుభవనీయ మంచు హృదయమ్మున నమ్మిన నేను; చూడు నా
జనని యనాథ, తాత వడె, సంభ్రమ మెత్తి వనంబునం జనం
గనుఁగొని చోరు లూడ్చిరి నగల్ ధనముల్ గల దారిబత్తెముల్. ౯౦౮

తే. ఈ విదల్లుండు దాదియు నేగ వెంట,
బాలపుత్ర నిరాశ్రయ బేల జనని,
నను భరద్వాజునాశ్రమంబునకుఁ గొంచుఁ
బోవ, మునులుఁ దత్పత్నులుఁ బూర్ణకృపను. ౯౦౯

క. ఫల నీవా రాహారం
బుల మముఁ బోషించినారు, పొందను దుఃఖం
బలనాఁడు, నేఁడు రాజ్యం
బు లభించియు హెచ్చుసుఖము పొందను దల్లీ! ౯౧౦

క. నీవారధాన్యభక్షణ
మే వర, మీరాజ్యభోగ మింతటికంటెన్,
నీవారాశి నరకమునఁ
బోవఁడు, రాజ్యాశి యటకుఁ బోవు ధ్రువముగా. ౯౧౧

క. వైరము మాత్సర్య మహం
కారము నే నెఱుఁగ, నెఱుక గలుగునరుఁడు ధ
ర్మారంభుం డయి యింద్రియ
వారంబు జయించి తలఁగవలె నరకంబుల్. ౯౧౨

తే. అఖిలయోనిసామాన్య మాహారసుఖము,
ధర్మము మనుష్యజన్మసాధ్యమ్ము, ధర్మ
తంత్రుఁడై యుండవలె భారతమున నరుఁడు;
ధర్మమే స్వర్గమోక్షప్రదంబు తల్లి! ౯౧౩

క. లీలావతి యావాక్యము
లాలించి, విలజ్జితోద్యదశ్రునయనయై,
తూలఁగ సుతశోకం, బనె
నీలీల సుదర్శనునకు నెంతయుఁ బ్రేమన్. ౯౧౪

ఉ. తప్పులు సైపు నాయెడ సుదర్శన! తప్పులు లేవు నీయెడం,
దప్పు తలంచుపుత్రకునిఁ దండ్రిని వారణ సేయనైతి, వా
రిప్పుడు వారికర్మఫలమే భుజియింతురు, నీవు చంపలే
దప్పు! తదీయపాపములకై వగ నొందెదఁ, గాదు వారికై! ౯౧౫

క. శోకముఁ గోపము నీపై
నేకోశంబునను లే వొకింతయు, నిఁకపై
నాకొమరుండవు నీవే,
నాకు మనోరమయె యప్ప, నానుడి వినుమా! ౯౧౬

క. భగవతికృపచే రాజ్యము
సుగమంబు నకంటకముగఁ జొప్పడెఁ, బ్రజలన్
సుగతిం బాలించుచు, సౌ
ఖ్యగరిమ శోభనము లొందు, కల్యాణగుణా! ౯౧౭

వ. సుదర్శనకుమారుం డామెవాక్యంబు లాకర్ణించి కృతార్థుండ నైతి
నని లీలావతికి మ్రొక్కి సెలవు గైకొని, యంతకుమున్న నిజమాత

వచ్చి నిలిచియున్న, మనోరమం బగు మనోరమాభవనంబుం జేరి
మంత్రుల నెల్లర రావించి దైవజ్ఞసార్వభౌమునిచే శుభముహూ
ర్తంబు వెట్టించి యి ట్లనియె. ౯-౧౮

క. సింహాసనేశ్వరికి నై
సింహాసన మొండు రాజశిల్పులచేతన్
రంహోగతిఁ దొల్గొల్తు ని
రంహ స్వర్ణ మణి ఘనము నమరింపవలెన్. ౯-౧౯

క. ధర్మార్థకామమోక్షద
శర్మాత్మక నటఁ బ్రతిష్ఠ సలిపి పరాంబన్,
బేర్మిన్ రామాదులక్రియ
నర్మిలిఁ బూజించుచుం బ్రజావన సేతున్. ౯-౨౦

క. నాగరికు లెల్ల భక్తి
శ్రీగరిమన్ దాని నెపుడు సేవింపఁగనౌ,
నీఁ గలది కోర్కె లన్నియు
వేగమె యాశక్తి సుండు; వినుడు శివ యదే! ౯-౨౧

క. శాసనము వించు మంత్రులు
ప్రాసాదం బొండు రత్నభర్మమనోజ్ఞో
ల్లాసము గావింపంగాఁ
జేసిరి శిల్పులను బంచి శీఘ్రకరణులై. ౯-౨౨

తే. ప్రతిమఁ జేయించి శుభముహూర్తమున దాని
నందులఁ బ్రతిష్ఠ గావించె అవనివిభుఁడు,
హవన మొనరించి పూజించి యఖిలదైవ
స్తోత్రముల వేదవిహితవిధ్యుక్తముగను. ౯-౨౩

ఉ. ఆయెడ నుత్సవంబు ప్రమదావహ మయ్యె, ద్విజేంద్రవేదపా
రాయణమంజురావము సెలంగఁగ నొక్కట ఋక్స్వరంబు వే

చేయెడ యాజుషశ్రుతులు, నింకొకచో శుభసామగీతు, లే
చాయ నథర్వణోచ్చరితశస్త్రసునాదము రక్షసేయఁగాఁ. ౯-౨౪

క. వాయించువారు వీణలు,
మ్రోయించెడువారు వేణుమురజాదికముల్,
హాయించు నాడువారును
నై, యుత్సవ మొప్పె నతులహర్షోత్సవమై. ౯-౨౫

క. ఆవిధిఁ గడు వైభవమున
దేవిని స్థాపించిఁ నిష్ఠ దీపింపంగాఁ,
గావించి బహువిధంబగు
సేవ, యతం డెక్కెఁ దండ్రిసింహాసనముఁ. ౯-౨౬

క. క్షితిఁ బాలించెను ధర్మ
వ్రతుఁడై రాముం డితండు రఘుఁ డితఁ డంచుఁ
నుతియించుచుండ సాధులు
నతులై సామంతులెల్ల నయమునఁ గొలువఁ. ౯-౨౭

తే. వర్ణములు నాశ్రమంబులు వరుస నాల్గు
నాల్గుగా ధర్మపాదముల్ నాలు గయ్యెఁ,
బ్రజలు ధర్మిష్ఠులై సుఖంపడిరి, శాంతి
వర్ధిలె, సుదర్శనునిరాజ్యపాలనమున. ౯-౨౮

క. వెలసెఁ దేవాయతనం
బులు గ్రామగ్రామములను, బూజోత్సవని
శ్చలమతిఁ బెరిగెను బ్రజ, కో
సలదుర్గయశస్సు ప్రాఁకె సకలాశలలో. ౯-౨౯

క. కాశీపురిని సుబాహుం
డీశ్రీప్రతిమప్రతిష్ఠ యొసఁగింపంగాఁ,
గాశీదుర్గ యటంచుఁ
దేశాంతరములను దానిదీప్తి వెలింగెఁ. ౯-30

క. భూజను లెల్లరు భక్త్య
ద్విజతులై, శ్రద్ధ, దాని, విశ్వేశ్వరు సే
యోజ సమర్పించెద, రా
యోజం బూజింపఁ దొడఁగి రుక్తవిధులతోఁ. ౯-౩౧

క. భారతభువిలో నెల్లెడ
వారుఁ పీ రనక యెల్లవర్ణంబులవా
రారంభించిరి నిత్య
శ్రీరమ్యంబుగ భవానిసేవ లొనర్పఁ. ౯-౩౨

క. నుతియింతు రాగమోక్త
స్తుతులఁ. శ్రీదేవి శక్తి సూక్తజపంబుల్
మతి నుంతురు, ధ్యానింతురు,
సతతంబుఁ దుర్గ జనులు, సడలనిభక్తిఁ. ౯-౩౩

క. హవణింత్రు జనులు నాలుగు
నవరాత్రమహోత్సవములు నానాగతులఁ,
హవనార్చాయాగంబుల
శివఁ గొల్తురు, శక్తిసేవ సేయుదు రెపుడుఁ. ౯-౩౪

వ. ఈ పుణ్యంబగు నాఖ్యానంబు శ్రోత్రపర్వంబుగా జనమేజయ భూకాంతుం డాకర్ణించి, దేవా! నవరాత్రవిధానం బేవిధం బైయుండు: నందు శరదుత్సవవిశేషం బెట్లు కర్తవ్యంబు; దానిఫలం బెట్టిది; సమస్తంబును విస్తరంబుగా సెల విచ్చి యనుగ్రహింపవే యని వేడిన వ్యాసమునీంద్రుం డి ట్లనియె. ౯-౩౫

## నవరాత్రవ్రతవిధివర్ణనము

క. రాజా! శ్రద్ధాళువవై
నేఁ జెప్పెడి దాలకించి, నిలుపుము మతిలోఁ,
బూజింపవలయు ముఖ్యము
గా జనులు శరద్వసంతకాలముల శివఁ. ౯-౩౬

ఉ. కాలునిదంష్ట్రియుగ్మ మనఁగా విలసిల్లు వసంతమున్ శర
త్కాలము, ఘోరరోగమృతికారణముల్ బహుదుర్గమంబు లా
వేళలు సర్వజీవులకు, విశ్రుతభక్తివివేకశాలు రీ
మూల మెఱింగి చండికకుఁ బూజ లొనర్తురు విశేష మత్తఱిన్.

తే. దానికై ముందుగా నమావాస్యనాఁడ
కూరిచి సమస్త యోగ్య సంభారవార
మాదిసంబున విధి హవిష్యాశనంబ
యేకభుక్తం బొనర్తు రెంతే శుచు లయి. ౩౮

తే. సమతలము శుభ పదా ప్రదేశమ్ము చూచి
మండపమ్ము షోడశహ స్తమానముగను
బరగఁగాఁ బదునాఱు స్తంభమ్ము లన్ని
ధ్వజములు వెలుంగ నిర్మింపవలయు ముందు. ౩౯

క. గారం బగు మృత్తికం గోఁ
జేరిచి గోమయము నలికి, చిత్రితసుశ్రీ
మీఱఁగ వేది చతుష్కా
స్తారంభ మొనర్పవలయు హస్తోచ్ఛ్రయమున్. ౪౦

వ. అందు శుచిరమ్యంబుగఁ బీఠాస్థానంబు కల్పించి విచిత్రంబు లగు
తోరణంబులు నిర్మించి స్ఫీతం బగు వితానంబు విరచింపం జేసి—

క. ఆస్త్రాత్రియె శ్రీవిద్యా
పారగులను వేదవాదభాసురుల సదా
చారుల దాంతులఁ దంత్రవి
శారదుల వరింపవలయు సద్భాసురులన్. ౪౧

వ. సాధకుం డంత వేఁగునంతకుం బ్రతీక్షించి, ప్రతిపద్దివసంబున విధివిధా
నంబుగా నదీ తటాక వాపీ కూపంబుల లభ్యం బగుదానను, దదలా
భంబున నిజగృహమందుంగాని, ప్రాతస్స్నానం బాచరించి, తాత్కా
లిక నిత్యకృత్యంబులు తీర్చి, ఋత్విగ్వరణం బొనర్చుట కర్తవ్యంబు.

అందు సద్ద్విజుల మధుపర్కప్రాశనపూర్వకంబుగా నర్ఘ్యపాద్య వస్త్రాలంకరణాదులచే యథాశక్తిగా విత్తశాఠ్యవర్జ్యంబుగాఁ బూజింప నగు. ౯-౧౩

క. విప్రులు సంతోషించిన
క్షిప్రము పరమేశి సంతసించును, సంపూ
ర్ణప్రతిభ గాంచుఁ గార్యము
లప్రతిహతభక్తి వారి నర్చించినచో. ౯-౧౧

వ. అయ్యెడ శ్రీదేవీభాగవత దుర్గాసప్తశతీ పారాయణంబు బ్రాహ్మణోత్తములఁ దొమ్మిదిమందినిగాని, యేవురంగాని, మువ్వురంగాని, వరించు టుత్తమంబు. అశక్తపక్షంబున శాంతుండు నరసింహుండు నగు నొక బ్రాహ్మణు నైన వరించుట ధర్మంబు. ౯-౧౪

క. వైదికమంత్రంబులతో
నాదిక్ స్వస్తిక్ వచించి, యంతట భక్తిన్
వేదిక సింహాసన మిడి
శ్రీదేవిన్ విధిఁ బ్రతిష్ఠ సేయఁగ నొప్పున్. ౯-౧౫

సీ. క్షౌమాంశుకము సర్వసంపన్నముగ దిద్ది
దివ్యోత్తరీయంబు దీర్పవలయు,
రత్నభూషాళి గ్రాలఁగ మెడ ముత్యాల
పేరులు వ్రేలాడ వేయవలయు,
శంఖచక్రగదాబ్జ చారు చతుర్హస్త
మూర్తిగాఁ గల్పింపఁ బూనవలయుఁ,
గాక యష్టాదశ ఘనబాహురూపగా
బహ్వాయుధములఁ గూర్పంగనగును,
సర్వలక్షణశోభాఢ్య సౌమ్యరూప
నా సనాతని నర్చింపనగును బ్రతిమ,
నట్లు గాదే నవార్ణమంత్రాన్విత మగు
యంత్రమునఁ బూజ సేయుట యైన నొప్పు. ౯-౧౬

తే. పంచపల్లవయుతము సువర్ణరత్న
యుక్తముగ బహుపుణ్యతీర్థోదకంబుఁ
గలశముగ మంత్రసంస్కృతగరిమఁ గూర్చి
పూజకై నిల్పవలయుఁ దత్పార్శ్వభువిని. ౨౮౮

క. పూజాసంభారసువి
భ్రాజిత మొనరించి పార్శ్వభాగములు, దిశల్
యోజింపవలయు మంగళ
భాజనఘోషముల గీతవాదిత్రముల౯. ౨౮౯

వ. మఱియు, రాజా! యీమహావ్రతారంభంబు హస్తాన్వితం బగు ప్రతిపత్తిథియందు సంకల్పించుట సర్వకామదం బగు; నానాఁడ యథాశక్తిగా నుపవాసమో, నక్తంబో, యేకభక్తంబో, నియమంబు వినిశ్చయించి— ౨౯౦

క. ఈనియమంబునఁ దల్లీ!
నే నవరాత్రవ్రతంబు నిర్వర్తింతు౯
శ్రీసత్యదాత్రి! జగదం
బా! నా కెల్లెడలఁ దోడుపడవే యిందు౯. ౨౯౧

వ. అని సంకల్పించి శ్రీదేవీసాహాయ్యం బర్థించి, యథావిధి మంత్రపూర్వకంబుగాఁ బూజ సేయఁ గడంగవలయు; నర్ఘ్యాదికం బాచరించి, చందనాగురుకర్పూరంబులను, సుగంధంబులను, మందార కరజాశోక చంపక కరవీర మాలతీ బ్రాహ్మ్యాది నానావిధకుసుమంబులను, శుభంబు లగు బిల్వదళంబులను, శ్రీదేవి౯ జగద్ధాత్రిం బూజించి, ధూప దీపంబు లర్పించి, నారికేళ మాతులుంగ దాడిమీ కదళీ నారంగ పనస పూర్ణఫలాది నానావిధభోజ్యఫలంబులను, మృష్టాన్నంబుల నైవేద్యంబు సమాచరింపవలయు. ౨౯౨

క. మాంసాశను లగు వారలు
హింసాబుద్ధిం ద్యజించి యీయసం దగు ని

స్సంశయముగ బలి దేషి
శంసితమతి ఛాగ పోత్రి సైరిభము లవేౕ. ౯-౫౩

వ. క్షత్రియాదు లగు వర్ణంబులవారికి బలివిధానంబు యజ్ఞకృతం బగుట నహింసమై నిశ్శ్రేయసకరం బగుచు విశసితపశువునకు ధ్రువ మ్ముగా స్వర్గప్రదమ్మునై శోభిల్లు. ౯-౫౪

క. కుండం బైనను గాదే
స్థండిలమే హోమమునకుఁ జాలెడికోలతిౕ
నిండగు త్రికోణరూపం
బుండఁగ నిర్మించి గడఁగ నొప్పు హవనముౕ. ౯-౫౫

తే. నిత్యము నథశ్శయానుఁడై నియతి మూఁడు
ప్రొద్దులుం బూజసేయుచుఁ బుణ్యవస్తు
నివహమున గీత వాదిత్ర నృత్య ముఖ్య
విధులను మహోత్సవంబు గావింపవలయు. ౯-౫౬

వ. మఱియు నీయెడ నవశ్యంబుగాఁ గుమారీపూజనంబు నిత్యకర్తవ్యం బై యెసంగు; నది దివ్యంబు లగు వస్త్రాలంకరణంబులను సుధామయంబు లగు భోజనంబులను జేయం దగు; నట్లనుదినంబు నేకైక కుమారింగాని, యేకవృద్ధి, ద్విగుణవృద్ధి, త్రిగుణవృద్ధులయం దొక్కటిచేఁగాని, సాధకునివిభవానుసారంబుగా విత్తశాఠ్యం బొనర్పక పూజింప నగు. ౯-౫౭

క. ఒకయేఁ డగునది గంధా
దికభోగము లింతయేనిఁ దెలియసిదా బా
లిక గావునఁ దగ దది పూ
జకు; నట్ల పదేండ్లు దాఁటఁ జన దర్చింపౕ. ౯-౫౮

వ. రెం డేఁడుల కన్యక కుమారి నాఁబడు; దాని నర్చింప, దుఃఖదారిద్ర్యంబు లెడసేసి శత్రుక్షయం బొనగూర్చి ధనబలాయుష్యంబులు వర్ధిలఁజేయు. మూఁడేండ్లది త్రిమూర్తి యనంబడు; దానిఁ బూజిం

చిన దీర్ఘాయుష్యంబును బుత్త్రపౌత్త్రాదివృద్ధియుఁ జేకురు. నాలుగు
వర్షంబులకన్నియ కల్యాణినామ; విద్యార్థులును, విజయార్థులును,
రాజ్యార్థులును, సుఖార్థులును, సర్వకామద యగు గల్యాణి సేవిం
తురు. పంచాబ్దంబులది కాళికయనంబరగు; దాని భక్తిభావంబుననర్చిం
చిన నరుండు శత్రునాశనంబు సాధించు. ఆఱుహాయనంబులకన్యఁ
జండిక యందురు; దాని నైశ్వర్యధనకాములు సంపూజింతురు.
సప్తశరద్వయస్క శాంభవినాఁ జెలంగు; దాని నిత్యవరివస్యచే దుఃఖ
దారిద్ర్యనాశనంబగు; వెండియు నృపుండు తత్పూజచే రిపునృపాల
సమ్మోహనంబు సాధించి సంగ్రామరంగంబుల జయశాలి యగు.
ఎనిమిదేండ్లది దుర్గ; దానినిఁ గ్రూరశత్రువినాశార్థంబు నుగ్రకర్మ
సాధనంబులను బరలోకవిజిగీషనుం గొల్తురు. ఇఁకఁ దొమ్మిదేండ్ల
కన్య సుభద్ర యనంబడు; దాని వాంఛితార్థసంసిద్ధికై సదా సమ
ర్చింతురు. మఱి పదేండ్లది రోహిణి; దానిని రోగనాశనంబునకై
విధివిధానంబున నర్చింపవలయు. ఈ కుమారీపూజనంబు— ౫౭౯

క. శ్రీరస్తను మంత్రము రోఁ
బ్రారంభింపంగ నగును బ్రాకృతు లెల్లన్;
శ్రీ రమ్య బీజ మంత్ర
ప్రారంభముగా నొనర్త్రు ప్రాజ్ఞులు మఱియున్. ౫౮౦

వ. కుమార్యాదిక పూజామంత్రంబు లేతదర్థంబులై సన్మంత్రివేద్యంబులై
యుండు. ౫౮౧

క. ఏది కుమారుని తత్త్వము
లాదిగ సృజియించు, నేది కాదులను మహేం
ద్రాదుల సృజియించునొ, స
ర్వాది యగుఁ గుమారి దాని నర్చింతు నిలన్. ౫౮౨

సీ. సత్త్వము రజస్సుఁ దమ మనఁ జని త్రిమూర్తు
లై మరల వానిచే ననేకాకృతు లయి

వరలుచుఁ ద్రికాలసంవ్యాప్తిఁ బరగు నేది,
యా త్రిమూర్తినిఁ బూజింతు నాదిశక్తి. ౯౬౩

క. తను నర్చించెడిభక్తుల
కనిశముఁ గల్యాణదాత్రి యఘవిచ్ఛేదా
యిని యా కల్యాణినిఁ బూ
జన మొనరించెద నితాంతసాత్త్వికభక్తిన్. ౯౬౪

తే. పూర్వజన్మసంచిత పాప పుణ్య కర్మ
బీజసంతతి రోహింపఁ బ్రేరయిత్రి
యై సమస్తభూతావళి కాది యైన
దేవి రోహిణి నినుఁ గొల్తు దృఢనియుక్తి. ౯౬౫

క. లీలఁ జరాచర మగు భూ
తాళిన్ బ్రహ్మాండ మెల్ల నల ప్రళయంబౌ
వేళం గాలంబ వయి క
బళించెడుఁగాళిక నిను భక్తిం గొల్తున్. ౯౬౬

క. చండికఁ జండాకారను
జండాసుర ముండదైత్య సంహారిణి ను
చ్చండాఘవితతినాశినిఁ
జండిక నర్చింతు నిన్ను సతతము భక్తిన్. ౯౬౭

క. ఏ దేవి యకారణముగఁ
బ్రాదుర్భవ మందుఁ, దత్పరంబులు దేనిన్
వేదములు పలుకు సుఖదఁగ,
నా దేవిని శాంభవిన్ సమర్చింతు నినున్. ౯౬౮

క. దుర్గతినాశిని యగుచున్
దుర్గంబుల భక్తతతికిఁ దోడయి దివిష
ద్వర్గసుదుర్జ్ఞేయ యయిన
దుర్గను నినుఁ బూజసేయుదును గడు భక్తిన్. ౯౬౯

క. ముద్రతోఁ గొల్చెడి భక్తా
భద్రంబులు పాఱఁద్రోలి వారనికృపతో
భద్రంబులు సమకూర్చును
భద్ర న్నినుఁ గొల్తుఁ దల్లి! పరమప్రీతిన్. ౯౭౦

వ. ఇత్యేతదర్థంబు లగు వరమంత్రంబులఁ గన్యకల వస్త్రాలంకరణంబులను దివ్యమాల్యంబుల నుచ్చావచంబు లగు గంధంబులను నిత్యంబు సమర్చింపవలయు; నని మఱియు వ్యాసుం డి ట్లనియె. ౯౭౧

క. ఏకాక్షి, పుట్టుగ్రుడ్డి, వి
శోకనముల మెల్ల గలది, రోమబహుళయై
వైకృతమైన, దసహ్యాం
బౌ కంపుది, బక్కచిక్కనది, కుంటిదియున్. ౯౭౨

క. గోలకయుం, గానీనయు,
శీలవిహీనకులజాత, శ్విత్ర, రజశ్చి
హ్నలక్షిత, వ్రణకిణ, యే
కాలంబునఁ బూజసేయఁగాఁ దగ దెందున్. ౯౭౩

క. కలకలలాడెడు మొగమును
సలలిత మగు దేహభంగి శౌచస్మితముం
గలిగిన కులీనకన్యా
లలామ పూజింపఁ దగు సలక్షణ భక్తిన్. ౯౭౪

తే. జయముఁ గోరిన, క్షత్రియజాత మేలు;
లాభ మర్థింప, వైశ్యశూద్రజలు మేలు;
సర్వకార్యార్థసిద్ధికి జన్నిగట్ల
కన్నియలు మేలు, పూజింపఁగా సతంబు. ౯౭౫

వ. బ్రహ్మక్షత్రియులు విప్రకన్యలను, వైశ్యులు త్రివర్గజాతలను శూద్రులు చాతుర్వర్ణ్యకన్యలను, కుమారీపూజయం దర్చింప నగు. కారువులు స్వకులసంజాత లగు కుమారికల నర్చింపవలయు. నవరాత్రవిధానం

బునఁ బూజ సేయ నశక్తుం డగువాఁ డష్టమినాఁడైన ముఖ్యంబుగాఁ
బూజించు టవశ్యకర్తవ్యంబు. ౯-౨౬

తే. అష్టమినె భద్రకాళిక యవతరించె
దక్షయజ్ఞవినాశనదీక్ష మున్ను,
ఘోరరూపయై యోగినీకోట్లు గొలువఁ;
జేయ నగు నాఁడు దాన విశేషపూజ. ౯-౨౭

క. నానాగంధసుమాదుల
దానంబున హోమములను దర్పణములచే
నానోపహారములతో
నానాఁ డర్చింపవలయు నంబిక శ్రద్ధన్. ౯-౨౮

వ. నవరాత్రంబు లుపవసింప నశక్తు లగువారలు సప్తమిని అష్టమిని
నవమినిఁ ద్రిరాత్రదీక్ష పూని యర్చింపఁ గామితఫలంబులు సిద్ధించు;
నీవ్రతంబునకు శ్రీదేవ్యర్చనంబును హోమంబును గుమారీపూజ
నంబును బ్రాహ్మణభోజనంబును బూర్ణతాహేతువులై విలసిల్లు;
నీ నవరాత్ర వ్రతంబునకుఁ దుల్యం బగు వ్రతంబు మఱొండు గానము.
ధనధాన్యంబులు నాయు రారోగ్యైశ్వర్యంబులుఁ బుత్రపౌత్త్రాభి
వృద్ధియు నీవ్రతంబుచే సంప్రాప్తంబు లగు. ౯-౨౯

తే. రాజ్య మర్థించువానికి రాజ్య మబ్బు,
విద్య యర్థించువానికి విద్య యబ్బు,
స్వర్గ మర్థించువానికి స్వర్గ మబ్బు,
మోక్ష మర్థించువానికి మోక్ష మబ్బు. ౯-౩౦

క. గతజన్మంబుల నెవ రీ
వ్రత మొనరింపంగ లేరొ, వా రీజనిలో
సుతహీనులు ధనహీనులు
పతిహీనలు వికలు లగుచుఁ బ్రభవింతు రిలన్. ౯-౩౧

క. కోమలతర బిల్వదళ
వ్యామిశ్రిత రక్తచందనార్చనచేతం
గామేశ్వరిఁ బూజించిన
భూమీశత్వంబు వాఁడు పొందు ధ్రువముగాన్. ౯౦౨

క. హరి హర కమలజు లింద్రుఁడు
వరుణుండుఁ గుబేరుఁ డగ్ని వాయు వినుండున్
సుర లెప్పుడుఁ గొలుచుఁ జండిక
నరు లేలా కొలువ రారు నవరాత్రములన్ ! ౯౦3

క. స్వాహా యనియు స్వధా యను
వ్యాహృతియుగ్మంబె యెవతెయనాహ్వయములు. త
ద్వ్యాహృతి మును లొనరించిన
నాహారము సురలుఁ బితరు లందెదరుగదా ! ౯౦౪

క. ఏయమ్మ పంపు సేయుదు
రా యయ్యలు ముగ్గు రాద్యు లమరోరగనై
హాయనపిశాచు లెవరే
నాయంబికశక్తి లేక యమరఁ గలారే ? ౯౦౫

తే. సర్వపాపప్రణాశిని సర్వకామ
దాత్రి సుమ్మి, రాజ ! నవరాత్రవ్రతంబు;
శివ భవాని సనాతని సేవ సేయ
వలయుఁ బరభక్తి శుభములు వడయు నరుఁడు. ౯౦౬

## నవరాత్రవ్రత మాహాత్మ్యము

క. విను తద్వ్రతమాహాత్మ్యము,
ధనహీనుఁడు బహుకుటుంబి ధర్మనిరతుఁ డొ
వణిజుఁడు కోసలదేశం
బున నుండె సుశీలనామపుణ్యాత్ముఁడు మున్. ౯౦౭

క. బాలకు లాఁకలి కేడ్వఁగ
బాలికలుం గడుపు నిండఁ బడయక సాయం
కాలం బాతఁడు తెచ్చిన
దాలుం బిడ్డలును గుడుతు రాతనితోడన్. ౯౮౮

సీ. ఐన నాతండు సదాచారనిరతుండు
శాంతుండు ధర్మవత్సలుఁడు ఘనుఁడు
సత్యసంధుఁడు ధృతిశాలి, క్రోధ మసూయ
మద మెఱుంగని నిరామయుఁడు సముఁడు,
దేవతలను బితృదేవతలను నిత్య
మతిథుల నర్చించి యంతఁ బ్రీతిఁ
బోష్యవర్గము నెల్ల భుజియింపఁగాఁ జెట్టి
గాని భుజింపఁడు తాను మున్న,
యట్టివాఁ డొక్కనాఁడు సాయాహ్నవేళ
నాలుబిడ్డలు నాఁకలి కలమటింప
నోర్వక, బుభుక్షితుం డయి యొయ్య నొక్క
సద్ద్విజుం జేరి యిట్లు ప్రశ్నం బొనర్చె. ౯౮౯

క. భూదేవా ! వేఁడెద నిను
నీదారిద్ర్యము తలంగు టెట్టులు? నాకున్
లేదు ధనేచ్ఛ యొకింతయు,
నీఁదంగఁ గుటుంబభరమె యెంచెద స్వామీ ! ౯౯౦

క. ఆఁకలి యాఁకలి యంచును
నాకోమరుం డడిగి యడిగి, నా కే మఁదున్
లేకున్న గుప్పెఁ డిడఁగా,
శోకముతో వాఁడు పిటిచొప్పునఁ బడియెన్. ౯౯౧

క. బాలకుఁ బదేండ్లు నిండెడు
నోలి వివాహమ్ము చేయ నొకకాసును లే

దేలా గొనరింతును బ్రా
ల్మాలినచో దానవేళ మఱి మించదొకో ! ౯౯౨

తే. ఆర్య ! సర్వజ్ఞుఁడవు, కృప నానతిమ్ము,
పోష్యపోషణ సేయఁగా బోలు ధనము
మాత్రమే పొందఁ జాలెడి మార్గ మేమి,
వ్రతమొ, దానమొ, తపమొ, మంత్రమొ, జపమ్మొ ? ౯౯౩

ఆ. దీనుఁడై సుశీలుఁ డీనుడు లాడంగ
విని ద్విజుండు మిగులఁ బ్రీతుఁ డగుచుఁ
బలికె, వైశ్యవర్య ! భగవతీనవరాత్ర
దీక్షఁ బూను, మింత దీని కేల ? ౯౯౪

క. సలుపుము భగవతిపూజలు,
సలుపుము హోమములు, శక్తిజపములు వేదం
బుల పారాయణములు, నీ
కొలఁదిగ ద్విజభోజనమ్ము గూర్పుము భక్తిన్. ౯౯౫

క. పావన మిది శోభన మఖి
లావన మిది సుఖద మిద్ది యాబ్రహ్మతృణ
శ్రీవర్ధన మిది బుధజన
భావిత మిది జ్ఞానదాత్రి వరదాత్రి యిదే. ౯౯౬

తే. రాజ్యపదవీచ్యుతుండు శ్రీరామమూర్తి
సీత నెడఁబాసి విరహవ్యథాతురుఁ డయి
చేసి నవరాత్రదీక్షఁ గిష్కింధయందుఁ
బరమభక్తి నారాధించె భగవతి మును. ౯౯౭

క. దానన్ వార్ధికి సేతువుఁ
బూనించి, దశాననుని సపుత్త్రికు సమర
క్షోణి వధించి, ధరాసుత
తో నేగి యయోధ్య నొంది ధ్రువముగ నేలెన్. ౯౯౮

తే. ఆవ్రతమహత్త్వ మిట్లు బ్రాహ్మణుఁడు తెలుప
వైశ్యుఁ డాతనిఁ బూజించి బహువిధములఁ
నంది యాతనికరుణ మాయాభిధాన
బీజమంత్రోత్తమంబు జపించె శ్రద్ధ. ౯౯౯

క. నవరాత్ర వ్రత మాతఁడు
నవరించెం దొమ్మిదైన సంవత్సరముల్
వివిధోపహారములతో
భువనేశీ జపవిధాన పూజా పరుఁడై. ౧౦౦౦

క. అల్ల మహాష్టమి జగముల
తల్లి నిశీథమునఁ దోఁచి తడఁబడెడు వణి
క్కల్లజు నానావరముల
వెల్లితుఁ గావించి ధన్యవృత్తి నొనర్చెన్. ౧౦౦౧

తే. వ్యాసుఁ డిటు పల్క వ్యగ్రుఁడై యధిపుఁ డంత
రాముఁ డేరీతిఁ గోల్పోయె రాజ్యమును
సీత, నతఁ డీవ్రతం బెట్లు చేసె, ననుచు
నడుగ, వ్యాసుండు పల్కె రామాయణంబు. ౧౦౦౨

## శ్రీ రామ చరిత్రము

శా. శ్రీమంతుండు విశాలవిక్రమకలాచిత్రుం డయోధ్యాపురీ
ధాముం డిద్ధర యేలె మున్ దశరథోదంచత్త్రిలోకీప్రభుం
రాముం డర్యమవంశదీపుఁ డఖిలార్యస్తుత్యకీర్తిం బ్రజా
క్షేమంభావుకుఁడై సుర క్షితిసుబ స్థేమక్రియావ్యగ్రుఁడై. ౧౦౦౩

తే. అతనిపత్నులు మువ్వ, రం దగ్రమహిషి
కోసలతనూజ కనె రాము గుణనిధాను,
భరతుఁ గైకేయి వినయాభిసరతుఁ గాంచెఁ,
గవల లక్ష్మణు శత్రుఘ్నుఁ గనె సుమిత్ర. ౧౦౦౪

క. జ్యేష్ఠుఁడు రాముఁడు గుణగ
రిష్ఠుండై దశరథునకుఁ బ్రేష్ఠుం డయ్యెన్,
నిష్ఠం గొల్వఁ గనిష్ఠులు
స్పష్టం బగు మతుల రాము శ్రేష్ఠుం డనుచున్. ౧౦౦౫

క. భాగ్యం బన నల దశరథ
భోగ్యం బన నొప్పె నెల్ల పుత్త్రులు సముల్లై
యోగ్యత శీలాకృతి సౌ
భాగ్యంబులఁ బెంపు నొంద వయసుకుఁ దోడై. ౧౦౦౬

ఉ. నెమ్మిఁ బొనర్చువేళ నుపనీతులఁ జేసిన, వేదముల్ తదం
గమ్ములు నేర్చి, వారును గణంగిరి చెప్పికొనంగఁ జాపవే
ద, మ్మది మున్ను దాఁచిన నిధానము సంస్మృతిఁ బాటిసంతఁ బ్రా
ప్త మ్మగు స్వస్వమట్లు నయి వారల కబ్బె దృఢంబుగా వెసన్.

క. షోడశమానాబ్దంబుల
యీడున రాముండు తండ్రి కిష్టుఁ డగు నెడన్
వేఁడెను విశ్వామిత్రుఁడు
తోడంపఁగ రాము యజ్ఞధూర్వహణమునన్. ౧౦౦౮

చ. జనకుఁడు పంప రాముఁడు భుజంబునఁ బూనిచి విల్లుబాణముల్
ఘన కరవాల శూల పరిఘ ప్రముఖాయుధపాళి, వీరశో
భన మగు చెల్వు గూర్చ ముఖపద్మముపైఁ బడు కాకపక్షముల్
సొనుపుచుఁ బాణిపద్మమునఁ జూపరు చొక్కఁ బయాన మయ్యెఁదాన్.

ఆ. అతని ననుగమించె ననుజుండు లక్ష్మణుం,
డట్లు వారు పూని నంటె యరుగ
యజ్ఞపురుషు నంటి హరిహరు లరిగెడు
పోల్కి దర్శనంబు పుణ్య మయ్యె. ౧౦౧౦

క. సరయూ దక్షిణతటమున
నరుగంగా వారు యోజనార్ధముమేరన్

భరితాదరమునఁ గౌశికుఁ
డరయుచు, రామా! జలంబు లంటుము, యనియెన్. ౧౦౧౧

చ. జలములు తాఁకి రాఘవుఁడు శౌచమనోహరకాంతిమూర్తియై
నిలిచినఁ గౌశికుండు గని, నీ కిదె యిత్తు సమానమైన వి
ద్యలఁ గొనుమా, బలాతిబల లన్నవి జ్ఞానకళాజనిత్రులై
పొలుచు నివే, త్వదీయమతిఁ బూను ననేకమహోజ్జ్వలాకృతుల్.

తే. అనుచు నజసుత లైన విద్యాద్వయంబు
రామునకు నీయ వాఁ డభిరాముఁ డయ్యె
మేఘగతుఁ డైన తిగ్మరశ్మియునుబోలె
సాంద్ర శారద పూర్ణిమా చంద్రుఁ డటులు. ౧౦౧౩

క. కుశికసుతుకథలు వించుం
గుశశయ్యలఁ బవ్వళించి కూర్కిరి వా రా
నిశ సరయూతటసైకత
విశదస్థలి నంత మౌని వేఁకువవేళన్. ౧౦౧౪

క. లేవయ్యా కౌసల్యా
దేవీప్రజ! పూర్వసంధ్య తివిరెడి, రామా!
దైవం బగు నాహ్నికవిధి
సేవింపఁగ వేళ, పురుషసింహమ! లేరా! ౧౦౧౫

తే. అనుచు లేపంగ రామలక్ష్మణులు లేచి,
స్నాతులుఁ గృతోదకులను నై, సలిపి పరమ
మంత్రజప, మాహ్నికంబులు మహితరీతిఁ
దీర్చి, ప్రణమిల్లి రా మౌనితిలకమునకు. ౧౦౧౬

క. సరయూ గంగా సంగమ
పరిసరముల కరిగి నాఁడు పరమప్రీత్యా
దరమునఁ గామాశ్రమముని
వరు లొసఁగినయతిథిపూజ వడసిరి వారల్. ౧౦౧౭

తే. వేగఁగా మఱి మఱునాఁడు విమలగాంగ
వారి సుస్నాతులై హుతవహ్ను లగుచు
నుడుపమున ముప్వురుం గంగ నుత్తరించి
కాంచి రలతాటకాఘోరగహనభూమి. ౧౦౧౮

క. ఝిల్లీనాదము శ్వాపద
వేల్లిత భైరవరవంబు విహగారభటీ
కల్లోలము దుర్గమతరు
వల్లీ వల్మీక ఘనము వనముం దానిన్. ౧౦౧౯

ఉ. చూపుచు నా కుమారులకు సూరివరేణ్యుఁడు పల్కె, రామచం
ద్రా! పని గల్గె నీ యెడఁ, బురాసమయంబున నీప్రదేశ మెం
తో పరిశోషకారి యయి యుండు, జనంబులు సందడించు రెం
డౌ పురరాజముల్ వెలయు, నక్కట! నిర్జన మయ్యె నేఁ డిటుల్.

ఉ. ఈయెడఁ దాటకాఖ్య వసియించెడు, యక్షిణి ఘోరరూప నా
గాయుతసత్త్వ సుందుసతి, యల్ల యగస్త్యమునీంద్రశప్తయై
యాయతరాక్షసీ తను గుణాయతులం గని పూరుషాదియై
పాయక సంచరించి యిటఁ బారణ సేయు సమస్తసత్త్వముల్.

క. మారీచుఁడు దీనికొడుకు
దారుణచరితుండు బలమదక్రముఁ డుండున్
వీ రిద్ద రిందుఁ జేయని
ఘోరంబులు లే, వొనర్త్రు గోవిప్రవధల్. ౧౦౨౨

ఉ. దీనిని, నీవు గాక, కడతేర్ప సమర్థుని ముజ్జగంబులం
గానము, సర్వభూతలయకారిణి దీనిఁ బ్రజావనాదృతిం
బూని, సమస్తగోభరముఁ బూని, ధరామరరక్షణవ్రతం
బూని, వధింపు, శంక లవ మొందక స్త్రీవధ యంచు, ధర్మ్యమున్.

ఉ. నావుడు రామచంద్రుఁడు వినమ్రత ని ట్లను, మౌనిచంద్ర! న
న్నీ వెనువెంటఁ బంపుతఱి నీపను చెల్లఁ బొనర్చునట్టు లు

ర్వీవిభుఁ డానతిచ్చె గురువిప్రులసన్నిధిఁ, దండ్రియాజ్ఞ వి
శ్వావసులా భవాదృశులయాజ్ఞ సమానము, బ్రహ్మవాదనా !

శా. అంచున్ మౌనికి మ్రొక్కి రాఘవుఁడు సాష్టాంగంబుగా, లేచి, చేఁ
గొంచుం జాపము మేరుసారమును, దత్కోటిన్ గుణం బూన్చి, పూ
రించెన్ రోదసిఁ, దద్గుణారవముతోఁ బ్రీతిన్ బుధుల్ పొంగఁగాఁ
జంచద్భీతిఁ గలంగి దుర్జనులయిచ్చల్ తూలి కంపింపఁగా. ౧౦౨౫

క. ఆ వింతయౌ భయంకర
రావము చెవిఁ జేరినంత రక్కసి, యెవఁ డో
రా వీఁ డని యార్చుచుఁ గ్రో
ధావిల యయి వారిపై సహంకృతిఁ గవిసెన్. ౧౦౨౬

క. మాయాయుద్ధవిశారద
యై యక్షిణి వారికన్ను లగపడకుండన్
బాయుచు దిక్కులు ఘూర్ణిల్
గో యని పై రాలవాన కురియుచుఁ దాఁకెన్. ౧౦౨౭

క. హుంకారమ్మున ముని తద
హంకారము మాన్చి, రామ, స్వస్తి యనుచు
మ్యోంకృతి చేసిన, రాముం
డంకించె శరంబు లాఁగి యాకర్ణముగాన్. ౧౦౨౮

క. బలమై రామశరం బతి
బలమై యశనిప్రపాతబలమై యత్యు
జ్జ్వలమై తాటకహృదయవి
దలనం బొనరించె నాటి తత్క్షణమాత్రన్. ౧౦౨౯

క. సురసంఘంబులు సిద్ధులుఁ
గురియించిరి పూలజల్లు కూరిమి మీఱన్
పరమాను లెల్ల సాధు
స్వరములు పరగించి రామపరులై రెలమిన్. ౧౦౩౦

తే. కౌశికుఁడు ప్రీతుఁడై తాటకావధమున,
రామున కొసంగె సకలాస్త్రరాజములను;
నంతఁ దనయాశ్రమముఁ జేరి యందు యజ్ఞ
దీక్షితుం డయ్యె, శ్రీరామ రక్ష యనుచు. ౧౦౩౧

శా. సావిత్రీపరమంత్రదర్శి యగు విశ్వామిత్రుయాగంబు శ్రీ
దేవీమూర్తిఁ ద్రిమూర్తమై యెసఁగె, ఋత్విక్సంప్రయుక్తశ్రుతి
శ్రీవిన్యాసముతోడ, నాహుతులతోఁ జెల్వొందు స్వాహా స్వధా
శ్రీ విద్యోతితహవ్యవాహుకళతో, శ్రీరామసంరక్షతోన్. ౧౦౩౨

క. శ్రీరాముఁడు సుమిత్ర కు
మారుఁడుఁ బెన్ ధనువు లూని మఖముం గావన్
మారీచుండు సుబాహుఁడు
ఘోరాసురబలముతోడఁ గూడిరి చెఱుపన్. ౧౦౩౩

క. దూరంబుననే యది గని
శ్రీరాముఁడు శరము దిగిచి దృఢముగ నేయన్
మారీచునిఁ ద్రోపాడుచు
వారాన్నిధిమధ్యమందుఁ బడ నేసె నృపా! ౧౦౩౪

క. ఆలోన సుబాహుం డా
భీలతఁ గవియంగఁ జూచి, పేర్చినరుషతోఁ
గోలన్ రాముఁడు హృదయము
కీలించిన, వాఁడు పడియెఁ గృత్తతరుగతిన్. ౧౦౩౫

క. తఱచై రక్కసిమూఁకలు
కేఱలంగా, లక్ష్మణుండు తిగ్మశరములన్
నఱకుచు వారల నందఱఁ
బఱపెన్ యమసదనమునకు వడి నతిథులుగాన్. ౧౦౩౬

క. సవనము లెస్సఁగఁ దీరిచి
యవభృథసుస్నాతుఁ డైన యమ్మునిచంద్రున్

సవినయముగ మ్రొక్కిన రా
ఘవులం దీవించె నతఁడు కదిరెడి ప్రీతిన్. ౧౦౩౭

క. మఱి యేమి యాజ్ఞ యన నా
మఱునాఁడే జనకనృపునిమఖము గనంగా
నరుగుద మచ్చోఁ గన నగు
నరుదగు శివధను వటంచు నా ముని పలికెన్. ౧౦౩౮

తే. పుణ్యకథ లాలకించుచుఁ బోవ వారు
కౌశికుం దొట్టి మౌనిపుంగవులఁ గూడి
గౌతమాశ్రమవీధి రాఘవుఁ డహల్య
స్వస్థ నొనరించె శాపపాపములవలన. ౧౦౩౯

తే. అటఁ గదలి వారు వైదేహునధ్వరంబు
గనిరి, బహుదేశభూసురకలితవేద
సుస్వరము, మౌనిసమ్మర్దశోభ, మధిక
వైభవము, నమందానందవాదనమ్ము. ౧౦౪౦

తే. గాధిజునిరాక విని, మిథిలాధినాథుఁ
డెదురు సని, యర్ఘ్యపాద్యాదు లిచ్చి, పూజ
సలిపి, ధన్యవాద మొనర్చి, తెలుపు మనియె
రాకకుం గత మా కుమారులఁగూర్చి. ౧౦౪౧

క. నావుడు విశ్వామిత్రుం
డీవిధమున మాఱుపల్కె, నీకొమరుఁడు రా
జీవాక్షుఁడు రాముఁడు, య
జ్ఞావన మొనరించి కూర్చె నధికప్రియమున్. ౧౦౪౨

క. చూపుము వీరికి శాంభవ
చాపం, బీపనియె పూని చనుదెంచితి, రా
జా! పుత్త్రులు దశరథకుల
దీపకులై పొల్చువారు తేజస్స్ఫూర్తిన్. ౧౦౪౩

సీ. జనకుండు ప్రీతుఁడై చాపసత్కథ యెల్ల
 వినిపించె నీరీతి విస్తరముగ;
నిమినుండి యాఱవ నృపుఁడు మాపూర్వుండు
 దేవరాతాఖ్యుండు తేజరిల్లు;
నతనిహస్తములందు న్యాస మొనర్చె స్వ
 యమ్ముగా దీని మహాశివుండు;
క్షేత్రంబు దున్నుచో సీత యగ్గ గన్పడియ
 లాంగలంబునఁ బుట్టె లక్షణాంగి;
యది యయోనిజ కావున నర్హ మనుచు
వీర్యశుల్కంబు దానికై విహిత మయ్యె;
నెందఱో క్షత్రియులు వచ్చి, రింత యెత్త
లేర! మఱి యేడఁ దద్ధనుఃపూరణంబు! ౧౦౪౪

క. పూర్వము దక్షాధ్వరమున
శర్వునకుఁ భాగ మీక సర్వముఁ దానే
గీర్వాణులు గొనఁగాఁ ద
ద్గర్వముఁ దూలింప నిద్ది కల్పింపఁబడెన్. ౧౦౪౫

క. మఱునాఁడు తేరఁ బంపఁగ
హరకార్ముకవరము పేర్మి నాయతభుజులౌ
నరు లైదు వేలు కదలిరి
పురిలోనికి జనకభూమిపునియానతిపై. ౧౦౪౬

క. ఎనిమిదిచక్రంబులతోఁ
దనరెడు నొక యినుపపెట్టె ధను వుండఁగ దా
నిని గంధమాల్యభూషిత
మొనరిచి మఖశాలఁ గడఁక నుంచిరి వారల్. ౧౦౪౭

శా. ఆమంజూషను జూపి మైథిలుఁడు, 'దేవా! దీని దేవాదులే
నా మోపెట్టఁగ లేర, మర్త్యులకు సాధ్యం బౌఁ దదారోపణం

చేమాడ్కిన్? శరయోజనం బెటుల నో? నింకన్ సరిన్ వేపనం
బేహా? తోలన మెట్లు? లైనఁ గననిమ్మా వీరి నీచాపమున్. ౧౦౪౮

వ. అని పలికిన, ౧౦౪౯

క. జనకునివిశదాక్షరములు
విని విశ్వామిత్రుఁ డనియె బిడ్డా! రామా!
కను ధను, వనఁ రాముఁడుఁ జి
వ్వున మంజూషఁ దెఱచి ధనువున్ స్పృశియించెన్. ౧౦౫౦

క. ముట్టుచుఁ బలికెను, ధను విదె
ముట్టితి మఱి తోలనంబుఁ బూరణమును జే
పట్టఁగ సెలవో? యన ముని
రాట్టిచ్చె ననుజ్ఞ జనకరాట్టు నవు నన్. ౧౦౫౧

చ. జనకుఁడు యజ్ఞవాటిఁ గల సర్వనృసింహులుఁ జూచుచుండ మో
హనగతి రామచంద్రుఁడు శివాత్మధను స్సవలీలఁ జేత నె
త్తెను, దివినుండి దేవతలు తేఱి కనుంగొని కావుమో జనా
ర్దన, యన, సిద్ధసాధ్యులు తథాస్తు తథా స్త్వని స్వస్తి చెప్పఁగాన్.

క. దైవతశిక్షకుఁగా హర
భావితమై పుట్టు గన్న బలువి ల్లది లో
కావనకృతావతారుఁడు
శ్రీవిభుఁ డప్పు డెక్కువెట్టె ద్రేల్మిడిఁ ద్రుటిలో. ౧౦౫౩

క. ఆరోపించి యతం డా
పూరించెడులోన దిశలు బూరటిలంగా
దారుణనాదము చేయుచు
భోరన నది విఱిగె రెండు ముక్కలు గాఁగన్. ౧౦౫౪

క. కొండయె విఱిగినదో, భూ
మండలమే వ్రస్సెనో కో, మఱి కాదే పై

నుండి పడెనో పిడుగే, కా
కొండే నీమ్రోఁత కలుగునొక్కో యంచున్. ౧౦౫౫

తే. జనకుఁడును రఘుపుత్త్రులు మునియుఁ గాక
తక్కుజన మెల్ల మోహవిత్రస్త మయ్యె;
నందఱుం దేఱినంతఁ బ్రీతాత్ముఁ డగుచు
మునికి దోసిలి యొగ్గి యిట్లనె జనకుఁడు. ౧౦౫౬

క. స్వామీ! దశరథరాముని
సామర్థ్యము తెలిసెఁ, గొలువ సాధ్యము కా దూ
హామేయ మతర్క్యము ని
స్సీమం బద్భుతము, వీరసింహుఁ డితఁడె వో. ౧౦౫౭

క. మాసీత యిట్టి రాముని
తో సంయోగమునఁ జేసి తుల లేని యశ
స్సీ సత్కులమున కలుగుచు,
నేసందేహంబు లేద యిందు, ధ్రువంబౌ. ౧౦౫౮

క. ప్రాణములకంటె నిది బహు
మానిత, రామునకు వీర్యమానప్రాప్తన్
దీని నొసంగెద దశరథు
నానయనమునకు మునీంద్ర! యానతి యీవే! ౧౦౫౯

తే. కౌశికుఁడు నల్లె యన జనకప్రభుండు
శీఘ్రగమనుల దూతలఁ జెప్పి పుచ్చ,
వా రయోధ్యను జేరి సభాగతుఁ డగు
దశరథున కెల్లకథయు విస్తరశుభోక్తి. ౧౦౬౦

తే. ఎఱుక సేయంగ నతఁడుఁ బ్రహృష్టుఁ డగుచు,
బాఢ మంచు వసిష్ఠుండు వామదేవుఁ
డఖిలమంత్రులుఁ దద్యాత్ర కనుమతింప,
వెడలె మిథిలకు హానులు నడువ ముందు. ౧౦౬౧

క. వారలు మిథిలం జేరఁగ
శ్రీరమ్యం బయ్యె మహానిసింహులకుశల
ప్రారంభసంగశ్లోక్తులు
నారాఘున జనక సౌహృదాలాపములన్. ౧౦౬౨

చ. జనకవిభుండు తాఁ జలుపుజన్నము పూర్తియొనర్చి స్నాతుఁడై
యనుజుఁ గుశధ్వజుం బిలువ నంపి యమాత్యు సుదామనాభిధుం
బనిచి సభాంగణంబునకు వైభవ మొప్ప నజాత్మజాతు ర
మ్మన నతఁడున్ ఋషీశ్వరుల నావుల మంత్రులఁ గూడి వచ్చెఁదాన్.

చ. అరుదుగ నంతటన్ దశరథాధిపుఁ గోర్కెమెయిన్ వసిష్ఠుఁ డె
ల్లరు వినఁ బల్కె రాఘవకులక్రమ మంతయు బ్రహ్మ యాది యా
వఱకును, రామలక్ష్మణవివాహనిమిత్తము వానికన్యలన్
వరణ మొనర్చె మైథిలు, సభాసదు లందఱు మెచ్చి యౌ ననన్.

మ. జనకుం డంత నిబద్ధపాణి యయి స్వచ్ఛప్రాభవోక్తిన్ వచిం
చెను, గన్యావరదాత యాత్మకుల మాసీమంబు వర్ణింపఁబో
లును నిత్యంబుఁ గులీనమార్గ మవులన్ రూపింతు నంచుం గడం
గెను వంశక్రమ మెల్ల నా నిమి మొదల్ కీర్తింపఁగా ధర్మ్యమున్.

వ. అనంతరంబ విదేహుండు— ౧౦౬౬

క. సీతను రాముని కిచ్చెద
నాతం డది వీర్యపణజయంబున గెల్చెన్
ప్రీతిగ నూర్మిళ దానము
సేతున్ లక్ష్మణున కిట్లు చేతుం జేతున్. ౧౦౬౭

క. అది విని విశ్వామిత్రుఁడు
ముదితుండై పల్కెఁ, బరమపుణ్యాకులంబుల్
సదృశము లిక్ష్వాకులదియు
విదేహులది యట్లు గాన వేడుక యయ్యెన్. ౧౦౬౮

క. భరతుఁడు శత్రుఘ్నుం డనఁ
బురుషోత్తము లున్నవారు పుత్త్రులు మఱి దా
శరథులు వా రిరువురకై
వరియింతుఁ గుశధ్వజేంద్రువరపుత్త్రికలన్. ౧౦౬౯

క. విని కృతకృత్యుఁడ ధన్యుఁడ
ననురూపము బాంధవం బటంచును హర్షం
బున ననుమతించి జనకుఁడు
పనిచెం గళ్యాణమంటపంబులు కూర్పన్. ౧౦౭౦

క. ధన్యుండు శతానందుఁడు,
ధన్యుండు వసిష్ఠుఁ డాది దంపతులకు నౌ
కన్యాదానగ్రహణము
లన్యోన్య మొనర్చి రప్పు డధికప్రౌఢిన్. ౧౦౭౧

క. లౌకిక వైదిక విభవ
ప్రాకట కల్యాణ మంటపంబున మహానుల్
భూకాంతులుఁ జూడఁగ సీ
తాకల్యాణంబు పుణ్యాతరమై యొప్పెన్. ౧౦౭౨

తే. సర్వభూషణభూషితఁ జారురూప
సీత రామాభిముఖముగఁ జేర్చి, యెదుర
వహ్ని వెలుఁగఁ బ్రదక్షిణావర్తశిఖల
ననియెఁ గౌసల్యకొడుకుతో జనకుఁ డిటులు. ౧౦౭౩

క. ఇది సీత నా కుమారిక,
వదలక నిను ఛాయవోలెఁ బత్నీవ్రతమున్
బదిల మొనర్చు, గ్రహింపుము,
కదియింపుము పాణి నీకుఁ గల్యాణ మగున్. ౧౦౭౪

మ. అనుచున్, జానకి మంత్రపూతజలధారామోచనప్రక్రియన్
జనకక్ష్మావిభుఁ డీయ దేవమునిరాట్సంఘోచ్చరత్సాధువా

దన ముప్పొంగెను దేవదుందుభులమ్రోఁతల్ పిక్కటిల్లెన్ జెలం
గ నమోఘం బయి పూలవాన, వెలసెన్ గీర్వాణలాస్యంబులున్.

సీ. అంతట వరుసగా నాత్మజ నూర్మిళ
పాణిని లక్ష్మణుపాణి నుంచె,
మాండవ్య భరతునిపాణిలో నుంచియు,
శ్రుతకీర్తి నుంచి శత్రుఘ్నుపాణి,
జనకుండు పల్కె, సజ్జను లౌచు మీ రెల్లఁ
బడతులతోడ సద్వ్రతులు గండు,
వారు నాలించి తత్పాణులు గ్రహించి
స్వీయపాణులలో, వసిష్ఠునాజ్ఞ,
దంపతులు నల్వు రపుడు ప్రదక్షిణంబు
సలిపి రగ్నికి వేదికి జనకునకును,
ఋషుల, కాయెడ దివిఁ బుష్పవృష్టి కురిసె,
దివ్యదుందుభిగీతవాదిత్ర మెసఁగ. ౧౦౭౬

క. వారల విశ్వామిత్రుఁడు
పూరించి శుభాశిషముల భూరిముదం బే
పారఁగ నుత్తరశైల
శ్రీరమ్యవనమ్ముఁ జేరె శ్రీయోగేచ్ఛన్. ౧౦౭౭

తే. జనకునియనుజ్ఞ దశరథక్ష్మావిభుండు
కదలఁ బురి కేఁగ, జనకుండు కనకరత్న
భూషణాంబర దాస దాసీసహస్ర
మాదిగా నిచ్చె హెచ్చు కన్యాధనంబు. ౧౦౭౮

క. కదలెను దశరథభూపుఁడు
పొదలెడి హర్షమున మునులు ముందు నడువఁగాఁ,
గదిసి నడువఁ జతురంగము,
లుదితప్రభ వారు పోవ నొక్కెడ దారిన్. ౧౦౭౯

క. బ్రహ్మ క్షత్రియ తేజో
జిహ్మగుఁ డగు పరశురామ శివగురుఁ డెదురై
బ్రాహ్మము వదలక రామ
బ్రహ్మంబున క్షాత్రశక్తిపాత మొనర్చెన్. ౧౧౮౦

క. మంగళవాద్యరవంబులు
నంగన లెత్తెడి సుమంగళారాత్రికముల్
మంగళకవిగీతములు చె
డంగుగ సాకేతపురిఁ జెలంగిరి వారల్. ౧౧౮౧

సీ. పదిరెం డేండ్లు సమస్తభోగములు దైవారంగ వైదేహిస
మ్మదలీలం జరియించె రాముఁ డభిరామప్రౌఢిఁ గ్రీడింపఁగా,
నిది శ్రీదేవి స్వయమ్ముగా మముఁ గటాక్షింపంగ నీమూర్తిఁ గొ
న్నది యంచుం బొగడం గుకుల్ పురజనం బాబాలగోపాలమున్.

చ. ప్రకృతుల కిష్టుఁడై తనకుఁ బ్రాణసమానుఁడు బంధుమిత్రపా
లికుఁ గడుఁ గూర్చువాఁ డయి, కడింది మగండు నశేషశాస్త్రసే
వకుఁడు మనోజ్ఞగాత్రుఁ డయి భాసిలురాజకుమారు రాజ్యల
క్ష్మికి నభిషిక్తుఁ జేయఁ దలఁచెన్ మదిఁ బంక్తిరథుండు నెమ్మిగాన్.

క. రామాభిషేకయత్నం
బామూలము తెలిసి కైక యర్థించెఁ బతిన్
దా మున్ను గొన్న వరములు
శ్రీ మీఱఁగఁ దీర్ప వేళ చేరె నటంచున్. ౧౧౮౪

ఆ. పదియు నాలు గేండ్లు ప్రవ్రజింపఁగ రాము
భరతుఁ జేయ రాజ్యపట్టభద్రుఁ,
గైక వేడ భూమికాంతుండు, హా రామ!
యనుచు నేల వ్రాలె నవశుఁ డగుచు. ౧౧౮౫

క. కదియు నభిషేకవేళకుఁ
గదలంగా జనకునాజ్ఞఁ గాంక్షించుచు స

మ్మదమున రామకుమారుఁడు
సుదర్శనాకారుఁ డెదురు సూచుచు నుండెన్. ౧౦౮౬

వ. అట్టియెడం గైకపనుపున సుమంతుం డరుగుదెంచి శ్రీరాము నామె
మందిరంబునకు రమ్మన, మహాప్రసాదం బని కదలి యందు విష
ణ్ణుండై యున్న నిజజనకుం గాంచి రాముం డి ట్లనియె. ౧౦౮౭

ఉ. ఏమిది తండ్రి! నన్నుఁ గని యింతయుఁ బల్కవు, క్రొత్త యయ్యె శ్రీ
రామ యటంచుఁ బిల్వ వభిరామవిధంబున, నాపొనర్చుత
ప్పేమిటి? సీతచే నయిన దే మఱి లోపము? తెల్పు వేఁడెదన్,
శ్రీమహనీయ! యప్రియము చేసెనె శత్రుఁడు, వానిఁ జెండెదన్.

క. ఎన్ని వచించిన రాముఁడు,
కన్నత్తఁడు దశరథుండు కాంచఁగఁ, బలుకం
బన్నఁడు పెదవు లోకించుక,
స్విన్నాననమవలఁ ద్రిప్పివేయును జడతన్. ౧౦౮౯

క. కారణ మెఱుఁగక వెలవెలఁ
బాఱెడి శ్రీరామచంద్రువంకన్ వికృతా
కారం బగు నెలనగవు ప్ర
సారించుచుఁ గైక పలికె సస్ఫుటఫణితిన్. ౧౦౯౦

శా. రామా! యీయెడ దాఁచనేమిటికి? శ్రీరాజేంద్రుఁ డెన్నాళ్ళనాఁ
డో మా కిచ్చె వరద్వయంబు, దయచేయుండంచు నర్థింప నేఁ,
డేమాడ్కిం బెడమోము వెట్టి పలుకం, డేమందుఁ నీవైనఁగా
నీ మీతండ్రిని సత్యవాక్యపదవీనిష్ఠం బ్రతిష్ఠింపవే! ౧౦౯౧

క. పదునాలు గేండ్లు కానన
పదవికి నినుఁ బ్రవ్రజించి భరతుని రాజ్య
పదవికి నభిషిక్తునిఁగా
నొదవింపఁగ వేఁడినార మోయి కుమారా! ౧౦౯౨

క. రాముఁ డనె మ్రొక్కి కైకకు
నీమాత్రంబునకె యాజ్ఞ యీవలెనె గురుల్ !
నీమాటమేర చాలదె
యోమాతా ! యిపుడ దండకోర్వికిఁ బోదున్. ౧౦౯౩

ఆ. అనుచు వెడలి రాముఁ డాయితం బగు నెడ
నతని ననుగమింప నాజ్ఞ గొనియె
సాధ్వి సీత, మఱియు సౌమిత్రి వెనువెంటఁ
జనియె రామవిభుఁడు సమ్మతింప. ౧౦౯౪

ఉ. ఆయెడ రామమాతయు నిజాత్మజుమంగళ మర్థిఁ గోరి యా
త్మాయతనంబునందు శుచియై పరదేవత సర్వదైవత
ధ్యేయను సర్వమంగళ నధిష్ఠితఁ జేసి సుమేరుశృంగమ
ధ్యాయతతుంగపీఠమున నర్చ యొనర్చుచు నుండె భక్తిగన్.

ఉ. తల్లినిఁ జేరి రాముఁడు ప్రదక్షిణపూర్వక మంబపాదసం
ఫుల్లసరోజపీఠి శిరముం గదియించి యొఱంగి భక్తి, నేఁ
డెల్లిదమొ మళ్ళి వచ్చు తెఱఁగే తనయే గడి దండకాటవీ
సల్లపనంబులో నెల వొసంగఁగ వేఁడె సుశాంతవైఖరిన్. ౧౦౯౬

తే. అంత నెఱిఁగి సమస్తంబుఁ గొంత తడవు
కైక దూషించి యొకకొంత కొంతుఁ బదరి
కొడుకువెంట నడవి కేగఁ గోర, రాముఁ
డామె వారించె సతిధర్మ మప్పుడుఱచి. ౧౦౯౭

తే. మంగళవ్రతదీక్షా శుభాంగి యామె
మంగళాభిముఖ యయి సర్వాంగరక్ష
తీర్చి యాశీఃపరంపర కూర్చి నిట్లు
లాత్మజున కందు మున్నులు తథాస్తనంగ. ౧౦౯౮

ఉ. మంగళ మేది దైవతనమస్కృతుఁ డైన సహస్రనేత్రుచే
సంగత మయ్యె వృత్రహరసంగరవేళ, సుపర్ణమూర్తికిన్

మంగళ మేది యా గరుడమాత యొనర్చె సుధాభిలాష, నా
మంగళమే సదా నినుఁ గుమారక ! కూడునుగాత, రాఘవా !

మ. అమృతోత్పాదనవేళ దైత్యకులసంహారార్థమై వజ్రికిన్
సముపాత్తం బెది మంగళం, బదితిచే సంప్రేషితంబై, త్రివి
క్రమముల్ పూనిన విష్ణుదేవునకు సంప్రాప్తించె నేమంగళం,
బమరుం గా కవి నీకు నెల్లపుడు భద్రాపాదులై, రాఘవా ! ౧౧౦౦

క. ఋతువులు సాగరములు ద్వీ
పతతియు వేదములు లోకపాళియు దిశలున్
సతతము శుభమంగళ స
మ్మతి నీకుం గూర్చుఁగాత మంగళశతముల్. ౧౧౦౧

వ. ఇట్లు సర్వమంగళాభిముఖయై ప్రియకుమారు నాశీర్వదించి మఱియు.

తే. దేవనిర్మాల్యవస్తువుల్ తీర్చి నుదుట,
రామునకు గంధముల్ పూసి రక్ష గూర్చెఁ
గామ్యకరణౌషధి విశల్యకరణిచేత,
జనని కౌసల్య తన్మంత్రజప మొనర్చి. ౧౧౦౩

మ. మఱియున్ వంగి శిరంబు మూర్కొనుచు రామారత్న మారాముఁ డా
నగమందుం గదియించి పల్కె, నిట రమ్మాయీ కృతార్థుండవై
మరలన్ రోగము నొప్పి లే కమరి, ప్రేమన్ సీతతోఁ గూడి బం
ధురసింహాసనభద్రశోభితునిఁ గాంతుంగాక నిన్ రాఘవా! ౧౧౦౪

క. మాతృకృత స్వస్త్యయన
ద్యోతితుఁడై రాముఁ డంతఁ దూర్ణగతిన్ స్వీ
యాతతమందిరగతుఁడై
స్ఫీతమతిన్ భూమిసురులఁ బిలువంబంచెన్. ౧౧౦౫

ఉ. అందు వసిష్ఠపుత్త్రుని సుయజ్ఞునిఁ బిల్వఁగఁ బంపి ముందుగా
వందన మాచరించి భయుభక్తుల నర్పణ చేసె వాసికిన్

గుందనపుంబురుల్ కటక కుండల హారము లాది భూష లొ
ప్పం దగు రత్నసంచయము భాసురశయ్యలుఁ గుంజరావళుల్.

తే. వెండియుం గాశికు నగస్త్యు విప్రవరులఁ
బిలిచి దానం బొనర్చె వారలకుఁ బ్రీతిఁ
బసిఁడి వెండియు మణులు గోవ్రజ మనేక
దాసదాసీజనంబు వస్త్రములు ధనము. ౧౧౦౮

క. అపరిమితద్రవ్యముఁ దన
యుపజీవులు తృప్తి పడఁగ నొసఁగి, యితరముల్
గృపణులకు బాలవృద్ధుల
కపార వేదమహీసురుల కర్పణచేసెన్. ౧౧౦౯

ఉ. ఆయెడ నుండు గార్గ్యుఁడు ధరామరుఁ డొక్కఁడు పింగళుం డర
ణ్యాయితభూమిలోనఁ ద్రిజటాఖ్యుఁడు, నిత్యము నుంఛవృత్తి నే
చాయనొ జీవముం గడపుఁ జాలులు దున్నుచు లాంగలంబుతోఁ
ద్రోయుచు ఫాలముం జెమటఁ దోఁగుచు గుద్దలిఁ జేతఁ బట్టుచున్.

వ. ఆవృద్ధతపస్వికిఁ దరుణవయస్కయు బహుపుత్త్రవతియు నగు సాధ్వి
ధర్మపత్ని యుండు; నాయిల్లాలె యి ల్లంతయు నెట్లో సవరించు
కొనుచు, దారిద్ర్యాభిపీడిత యయి వగచుచు సంసారబాధ పట్టించు
కొనని నిజనాథుం గాంచి యి ట్లనియె. ౧౧౧౦

క. ఆలింపు పలుకు నాయది
ఫాలము కుద్దాల మిట్లు పట్టు టికైనం
జాలించి బయలు దేరుము
నూడఁగ ధర్మజ్ఞు దానశూరున్ రామున్. ౧౧౧౧

తే. పడఁతివాక్యంబు లాలించి బ్రాహ్మణుండు
కప్పికొనఁ గాని యొక శాటి కప్పి మీఁద
బయలు వెడలెను దశరథపార్థివాత్మ
జాతమందిర ముందునాచాయఁ బట్టి. ౧౧౧౨

క. భృగ్వాంగిరసస్సమద్యుతి
దిగ్వలయంబులు వెలుంగఁ ద్రిజటుఁడు నడువన్
వాగ్వైదగ్ధ్యము లెడలిరి
దృగ్వివరము లప్పగించి తెలి వఱి క్షత్త్రుల్. ౧౧౧౩

క. పంచమకక్ష్య నవక్రో
దంచితగతిఁ జేరి యచట దశరథరాముం
గాంచి కడుం బ్రీతుఁ డయి వ
చించెను ద్రిజటుండు వాని కిట్టులు నెమ్మిన్. ౧౧౧౪

క. పిల్లలు గల నిఱుపేదను
నిల్లిల్లును బిచ్చ మెత్తి యే జీవింతున్
సల్లలితయశా! నృపసుత!
చల్లని చూపునను గాంచి చన వీయఁగదే. ౧౧౧౫

వ. అట్లారుండై కుచేలుం డగు నా వృద్ధబ్రాహ్మణుండు తూలుచుఁ దనకఱ్ఱ యూఁతఁ గొని యెట్లో నిలుచుచుఁ దన్ను యాచింప లేక యిట్లు వచింప విని, శ్రీరాముండు మందహాససుందరవదనారవిందుండై,

ఉ. ఆమునిఁ గాంచి ప్రీతిఁ బరిహాససమన్వితవాక్కు పల్కె, నే
నీమునుపే సమస్తమును నిచ్చితి దానము, నాలమంద లేఁ
గా మిగిలెన్ సహస్ర; మవి కఱ్ఱను నీయది యెంత దవ్వు పోఁ
గా మఱి వేయు, దంతదనుకన్ సరి గోవుల నీ కొసంగెదన్.

క. రామునినుడి విని వడివడి
నాముని నడుమునకు శాటి నమరిచి, ప్రాణా
యామపరుం డయి విసరిన
నామునికోల పడె సరయునావల లీలన్. ౧౧౧౬

క. వెంటనె రాముఁడు త్రిజటుని
నంటి కవుంగిటను గ్రుచ్చి, యలుగకు దేవా!

యంటిని నవ్వులకై నీ
దంటతనం బెఱుఁగ వేఁడి, దయచూఁగదే! ౧౧౧౯

క. నా కున్న ద్రవ్య మంతయు
శ్రీకర మగు విప్రపూజచే ధన్య మగున్
నీ కోరిన యేదేనియుఁ
జేకొని రక్షింపు, నిజము చెప్పితి స్వామీ! ౧౧౨౦

తే. పత్నితోఁ గూడి త్రిజటుండు పాడియాల
మాత్రమే కొని తుష్టుఁడై మఱియు మఱియు
నాముని యొసంగె రామున కాశిషములు
ప్రీతి సుఖ బల జయ యశో బృంహణములు. ౧౧౨౧

తే. తక్క ధన మెల్ల విప్రసత్తముల కొసఁగి
మిత్రభృత్యులఁ జేసి సంప్రీతులుగను
నిజసతిం గూడి తండ్రిసన్నిధికి వచ్చె
మ్రొక్కుతమి రాముఁ డడవికిఁ బోవుముందు. ౧౧౨౨

క. తమ్మునితో రాముఁడు పితృ
సమ్ముఖమునఁ గట్టె సవతిజనని యొసఁగఁగా
నిమ్ముగ వల్కలములు, నీ
తమ్మ కొకటి కప్పెఁ గట్టు టది యెఱుఁగమిచేన్. ౧౧౨౩

క. శ్రీరాముం డడవికిఁ జనెఁ
దో రా లక్ష్మణుఁడు జనకదుహితయు నెమ్మిన్;
హారామ! రామ! యంచును
జేరెం గౌసల్య గృహము శ్రీదశరథుఁడున్. ౧౧౨౪

క. రామా రామా యని శ్రీ
రామస్మరణంబు తక్క రానీ కొండౌ
నేమాట నాల్క దశరథ
భూమీశుఁడు తనువు వదలెఁ బుత్త్రార్తుండై. ౧౧౨౫

తే. మాతులగృహంబునుండి సాకేతపురికి
భరతుఁ డనుజునితో వచ్చి వార్త లెఱిఁగి
తండ్రి కొనరించి పరలోకతర్పవిధులు
తల్లి దూఱుచు రాజత్వ మొల్లఁడయ్యె. ౧౨౬

ఆ. చిత్రకూటమందు శ్రీరాముఁ డుండుట
యెఱిఁగి యరిగి యన్న కెఱఁగి వేఁడెఁ
దిరిగివచ్చి రాజ్యపరిపాలనము చేయ,
నన్న యియ్యకొనక యతనిఁ బంపె. ౧౨౭

వ. భరతుండు శ్రీరాముపాదుకలు మహాభక్తిం దెచ్చి ప్రభుస్థానంబున
నిలిపి తదనుమతి రాజ్యకార్యంబులు నిర్వర్తించుచుండె. అట శ్రీరా
ముండు సీతా లక్ష్మణ సమేతుండై, ౧౨౮

క. దండకవని మున్యాశ్రమ
మండలిఁ గాంచుచు నగస్త్యమౌని కెఱఁగ నా
తం డాదరమున వారల
నుండుం డని పంచవటికి నోజం బంపెన్. ౧౨౯

ఉ. చెంగట గౌతమీనది శుచిప్రవణంబుగఁ బాఱఁగా శ్రమ
మంగళహారు లైన ద్విజమాలిక లొప్ప సమిత్కుశోదకం
బుం గడు రమ్యముల్ వివిధపుష్పఫలాఢ్యము నౌ వివిక్తభూ
మిం గని పర్ణశాల యట మించినప్రీతి రచించి రత్తఱిన్. ౧౩౦

క. ఇచ్ఛలఁ బ్రమదంబున వా
రచ్చో నుండంగ, రావణానుజ యటకున్
వచ్చి, రఘూత్తమురూపము
మెచ్చి, యసమబాణుచేయిది మేరలు మీఱన్. ౧౩౧

తే. ముక్కుఁ గోయింపఁ గని క్రోధమూర్ఛితు లయి
యెత్తివచ్చి రాము శిక్షించు నిచ్ఛ

దైత్యులు ఖరాదు లతిబలదర్పితాత్మ
లొక్కటఁ జతుర్దశసహస్రయోధవరులు. ౧౧౩౨

క. శ్రీరాముఁడు నిజకార్ముక
ధారాధర ముక్త బాణ ధారావృష్టిన్
వారల నెల్లర నొక్కఁడ
కారించుచుఁ ద్రుంచె మూఁడు గడియలలోనన్. ౧౧౩౩

ఉ. కో యని యంత శూర్పణఖ కూయిడుచున్ వెస లంకలోనికిం
బోయి దశాస్యుఁ గాంచి, తనపోకడ తెల్పక, దూషితాత్మయై
పోయితినోయి రాముఁ డను భూపకుమారునిచేతిలోనఁ గో
ల్పోయితి నాసమున్, ఖరుఁడు వోయెను, బోయిరి దూషణాదులున్.

క. అనుచుం జెప్పెడునంతర
మున నెరవున మఱియుఁ జెప్పె ముల్లోకములన్
గనియుండ మీఁదు చక్కం
దనమున సీతమ్మ కతసితరుణికి ననియున్. ౧౧౩౫

సీ. ఆ ఖలుం డంత రోషవశాత్ముఁ డగుచు
నరద మెక్కి రయంబున దరిసె సాయ
ముడుగ మాయావి మారీచునాశ్రమంబు;
కదలె వాఁడును మాయామృగంబుగాఁగ. ౧౧౩౬

మ. ఆ మాయామృగ రామణీయకము నేమందున్, శరీరద్యుతుల్
హైమస్థాపితరత్నరోచిరుపమేయంబుల్, మణుల్ శృంగముల్
మోముం గోకనదాభముం, జెవులు రెండుం జూడ నైంద్రాశ్మముల్,
శ్రీ మీఱున్ ఖురముల్ విదూరమణులై, శ్రీకారమే పుచ్ఛమున్.

క. శ్రీహరిమాయయె సీతగ
దేహం బై రూపు దాల్పఁ, దివురుచు దానిన్
మోహింపఁ జేయ నమ్మృగ
మూహించుచు నికటభూమి నొయ్యనఁ దిరిగెన్. ౧౧౩౮

క. కొఱుకుం బచ్చిక, చెంగున
నుఱుకున్, గ్రీవంబు ద్రిప్పి యొయ్యారముగాఁ
బరికించు నిండుఁగన్నులు
దెఱచి దిశల్, రిక్కఁ జెవులు ద్రిప్పుచుఁ దోఁకన్. ౧౧౩౯

క. వేడుకపడి దానిం గని
వేఁడెన్ వైదేహి ప్రాణవిభుఁ దేరంగా
లేఁడిని, విధిచేఁతల కెదు
రాడఁగ నెవ్వరికి శక్య మవనీస్థలిలో? ౧౧౪౦

క. రాముఁడు నొం డాడక మది
నేమియు శంకింపకే మహేష్వాసుండై
యామృగపద మంటి చనెన్
నేమించి సురక్ష కిచట నిజసహజన్మున్. ౧౧౪౧

క. అది తనమాయను రాముని
సుదూర మెలయింప నలుకఁ జూచి యతండున్
బదిలముగ లాఁగి శరమును
గుదులుచుఁ గృత్రిమమృగంబు కూలఁగ నేసెన్. ౧౧౪౨

క. హతుఁడై రామశరాహతి,
హాతోఽస్మి సీతే! హాతోఽస్మి హా సౌమిత్రే!
ఇతి నితరాం రామస్వర
గతి దీనత నఱచెఁ బడుచు ఖలుఁ డట్లు వెసన్. ౧౧౪౩

శా. ఆయార్తస్వర మాలకించి యట సీతాబ్జాతపత్త్రాక్షి, బే
లై, యొక్కుమ్మడి నుల్కిపాటు వడి, మ్రాన్పడిపోయి యాలోన నె
ట్లో యూర్పుల్ నిగుడించుచున్ బవకోల్లోలన్మన స్థైర్యయై
యాయాసంబున రోఁజుచుం బలికె నిట్లా యమ్మ సౌమిత్రితోన్.

క. లేవయ్యా యన్న లక్ష్మణ!
పోవయ్యా! వేగ, మదిగో భగ్నస్వరుఁడై

చేవ చెడి తోడు పిలిచెడి,
నీవును విన లేదో యన్న నిన్నుఁ బిలుచుటల్? ౧౧౪౫

తే. ఒసఁగె దానికి సౌమిత్రి యుత్తరంబు,
నమ్మ! యసహాయ నిను దిగనాడి యిచట
నడుగు కదలను, శ్రీరామునాజ్ఞ మీఱఁ
బోను, మాయావి యటు కొనిపోక చూచి. ౧౧౪౬

చ. తిర మొనరింపు నీయెడఁదఁ, దేరుము, ధైర్యము నూను తల్లి, యి
ద్ధరణి సమస్తభూతతతి తథ్యము రాము హరింపఁ జాలునే!
పొరయ ద దెట్టి యాపదయు భూసుత! ని న్నిట నొంటి నుంచి మీఁ
దరయక పోయి భ్రాతృవిహితాజ్ఞ విలంఘన చేయ నొప్పునే?

వ. అట్లు ధైర్యంబు పలుకు నాతనివచనంబు లాలింపక సీతాసుదతి విధి
చోదితయై యక్రూర యయ్యుఁ గ్రూరాక్షరంబుల శుభలక్షణుం
డగు లక్ష్మణునితో ని ట్లనె. ౧౧౪౮

క. ఎఱిఁగితి నిప్పుడు లక్ష్మణ!
భరతప్రేరితుఁడ వీవు పాపిష్ఠమతిన్
మఱలు గొనినావు నాపయిఁ
బరపురుషుం గొనఁగఁ, దలఁతొ స్వైరిణిగ ననున్! ౧౧౪౯

క. ఇప్పుడు రాముఁడు రాకిటఁ
దప్పినయెడ నేను విడుతుఁ దథ్యము, మది నీ
చొప్పడినటులనె పో, నిలు,
మెప్పాటం జనియె నన్నయెడ నెన రెల్లన్. ౧౧౫౦

ఉ. జానకిమాటపోట్లు నిజసంధుల దూరి శరంబులట్ల కా
దీనత రుద్ధకంఠుఁ డయి దేవరుఁ డిట్లనుఁ గ్రూరవాక్కులి
ట్లానతి యిచ్చినావు, పరమాపద రానగు నంచు నాత్మధీ
జ్ఞానము వెల్గు నే మనఁగఁ జాలుదు ని, న్నని పల్కి యాతఁడున్.

తే. కదలె నావీరుఁ డగ్రగజాపదమునంటి
పొగలుచుం బెల్లు శోకార్తిమూర్తి యగుచు,
నంతఁ గపట త్రిదండి సంన్యాసివేషుఁ
డై ప్రవేశించె రావణుం డాశ్రమంబు. ౧౧౫౨

క. యతిగా నాతనిఁ దలఁచుచు
నతిభక్తిన్ సీత యొసఁగి యర్ఘ్యము వన్యో
ద్యతభైక్ష్యసమర్పణఁ బూ
జితుఁ గావించెను దురాత్ము జితసురనాథున్. ౧౧౫౩

వ. త్రిలోకకంటకుం డగు నా దశకంఠుండును, మృదుస్వరంబు లగు నమ్రవచనంబుల దాని నిట్లని ప్రశ్నించె. ౧౧౫౪

ఉ. ఎవ్వతెవే వనంబునఁ జరించెద వొంటిఁ? బ్రియాంగి! తెల్పు మీ
వెవ్వరిపుత్త్రి వౌదు? పతి యెవ్వఁడు? పద్మపలాశలోచనా!
యెవ్వఁడు నున్నె, చక్రసమవృత్తకుచద్వయి! తోడు నీకు, సం
దివ్విధి నుండ వీటెఁడివటే వరవర్ణిని! నిర్జనాటవిన్? ౧౧౫౫

శా. నాకుం జూడఁగఁ జంద్రకాంతముఖ నానారత్న చామీకర
వ్యాకీర్ణామల సౌధరాజములలో, వామోరు! నెల్లొందఁగా
నీకు న్నీ డగుఁ గాని యిట్లు మునిపత్నింబోల నీ పర్ణశా
లాకూపంబున మ్రగ్గ నౌదువటె, స్వర్భామాసమప్రాభవా!

క. రావణుఁ డటు పలుకంగా
దైవవిధిన్ యతియకాఁగఁ దలపోయుచు నీ
తావసితయుఁ బ్రతివచనం
బీవిధి మండోదరీసతీశున కొసఁగెన్. ౧౧౫౭

తే. ఎఱిఁగియేయుండు దశరథధరణినాథు,
నలువు రాపుణ్యశాలికిఁ గలరు పుత్త్రు,
లందు జ్యేష్ఠుండు రామనామాంకితుండు
విశ్రుతపరాక్రముండు మద్విభుఁ డతండు. ౧౧౫౮

వ. అన విని రావణుం డిట్లనియె. ౧౧౫౯

శా. లంకేశుండ నరాళకుంతల! త్వదర్థం బీ యతీశస్వరూ
పాంకంబుల్ ధరియించితిన్, దెలుప నేలా కొంకు, మందోదరీ
పంకేజాక్షివిభుండ, శూర్పణఖ చెప్పంగా ఖరాదుల్ రణా
హంకారుల్ తెగు టెల్ల వింటి, నదె నీకై పోవఁ బ్రేరేచె నన్.

శా. బేలా! యేటికి నీకుఁ గేవలనరుం బ్రేమింప? వాఁ డందు నీ
లీలన్ సంహృతరాజ్యుఁడున్ వ్యపగతశ్రీకుండు నుగ్రాటవీ
వ్యాలోలాత్ముఁడు దుర్బలుం, డతనితోఁ బాటీవు నిట్లుండఁగా,
నేలా? వీడుము, నన్నుఁ గొమ్ము పతిగా, నీశుండ నాశాళికిన్.

ఆ. అబల! మున్న జనకు నర్థింప నీకయి
శివధనుఃపణంబుఁ జెప్పె నతఁడు;
దానిగౌరవమున నే నీస్వయంవర
మునకు బయలుదేర మొనయకుందు. ౧౧౬౨

క. అది మొదలుగ నీపయి నా
మది లగ్నం బయ్యె నాటి యనురాగ మెదన్
వదలమి నిటు వచ్చితి నను
బ్రదికింపవె కరుణఁ జూచి పాటలగంధీ! ౧౧౬౩

తే. రావణుఁడు దుష్టవాక్యంబు లీవిధమునఁ
బలుక నాలించి భూజాత యొడలు
కంప మొందంగ నెట్టులో కలఁత కుదియఁ
బదిల మొనరించి మది నిట్లు బదులు పలికె. ౧౧౬౪

తే. అయ్యో! పౌలస్త్య! యిటు లేలనయ్య! తులువ
పలుకు పలికితి, కామవిహ్వలుఁడ వౌదు!
వెనత ననుకొంటి? స్వైరిణినే? తలంపు,
జనకుల పవిత్రవంశ సంజాత నగుదు. ౧౧౬౫

క. పోఁగదవయ్యా! ప్రాణము
పైఁ గలదే తీఁపి నీకు వైళమ పురికిన్
నేఁ గారణముగ రాముని
చేఁ గోల్పోయెద నుసురు సిద్ధము కుమతీ! ౧౧౬౬

తే. హామ్మ హాహా మ్మటంచుఁ జెప్పుచునె సీత
వసుమతీరావణాంకు రావణునిఁ జూచి
యతిరయంబునఁ బర్ణశాలాంతరంబు
నం జొరంబాఱె యగ్నిచెంగటను డాఁగె. ౧౧౬౭

ఉ. ఆయెడ నొక్కపెట్టున దశాననముల్ మొలకెత్త సంజనా
గాయతశీర్షపంక్తివలె, నగ్నికణంబులు క్రుమ్మరింపఁగా
నేయెడఁ జూపు లిర్వది, ఫణీంద్రములట్లు భుజంబు లాడఁగా
స్వీయభయంకరాకృతి భజించి నిశాటుఁడుఁ జొచ్చెలోనికిన్.

ఆ. చొచ్చి పర్ణశాల నచ్చట భయవిహ్వ
లాంగి యగుచు నేడ్చునట్టిదాని,
రామ రామ యంచు లక్ష్మణా యంచును
నెలుఁగులిడెడు దాని బలిమిఁ బట్టె. ౧౧౬౯

తే. పట్టి యాపాపి భీతి సత్వరమ పర్ణ
శాల వెలువడి రథముపై బాల నుంచి
తరలె నాకాశపథమున, మరల మరల
లక్ష్మణుని రాము నెలుఁగు లిడంగ సీత. ౧౧౭౦

క. రామా రామా యను సీ
తామానినియార్తరవము తాఁకఁగఁ జెవులం
దా మి న్నంది జటాయువు
భీమంబుగఁ దాఁకెఁ బరువు వెట్టు దశాస్యున్. ౧౧౭౧

మ. నఖతుండైకసమీకసాధనవిహంగస్వామి యావేళ స
మ్ముఖుఁడై రాక్షసనాథుతోఁ దొడరె సంస్ఫోటాసిపత్త్రిఘను

ర్మ్మఖ సర్వాయుధసాధనోద్యతునిత్తో రోషంబు దీపింపఁగా
నఖిలాకాశపథంబుఁ దాన యయి యత్యంతాద్భుతప్రక్రియన్.

క. వాఃోద్ధత మేఘద్వయ
మేతీరున గగనవీథి నెదురుకొను, సప
క్షాతతగిరియుగ మేక్రియ,
నాతీరున వారిసంప్రహారము వెలసెన్. ౧౧౬౩

తే. శరపరంపర కురిపించి సంగరమున
గృధ్రపతిపై నిశాటుండు కెరలి కినుక
శరశతావారితుం జేయ మెఱసె నతఁడు
తన కులాయంబు గన్న పతత్త్రియట్లు. ౧౧౬౪

మ. ఎదురన్ జానకి లోచనాబ్జముల నెంతే జాఱఁగా నశ్రువుల్
గదురంగా విలపింప, దానిఁ గనుచుం, గ్రందింప వైదేహి గ
ద్గదకంఠంబున రామ రామ యనుచుం గాడంగ శ్రోత్రంబు లిం
కెదియుం జూడక యాలకింపక విహంగేంద్రుండు విస్రబ్ధుఁడై. ౧౧౬౫

మ. పటుపాదాహతి దైత్యచాపము వెసన్ భంజించి, తూణీర ము
త్కటపక్షోద్యతమారుతాహతుల వీఁకన్ దిక్కులం జిమ్మి, వి
స్ఫుటతుండాహతి సారథిం దునిమి వమ్ముం జేసి యుగ్యంబులన్
విటతాటం బొనరించెఁ దేరు ధ్వజమున్ వెల్గొందుతచ్ఛత్రమున్.

క. విరథుం డై రావణుఁ డ
త్తఱి వైదేహిఁ దనయంకతలమునఁ గొని ది
క్కెఱుఁగక భూమీతలమున
కుఱికెన్ వెన్నంటి పక్షియును బొడువంగా. ౧౧౬౬

మ. శిరముల్ గీరుచు బాహువుల్ నఱకుచుం జెండాడుచున్ వక్షమున్
బరులం జీల్చుచు వీఁపునం బొడుచుచుం బాదంబులన్ వ్రచ్చుచుం
బరిచారం బొనరించె రావణుని నా పక్షీంద్రుఁ డాయాజిలో
మఱియుం గ్రూరతరాక్షరంబులను దన్మర్మచ్ఛిదం జేయుచున్.

క. పెరిగినరుష నప్పు డసురయుఁ
బెటికి వెసఁ గోలు విహగవిభుపక్షంబుల్
బరులు న్నఱకెను దెగిపో
నురలఁగ రుధిరంబు పుడమి గ్రోలఁగి పడంగన్. ౧౧౭౯

ఆ. పడుటఁ గాంచి సీత పరుగిడుచుం జేరఁ
బోయి నెత్తు రోడు పులుఁగు నొంటి
నాత్మబంధువట్లు లాలింగన మొనర్చి
వివిధగతులఁ జేసె విలపనంబు. ౧౧౮౧

తే. అట్టియెడ రావణుండు రాపట్టి వెంట
నంటి పోనీక పట్టి విహాయసమునఁ
గొంచు లంకాపురిం జేర్చెఁ గురరివోలె
నెలుఁగు లిడుదాని రామునిఁ బిలుచుదాని. ౧౧౮౧

వ. వైదేహిం బంక్తికంధరుం డట్లు గొంపోయి యశోకవనికాసంస్థితం జేసి, క్రూరరూపం బగు రాక్షసీసహస్రంబుఁ గాపుంచి సామదానాద్యుపాయంబుల నెంత ప్రయత్నించియు నది నిజసాధ్వీవృత్తంబున నచలిత యగుటం జేసి, యతం డప్రాప్తమనోరథుం డయ్యె. ౧౧౮౨

క. మృగముం జంపి తదభిహిత
మగు రవ మాలించి మాయ యగుట దెలిసి క్రీ
డగు టాశంకించుచు శీ
ఘ్రగమనుఁడై వచ్చుచుండె రాముం డచటన్. ౧౧౮౩

మధ్యాక్కర—ఎదురు వచ్చెడు తమ్ముఁ జూచి రాముం డిదే మన్న, సీత
వదలి వచ్చితి వేల నొంటి వినలేదొ పాపిష్ఠుస్వరము
మది కలంగెడిఁ బెల్లు ననిన సౌమిత్రి మా ఱెల్లు పల్కఁ
గదలితిన్ సీతవాగ్బాణహతుఁడ నై కాలయోగాన.

ఉ. వారలు పర్ణశాలకు నివర్తిలి యచ్చట సీతఁ గానఁగా
నేరక గౌతమీ శుభధునీపులినంబులఁ బుణ్యావాస్సర

స్త్రీరములన్ వనప్రకరసీమల శైలఝరీగుహాదరీ
వారములన్ నికుంజములఁ బాదపవీథుల రోసి రెల్లెడన్. ౧౧౮౫

క. వెదకెడు వారలు చని చని
తుద కొక్కెడఁ గనిరి చేవ తూలినవానిన్
వదలెడుఁ గడప్రాణముతోఁ
గదలక పడియున్నవాని ఖగసత్తమునిన్. ౧౧౮౬

తే. రాముని గాంచి యా గృధ్రరాజు తెలిపి
వత్స! సీతను బల్మి రావణుఁడు గొంచుఁ
బోయె, నే నివారింప ని ట్లాయె నంచుఁ,
బ్రాణములు వీడె రాముకరంబులంద. ౧౧౮౭

క. రాముఁడు విలపించి ఖగ
స్వామికి నిజబంధువునకు వలె సంత్యేష్టిన్
నేమంబున నొనరిచి శుభ
ధామముల జటాయు వొందఁ దర్పితుఁ జేసెన్. ౧౧౮౮

వ. అంత లక్ష్మణుం గూడి శ్రీరాముండు— ౧౧౮౯

ఆ. కదలి వెసఁ గబంధుకరముల ఖండించి
శాపమోక్షణం బొసంగి ప్రభుఁడు
వానివచనగౌరవమున సుగ్రీవుతోఁ
సలిపెఁ జెలిమి యగ్నిసాక్షికముగ. ౧౧౯౦

క. వాలి నొకకోల రాముఁడు
వ్రాలిచి, కిష్కింధఁ బట్టభద్రునిఁ గాఁగన్
లీల నిలిపి సుగ్రీవునిఁ
దా లక్ష్మణుతోడ నుండెఁ దత్ప్రాంతగిరిన్. ౧౧౯౧

వ. అట్లు వర్షాసమయాత్యయంబు నిరీక్షించుచు శ్రీరాముండు మాల్యవంతంబున నివసించుచు, దశాననాపహృత యగు సీతం దలంచుచు

నిరంతరంబుఁ దదాయత్తచిత్తుండై సీతావిరహంబుఁ దుర్భరంబు కాఁ
దమ్మునితో ని ట్లనియె. ౧౧౯-౨

ఉ. పోయిన దాట సీత, పరిపూర్ణమనోరథ యయ్యె నేఁడు కై
కేయి, నిజంబు; నేను గమకించుట జీవముల్ ధరింప నె
ట్లోయి! యయోధ్యలోనఁ బద ముంచి చరించుట యేమొగంబుతో
నోయి! యిటుండుకంటె మృతి నొందుట యొప్పని శోఁచు లక్ష్మణా!

ఉ. పోయెను జేతిలోఁ బడఁగఁ బోయినరాజ్యము దూరమై, యర
ణ్యాయతభూమిలో నిలువనయ్యెను, బ్రేముడిఁ గాంచుతండ్రియుం
బోయెను లోకమే విడిచి, భూసుత దుష్టనిశాటనీతయై
పోయిన, దేమి చేయ నిఁకఁ బూనునొ దైవము నాకు దుష్టమై!

క. మనువంశజులము నృపనం
దనులము మన మిట్లు వంతఁ దలచెద మహవిం,
జను నె పురాకృత మనుభవ
మునఁ గా కెవరికిని గడవ భూమిస్థలిలో? ౧౧౯-౫

క. నీవును నాతో భోగము
లావలఁ ద్యజియించి నెతల నందెద విందున్
నావలె మును మనకులమున
నేవాఁడుం బడెనె, పదు నె యిడుముల నిటులన్! ౧౧౯-౬

మ. భర మయ్యెం దలమున్క లయ్యెడి విపత్పాథోధినీరంబుసం
తరణోపాయము లేదు, లేవు ధనసైన్యంబుల్, సహాయుండు లేఁ
డరయన్ నీ వొకరుండు దక్క, నెది సేయన్ సాధ్యమా నిప్పు? డె
వ్వరి నేమందును? గోప మేటిపయి? మత్ప్రారబ్ధభోగంబునన్!

ఉ. పోయినఁ బోయె రాచసిరి, బూటక మింద్రసభోపమమ్మునై;
యీయటవీనివాస మిటు లేటికి నబ్బిన? దబ్బెఁగాక; యే
లా యిట బాలభావమున రావలెఁ దో మనవెంట సీత? పో
నీ యటు వచ్చెఁగాక, యిటు లేల నిశాటుఁడు కొంచుఁ బోవలెన్?

చ. దనుజునియింట నేదశలు దాఁపుర మైనవొ మత్ప్రియాంగికిన్ ?
జనకజ మించి వచ్చిన నిజంబుగఁ బ్రాణము లైన వీడు; రా
వణునివశంబు కాదు వరవర్ణిని యెప్పుడు; దానిఁ బాసి నా
మనుగడ యేల తమ్ముఁడ! సమమ్ముగఁ బ్రాణము లేను వీడెదన్.

వ. రాజీవాక్షుం డగు శ్రీరాముం డిట్లు విలపించుచుండ ధర్మాత్ముం డగు లక్ష్మణుం డమృతసేచనసమశీతలంబు లగు సాంత్వనవచంబుల నిట్లనియె. ౧-౨౦౦

క. శిక్షించి రాక్షసాధము
నీక్షణమే సీతఁ దెచ్చి యిచ్చెద, నన్నున్
వీక్షింపు, ధైర్య మూను, స
మాక్షిప్త మొనర్చు కాతరార్తత్వంబున్. ౧-౨౦౧

క. ఆపద యైనను సంపద
ప్రాపించిన నిన్నుఁబోటి ప్రాజ్ఞులు సములై
దీపింతురు ధైర్యప్రభఁ,
గాపురుషులు మునిఁగియుంద్రు కష్టసుఖములన్. ౧-౨౦౨

తే. కడఁగి సంయోగవిప్రయోగములు నరునఁ
గలుగు దైవవశంబులై కాక, రాజ్య
హరణ వనవాస సీతాపహరణము లెలు
లట్లు వైదేహితో యోగ మగుట ధ్రువము. ౧-౨౦౩

ఆ. శోక మెట్టిదయ్య ! చూడఁ దేహముగాక
యాత్మ శోక మొందునయ్య యెందు ?
సుఖము వచ్చు మరల శోకమ్మునున్ వచ్చు,
నట్లు సీత; వదలుమయ్య ! వంత. ౧-౨౦౪

సీ. లేరె యసంఖ్యాక వీరులు కపివరుల్
లేరె జానకిజాడ తీరు నరయ ?

భరతుండు శత్రుఘ్నపరివృతుండై పిల్వఁ
దోడుగా బలుసేనఁ గూడి రాఁడె?
వార్త యెఱింగిన బహుబలంబులఁతోడ
నండ కాఁడే జనకుండు విభుఁడు?
ధనువు నేఁ జేఁబూనఁ ద్రైలోక్యము వడంకు
నే నొకండను జాల నేమి? పలుకు,

నేకరథుఁడై రఘుండు మున్నెల్లదిశలు
గెలువఁడె? సహాయయుతుఁడఁ దత్కులభవుండ
సురవిరోధి దురాచారు దురితహాతుని
రావణు వధించు టది యెంత రామ! నాకు? ౧-౨౦౫

తే. సుఖము పిమ్మట దుఃఖము, సుఖము దుఃఖ
మునకుఁ దర్వాత, నొకదానివెనుక నొకటి
చక్రనేమిక్రమంబున సంభవించుఁ,
బొంగఁగారాదు, వానిచేఁ గ్రుంగరాదు. ౧-౨౦౬

మ. వినవో కేవల మింద్రుఁ డాపదలు ప్రాపించెంగదే, స్వర్గో
భసవిభ్రంశన మొంది దీనతరుఁడై పంకేజగర్భాంతరం
బున నజ్ఞాతనివాసముం జలుపఁడే మున్ భీతిం బెక్కేఁడు, లా
తనిస్థానంబున నిల్పఁగా నహుషు నాత్మప్రౌఢిమై దేవతల్? ౧-౨౦౭

క. శోకింపఁ దగదు నీకుం
బ్రాకృతజనునట్టు, లుద్యమక్రమబుద్ధిం
జేకొమ్ము, లెమ్ము, సర్వ
జ్ఞాకృతివి జగత్ప్రభుండ, వరయ మహాత్మా! ౧-౨౦౮

వ. ఇట్లు లక్ష్మణవాక్యప్రబోధితుండై రఘునందనుండు శోకంబు త్యజించి
విగతజ్వరుండై యుండు సమయమ్మున, ౧-౨౦౯

చ. రణన మొనర్ప శ్రావ్యముగ గ్రామ్యమనోహరమూర్ఛనంబుగాఁ
దన మహతీవిపంచిని నదంబు, బృహద్రథసామగానను

స్వన మెసఁగించుచుం జెవులపండువుగా దెస లెల్ల నింపుచుం
జనవున నారదుం డచట సన్నిధి సేసె దిశావతీర్ణుఁడై. ౧౨౧౦

వ. చూచి రాముండు లేచి, శుభం బగు నాసనంబున నారదు నాసీనుం గావించి యర్ఘ్యపాద్యాదుల విధివిధానంబున నర్చించి, కృతాంజలియై నిలువ, మునీంద్రుచే ననుజ్ఞాతుండై తత్సమీపమ్మున నుపవిష్టుండైన శ్రీరాముని సానుజుని దుఃఖమానసునిఁగా నిరీక్షించి దేవముని ప్రీతివచనంబులఁ గుశలప్రశ్నం బాచరించి యిట్లనియె. ౧౨౧౧

క. ప్రాకృతనరుఁడటు రామా!
శోకార్తిం బొగిలె దేల? సురసద్మమునన్
నాకుం దెలిసెను విగత
శ్రీకుఁడు రావణుఁడు చనుట సీతం గొంచున్. ౧౨౧౨

క. తన మృత్యుకారణం బిది
యని తెలుపక, మోహముగ్ధుఁడయి హరియించెన్
జనకజఁ బౌలస్త్యుఁడు, నీ
జననము తద్ధననమునక జాతముసుమ్మా. ౧౨౧౩

చ. మునిసుతయై విదేహసుత పూర్వభవంబున నిష్ఠతోఁ దపం
బొనరుచువేళ దానిని శుభోజ్జ్వలగాత్ర సునేత్రఁ గాంచి, రా
వణుఁడు మదాంధుఁడై, యడిగి భార్యవు కమ్మని, తత్తిరస్కృతిం
గినిసి యతండు బల్మిఁ దన కేల గ్రహించెఁ దదీయకేశముల్. ౧౨౧౪

క. కోపించి తత్(క్ష)ణమ యా
తాపసి తత్స్పర్శదూషితంబు నిజాంగం
బోపక ధరింప నిమిషము,
శాపం బిచ్చెను దపోగ్ని జ్వాలియించుతఱిన్. ౧౨౧౫

క. ఓరి దురాత్మా! మరలన్
నారి నయోనిజగ నిన్ను నాశ మొనర్పన్

ధారుణి నుదయింతు ననుచు
నారీమణి లయంబు నొందె నాత్మతపోగ్నిన్. ౧-౨౧౬

శా. రామా ! యాసతి యీవిదేహసుత, శ్రీరామాంశసంభూత, యా
భామన్ స్వీయకులప్రణాశనకరిన్, వ్యాళిన్ స్రజం బంచు నె,
ట్లామాండ్కిం గొనె రావణుం డతనిసంహారార్థ మి ట్లూనితీ
ర్థామాకార మజాన్వయంబున నజప్రఖ్యుండ వీ వచ్చితా !

చ. ధృతి మతి నూను, జానకి స్మరించెడు ని న్ననిశంబు, పీడ దా
సతి నిజధర్మమున్, విబుధశాసనుఁ డామెకుఁ ద్రావఁ బంపె స
మ్మతి సురభీపయ స్సమృతమండితపాత్రలు, వాని నానునా
కతమున క్షుత్పిపాసలును గ్లానియు నొందదు, చూచి వచ్చితిన్.

క. రావణహరణోపాయము
నే వచియించెదను వినుమ, యీ యాశ్వినమం
దీ వికఁ నవరాత్రవ్రత
సేవన్ భగవతిసమర్చ సేయుము శ్రద్ధన్. ౧-౨౧౯

తే. మనుజపముచే దశాంశహోమంబుచేత
విశసిత సుమేధ్య పశుబలి విధులచేతఁ
బూని యుపవాస మంబికాపూజ సలుపు,
దాన ని న్నూనుఁ గార్యసాధనకు శక్తి. ౧-౨౨౧

ఆ. సర్వసిద్ధిదంబు సద్వ్రతం బిది, రామ !
నరుఁడు సుఖము వేళ జరుపవలయు;
మఱియుఁ గష్టవేళ మఱివిశేషంబుగా
సలుపవలయు నంట సత్య మనఘ ! ౧-౨౨౧

చ. హరి హర కంజజుల్ సలిపి, రామఘవానుఁడు స్వర్గలోకమం
దరుదుగఁ జేసెఁ, గశ్యపుఁడు నాభృగుపూని వసిష్ఠ కౌశికుల్
పరహ్వృతదారుఁడైన గురువర్యుఁడుఁ బూని రనుత్తమవ్రతం
బరయఁగ, దీని రావణవధార్థము నీవును బూను రాఘవా !

తే. వృత్రహరణంబు సాధించె వృత్రహరుఁడు,
త్రిపురదాహంబు సాధించెఁ ద్రిపురహరుఁడు,
మధువుఁ గొనె మేకువునఁ జేసి మధుహరుండు,
దీని నీవును జేయు విధానవిధిని. ౧-౨-౨౩

వ. అని పలుకు నారదువచనంబు లాలించి శ్రీరాముం డిట్లని ప్రశ్నించె.

క. పరమదయాకర! యెవ రా
పరదేవత? తెలుపు తత్త్వభావం, బే మై
పరగెడిఁ బే? రెటు వుట్టెడి?
నెఱిఁగింపుము వ్రతవిధానమెల్ల మహాత్మా! ౧-౨-౨౪

వ. నావుడు నారదుం డిట్లను. రామా! యీ యర్థం బేకాగ్రబుద్ధివై సమాకర్ణింపుము. నిత్యయు నాద్యయు సనాతనియు నగునది శక్తియ యగుంగాక యితరమ్ముగాదు. దానిం బూజించువారి కది సర్వకామప్రద యై యఖిలదుఃఖౌఘంబులు నిర్మూలించు. అదియ సర్వజంతువులకు బ్రహ్మాదులకునుం గారణం బై యలరారు. ఆదేవీశక్తి లేక యెవ్వండు నొక్కింతయు స్పందించుట కేని సమర్థుండు గానోపండు. విష్ణుదేవుపాలనశక్తియు, మహేంద్రికర్తృత్వశక్తియు, రుద్రునిలయశక్తియు, నదియ యగుచు, సమష్టిరూపంబునఁ బరశివాత్మకం బై పరబ్రహ్మశక్తి యయి యెసంగు. ౧-౨-౨౫

మ. సదసద్రూపక మా త్రిలోకని సమస్తం బైన వస్తువ్రజం
బది యేదే, నెట నున్న, నెట్టి దగు, నెంతై యుండు, నెట్లుండుఁగా,
కది సర్వంబున, కేది శక్తి యయి పోల్పారుఁ, రఘూత్తంస! దా
నిని యుత్పత్తి యొకండు నుండునొకో వర్ణింపఁగ భావింపనేఁ!

చ. ఎపుడు జనార్దనుం డజుఁడు, నీశుఁడు లేఁ, డినుఁ డైన లేఁడు, లే
రపుడు సురల్ సురేంద్రుఁడును, నెప్పుడు లేదు ధరిత్రి యేని, య
ల్లపుడు యుగాదిలోఁ బ్రకృతి యాద్య సనాతన నిర్గుణాత్మ పూ
ర్ణపద శివాఖ్య కూడుచుఁ బరాపురుషుఁ విహరించుఁ గ్రీడలన్.

తే. అదె వివర్తంబుచే సగుణాత్మ యగుచు
నవల సృష్టించు భువనత్రయంబు పేర్మి,
దానికై ముందు బ్రహ్మాదిదైవకోత్త
ములను సృష్టించి, శక్తు లెల్లెడలఁ గూర్చు. ౧౨౨౯

క. దానిని స్వాభిన్నం బగు
జ్ఞానంబున నెఱుఁగఁ జాలు జంతువు సంసా
రానూననిగడనంబులు
పూనదు, జన్మంబు గనదు, ముక్తంబు నగున్. ౧౨౩౦

క. అది పరమవిద్య జ్ఞేయం,
బదియే వేదాది, శ్రుతికి నాలయ మది, దా
నిది నామం బిది యని చె
ప్పుదు నెట్టుల? నూహ కందఁ బోలునె రామా! ౧౨౩౧

క. గుణకర్మమ్ముల భేద
మ్మున నల బ్రహ్మాది మూర్తి ముఖ్యులు కల్పిం
చినవారలు నామావళు
లనంతములు దానిఁ కేది యని యొక టందున్? ౧౨౩౨

తే. అల అకారాది క్షాంత మహానక్షల మైన
స్వరములును వ్యంజనంబులు సర్వవర్ణ
ములును నెన్నెన్ని విధములఁ గలుపఁదగును
బరగు నవి యెల్లఁ దన్నామపరము లగుచు. ౧౨౩౩

వ. అది విని శ్రీరాముండు సంప్రీతుండై మహాబ్రహ్మర్షిసత్తమా! తద్వ్ర
తంబు సర్వంబు నాకు నిర్వర్ణింపవే; యిప్పుడ శ్రీదేవీపూజనంబునకు
గొరకొందు; ననుడు నారదుం డిట్లనియె. ౧౨౩౪

చ. సమతలిఁ బీఠికావరము స్థాపన చేసి, పయిం బ్రతిష్ఠ సే
యుము జగదంబికన్, సలుపు మోయి నవాహ్నములున్ వ్రతాంగభూ

తము లుపవాసముల్, త్రిదశతర్పణకై మది యుత్సహించె, నిం
దమరెద నేన బ్రహ్మ నయి యాగము సద్విధి నిర్వహింపఁగా.

వ. నారదువచనంబు లాలించి, యవి సత్యార్థంబు లగుట నిశ్చయించి, శ్రీరాముండు లక్ష్మణునుం గూడి, యాశ్వినమాసప్రారంభంబున నా గిరివరంబున దీక్షితుండై నారదోపదిష్టక్రమంబున శుభంబగు పీఠంబున జగదంబికం బ్రతిష్ఠించి, యుపవాసపరుండై తదర్చనం బొనర్చి, విధి విధాన హోమ పూజన బలివిధానంబుల భక్తితత్పరుండై నవరాత్ర వ్రతంబు నిర్వర్తించునెడఁ దదారాధన సంతోషితయై. ౧-౨౩౬

ఉ. అద్దమరేయి నష్టమిని నా జగదంబిక ప్రీతి చిల్కఁ బల్
నిద్దముపుమోముతోడఁ గృప నిండి వెలుంగు కటాక్షపాళితో
నొద్దిక సింహయానమున నొప్పి కనంబడి శైలశృంగమం
దిద్దఱకుం, రఘూత్తమున కిట్లనె మేఘగభీరభాషలన్. ౧-౨౩౭

తే. రామ! తోషితనైతి నీవ్రతముచేత,
నడుగుము వరమ్ము, నీవు నారాయణాంశ
రావణవధార్థ మమరసంప్రార్థనమునఁ
బుట్టితివి, పుణ్యమనుకులమ్మునను, వత్స! ౧-౨౩౮

సీ. మత్స్యరూపమున సోమకుఁ జంపి, రక్షించి
వేదముల్, కూర్చితి విబుధహితము;
కచ్ఛపాకృతిఁ బాలకడలి మందర ముద్ధ
రించి, పీయూష మర్పించినావు;
దశనాగ్రమున ధాత్రి ధరియించి, కోలంబ
వై వధించితి హిరణ్యాక్షు నుగ్రు;
నరసింహతను పూని నలిఁ గాచి ప్రహ్లాదుఁ,
బ్రమథించినావు హిరణ్యకశిపు;
లీలఁ త్రైవిక్రమమున బలిచ్ఛలంబు
చేసితివి వామనుండవై; జిష్ణురూప,

జామదగ్న్యుండవై కూల్చి క్షత్రియులను
భూమి నొసఁగితి కశ్యప భూసురునకు. ౧౨౩౯

క. సురసంప్రార్థన నిపు డిటు
మరలన్ దాశరథి వగుచు మహిఁ బుట్టితి, శ్రీ
ధర! రావణవధకై, కపి
వరు లీకార్యమునఁ దోడుపడుదురు నీకున్. ౧౨౪౦

క. వారు సురాంశం బుట్టిన
వార, లనంతాహియంశవాఁడు సుమిత్రా
నారీతనయుఁడు రావణి
మారించున్; వీరలెల్ల మచ్ఛక్తియుతుల్. ౧౨౪౧

క. మానక శరద్వసంతము
లూనుము సద్వ్రతము దీని, నొనరుపు శ్రద్ధన్,
నూనము, చంపెదు దుష్టు ద
శానను, నిజరాజ్యలక్ష్మి నందెదు మరలన్. ౧౨౪౨

తే. రామరాజ్యం బటంచు స్తోత్రం బొనర్ప
జనులు, పదియొక్కవేలు వత్సరము లీవు
ధాత్రిఁ బాలించి, ధర్మవర్ధన మొనర్చి,
త్రిదివముం జేరికొందువు తిరిగి, రామ! ౧౨౪౩

వ. వ్యాసుం డి ట్లనియె. ౧౨౪౪

చ. వరము లొసంగి రామునకు భద్ర భవాని యదృశ్య యైనఁ, ద
త్పరమతితో రఘూద్వహుఁడు తద్వ్రతపూర్తి యొనర్చి శ్రద్ధఁ ద
త్పరదినమే విధిన్ విజయ భద్ర భజించి విశేషపూజలం,
దరలెఁ బ్రయాణమై దశమినాఁడ, యొసంగి యనేకదానముల్.

మ. కపిసంఘుంబులతో రఘూత్తముఁడు వీఁకన్ వారధిం గట్టి, పూ
ర్ణపయోధిం దరియించి, రావణు సపుత్రభ్రాతృసైన్యంబు పా

శిపురిం జేరఁగఁ బంపి, సీతఁ గొని, వాసిం జేరి సాకేతముౕ,
విపులశ్రీకృపఁ బృథ్వీపాలనముఁ బూనెం బూర్ణకాముండునై.

క. నరుఁ డెవఁడు భక్తి విను నీ
చరితం, బాతఁడు సుఖించి జగతీస్థలిలోఁ,
బరమపద మందుఁ బిమ్మట;
సరియే భాగవతమునకు సకలచరితముల్ ? ౧-౨౮౭

సరసాంకము—భువనేశ్వరీభజన పూజన పూర్ణబోధా !
స్తవనీయ పూత శుభ సత్యతపోవరిష్ఠా !
శివకామబీజపర శిష్య సుదర్శనాంగా !
నవసంవృతిప్రణవనాదకలాభిరామా ! ౧-౨౮౮

గద్యము— ఇది జగద్గురు శ్రీ కల్యాణానందభారతీ స్వామి కరకమల ప్రసాదాసాదిత శ్రీ కవిసమ్రా ట్పట్టాభిషేకశ్రీక, హారితసగోత్ర పవిత్ర, ఆపస్తంబసూత్ర, శ్రీమహాలక్ష్మ్యంబా హనుమచ్ఛాస్త్రి పుత్త్రి, వేంకట లక్ష్మీనరసింహశాస్త్రి విజ్ఞానయోగ దర్పణ ప్రతిబింబిత శ్రీదేవీభాగవతంబునందుఁ దృతీయస్కంధము. ౧-౨౮౯

# సవరణ

| పే. | పం. | సవరణ | పే. | పం. | సవరణ |
|---|---|---|---|---|---|
| 1 | 7 | భారతీ | 129 | 5 | అన్యోన్యస్య |
| 3 | 22 | గుణుండు | ,, | 21 | లతాథ |
| 9 | 23 | యార్యా | 141 | 6 | యదియు |
| 10 | 12 | సలుల | ,, | 16 | వది |
| 11 | 2 | గోష్ఠీ | 143 | 19 | సమయథంగం |
| ,, | 5 | యుందయింది | 146 | 20 | ఇది |
| ,, | 9 | కామేశ్వరీ | 151 | 26 | కాంచుటఁ |
| 14 | 5 | తల్లరుఁ | 152 | 11 | నెనరించుట |
| 15 | 1 | ద్వితీయ | 153 | 19 | నేమింపం |
| 16 | 13 | శ్రౌతాధ్వముల్ | 154 | 8 | విన్యసింతు |
| 21 | 25 | త్ర్యక్షేయం | 158 | 12 | బ్రాప్తుఁడు |
| 29 | 5 | తన్వీ | 165 | 15 | లందఱం |
| 30 | 24 | ఔశనసము | 169 | 1 | యాత్మీయ |
| 32 | 24 | క్షేమంబున | ,, | 3 | సత్కృతిలో |
| 35 | 7 | మత్రి | 175 | 2 | పరికరో |
| 36 | 22 | ఇట్లనఁగ | ,, | 6 | యసువు |
| 37 | 25 | క్రూరసింహ | 177 | 12 | నీయకొనిరొ |
| 46 | 2 | సపత్ని | 180 | 2 | వెన్కాడిర |
| 48 | 15 | జ్ఞానానంద | 184 | 17 | కృపుఁడు |
| ,, | 19 | నుతింపం | 185 | 16 | దీక్షు |
| 73 | 6 | వరియించు | 186 | 22 | దీవ్ర |
| 85 | 4 | జాతి | 189 | 2 | మంత్రు |
| 97 | 24 | దేకాంతి | ,, | 7 | ఫణిదహనము |
| 106 | 15 | చేత నల్లఁ | 191 | 2 | దేవ |
| 107 | 1 | అకలంక | ,, | 18 | యన వారు |
| 109 | 24 | దుర్జరము | 192 | 12 | యురగుల |
| 110 | 10 | రొండు | 193 | 13 | నురగుల |
| 112 | 16 | శాస్త్ర | 194 | 7 | సుమనస్కృతి |
| 113 | 15 | యుగుచు | ,, | 9 | స్నానానంతర |
| 121 | 3 | భీష్ముఁ డది | 195 | 7 | సుపుఁడై |
| 123 | 9 | గ్రహియింప | 198 | 3 | ద్వ్యమ్యాస్మలా |
| 124 | 16 | మంత్రించె | 201 | 12 | భావవశం |

| పే. | పం. | సవరణ |
|---|---|---|
| 208 | 4 | పోతమత్రై |
| 206 | 4 | శయునించిన |
| 208 | 4 | స్వఖరంహం |
| ,, | 12 | ద్వరములు |
| 209 | 5 | జేరఁ బోవ |
| 210 | 15 | మాలపింపక్ష |
| ,, | 25 | జయుస్వనో |
| 215 | 24 | నత్తిక |
| 225 | 22 | నిను, |
| 232 | 18 | తీర్చు |
| 218 | 20 | లవి యని |
| 245 | 9 | గాంచంగ |
| 253 | 6 | యేయెడఁ |
| 260 | 25 | పుణ్యమునిగోష్ఠి |
| 267 | 2 | విధమై |
| 270 | 1 | ప్రభవిష్ణుఁడు విష్ణుఁడు |
| 271 | 25 | వలపటి |
| 277 | 9 | కొంటాడంగ |
| ,, | 10 | పంచాస్యంబులం |
| ,, | 12 | వన్యసత్త్వ |
| 280 | 14 | మాయకుఁడై |
| 283 | 8 | రోడ్డనఁ |
| ,, | 24 | జగడ్రి |
| 285 | 28 | గాంక్షింపదే |
| 290 | 13 | స్వపుత్త్రివ |
| ,, | 22 | పొందుపడుఁ |
| 291 | 6 | సైరంధ్రీవిదల్ల |
| ,, | 26 | నాదంబులు |
| 294 | 24 | గడిపఁ |
| 296 | 18 | కరుణ నూని |

| పే. | పం. | సవరణ |
|---|---|---|
| 305 | 12 | మఁదు |
| 309 | 17 | నిచ్ఛాస్వయం |
| 314 | 19 | వడఁగఁ |
| 316 | 16 | నాచరించె |
| 332 | 21 | లాలించి |
| 335 | 10 | యుండుం గా |
| ,, | 22 | బరిశోధించు |
| 338 | 16 | సంభృతాస్త్ర |
| ,, | 20 | మిది యేమిది |
| 340 | 24 | మనుమండు |
| ,, | ,, | మడిసి |
| 344 | 6 | వసింతు |
| ,, | 14 | బోవం |
| 345 | 3 | ప్రియము |
| ,, | 11 | వానికి |
| 347 | 24 | దీఱదు |
| 349 | 26 | లీలావతికి |
| 357 | 4 | పంచాబ్దం |
| 365 | 1 | రాముండు |
| 367 | 26 | పను పెల్ల |
| 368 | 12 | యా యక్షిణి |
| 387 | 3 | సౌమిత్రి |
| 389 | 19 | యొడలు మివులఁ |
| ,, | 20 | గంప మొంద |
| 390 | 4 | వుసురులు |
| 392 | 6 | నంటి |
| ,, | 7 | యాత్మ |
| 396 | 25 | గ్రామమునో |
| 398 | 2 | లఘుము |
| 400 | 16 | దాని కేది |

# శ్రీవిద్యాశంకరలీల

కవితావతంస, కావ్యతీర్థ

## శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

శ్రీ శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీ పీఠాధీశ్వరులు జగద్గురు శ్రీ కల్యాణానందభారతీ మాంతాచార్య మహా స్వామివారి యాదేశానుసారముగా రచింపబడిన శ్రీ విద్యాశంకరుల యథార్థచరిత్రమును వర్ణించు పద్యకావ్యము. ఇందు, లోకములో శ్రీ విద్యాశంకరుల చరిత్రమున గల అపప్రథ లన్నియు పరిహరింపబడినవి. లోకములో ప్రచారములో నున్న శ్రీ విద్యాశంకరుల చరిత్రమును విమర్శించు జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీస్వాములవారి విపులపీఠికయు ఇందు కలదు.

వెల రు. 2-0-0

కొను చోటు—

నోరి నరసింహ శాస్త్రి

సాహితీసమితి, రేపల్లె

## నోరి నరసింహ శాస్త్రి రచనలు

# నారాయణభట్టు

ఆంధ్ర మహా భారత రచనమునకు నన్నయభట్టారకుని ప్రేరేపించి, చేయూతగా నిలిచిన ఆతనిసహాధ్యాయుడు, మిత్రుడు, అయిన నారాయణభట్టును స్వస్వరూపమున ప్రదర్శించు చరిత్రాత్మకమగు స్వతంత్ర నవల. ఇందు, రాజరాజనరేంద్రునినాటి భారతదేశచరిత్ర, యథాస్థితముగా చిత్రింపబడినది. ఆంధ్ర మహా భారత రచనావిశిష్టతయు, అందుకు కారణములుగా ఆనాడు సంభవించిన ధర్మవిప్లవములు, ఇందు విశదింప బడినవి.

వెల రు. 4-0-0

# రుద్రమదేవి

ఆంధ్రరాజగు కాకతి రుద్రమ, ఆంధ్రదేశముపై దండెత్తివచ్చిన పల్లవ, పాండ్య, కళింగ, చోళ, యాదవ, కర్ణాటక, రాజులను నిర్జించి, ఆంధ్రుల స్వాతంత్ర్యమును, ఔన్నత్యమును సుప్రతిష్ఠితము చేసిన ఉజ్జ్వల వీరగాథ. ఈ నవలలో, కాకతీయులనాటి సాంఘిక, రాజకీయ, సాహిత్య జీవితము విపులముగా ప్రదర్శింపబడినది. తిక్కనసోమయాజి, మారన, గురునాథుడు, కేతన, విశ్వేశ్వరశివదేశికులు, యథావాక్కుల అన్నమయ్య, మున్నగు కవులయు పండితులయు, అన్నమంత్రి, కోలనిరుద్రుడు, జన్నిగ, అంబదేవుడు, గన్నారెడ్డి, మేచయనాయకుడు, ఇత్యాది వీరులయు, ప్రతిభలు, ఇందు ప్రదర్శింపబడినవి.

వెల రు 4-0-0

# తేనెతెట్టె

ఏకాంక నాటికల సంపుటి

వెల రు. 1-0-0

దొరకుచోటు—

నోరి నరసింహ శాస్త్రి

సాహితీసమితి

రేపల్లె